# ఆమనీ పాడవే

## ఇళయరాజా పాటలు



సంకలనం. రూపకల్పన

**ఆచారం షణ్ముఖాచారి**

# అంకితం

జయన్తితే సుకృతినో - రససిద్ధాః కవీశ్వరాః
నాస్తితేషాం యశఃకాయే - జరామరణజం భయమ్



వేణువై భువికి వచ్చి... గాలియై దివి కేగిన
సినీగీతాల 'సుందర'మూర్తి... వేటూరి కి
అభిమాన పురస్సరంగా...

# ఆమనీ పాడవే

## ఇళయరాజా పాటలు

సంకలనం·రూపకల్పన

ఆచారం షణ్ముఖాచారి

**వాత్సవ్ పబ్లికేషన్స్**

405, A బ్లాక్, శ్రీ సాయి శ్రీనివాస టవర్స్, ఈశ్వర్ విల్లా వీధి,

నిజాంపేట, హైదరాబాద్ – 500 019

మొబైల్ : 94929 54256

e-mail: shanchary@gmail.com

ఆమనీ పాడవే... - AAMANEE PAADAVE..
ఇళయరాజా పాటలు - ILAYARAJA PAATALU

సంకలనం - రూపకల్పన - *Compiled & Conceived by*
ఆచారం షణ్ముఖాచారి - **ACHARAM SHANMUKHACHARY**
*B.Sc., (Ag.) M.A., CAIIB., CRB*



ప్రథమ ముద్రణ : డిసెంబర్, **2012**

ముఖచిత్రాలంకరణ : పెమ్మరాజు రవికిషోర్,
చీఫ్ ఆర్టిస్ట్, ఈనాడు గ్రూప్, హైదరాబాద్

గ్రాఫిక్స్ : **ఆచారం జయదేవ్,** ప్రాజెక్ట్ మేనేజర్
యష్ టెక్నాలజీస్, హైదరాబాద్

మూల్యం : ₹ **300** (విదేశాలలో *$ 8*)

ముద్రణ : **కర్షక్ ఆర్ట్ ప్రింటర్స్**
విద్యానగర్, హైదరాబాద్.
ఫోన్: 040 27618261

ప్రతులకు : 1. ఏ. షణ్ముఖాచారి, 405, A బ్లాక్,
శ్రీ సాయి శ్రీనివాస టవర్స్, ఈశ్వర్ విల్లా వీధి,
(బచ్‌పన్ స్కూలు వద్ద) నిజాంపేట,
హైదరాబాద్ - 500 072, మొబైల్ : 94929 54256

2. **విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,** హైదరాబాద్
ఫోన్ : (040 24744580) **& అన్ని శాఖలు**

3. **నవోదయ పబ్లిషర్స్,**
ఆర్యసమాజ్ ఎదురుగా, కాచిగూడ
హైదరాబాద్ (040 24652387)

4. **క్రియేటివ్ లింక్స్,** హైదరాబాద్ (98480 65658)

ఇంకా ఇతర ప్రముఖ పుస్తక విక్రయ కేంద్రాలు

Vennelakanti
Movie Writer & Lyricist

No.9, T.V. Street,
Santhi Nagar,
Saligramam.
CHENNAI - 600 093
Ph : 044 - 427 36882
Mob : (+ 91) 93821 13273



# ఇళయరాజీయం - షణ్ముఖ ప్రియం

ఇళయరాజా... ఒక సంగీత సముద్రం. లవణ సముద్రం కాదు... శ్రవణ సముద్రం.

## వరప్రసాది - స్వరవినోది

మూకాంబిక మాత గుడిలో ఒక వృద్ధసాధువు రాజాను చూసీ చూడగానే "ఇళయరాజా డా...నీ... (యువరాజువురా నువ్వు) అని ఆశీర్వదించాడట. అంతే! డానియల్ రాజయ్యగా పిలవబడే రాజా ఇళయరాజాగా మారారు. యువరాజుగా ప్రారంభించిన తన ప్రస్థానాన్ని కొన్ని దశాబ్దాల పాటు మహారాజులా ఏలిన ఇళయరాజా.. నేటికీ తన కుమారుడు యువన్ శంకర్‌రాజాతో పోటీపడుతూ ఆయన స్ఫూర్తిని ఇంకా కొనసాగించడం ఆయనకే చెల్లింది.

తమిళంలో 'ఇసైజ్ఞాని' గా కీర్తింపబడే ఇళయరాజాను ఒక సంగీత ఋషి అని చెప్పవచ్చు. "నా నృషిః కురుతే కావ్యం" అనేది ఆర్యోక్తి. ఋషి కానివాడు కావ్యం రాయలేడని దీని అర్థం. ఇళయరాజా పరంగా యీ ఆర్యోక్తిని "నా నృషిః కురుతే సంగీతం" అని అన్వయిస్తే అతిశయోక్తి కాదు. ఎందుకంటే ఇళయరాజా సంగీతాన్ని ఏనాడూ వృత్తిగా భావించడు... ఒక తపస్సుగా భావిస్తాడు. ఆ సంగీత తపస్వి తపస్సుకు మెచ్చి భగవంతుడు ప్రసాదించిన వరం... మనం వింటున్న స్వరం!

వివిధ సంగీత వాద్య పరికరాల్ని ఎప్పుడు, ఎక్కడ ఎలా వాడాలో పరిపూర్ణంగా తెలిసిన స్వరమాంత్రికుడు ఇళయరాజా.

తన మొదటి సినిమా చేసేటప్పుడున్న కృషి, తపన, పట్టుదల ఇళయరాజాలో ఈనాటికీ చెక్కు చెదరలేదు. "నా మొదటిసినిమాలో వున్న 'ఫైర్' యిప్పటికీ నాలో వుండగా..నేనేదో యింకా సాధించాలని

తపిస్తుంటే...నా పాతపాటల్ని ఉదాహరిస్తూ.. అలాంటి పాటల్ని కావాలంటారెందుకు మీరు" అని ఒక దర్శకునితో ఇళయరాజా చతురోక్తి విసరడం నాకింకా గుర్తు.

"కవిత్వం ఒక ఆల్కెమీ" అన్నాడు తిలక్. సంగీతం ఒక ఆల్కెమీ అయితే అది త్యాగరాజుకి, శ్యామశాస్త్రికి, అన్నమయ్యకి, రామదాసుకి తెలిసినట్లే ఇళయరాజాకు కూడా తెలుసు. తెలుగు వాగ్గేయకారులతో ఇళయరాజాను ఎందుకు పోల్చుతున్నానంటే, ఇళయరాజా వాగ్గేయకారుల వారసుడు కూడా. ఆయన తమిళంలో అద్భుతమైన పాటలు రాయడం నాకు తెలుసు.

ఇళయరాజా అంటే ఒక సంగీత విశ్వవిద్యాలయం. అందులో ఆయనే కులపతి; ఆయనే ఆచార్యుడు; ఆయనే నిత్యవిద్యార్థి! ఆయన జీవితకాలంలో మనమూ జీవిస్తున్నామంటే అది మన పూర్వజన్మ సుకృతంగా భావించడంలో అతిశయోక్తిలేదు.

**ఈ సుగంధం - ఋణానుబంధం**

అలాంటి ఇళయరాజాతో పరిచయ భాగ్యమే కాక ఆయన సంగీతంలో కొన్ని స్ట్రెయిట్ చిత్రాలకు, ఎక్కువ భాగం అనువాద చిత్రాలకు పాటలురాసే అవకాశం రావడం నిజంగా నా పురాకృత పుణ్య విశేషం. ఆ పాటలన్నీ ప్రజాదరణ పొందడం కూడా నా అదృష్టం. ఇటీవల కాలంలో నాతో అయ్యప్పస్వామి భక్తి గీతాలు దగ్గరుండి రాయించుకోవడమే కాకుండా శ్రీరమణమహర్షి జయంతి సందర్భంగా నాతో భక్తి గీతాలు రాయించి, అరుణాచలంలో రమణాశ్రమానికి తీసుకువెళ్లి ఆ పాటల సిడిని ఆవిష్కరించి, నాకు ఆశీర్వాదం ఇప్పించడం, నా జీవితంలో మర్చిపోలేని మధురానుభూతి. ఆ అవ్యాజానురాగానికి ఏమిచ్చి నేను ఋణం తీర్చుకోగలను? అందులో లవలేశం తీర్చుకునేందుకే ఈ నాలుగు మాటలు !

**ఈ షణ్ముఖ మఖానికి నఖమంత నావంతుగా..**

నా ఆత్మీయ మిత్రుడు డా॥ పైడిపాల ద్వారా పరిచయమైన మరో సన్మిత్రుడు శ్రీ ఆచారం షణ్ముఖాచారి. ఆయన తన తొలిప్రయత్నంగా

నా తల్లీ, తండ్రీ, గురువు, దైవమైన ప్రఖ్యాత గాయకులు డా॥ యస్.పి. బాలసుబ్రహ్మణ్యం గారు 30 సంవత్సరాల ప్రస్థానంలో ఆలపించిన 300 పాటల్ని ఎంపిక చేసి, 2010 సం॥లో ''పల్లవించవా నా గొంతులో'' పేరిట పుస్తకాన్ని ప్రచురించారు. ఆ పుస్తకావిష్కరణ కార్యక్రమంలో డా॥ బాలు గారితో కలిసి సింహపురి పట్టణంలో నేను కూడా పాల్గొనడం నా అదృష్టం. శ్రీ షణ్ముఖాచారి ఇప్పుడు తన మలి ప్రయత్నంగా ఇళయరాజా 1978 సం॥రం నుండి 1998 (20 సంవత్సరాల ప్రస్థానం) వరకు స్వరపరిచిన వివిధ చిత్రాల్లోని 300 పాటల్ని ఎంపిక చేసి ''ఆమనీ పాడవే'' పేరిట ప్రచురిస్తున్నారు. ఇది ఇళయరాజామీద అభిమానంతో ఆయన స్వర ప్రస్తారానికి యిస్తున్న అక్షరరూపం - వర్ధిష్ణు గాయనీ గాయకులకు దిశానిర్దేశం చేసే దీపం. దీనిని కూర్చడానికీ..తీర్చి దిద్దడానికి శ్రీ షణ్ముఖాచారి నిష్కామ శ్రమ, దీక్ష వెలకట్టలేనివి. ఈ ''ఆమనీ పాడవే'' పుస్తకానికి ముందుమాట రాసే అవకాశం ఇంతమంది మహా మహులుండగా నాకు ఇవ్వడం, శ్రీ షణ్ముఖాచారికి నా పట్లవున్న స్నేహ వాత్సల్యాలకు నిదర్శనం. అందుకు శ్రీ షణ్ముఖాచారికి హృదయ పూర్వకంగా ధన్యవాదాలు తెలియజేస్తున్నాను.

ఈ పుస్తక ముఖచిత్రంలో సప్తఋషుల్లాంటి ఏడుగురు కవులు; సప్తస్వరాల్లాంటి ఏడుగురు గాయనీ గాయకుల ఛాయాచిత్రాలు పొందుపరచడం అభినందనీయం. ''ఆమనీ పాడవే'' సంకలనం కూడా ''పల్లవించవా నా గొంతులో'' లాగా గొంతు గొంతునూ తడిపే అమృత పానమూ, అక్షయ గానమూ అవుతుందనటంలో ఎలాంటి సందేహం లేదు.

తినబోతూ రుచులెందుకు? ఆ షణ్ముఖప్రియరాగంలో ఈ ఇళయ రాజీయాన్ని ఆస్వాదించండి..ఆనందించండి..పాడుకోండి.. ఈ పుస్తకాన్ని పదికాలాలపాటు పదిలంగా కాపాడుకోండి!

వెన్నెలకంటి

## మరల నిదేల రామాయణంబన్నచో...

ఆధునిక తెలుగు చలనచిత్ర సంగీత చరిత్రలో పద్మభూషణ్ డా॥ ఇళయరాజా ఒక ఉత్తుంగతరంగం. సంప్రదాయ సంగీతానికి పాశ్చాత్య సంగీతపు సొబగులద్ది, లయబద్ధమైన, వేగవంతమైన బాణీలతో కొత్త ఒరవడికి శ్రీకారం చుట్టిన ఇళయరాజా తెలుగులో సంగీత దర్శకత్వం వహించిన చిత్రాలు రాశిలో తక్కువే అయినా వాసిలో ఆణిముత్యాలు.

నా మొదటి ప్రయత్నంగా పద్మభూషణ్ డా॥ యస్.పి. బాలసుబ్రహ్మణ్యం గారు వివిధ సంగీత దర్శకుల వద్ద; తన స్వీయ దర్శకత్వంలోనూ ఇతర గాయనీ గాయకులతో పాడిన 300 గొప్పపాటల సంకలనాన్ని "పల్లవించవా నా గొంతులో" పేరిట 2010లో విడుదల చేశాను. లాభాపేక్షతోగాక, ప్రతి సంగీతాభిమాని, వర్ధమాన గాయనీ గాయకులు ఆ పాటలు పాడుకునేందుకు సింగర్-ఫ్రెండ్లీగా వుండేలా డా॥ బాలు గారి పాటల సంకలనాన్ని తీర్చిదిద్దటం జరిగింది.

అదే స్ఫూర్తితో నా మలి ప్రయత్నంగా సంగీత దిగ్గజం ఇసైజ్ఞాని ఇళయరాజా అద్భుత పాటల సంకలనం **"ఆమనీ పాడవే"** పేరిట విడుదలచేసే ప్రయత్నం చేస్తున్నాను. ఈ సంకలనంలో పాటలు కూడా సింగర్-ఫ్రెండ్లీగా, రికార్డులలో వున్నట్టుగానే, యథాతథంగా వుంటాయి. మీకు నచ్చుతాయి కూడా!

నా మొదటి సంకలనాన్ని అతి పిన్నవయస్సులోనే స్వర్గస్థుడైన ప్రముఖ గీతరచయిత మైలవరపు గోపి గారికి అంకితం ఇవ్వడం జరిగింది. ఇళయరాజా చిత్రాల్లో అధికశాతం పాటల్ని రచించిన స్వర్గీయ వేటూరి సుందరరామమూర్తి గారికి ఈ "ఆమనీ పాడవే" సంకలనాన్ని అభిమాన పురస్సరంగా అంకితం ఇస్తున్నాను.

ఈ పుస్తకంలో పొందుపరచిన 300 పాటల్లో దాదాపు 235 పాటల్ని డా॥ బాలుగారే ఆలపించారు. ఎందుకంటే వారిద్దరి సాంగత్యంలో వచ్చినన్ని పాటలు మరెక్కడా రాలేదు. ఈ సంకలనానికి ఆశీఃపూర్వక సందేశాన్ని యిచ్చిన డా॥ బాలుగారికి సదా కృతజ్ఞుణ్ణి, విధేయుణ్ణి!

ఆచారం షణ్ముఖాచారి

## హృదయ పూర్వకంగా...

నా మొదటి పుస్తకం "పల్లవించవా నా గొంతులో" రచనకు ప్రోత్సాహమిచ్చి; తన అమృత హస్తాలతో స్వయంగా పుస్తకాన్ని ఆవిష్కరించి; మలిరచన "ఆమనీ పాడవే" (డా॥ ఇళయరాజా పాటలు)కు కూడా ప్రోత్సాహ సహకారాలనిచ్చి; పరిచయవాక్యాలతో భుజంతట్టిన స్వరసమ్రాట్, బహుముఖ ప్రజ్ఞాశాలి, పద్మభూషణ్ డా॥ ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం గారికి...

ఆత్రేయ శైలిని...వేటూరి అభివ్యక్తిని ఆవిష్కరించే రచనాశిల్పంతో సంప్రదాయ ధోరణిలో గీతరచన చేస్తూ, అనువాద చిత్రాలకు మహామహుల వారసునిగా వర్ధిల్లుతూ, అడిగిన వెంటనే యీ పుస్తకానికి మకుటాయమానమైన పీఠిక రాసిన నెలనవ్వుల వెన్నెలకంటి గారికి...

ఈ "ఆమనీ పాడవే" పుస్తకానికి అద్భుతంగా రూపురేఖలు దిద్ది కవర్‌పేజిని అత్యంత సుందరంగా మలిచిన నా ఆత్మీయమిత్రులు, ఈనాడు గ్రూప్ చీఫ్ ఆర్టిస్ట్ పెమ్మరాజు రవికిషోర్ గారికి...

ఈ పుస్తక రూపకల్పనలో అమూల్యమైన సలహాలు అందించి, అడుగడుగునా వెన్నుతట్టి సహకరించిన నా ఆత్మీయమిత్రులు, శ్రేయోభిలాషి, ప్రముఖ సినీ విమర్శకులు డా॥ పైడిపాల గారికి...

ఇళయరాజా గురించి హాసం పక్షపత్రికలో ప్రచురించిన సందేశాన్ని ఈ పుస్తకంలో పునర్ముద్రించటానికి సమ్మతించిన శాంతా బయోటెక్నిక్స్ అధినేత పద్మభూషణ్ కె.ఐ. వరప్రసాదరెడ్డి గారికి...

స్వర్గీయ ఘంటసాల, శోభన్‌బాబుల జయంతి, వర్ధంతుల సందర్భంగా తూర్పుగోదావరి జిల్లా పరిసర ప్రాంతాలలో నేను నిర్వహించిన దాదాపు 30 సంగీత విభావరులను విజయవంతం చేసి, నా పుస్తకరచనలన్నిటికీ సహకారాలు అందిస్తున్న నా సహోద్యోగి, ఆంధ్రాబ్యాంక్ అసిస్టెంట్ జనరల్ మేనేజర్ పి. సుధీర్‌కుమార్ గారికి...

ఈ పుస్తక రచనకు సహకరించిన శ్రేయోభిలాషులు, ప్రముఖ సంగీత దర్శకులు టి.వి. సోమరాజు (రాజ్) గారికి, ప్రముఖ ఆర్కిటెక్ట్ కె. నారాయణరాజు (శేషు) గారికి; తెలుగు, కన్నడ చిత్ర దర్శకులు శివగణపతి గారికి, శ్రీ రొంపిచెర్ల నాగరాజు, శ్రీ పి.సి. సుకుమార్‌గార్లకు, ప్రత్యక్షంగా, పరోక్షంగా సహకరించి ఈ సంకలనాన్ని యింత అందంగా రూపొందించి మీకు అందించడానికి సహాయపడిన మహానుభావులెందరో...

అందరికీ పాదాభివందనాలు !!

ఆచారం షణ్ముఖాచారి



# ఇళయరాజా స్వరా(గా)లు

**...ఆచారం షణ్ముఖాచారి**

ఇళయరాజా 1943 జూన్ రెండో తేదీన తమిళనాడు రాష్ట్రం తెన్ని జిల్లా పణ్ణైపురం గ్రామంలో జన్మించారు. ఈ గ్రామం తమిళనాడు – కేరళ సరిహద్దుల్లో పశ్చిమ కనుమల పచ్చదనంతో నిండి ఉండేది. రాజా తల్లిదండ్రులు చిన్నతాయమ్మాళ్, రామసామి. తండ్రి కేరళ టీ తోటల్లో సూపర్ వైజర్‌గా పనిచేసేవారు. ఆయన నాటకాల్లో నటిస్తూ, మంచి గాయకుడుగా పేరు తెచ్చుకున్నారు. కేరళలో ఒక ఇంగ్లీషు దొర స్నేహ కారణంగా రామసామి క్రైస్తవ మతం స్వీకరించారు. రామసామి మొదటి భార్య కుమారుడు పావలర్ వరదరాజన్. భార్య మరణానంతరం రామసామి చిన్నతాయమ్మాళ్‌ని వివాహమాడారు. చిన్నతాయమ్మాళ్‌కి ముగ్గురు సంతానం. భాస్కర్, రాజయ్య, అమరన్. ఇళయరాజాకి తండ్రి పెట్టిన పేరు జ్ఞానదేశికన్. తండ్రి క్రైస్తవమతం స్వీకరించాక జ్ఞాన దేశికన్ పేరును డేనియల్ రాజయ్య (రాజా)గా మార్చారు.

## నిచ్చెన మెట్లమీద బాల్యం

తల్లిపాడే జోలపాటల్ని, జానపద సంగీతాన్ని రాజా ఎంతగానో ఇష్టపడేవారు. తను ఎనిమిదో తరగతి చదువుతున్నప్పుడు ఒక జ్యోతిష్కుడు తనకు చదువువంటబట్టదని చెప్పడంవిన్న రాజా ఆ మాటలు నిజం కాకూడదని, బాగా చదువుకోవాలని నిశ్చయించుకున్నారు. పెద్దన్నయ్య వరదరాజన్ ఒక నాటకాల కంపెనీలో నష్టపోవడంతో, రాజయ్య తన బావగారి ఇంటికి వెళ్లి అక్కడే చదువు కొనసాగించవలసి వచ్చింది. కుటుంబ ఆర్థిక పరిస్థితి సహకరించకపోవడంతో చదువుకు స్వస్తి చెప్పి కూలీగా పనిచేయాల్సి వచ్చింది. మిలటరీలో పనిచేసి రిటైర్ అయిన తన బావగారి సహకారంతో మదురైలో వైగై నది ఆనకట్ట నిర్మాణంలో రాళ్లెత్తిన బాలకార్మికుల్లో రాజా కూడా ఒకరు. వ్యవసాయ కూలీల ఏలపాటలు, కార్మికులు పాడుకునే పాటలతో గళం కలిపే రాజాని గమనించిన ఒక ఇంజనీర్ తన వద్ద నౌకరుగా నియమించుకున్నారు. రాజా మొదటి సంపాదన వారానికి 7 రూ.లు. ఈ రోజు ఇళయరాజా కోట్లకు పడగెత్తినా తన మొదటి సంపాదన ఇచ్చిన ఆనందం మరచిపోలేనిదని అంటూ

ఉంటారు. అదే సమయంలో అన్న వరదరాజన్ కేరళలో కమ్యూనిస్టు పార్టీ ప్రచార కార్యకర్తగా రంగంలోకి దిగి మంచిపేరు తెచ్చుకున్నాడు. పార్టీ సభల ప్రారంభానికి ముందు వరదరాజన్ ప్రజలను ఉత్తేజపరిచే పాటలు పాడేవాడు. రాజా కూడా తన అన్నతో పార్టీ సభలకు వెళ్లి అడపాదడపా కొన్ని పాటలు పాడుతూండేవారు.

1968లో రాజాకు అల్లినగరం చిన్నసామి అనే మలేరియా ఇన్‌స్పెక్టర్‌తో పరిచయం అయ్యింది. నాటకాలంటే చిన్నసామికి ఎంతో మమకారం. అతను మదురై పరిసరప్రాంతాల్లో తనకు తీరిక చిక్కినపుడల్లా నాటక ప్రదర్శనలు ఇస్తుండేవాడు. ఆ నాటకాలకు సంగీత బాధ్యతలు రాజా నిర్వహించేవారు. హఠాత్తుగా చిన్నసామి తన ఉద్యోగానికి గుడ్‌బై చెప్పేసి సినిమాల్లో ప్రయత్నాలు చెయ్యాలని మద్రాసు (చెన్నై) వెళ్లిపోయాడు. వెళ్తూవెళ్తూ రాజయ్యతో "నీకు మద్రాసు రావాలనిపిస్తే నాదగ్గరకొచ్చెయ్" అని చెప్పి మరీ వెళ్లాడు. రాజా ఆలోచనలు కూడా సినిమాల చుట్టూనే తిరుగుతుండేవి.

1969లో రాజా తన సోదరులిద్దరితో కలిసి మద్రాసు నగరం చేరి, చిన్నసామి గదికి వెళ్లారు. ఆ చిన్న గది రాయపేట ముత్తుమొదలి వీధిలో వుండేది. అందులోనే నలుగురూ సర్దుకునేవారు. చిన్నసామి ఓ పెట్రోల్ స్టేషన్లో పనిచేస్తూ సినిమాల్లో ప్రయత్నాలు కొనసాగించేవాడు. రాజాని చిన్నసామి "ఏం చెయ్యాలనుకుంటున్నా"వని అని అడిగితే "సినిమాల్లో మ్యూజిక్ చెయ్యాలనుకుంటున్నా"నని చెప్పేవారు. అన్న వరదరాజన్ దగ్గర హార్మోనియం వాయించడం రాజాకు బాగా వచ్చు. అది ఉపకరిస్తుందని ఆశ! కానీ, "సినిమాల్లో చేరాలంటే ఒక్క హార్మోనియం వాయించగలిగితే చాలదు; చాలా వాద్య పరికరాలు నేర్చుకోవాలి" అని చిన్నసామి సలహా యిచ్చాడు. తీరిక చిక్కినప్పుడల్లా ఇతర సంగీత వాద్య పరికరాలను ఉపయోగించడం రాజా అలవాటు చేసుకున్నారు. అలా అన్నదమ్ములందరూ చిన్న చిన్న నాటకాలకు వాద్య సహకారం అందించేవారు. సంపాదన అంతంత మాత్రమే. రెండు పూటలా భోజనం కూడా కొన్నిసార్లు దొరికేది కాదు.

### బాలూ తోడుగా కలల అలలలో...

అన్నదమ్ముల అవస్థలు గమనించిన చిన్నసామి వాళ్లని ఒక గాయకునికి పరిచయం చేశారు. ఆయనకో ఆర్కెస్ట్రా బృందం ఉండేది. పెళ్లిళ్లకీ, యితర

శుభ కార్యాలకీ ఆయన తన బృందంతో పాటకచేరీలు చేసేవారు. ఆయనే నేటి మేటి గాయకులు పద్మభూషణ్ డా॥ యస్.పి. బాలసుబ్రహ్మణ్యం. రాజా సోదరుల్ని బాలుకి పరిచయం చేసిన చిన్నసామే తర్వాత కాలంలో ప్రఖ్యాత దర్శకుడిగా పేరుగాంచిన భారతీరాజా. తన సోదరులతో కలిసి బాలు దగ్గరకు వెళ్లిన రాజాను "సంగీతం వచ్చా?" అని బాలు అడిగితే "సంగీతం నేర్చుకోలేదు; కానీ హార్మోనియం వాయిస్తాను" అని రాజా బదులిచ్చారు. "ఏదీ వాయించు చూద్దాం" అని బాలు అడగగానే, రాజా హార్మోనియం అందుకొని Doctor Schiwago (డాక్టర్ ఝివాగో) చిత్రంలో టైటిల్ మ్యూజిక్ వాయించి చూపారు. Maurice Jarrie స్వరపరిచిన ఆ థీమ్ మ్యూజిక్ (Laura's Theme) చాలా క్లిష్టమైంది. ఆ మ్యూజిక్ విన్న బాలు ఆశ్చర్యపోతూ "సంగీత జ్ఞానం లేకుండా ఎలా వాయించగలిగావు?" అని ప్రశ్నిస్తే "మ్యూజిక్ విని వాయించాను" అని రాజా జవాబిచ్చారు. తన ట్రూప్‌లో అప్పటికే అనిరుద్ధ అనే హార్మోనియం వాయించే వ్యక్తి వుండడంతో సందిగ్ధంలో పడిన బాలుకి "నేను గిటార్ కూడా వాయించగలను" అని కొన్ని గిటార్ బిట్స్ రాజా వాయించి బాలుకి వినిపించారు. సుతారంగా హార్మోనియం మీద, గిటార్‌మీద కదులుతున్న రాజా వేళ్లను బాలు అలాగే చూస్తుండిపోయారు. తర్వాత బాలు ట్రూప్‌లో రాజా గిటారిస్టుగా, తమ్ముడు భాస్కర్ డ్రమ్మర్‌గా, తదనంతర కాలంలో హార్మోనియంకు మారిన రాజా స్థానంలో మరో సోదరుడు అమర్ (గంగై అమరన్) గిటారిస్టుగా స్థిరపడ్డారు.

అన్న పావలర్ వరదరాజన్ కాలం చేసిన తరువాత "పావలర్ బ్రదర్స్" పేరుతో కొనసాగించిన రాజా సోదరుల ఆర్కెస్ట్రా బృందానికి మంచిపేరొచ్చింది. టి. నగర్‌లోని ఒక హోటల్లో రోజూ వినిపించే రికార్డుల్ని బాలు, రాజాలు టీ తాగుతూ విని, ఆ సంగీత గమకాల్ని, రాగాల్ని గుర్తుపెట్టుకుని తమ గదికి వచ్చి, గ్రంథస్తం చేసి రిహార్సల్స్ చేసేవారు. అలా 'పావలర్ బ్రదర్స్' పతాకం క్రింద రాజా కొన్ని వందల తెలుగు, తమిళ కచేరీలు చేశారు.

గొప్ప గాయకుడు కావాలని బాలు, గొప్ప సంగీత దర్శకుడు కావాలని రాజా కలలు కనేవారు. ప్రముఖ సంగీత దర్శకులు యమ్.యస్. విశ్వనాథన్ ఆ రోజుల్లో ఉదయం ఏడయ్యేసరికి MSV 5052 కార్లో మైలాపూర్ మీదుగా రికార్డింగ్ థియేటర్‌కి వెళ్తూవుండేవారు. వీళ్లిద్దరూ ఎవరినైనా అడిగి స్కూటర్ సంపాదించి నేరుగా యమ్.యస్. విశ్వనాథన్ ఇంటి దగ్గరకు వెళ్లి కాస్త

దూరంగా కాపుకాసేవారు. ఆయన బయటకు వచ్చి తన కారులో కూర్చునేంతవరకు తనివితీరా చూసి వెళ్లిపోతుండేవారు. ఆ కొన్ని క్షణాల దర్శనం కోసం అంతగా తపించేవారు. ఎప్పటికైనా ఆయనవద్ద పనిచెయ్యాలని కూడా అనుకునేవారు.

## ధనరాజ్ మాస్టర్‌తో పరిచయం

పాశ్చాత్య సంగీతంలో మెళకువలు నేర్చుకోవాలని ధనరాజ్ మాస్టర్ వద్దకు ఇళయరాజా వెళ్లారు. ఆయన నైపుణ్యం, గ్రహణశక్తిని అంచనావేసిన ధనరాజ్ మాస్టర్ రాజాకు సినీ సంగీతంలో మెళకువలన్నీ నేర్పారు. పియానోతో సహా అన్నీ పాశ్చాత్య సంగీత పరికరాల వాదకం రాజాకు కరతలామలకం అయింది. శాస్త్రబద్ధంగా వాద్యాలను వుపయోగించడమే కాకుండా, నొటేషన్స్ రాయడం కూడా మాస్టర్ రాజాకు నేర్పారు. ప్రముఖ సంగీత దర్శకులు జి.కె. వెంకటేష్ ఒక తెలుగు చిత్రం కోసం పాటలు రికార్డింగ్ చేస్తూ ఆర్గన్ ప్లేయర్‌గా రావలసిందని ధనరాజ్ మాస్టర్‌కు కబురంపారు. ఆయన తన వెంట ఇళయరాజాను భరణీ స్టూడియోకి తీసుకువెళ్లి జి.కె. వెంకటేష్‌కు మ్యూజిక్ డైరెక్టర్‌గా పరిచయం చేశారు. ఆ తర్వాత జి.కె. వెంకటేష్‌కు సహాయకుడిగా 1968 నుండి 1974 వరకు దాదాపు 100 చిత్రాలకు పైగా ఇళయరాజా సహాయకుడిగా పనిచేశారు.

## రాజా వేదన - మూకాంబిక దీవెన

ప్రఖ్యాత వయొలిన్ విద్వాంసులు ఎల్. వైద్యనాథన్ కూడా జి.కె. వెంకటేష్‌కు సహాయకుడుగా పనిచేస్తుండేవారు. ఆయన రాజాకు మంచి మిత్రులు. 1974లో ఒకసారి జి.కె. వెంకటేష్ సంగీతవిభావరి నిర్వహించేందుకు ఇద్దరూ మైసూరు వెళ్లారు. రాజా అక్కడ జ్వరాన పడ్డారు. వైద్యనాథన్ సలహా మేరకు మూకాంబికను దర్శించుకుంటానని మనసులోనే రాజా స్మరించుకున్నారు. అంతే... జ్వరం క్షణంలో మాయమైంది. మరుసటి రోజు కొల్లూరు చేరుకొని సౌపర్ణికానదిలో స్నానం చేసి, ఆదిశంకరుడు ప్రవేశించిన పశ్చిమద్వారం నుండి మూకాంబికా మాతను దర్శించుకున్నారు. సరస్వతీ మంటపంలో కూర్చుని వైద్యనాథన్ వయొలిన్ వాయిస్తుండగా రాజా రెండు కీర్తనలు ఆలపించారు. పూజారి గణపతి భట్ ఆ వయొలిన్‌ని అమ్మవారి చేతులలో ఉంచి, అర్చన చేసి ఇద్దరినీ ఆశీర్వదించారు. గణపతి భట్

ఆశీర్వాదంతో రాజా 'ఇళయరాజా'గా రూపాంతరం చెందారు. ఇళయ రాజా అంటే 'యువరాజు' అని అర్థం. మాత దర్శనానంతరం రాజా ప్యాంటు, షర్టు విసర్జించి అడ్డపంచె, జుబ్బాలోకి మారారు.

## సినీరంగం - రాజా అరంగేట్రం

మొదటి సినిమాకు పనిచేసే అవకాశం రాజాకు రానే వచ్చింది. సలీల్ చౌదరి సంగీత దర్శకత్వంలో నిర్మల ఎంటర్‌ప్రైజెస్‌వారు నిర్మించిన ఛైర్మన్ చలమయ్య చిత్రానికి గిటారిస్టుగా తొలి అవకాశం అది. తొలిదశలో "దీపం" అనే చిత్రానికి సంగీతం అందించే అవకాశం వచ్చింది. దురదృష్టవశాత్తు రికార్డింగ్ దశలోనే ఆ చిత్రనిర్మాణం ఆగిపోయింది. జెమిని వారి చిత్రానికి సంగీత దర్శకత్వం నిర్వహించే అవకాశం వచ్చినట్టేవచ్చి చేజారింది. జి.కె. వెంకటేష్‌తో పాటు కె.వి. మహాదేవన్, యమ్.ఎస్. విశ్వనాథన్ చిత్రాలకు గిటారిస్టుగా, ఆర్గన్ ప్లేయర్‌గా ఇళయరాజా పనిచేస్తున్న రోజుల్లో కమల అనే ఒక కోరస్ సింగర్ ఆయన్ని ప్రముఖ నిర్మాత పంజు అరుణాచలంకు పరిచయం చేసింది. రాజా చేసిన బాణీలు విన్న పంజు అరుణాచలం, దేవరాజ్-మోహన్ దర్శకత్వంలో తాను నిర్మించదలచిన 'అణ్ణక్కిళి' చిత్రానికి సంగీత దర్శకునిగా ఇళయరాజాను నియమించారు. గ్రామీణ నేపథ్యంలో సాగే 'అణ్ణక్కిళి' చిత్ర సంగీతం ప్రేక్షకులకి విభిన్న స్వరాల్ని వినిపించి సంభ్రమాశ్చర్యాలకు గురిచేసింది. టైటిల్స్‌లో ఇళయరాజా పేరు కనపడగానే థియేటర్లలో చప్పట్లు మారుమోగేవి. జానకి పాడిన "మచ్చానె పాత్తీంగళా...మలవాళ తోపుకుళ్లే" అనే హుషారుపాట ప్రేక్షకుల్ని మత్తెక్కించింది.'అణ్ణక్కిళి' చిత్రాన్ని తెలుగులో రామచిలక పేరుతో పునర్మించారు. సత్యం సంగీత దర్శకత్వం వహించిన యీ చిత్రంలో అన్నీ ఇళయరాజా బాణీలే వాడుకున్నారు.

భారతీరాజా యీలోగా సంచలన దర్శకునిగా పేరు తెచ్చుకోవడంతో ఇళయరాజాకు ఆయన చిత్రాలకి పనిచేసే అవకాశం దక్కింది. ఈ యువజంట నెలకొల్పిన ఎన్నో మైలురాళ్లు చలనచిత్ర సంగీతరంగంలో యిప్పటికీ చెక్కు చెదరలేదు.

## తెలుగు తెరమీద ఇళయరాజా శకం..

దర్శకుడు ఎ.సి. త్రిలోక్‌చందర్ నిర్మించిన భద్రకాళి (1977) చిత్రంతో తెలుగులో ఇళయరాజా రంగప్రవేశం జరిగింది. ఆ చిత్రంలో వచ్చే "చిన్నిచిన్ని

కన్నయ్యా" (జేసుదాస్, సుశీల), "అడిగావే అక్కడా ఇక చూస్కో ఇక్కడా" (సుశీల) పాటలు చాలా పాపులర్ అయ్యాయి. ఇళయరాజా పేరు తెలుగు ప్రేక్షకులకు బాగా తెలిసింది వయసు పిలిచింది (1978 - శ్రీధర్) చిత్రంతోనే. దాంతో రాజా ఇక వెనుకకు తిరిగి చూడలేదు.

హిందీలో సంచలనం సృష్టించిన అమితాబ్ బచ్చన్ చిత్రం డాన్ ను NTR వ్యక్తిగత మేకప్‌మేన్ పీతాంబరం తెలుగులో యుగంధర్ (1979) పేరిట రీమేక్ చేశారు. దర్శకుడు కె.ఎస్.ఆర్. దాస్ ఇళయరాజాకు సంగీత దర్శకత్వం అప్పగించారు. NTR చిత్రానికి పనిచేయవలసి రావడం రాజాకి అదే తొలిసారి. హిందీచిత్రంలో పాటలన్నీ చాలా పాపులర్ అయ్యాయి. "యే మేరాదిల్ ప్యార్ కా దీవానా" అనే ఆశాభోంస్లే పాట చిత్రం ప్రారంభంలోనే వస్తుంది కాబట్టి, మంచి టాక్, ఓపెనింగ్ కలెక్షన్లు వస్తాయనీ, ఆ పాటను తెలుగులో యథాతథంగా వాడుకుందామని నిర్మాత, దర్శకులు ఇళయరాజాకు సూచించారు. కానీ, ఇళయరాజా ఆ పాటకు "అంతకన్నా గొప్ప ట్యూన్ యిస్తాను చూడండి" అంటూ "నా పరువం నీకోసం" (సినారె) పాటను స్వరపరిచి చూపారు. జానకి ఆలపించిన యీ పాట ఓ ప్రభంజనం సృష్టించింది. అలాగే మిగతా పాటలన్నీ స్వతంత్రంగా ట్యూన్ చేద్దామని రాజా సూచిస్తే దర్శకుడు ఒక్కపాట విషయంలో మాత్రం ఒప్పుకోలేదు. చిత్రం మొత్తానికే హైలైట్‌గా నిలిచే "ఖయ్‌కే పాన్ బనారస్ వాలా" పాట ట్యూన్‌ని తెలుగులో యథాతథంగా వుంచాలని పట్టుపట్టారు. అలా అయిష్టంగానే ఇళయరాజా "ఓరబ్బీ ఏసుకున్నా కిళ్లీ" పాటను ఈ చిత్రంలో చేయడం జరిగింది. ఈ చిత్రంలో "దాదాదాదా...దాస్తే దాగేదా" (ఆత్రేయ) "నాకోసమే మీరొచ్చారు" (వేటూరి) పాటలు కూడా బాగా విజయవంతం అయ్యాయి.

1978-79లో ఇళయరాజా తమిళంలో సంగీత దర్శకత్వం నిర్వహించిన దాదాపు పది చిత్రాలు తెలుగులోకి అనువదించబడ్డాయి. ఆ చిత్రాల పాటలన్నీ తెలుగులో కూడా విజయవంతం అయ్యాయి. వయసు పిలిచింది (1978- వేటూరి, ఆరుద్ర)లో అన్ని పాటలూ; ఎర్రగులాబీలు (1979-ఆత్రేయ, వేటూరి)లో "ఎర్రగులాబీ విరిసినది తొలిసారీ ననుకోరీ", "ఎదలో తొలివలపే... విరహం జతకలిసే" పాటలు; అజేయుడు (1979-రాజశ్రీ)లో "నీ పెదవుల లోనా.. తేనెలవానా" పాటలు డబ్బింగ్ పాటలంటే నమ్మశక్యం కాదు. 1979లో పంచభూతాలు (చంద్రమోహన్ - లత), కాళరాత్రి

(రంగనాథ్) చిత్రాలు ఇళయరాజాని తెలుగు చలనచిత్ర రంగంలో నిలదొక్కుకునేలా చేశాయి.

1981లో వచ్చిన సీతాకోకచిలక (భారతీరాజా-ముచ్చెర్ల అరుణ, కార్తీక్) చిత్రం ఇళయరాజా ప్రతిభను తెలుగు శ్రోతలకు గుర్తుండేలా చేసింది. ఈ చిత్రంలో వచ్చే "మిన్నేటి సూరీడు వచ్చేనమ్మా" పాటకు తన చిన్నతనంలో తల్లిపాడిన జోలపాట స్ఫూర్తి అని ఇళయరాజా చెప్పేవారు. ఆ రోజుల్లో విడుదలైన వసంతకోకిల, అమరగీతం, మధురగీతం, టిక్ టిక్ టిక్ వంటి డబ్బింగ్ చిత్రాలే కాక, పూలపల్లకి, కొత్తజీవితాలు వంటి స్ట్రెయిట్ చిత్రాలకూ ఇళయరాజా వీనుల విందైన సంగీతం అందించారు.

1983 నుండీ తెలుగునాట ఇళయరాజా ప్రభంజనం వెలిగింది. అది తెలుగు చలనచిత్ర సంగీత చరిత్రలో గొప్పమలుపు! సరికొత్త బాణీలు, వైవిధ్యభరిత సంగీతం యువతరాన్ని గంగవెర్రులెత్తించింది. ఇళయరాజా సంగీతానికి జనం బ్రహ్మరథం పట్టారు. సాగరసంగమం, అభిలాష, రాజకుమార్, మంత్రిగారి వియ్యంకుడు చిత్రాలేకాక రాగమాలిక వంటి డబ్బింగ్ చిత్రాలలో పాటలు సంప్రదాయ తెలుగు చలనచిత్ర సంగీతానికి భిన్నంగా, వైవిధ్యంగా వుండటంతో శ్రోతలకు, సంగీత ప్రియులకు ఇళయరాజా ఆరాధ్యదైవం అయ్యారు. ముఖ్యంగా శంకరాభరణం (1980-కె.వి. మహదేవన్-విశ్వనాథ్) వంటిచిత్రం నిర్మించిన ఏడిద నాగేశ్వరరావు కూడా సీతాకోకచిలక (1982) చిత్రం నుండి ఇళయరాజానే సంగీత దర్శకునిగా కొనసాగించారు.

## వంశీ మధురగీతాలు - రాజా స్వరపారిజాతాలు

ఇదే సమయంలో ఇళయరాజాకు యువ దర్శకుడు 'వంశీ'తో పరిచయం అయింది. సితార (1984) వంశీకి దర్శకుడుగా రెండవ చిత్రం. ఏడిద నాగేశ్వరరావు నిర్మించిన ఆ చిత్రానికి ఇళయరాజా సంగీత దర్శకుడు. రీ రికార్డింగ్ మినహా చిత్రం మొత్తం పూర్తయింది. శ్రేయోభిలాషులకు డబుల్ పాజిటివ్ వేసి చూపిస్తే, చూసిన వాళ్లంతా పెదవి విరిచారు. చాలావరకు సైలెంట్‌గా వుంటూ, అతి తక్కువ సంభాషణలతో వున్న ఆ చిత్రం విజయం సాధించడం కష్టమన్నారు. నిరాశ చెందిన వంశీ, ఇళయరాజాకు పాజిటివ్ ప్రింట్ వేసి చూపించారు. సినిమా చూసిన రాజా వంశీని అభినందిస్తూ "చాలా బాగుంది. చూడు దీనికి మ్యూజిక్ ఎలా చేస్తానో" అని రీరికార్డింగు

చేసి మెప్పించారు. ఆ సినిమా పెద్ద సంచలనాన్ని సృష్టించింది. కావాలంటే ఆడియో మ్యూట్ చేసి యీ సినిమా చూడండి...చప్పగా వుంటుంది. ఆడియోతో సహా చూడండి అదొక అద్భుతం అనిపిస్తుంది.

తర్వాత వచ్చిన ఛాలెంజ్ (చిరంజీవి, విజయశాంతి–కోదండరామిరెడ్డి), మాంగల్యబంధం (సుమన్, సుహాసిని–కట్టా సుబ్బారావు) చిత్రాలు తెలుగు చలనచిత్ర రంగంలో ఇళయరాజా స్థానాన్ని సుస్థిరపరిచాయి. ఇదే సమయంలో ఉషాకిరణ్ మూవీస్‌వారు రాజేంద్రప్రసాద్, భానుప్రియతో ప్రేమించు పెళ్లాడు (1985) చిత్రం తలపెట్టారు. వంశీ పట్టుబట్టి ఇళయరాజాను సంగీత దర్శకునిగా తీసుకున్నారు. రాజా ఆ చిత్రానికి కేవలం ఒక గంటలో ఆరు పాటల్ని స్వరపరిచారు. "పయ్యారి గోదారమ్మ ఒళ్లంత ఎందుకమ్మ కలవరం", "గోపెమ్మ చేతిలో గోరుముద్ద", "నిరంతరమూ వసంతములే", "ఈ చైత్రవీణా ఝుంఝుమ్మనీ", (పాటలు అన్నీ వేటూరి) పాటలు పెద్ద హిట్ అయ్యాయి.

వంశీ మరో చిత్రం లేడీస్ టైలర్ (1986 రాజేంద్రప్రసాద్–అర్చన) లో ఒక్కపాట మినహా అన్ని పాటలూ ఇళయరాజా రికార్డు చేశారు. ఇళయరాజా బిజీగా ఉండి ఆఖరిపాట యివ్వటంలో జాప్యం జరగడంతో, కాల్‌షీట్ల ఇబ్బంది ఉండకూడదని రాజేంద్రప్రసాద్–అర్చనలపై వంశీ మాంటేజ్ షాట్సు తీశారు. తర్వాత ఇళయరాజా ఆ మాంటేజ్ షాట్సు ఆధారంగా ట్యూన్ కట్టటం, సిరివెన్నెల పాట రాయడం జరిగిపోయాయి. ఆ పాటే "ఎక్కడ ఎక్కడ దాక్కున్నావే లక్కును తెచ్చే చుక్కా" పాట. ఇళయరాజా తన సంగీత ప్రస్థానంలో ఇలాటి సాహసోపేత ప్రయోగాలెన్నో చేశారు.

సితార చిత్రానికి జరిగినట్లే రాంగోపాల్‌వర్మ నిర్మించిన శివ (1989) చిత్రంలోనూ ఒక విచిత్రం జరిగింది. డబుల్ పాజిటివ్ చూసిన పెద్దలు మిన్నకుండిపోయారు. అదే పెద్దలు ఇళయరాజా రీరికార్డింగ్ చూసిన తర్వాత అద్భుతమన్నారు. ఈ చిత్రంలో ఒక షాట్లో నాగార్జున, జె.డి. చక్రవర్తిని కాలేజ్ క్యాంపస్‌లో తరుముతుంటాడు. ఇళయరాజా ఆ షాట్‌కి ఒక విషాద మ్యూజిక్ బిట్ వేశారు. వర్మకి అర్థం కాలేదు. వర్మ సంశయం గ్రహించిన ఇళయరాజా, "పిల్లలు బాగా చదువుకోవాలని ఎంతో డబ్బు వెచ్చించి తల్లిదండ్రులు కాలేజీలకు పంపితే, వాళ్లు చేసే పని ఇదా? అవి చూస్తే తల్లిదండ్రు లెంత బాధపడతారు? అందుకే అక్కడ పేథటిక్ మ్యూజిక్ బిట్ వేశాను" అని అన్నారట. సైకిల్ ఛేజ్ షాట్లో కూడా ఇళయరాజా పేథటిక్ బిట్‌నే వినిపించారు.

ఇదే ఇతరులకు ఇళయరాజాకి వున్న తేడా!

**రాజా నాదవిన్యాసం**

1985లో వచ్చిన అన్వేషణ (కార్తీక్, భానుప్రియ-వంశీ), జ్వాల (చిరంజీవి, భానుప్రియ-రవిరాజా పినిశెట్టి) చిత్రాలలో పాటలు ఒక ఎత్తైతే శ్రీ షిర్డిసాయిబాబా మహాత్మ్యం (విజయచందర్-కె. వాసు) లో పాటలు మరో ఎత్తు. ఎంతో వైవిధ్య భరితమైన స్వరజతులు ఇళయరాజా సంగీతంలో ప్రస్ఫుటిస్తాయి. 1986లో ఇళయరాజా నిరీక్షణ, ఆలాపన, రాక్షసుడు, ఒకరాధ-ఇద్దరు కృష్ణులు వంటి విజయవంతమైన చిత్రాలకు అద్భుతమైన పాటలు స్వరపర్చారు. ఆ పాటలన్నీ సుస్వర పారిజాతాలే!

ఒకసారి రాజా మ్యూజిక్ సిట్టింగ్ కోసం ముదుమలై అడవుల్లోని అతిథిగృహంలో బసచేసారు. షెడ్యూలుకన్నాముందే పనులన్నీ అయిపోయాయి. సాధారణంగా సిట్యుయేషన్లకు దర్శకుని సూచనమేరకు రాజా ట్యూన్లు యిస్తారు. కానీ స్వయంసిద్ధంగా తన మస్తిష్కంలో మెదిలే ఆలోచనలకు ట్యూన్లు కట్టాలనిపించి ఆరు బాణీలను సిద్ధం చేశారు. వాటిని ఎవరు తీసుకుంటారు? పాటలకు అనుగుణంగా కథ అల్లాలి. సాధారణంగా యిది జరిగేపని కాదు. తమిళ దర్శకులు ఆర్. సుందరరాజన్‌కు ఆ ట్యూన్లు వినిపించి కథ అల్లి సినిమా తియ్యమని ఇళయరాజా సలహా యిచ్చారు. అలా "వైదేహి కాత్తిరుందాళ్" చిత్రం రూపొంది అఖండ విజయం సాధించింది. దాన్నే భానుచందర్, భానుప్రియ జంటగా దర్శకుడు మోహనగాంధి మంచి మనసులు (1986) చిత్రంగా పునర్నిర్మించారు. ఈ చిత్రంలోని "జాబిల్లికోసం ఆకాశమల్లే వేచాను నీరాకకై", "ఈ సంజ కెంజాయ కుంకుమలో" పాటలు స్వరపారిజాతాలే కదా!

సినిమా విజయవంతం కాదని అనిపించిన సందర్భాల్లో నిర్మాతల్ని రీరికార్డింగ్‌ల వంటి పనులకు ఎక్కువగా ఖర్చు పెట్టనిచ్చేవారు కాదు రాజా. చిత్ర విజయాల అంచనా వెయ్యడంలో ఇళయరాజాకు సిక్స్త్‌సెన్సు వుండేదని సినీపండితుల ఉవాచ.

లేడీస్ టైలర్‌తో బాటు 1987లో సంకీర్తన (నాగార్జున, రమ్యకృష్ణ-గీతాకృష్ణ), మహర్షి (రాఘవ, శాంతిప్రియ-వంశీ) చిత్రాలు ఇళయరాజాకు మంచిపేరు తెచ్చిపెట్టాయి. అదే సంవత్సరం డాన్స్‌మాస్టర్, కేడీ, నాయకుడు వంటి డబ్బింగ్ చిత్రాలు కూడా విడుదలయ్యాయి. ఇళయరాజా చేసిన డబ్బింగ్ పాటల్ని

ఏనాడూ పరభాషా గీతాలుగా ప్రేక్షకులు, శ్రోతలు పరిగణించలేదు. ఆయన సంగీత దర్శకత్వంలో నేటివిటీ వుండేలా డబ్బింగ్ పాటలు రూపుదిద్దుకునేవి.

కమల్‌హాసన్ చిత్రాలకు యమ్.యస్. విశ్వనాథన్ కాని ఇళయరాజా కాని సంగీతం సమకూర్చేవారు. మార్పుకోసమని 'హేరాం' చిత్రానికి మరో సంగీత దర్శకునికి అవకాశం కల్పించారు కమల్. పాటలు సగం పూర్తయ్యాక ఆ పెద్దమనిషి పారితోషికం ఎక్కువ కావాలని పట్టుబట్టాడు. అప్పటికే పాటల చిత్రీకరణ జరిగిపోయింది. పారితోషికం పెంచేందుకు కమల్ ససేమిరా అన్నారు. దాంతో ఆ సంగీత దర్శకుడు "నా పాటలు మీ చిత్రంలో వాడకండి" అంటూ షరతు విధించాడు. కమల్ ఇళయరాజాకు ఫోన్ చేసి జరిగింది చెప్పి, పాటల్ని మళ్లీ చేసివ్వమని, రీషూట్ చేస్తానని చెప్పారు. రాజా ఆలోచించి, "కమల్! బాధపడకు. ఇలాంటివి సినీ పరిశ్రమలో మామూలే. పాటలు మళ్లీ కంపోజ్‌చేసి రీషూట్ చెయ్యాలంటే డబ్బు, సమయం రెండూ వృధా అవుతాయి. ఒకసారి నువ్వు షూట్ చేసిన పాటలు చూపించు. అదే సాహిత్యానికి చిత్రీకరణకు సరిపోయే బాణీలు అందిస్తాను" అంటూ కమల్‌ని సమాధాన పరిచారు. ఈ సాహసం కేవలం ఇళయరాజా మాత్రమే చెయ్యగలిగారు.

## అనితరసాధ్యం - ఇళయరాజా మార్గం

1988లో ఇళయరాజా రక్తాభిషేకం (బాలకృష్ణ, రాధ-కోదండరామిరెడ్డి), జమదగ్ని (కృష్ణ, రాధ-భారతీరాజా), వారసుడొచ్చాడు (వెంకటేష్, సుహాసిని-మోహనగాంధి), అభినందన (కార్తీక్, శోభన-అశోక్‌కుమార్), రుద్రవీణ (చిరంజీవి, శోభన-బాలచందర్), ఆఖరిపోరాటం (నాగార్జున, శ్రీదేవి-రాఘవేంద్రరావు), శ్రీ కనకమాలక్ష్మి రికార్డింగ్ డాన్స్ ట్రూప్ (నరేష్, మాధురి-వంశీ), స్వర్ణకమలం (వెంకటేష్, భానుప్రియ-విశ్వనాథ్), మరణమృదంగం (చిరంజీవి, రాధ-కోదండరామిరెడ్డి) వంటి విజయవంతమైన చిత్రాలకు సంగీతం సమకూర్చారు. ఇదే సమయంలో ఘర్షణ డబ్బింగ్ చిత్రం కూడా శతదినోత్సవం జరుపుకుంది. ఈ చిత్రాలన్నిటిలోనూ విభిన్న సంగీతం వినిపించిన ఇళయరాజా మార్గం అనితరసాధ్యం.

1989లో ఇళయరాజా అత్యధిక విజయోత్సవ చిత్రాల్ని అందించారు. వాటిలో శివ (నాగార్జున, అమల-రాంగోపాల్ వర్మ), ఇంద్రుడు-చంద్రుడు (కమల్‌హాసన్, విజయశాంతి-సురేష్‌కృష్ణ), ప్రేమ (వెంకటేష్, రేవతి - సురేష్

కృష్ణ), గీతాంజలి (నాగార్జున, గిరిజ-మణిరత్నం), రుద్రనేత్ర (చిరంజీవి, రాధ- రాఘవేంద్రరావు), చెట్టుకింద ప్లీడరు (రాజేంద్రప్రసాద్, కిన్నెర-వంశీ), విచిత్ర సోదరులు (కమలహాసన్, గౌతమి-సింగీతం శ్రీనివాసరావు) చిత్రాలు విజయం సాధించాయి. 1989-92 సం॥ల మధ్యకాలంలో ఇళయరాజా పేరు మారు మ్రోగింది. తెరమీద ఆయన పేరు కనిపిస్తే ఈలలు వినపడేవి. తమిళనాడులో అయితే హీరోతో సమానంగా చిత్రం విడుదల రోజున ఇళయరాజా కటౌట్లు వెలిసేవి. ఇళయరాజా పాటల్ని క్యాసెట్లలో నింపుకునే వాళ్లు మ్యూజిక్‌షాపుల్లో నిండిపోయేవారు.

రాజా చిత్రరంగ ప్రవేశం చేసిననాటికి అటు తమిళ, ఇటు తెలుగు చిత్రరంగంలో ఉద్దండ సంగీత దర్శకులుండేవారు. తమిళంలో యమ్.యస్. విశ్వనాథన్‌ది ఏకచ్ఛత్రాధిపత్యం. తెలుగులో మహదేవన్, రాజన్ – నాగేంద్ర, సత్యం, చక్రవర్తి, రమేష్‌నాయుడు, రాజ్-కోటిలదే ఆధిపత్యం. ఇంతపోటీ వాతావరణంలో కూడా ఇళయరాజాను నిలబెట్టింది ఆయన ప్రవేశపెట్టిన వినూత్న సంగీత పోకడలే. బొబ్బిలిరాజా, కొండవీటిదొంగ, ఏప్రిల్ 1 విడుదల, కీచురాళ్లు, కూలీ నెం. 1, ఆదిత్య 369 వంటి ఎన్నో చిత్రాలు ఇళయరాజాని అందలం ఎక్కించాయి. అంజలి, ఓ పాపాలాలి, తూర్పు సిందూరం వంటి డబ్బింగ్ చిత్రాలుకూడా రాజా కీర్తిని తారాపథానికి చేర్చాయి.

తమిళంతో పోల్చితే ఇళయరాజా తెలుగులో తక్కువ చిత్రాలకు దర్శకత్వం వహించినా, తెలుగు సినిమానే ఆయనకు మొదటి జాతీయ పురస్కారాన్ని (సాగర సంగమం-1983) అందించింది. అలాగే 1988లో రుద్రవీణ చిత్రం కూడా రాజాకు జాతీయ పురస్కారాన్ని తెచ్చిపెట్టింది. భారతీరాజా తొలిచిత్రం "పదునారువయదినిలే" (తెలుగులో పదహారేళ్ల వయసు)లో జానకికి జాతీయ అవార్డు లభించింది ఇళయరాజా సంగీత దర్శకత్వంలోనే.

తమిళంలో సింధుభైరవి (1985) చిత్రానికి కూడా ఉత్తమసంగీత దర్శకత్వానికి జాతీయ పురస్కారం లభించింది. ప్రఖ్యాత గాయని 'చిత్ర' యీ చిత్రం ద్వారానే పరిచయం అయింది. అంతేకాదు జాతీయ స్థాయిలో ఉత్తమ గాయనిగా మొదటి చిత్రంలోనే పురస్కారం అందుకుంది. ఇది కూడా ఇళయ రాజా ప్రతిభే. ఇళయరాజా చలనచిత్ర సంగీతానికి కొత్తనడక నేర్పారు. కొత్తరకంగా పాశ్చాత్య వాద్యపరికరాలను వినియోగించి వైవిధ్య భరితమైన

సంగీతాన్ని సృష్టించారు. జగదేకవీరుడు-అతిలోక సుందరి (1990)లో "యమహో నీ యమాయమా అందం" అనే పాటను విషాద గీతాలకు వుపయోగించే 'మాయమాళవగౌళ' రాగంలో స్వరపరిచి "ఆహా" అనిపించుకున్నారు.

ప్రయోగాలు చెయ్యడంలో ఇళయరాజా సిద్ధహస్తులు. మౌనగీతం (1981) చిత్రంలో "పరువమా చిలిపి పరుగు తీయకూ" పాటకు జాగింగ్ శబ్దాన్ని ఆర్కెస్ట్రాలో ఒక వ్యక్తి తొడలమీద లయబద్ధంగా చేతులతో కొట్టించి రాబట్టారు. పాట ఎంత మధురంగా వుంటుందో చెప్పాల్సిన పనిలేదు. ఇళయరాజా ఒక్కరోజులో 25 పాటలవరకు బాణీలు కట్టగల ధిట్ట. "భాషతో సంబంధం లేకుండా వీనుల విందైన సంగీతం అందించగలిగే ఏ సంగీత దర్శకుడైనా నాకు ఇష్టమే. సంగీతం ఒక సాగరం. ఆ సాగర తీరాన కూర్చుని, అక్కడ దొరికే ఆలిచిప్పల్ని ఏరి, మాల కూర్చి, మెరుగుపెట్టి అమ్మే పనే నేను చేస్తున్నది" అంటారు ఇళయరాజా.

## వంశీ తలపోతలు – ఇళయరాజా కలనేతలు..

భారతీరాజా దర్శకత్వంలో ఇళయరాజా సంగీతం సమకూర్చిన సీతాకోకచిలక (1982) చిత్రానికి వంశీ అసిస్టెంట్ డైరెక్టరుగా పనిచేశారు. తన తొలిచిత్రం మంచుపల్లకి. ఏడిద నాగేశ్వరరావు నిర్మించిన సితార వంశీకి రెండవ చిత్రం. ప్రతిష్ఠాత్మకంగా నిర్మింపబడిన ఈ చిత్రం వంశీకి దర్శకునిగా మంచిపేరు సంపాదించి పెట్టడమే కాకుండా ఇళయరాజా సంగీతానికీ అంతేపేరు తెచ్చిపెట్టింది. సితార విజయంతో ఇళయరాజా వంశీకి ఆస్థాన విద్వాంసులయ్యారు. అంతేకాదు ఇద్దరి మధ్య విడరాని స్నేహబంధం బలపడింది.

ఇళయరాజాతో కలిసి వంశీ అన్వేషణ (1985) చిత్రం మ్యూజిక్ సిటింగ్స్‌కి మదురై వెళ్లారు. తీరా వెళ్లాక కథ వున్న ఫైలు తీసుకెళ్లలేదని గుర్తించారు. పాటల సన్నివేశాలు ఎక్కడెక్కడ వున్నాయో గుర్తులేదు వంశీకి. అక్కడికక్కడ మరలా కథ అల్లి పాటలు ఖరారు చేశారు ఇద్దరూ. ఈ చిత్రం రీరికార్డింగు హాలీవుడ్ సినిమాల స్థాయిలో వుంటుంది. ఈ చిత్రంలో పక్షుల కిలకిలారావాలు ఒక తమిళ మిమిక్రీ కళాకారునితో చేయించారు.

ప్రేమించు పెళ్లాడు (1985) చిత్రానికి ఉషాకిరణ్ మూవీస్‌వారు సత్యంని కాని, బాలుని కాని సంగీత దర్శకునిగా తీసుకుందామని తొలుత సూచిస్తే

వంశీ పట్టుబట్టి ఇళయరాజాను ఎంపిక చేయించారు. రాజా ఆచిత్రానికి కేవలం 45 నిమిషాల్లో అన్ని పాటలూ కంపోజ్ చేశారంటే నమ్ముతారా!

శ్రీ కనకమాలక్ష్మి రికార్డింగ్ డాన్స్ ట్రూప్ (1988) లో తొలిసారి మూడు పాత పాటల్ని రీమిక్స్ చేయించారు వంశీ. అవి:- "నువ్వు నాముందుంటే" (సినారె-గూఢచారి 116), "తెలిసిందిలే... తెలిసిందిలే" (సినారె-రాముడు భీముడు), "సిగ్గేస్తోందా... సిగ్గేస్తోందా" (సినారె - మనుషులు మమతలు). సితారలో ఒక మ్యూజిక్ బిట్ ఆధారంగా "వెన్నెల్లో పాడనా... నవ్వులే పూయనా" పాట రూపుదిద్దుకుంది. స్వాతిముత్యం (1986) చిత్రంలో తరచుగా వచ్చే ఒక మ్యూజిక్ బిట్‌ను వంశీ పాటగా మలుచుకున్నారు. సిరివెన్నెల రాసిన "ఏనాడు విడిపోని ముడివేసెనే" అనే యీ పాటను చాలా బాగా ట్యూన్ చేశారు ఇళయరాజా. ఆలాపన (1986) చిత్రంలో ఒక లవ్ థీమ్ ఆధారంగా చెట్టుకింద ప్లీడరు (1989) లో "అల్లిబిల్లి కథలా రావే.. అల్లుకున్న కథలా రావే" పాటను ఇళయరాజాతో చేయించుకున్నారు వంశీ.

శివ (1889) చిత్రంలో "బోటనీ పాఠముంది... మ్యాటనీ ఆట వుంది" పాట రికార్డింగ్ ప్రసాద్ స్టూడియోలో జరుగుతున్నప్పుడు వంశీ అక్కడకు వెళ్లారు. రిథమ్ కొత్తగా అనిపించి అలాటి పాట ఒకటి కావాలని వంశీ రాజాను అడిగారు. అలా ఏప్రిల్ 1 విడుదల (1991) చిత్రంలో "ఒకటే ఆశ... అందుకో శ్వాస" అనే పాటను ఇళయరాజా వంశీకి చేసి పెట్టారు.

డిటెక్టివ్ నారద (1992) చిత్రంకోసం వంశీ "ప్రేమయాత్రలకు బృందావనము నందనవనము ఏలనో" (గుండమ్మకథ) ప్రేరణగా ఒక పాట రాసి ఇళయరాజాకు చూపించారు. "కాన్సెప్ట్ బాగుంది. ఆర్కెస్ట్రేషన్ కూడా నువ్వేచెయ్యి" అని వంశీని ప్రోత్సహించి, సంగీత దర్శకునిగా కూడా తీర్చిదిద్దారు. "యవ్వనాల పువ్వులన్ని నవ్వుతున్న తోటలో" అనేదే యీ పాట. వంశీ చిత్రాలు అధిక శాతం సంగీత భరితాలే. ఔట్‌పుట్ బాగా రావాలని సంగీత చర్చల్లో వీళ్లిద్దరే కూర్చునేవారు. సమయపాలనలో ఇళయరాజాకు మరెవరూ సాటిరారు.

ఇళయరాజా వైవిధ్యంగల గాయకుడు కూడా. సీతాకోకచిలుక (అలలు కలలు ఎగసి ఎగసి), కూలీ నెం. 1 (కలయా నిజమా), అంతఃపురం (అస్సలేం గుర్తుకురాదు నాకన్నుల ముందు నువ్వు వుండగా) చిత్రాల్లో ఇళయరాజా మంచి మెలోడీ గీతాలు ఆలపించారు.



## ఇళయరాజా ప్రస్థానంలో విజయసోపానాలు

**జాతీయ పురస్కారం (ఉత్తమ సంగీత దర్శకుడు)**

1983 సాగర సంగమం (తెలుగు)
1985 సింధు భైరవి (తమిళం)
1988 రుద్రవీణ (తెలుగు)
2009 కేరళ వర్మ పళసిరాజా (మలయాళం)

**నంది బహుమతి (ఆంధ్రప్రదేశ్)**

1982 సీతాకోకచిలక
1988 రుద్రవీణ
1990 జగదేకవీరుడు - అతిలోకసుందరి

**తమిళనాడు రాష్ట్ర బహుమతి**

1977 పదునారు వయదినిలే
1980 నిలళ్‌గళ్
1981 అలైగళ్ ఒయివత్తిలై
1988 అగ్ని నచ్చత్తరమ్
1989 వరుషం పదినారు & గరగాట్టక్కారన్
2009 అజంతా

**కేరళ రాష్ట్ర బహుమతి**

1994 సమ్మోహనం (నేపథ్యసంగీతం)
1995 కాలాపాని
1998 కల్లు కొండొరు పెణ్ణు (నేపథ్యసంగీతం)

**ఫిలింఫేర్ బహుమతి**

2003 మనస్సినక్కరే (మలయాళం)
2005 అచ్చువింటె అమ్మ (మలయాళం)

**గోల్డెరెమి పురస్కారం**

2005 విశ్వ తులసి (తమిళం) యం.యస్. విశ్వనాథన్‌తో సంయుక్తంగా

**బిరుదులు - సత్కారాలు**

1988 *(a)* "ఇసైజ్ఞాని" తమిళనాడు ప్రభుత్వ పురస్కారం
*(b)* "కలైమామణి" తమిళనాడు ప్రభుత్వ పురస్కారం
1998 "లతా మంగేష్కర్ పురస్కార్" - మధ్యప్రదేశ్ ప్రభుత్వ పురస్కారం

2004 "*NTR*" జాతీయ పురస్కారం" – ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పురస్కారం

2010 *(a)* పద్మభూషణ్ – భారత ప్రభుత్వ సత్కారం

*(b)* "అక్షయ సమ్మాన్" – ఒడిసా రాష్ట్ర ప్రభుత్వ పురస్కారం

## గౌరవ డాక్టరేట్లు

1994 *(a)* అన్నామలై విశ్వవిద్యాలయం, తమిళనాడు

*(b)* అరిజోనా (అమెరికా) రౌండ్‌టేబుల్ డాక్టరేట్

1996 మదురై కామరాజ్ విశ్వవిద్యాలయం, తమిళనాడు

## మైలురాళ్లు

- దళపతి (1991) చిత్రంలో బాలు, స్వర్ణలతతో పాడించిన "రాక్కమ్మా కయ్యెతట్టు" (తెలుగు దళపతిలో "చిలకమ్మా చిటికెయ్యంట") పాటకు *BBC World Top Ten Music Poll* లో స్థానం
- నాయగన్ (1987) చిత్ర సంగీతానికి *Time Magazine All Time 100 Best Movies* లో స్థానం
- అంజలి (1990), హే రాం (2000) చిత్రాలు ఆస్కార్ అవార్డు పరిశీలనకు అర్హత
- ఇటలీ ఏంజలికా అంతర్జాతీయ ఫెస్టివల్ (2004) లో సంగీత ప్రదర్శన
- ధార్మిక సంస్థలకు విరాళాల సేకరణ కోసం శ్రీలంక, మలేసియా దేశాలలో సంగీత ప్రదర్శనలు
- రాయల్ ఫిల్‌హార్మోనిక్ ఆర్కెస్ట్రా తరఫున సింఫనీ నిర్వహించిన మొదటి ఆసియా వాసిగా ఖ్యాతి

## వ్యక్తిగతం

భార్య : జీవా (అక్క కూతురు) – ఇటీవలే కాలధర్మం చెందారు

కుమారులు : కార్తీక్‌రాజా, యువన్ శంకర్ రాజా (ఇద్దరూ సంగీత దర్శకులే)

కుమార్తె : భవతారిణి (గాయని, సంగీత దర్శకురాలు)



## వేటూరి సుందరరామమూర్తి స్వదస్తూరితో రాసిన గీతం

అ. సాగర సంగమమే - ప్రణయ
సాగర సంగమమే ॥

జానకి కన్నుల జలధి తరంగం
రాముని మదిలో విరహం సముద్రం
చేతులు కలిపిన సేతు బంధనం
ఆ సేతు హిమాచల ప్రణయ
కీర్తనం ॥

ఆ! సాగర సంగమమే - ప్రణయ
సాగర సంగమమే ॥
కలలో అలలై ఎగసిన కడలికి
కలలూ ఇలలూ దారికని తెలియక ॥
కన్యాకుమారి నీ పదములు కడిగే
కడలికి కెరటంబై కదిలిన వేళ
సుమ సుకుమారి నీ చూపులకే
తడబడి వరములు అడిగిన వేళ

అ! అలసిన నా పాల అలకల నీలి
కురుల కొలువెక్కి ప్రణయాల పిలిచిన
పున్నమి రాతిరి వచ్చిన వేళ ॥

అ! భారత భారతి పద సన్నిధిలో
కలమున సాగర సంగమ స్మృతిలో
నా రవి నీవని వలపుల కోరిక
హృదయము ప్రియదగ పలికిన వేళ

ఇ! కురువపు ఉరవడి పరుగిడి వేగిరి
కన్నుల తొలకరి కలిసిన మనసున
సందిట మంటను పంచిన వేళ ॥



# ఇద్దరూ ఇద్దరే...
# ఇద్దరిదీ చెరిగిపోని ముద్దరే....

.....వేటూరి సుందరరామమూర్తి

*"తెలుగు చిత్ర సంగీత రంగానికి ఎంతో సేవ చేసిన ఇద్దరు మిత్రులు జూన్ నెలలోనే జన్మించారు. ఏడు రంగుల ఇంద్రధనస్సులు నింగిలో తొంగిచూసే సప్త స్వరాల తొలకరి జల్లుల వేళలో ఆ యిద్దరూ పుట్టడం వారు సంగీతానికి జీవితాలు అంకితం చేయడం ఆశ్చర్యం కలిగించదు. వారిద్దరితో నా అనుబంధమూ అలరులు కురియగ ఆమని సొబగులతో అలరారే అనురాగ వినురాగ బృందావన గీతగోవిందమే. వేదం, అణువణువున నాదం, నా పంచ ప్రాణాల నాట్య వినోదం 'అడమ'లుగా పెనవేసుకున్న ప్రణవంలా అది నాలో నేపథ్యంగా వినిపిస్తుంది.*

*ఈ యిద్దరిలో ఒకరు గిటారు డేనియల్ రాజా, ఇంకొకరు 'ఆంధ్రపత్రిక' లో నా సహోద్యాయి శ్రీ అగస్త్యేశ్వరరావు గారి అల్లుడు చి॥మణి. మూకాంబికా మూకస్వర ప్రసాదంతో డేనియల్ మహా సంగీత దర్శకుడైనాడు. మంచి బాలుడు మణి చదవవచ్చిన ఇంజనీరింగు పక్కన పెట్టి తండ్రినుంచి సంక్రమించిన త్యాగరాజ సంప్రదాయ గీతికి వారసుడై కోదండపాణి గురుత్వంలో ఘంటసాల అనే గంధర్వుడికి వారసుడనిపించు కున్నాడు."*

వీరిద్దరి జీవితాలు ప్రత్యక్షసాక్షిగా పరిశీలించినవారికి వర్తమాన పురాణాలుగా కనిపిస్తాయి. అభినవ శ్రుతి హాసాలుగా వినిపిస్తాయి.

డేనియల్ గిటారు చేత పట్టుకొని కాళ్లు కడుపులో పెట్టుకొని కాలం గడిపిన రోజుల్లో అనంతమైన రాగాలు, వాటిచుట్టూ పరిభ్రమించే లోకాలు అతని కడుపులో వున్నాయని గుర్తించిన వారు లేరు. నిట్టూర్పులతో మూగ వేణువులూదుతున్న అతని మౌనగీతాలు ఆ తర్వాత పలకనేర్చిన వైనం ఓ చిన్న కథ.

అతను కొందరు మిత్రుల పిలుపుతో చేసేది ఏమీ లేక యాత్రకు బయలుదేరాడు. అతని మతం క్రైస్తవం. కానీ అభిమతం, సమ్మతం క్రైస్తవపు సరిహద్దులు దాటాయి. నిజమైన క్రైస్తవాన్ని వాస్తవాన్ని గ్రహించింది అతని మనస్సు. మిత్రులతో యాత్రకు వెళ్లి డేనియల్ కొన్ని ప్రదేశాలు చూసి కర్ణాటక

రాష్ట్రంలో దక్షిణ కన్నడ జిల్లాలోని కొల్లూరు చేరుకున్నాడు. ఆ ఊరు శ్రీ ఆదిశంకరుల మూకపంచవింశతికి అద్దం పట్టే శ్రీ మూకాంబికా క్షేత్రం, సౌపర్ణికా నదీ తీరం, అదొక చిట్టడవి. అక్కడొక అతి ప్రాచీనమైన గణపతి ఆలయం. స్నానం చేసి వచ్చి డేనియల్ ఆ గుడిలో కూర్చున్నాడు. ఏదో నిర్వేదం. ఏదో నైరాశ్యం, బరువుగా మౌనం, బహుశా ధ్యానమేమో ! అది కూడా తెలియని స్థితి. అక్కడికి అడవిలోంచి వృద్ధుడైన సాధువు ఒకరు వచ్చి, దీపారాధన చేసి, స్వామికి నమస్కరించి అప్రయత్నంగా డేనియల్ వైపు చూసాడు. అతను మౌనముద్రలో వున్నాడో యోగనిద్రలో వున్నాడో – ఈ సాధువు అతనిని సమీపించి క్షణం ఆగి తలపై చేత్తో తడిమి 'ఇళయరాజా డా నీ' అన్నాడట. అతనిలో అపూర్వమైన చైతన్యం పుట్టుకొచ్చింది. కానీ ఎదుట జీవితం ఎడారిలా వుంది. అమ్మను సేవించుకొని మిత్రులతో మద్రాసు చేరాడు డేనియల్. రాగానే భార్య ఎదురువచ్చి........ 'మీ కోసం ఎవరో వారం రోజుల నుంచి రోజూ రెండు మూడు సార్లు వచ్చిపోతున్నారు. వాళ్లేదో పిక్చర్ తీస్తున్నారట. మీరు సంగీతం చెయ్యాలట' అంటుండగానే వాళ్లు రావడం, ఆ పిక్చర్‌కి అతను సంగీతం చేసి తన స్వర విహంగాన్ని వినువీధిలో ఎగురవేయడం జరిగిపోయింది. ఆ చిత్రమే 'అణ్ణక్కిళి' అనే తమిళచిత్రం. అందులో ప్రతిపాటా సూపర్‌హిట్టు కావడం, చిత్రవిజయానికే కాక ఇళయరాజా జీవిత సోపానానికి తొలిమెట్టు కావడం జరిగింది.

అనాడే దక్షిణ భారత చలనచిత్రాకాశంలో అపూర్వమైన తార వెలిగింది. వ్యక్తిగతంగా డేనియల్‌లో ఒక యోగి ఆవిర్భవించాడు. మూకాంబికా కృపారసం అతనిపై ఎడతెగని ధారగా కురిసింది. కాషాయం కడుతూ, పాదరక్షలు విసర్జించి,ఏకభుక్తంగా శాకాహారియై, మితభాషిగా, మౌనిగా మారిపోయాడు. అతను చేసిన చిత్రాల సంగీతంలో కూడా దివ్యత్వం చోటు చేసుకుంది. ఇళయరాజా శకం ప్రారంభమైంది. స్వరబ్రహ్మ అంతటి వారే అతని నాద విన్యాసానికి ఆశ్చర్యపడిన సందర్భాలున్నాయి.

'రాజపార్వై' అనే తమిళ చిత్రాన్ని తెలుగులో అమావాస్య చంద్రుడుగా ఏకకాలంలో తీయడం జరిగింది. ఇళయరాజాతో నాకు అదే తొలి పరిచయం. అప్పుడే తమిళ కవి వైరముత్తుకు ట్యూన్ యిచ్చానని, అప్పుడే ఈయన (అంటే నేను) వస్తే బాగుండేది కదా అన్న ఫుల్లవిరుపుతో ప్రారంభమైంది, ఈ పరిచయం. దర్శకుడు సింగీతం శ్రీనివాసరావుగారు ఏదో సర్ది చెప్పబోయారు. ఇదేదో బ్రతిమాలుడు వ్యవహారంగా తోచి నేను లేచి వెళ్ళబోయాను. తాను చాలా బిజీగా వున్నానని, తమిళకవి ట్యూన్ ఇవ్వగానే అలా పల్లవి రాసిచ్చాడని, ఇప్పటికే

తనకు లేటయిందని ఇదీ వరస.... విరసంగా సాగింది. 'నేనూ చాలా బిజీయే.... అలా చెప్పుకోవడం పద్ధతి కాదు.... వస్తాను' అన్నాను. 'ఎన్నా సార్ - కవింగర్‌కి కోపం వందదుపోలె యిరిక్కే... సారీ సార్' అంటూ ఆ ట్యూను వినిపించాడు ఇళయరాజా. వినగానే ఆనందం కలిగింది. 'ఇలా వినగానే తమిళకవి అలా రాసి ఇచ్చాడు' అన్నమాట మదిలో మెదిలింది. 'ఎతుదుకు రాంగళా' అన్నాను.... 'పల్లవి రాసుకుంటారా' అని.... ఇప్పుడే చెప్పేస్తారా అయితే చెప్పండి' అన్నాడు.

'సుందరమో సుమధురమో... చందురుడందిన చందన శీతలమో
మలయజ మారుతశీకరమో... మనసిజ రాగవశీకరమో'

అని పల్లవి చెప్పాను. అది పాడుకొని చూసి, బయటకు పాడి వినిపించి 'ఎంత మధురంగా వుంది. ఆహా! సుందర తెలుంగు అని భారతి మహాకవి ఎందుకన్నాడో యిప్పుడు తెలిసింది'. అని నన్ను కూడా మెచ్చుకున్నాడు.

ఆ ముహూర్తమెటువంటిదో మా యిద్దరి కలయికలో ఎన్నో పాటలీ కుసుమాలు వికసించాయి. మా మధ్య అవ్యాజమైన స్నేహబంధం ఏర్పడి ఒకటిన్నర దశాబ్దం పాటు మా సినీ జీవితానికి ఆలంబనగా నిలిచింది. ఇళయరాజా బాహిర ప్రవర్తన చాలా మందికి అర్థం కాని విషయం. సన్నిహితులైన ఏ యిద్దరు ముగ్గురికో అది కరతలామలకం. మేమిద్దరం కలిసి కొన్ని తీర్థయాత్రలు చేసాం. కర్ణాటకలో హెనెక్కీ అనే కుగ్రామంలో ఒక స్వామి - ఆయన పేరు ఆవులప్పస్వామి. దర్శనానికి రాజా దంపతులూ, నేనూ వెళ్లాము. ఆ గ్రామంలో గుడికి చెందిన పూజాగోవు మరణిస్తే ఈ స్వామిని జనమంతా ప్రార్థించారట. అప్పుడీస్వామి ఆవు కళేబరాన్ని వెనకనుంచి తాకి 'లేరా బసవా లే' అన్నాడట. ఆ ఆవు వెంటనే సజీవంగా లేచి నిలబడ్డదని, అప్పటినుంచి 'ఆవులప్పస్వామి' అనే పేరు స్వామికి వచ్చిందని రాజా నాకు చెప్పాడు. అలాగే పొల్లాచ్చిలో 500 సంవత్సరాల ఒక యోగి వున్నాడని చెప్పి (ఆయన ఫోటో కూడా తన కంపోజింగు గదిలో వుంది) ఎంతగానో ఆయన మహత్తు నాకు చెప్పేవాడు.

ఇళయరాజా చక్కని తెలుగు మాట్లాడగలడు. యాస ఆయనలో చాలా తక్కువ. పాట రాస్తే దాన్ని సవిమర్శకంగా తూచి చూడగలడు. స్వర పదసంధానం ఆయనకు, ఆయన పాటకూ ప్రాణం. తను ఇచ్చిన ఒక ట్యూన్‌కి 'కొట్టండి తిట్టండి గిల్లండి గిచ్చండి కొయ్యండి చంపండి పిచ్చంటే నమ్మండి ప్రేమా' అని రాసినప్పుడు అతను ఎంతగా నవ్వాడో, ఎంతమందికి చెప్పాడో! 'సాగరసంగమం' లో 'ఓం నమశ్శివాయ' అనే పాట నన్ను ముందు రాయమని తరువాత ఎంత గొప్పగా ట్యూన్ చేశాడో అందరికీ తెలిసిందే. శివసంబంధమైన రాగాలలో

హిందోళం ప్రధానమైనదని ప్రొఫెసర్ పి. సాంబమూర్తి ఒక సదస్సులో చెప్పారు. ఇళయరాజా ఆ రాగంలో నా పాటను స్వరపరిచిన క్షణాలలో నాకు ఆ మాటలు గుర్తుకు వచ్చాయి. అందులో అతను ప్రస్తారించిన స్వరాలు శివస్పందనను తాండవ చలనాన్ని సాత్వికంగా కళ్లకు కట్టినట్లు చూపించాయి. ముఖ్యంగా 'ప్రకృతి పార్వతి నీతో నడచిన ఏడు అడుగులే స్వరసప్తకమై' అన్నచోట స్వరకల్పన అద్భుతంగా తోచింది. ఒకప్పుడు శహనా రాగంలో 'మామ' మనోహరంగా డ్యూయట్ చేస్తే, రాజా పరమ విషాదరాగంగా పరిగణింపబడే శుభపంతువరాళి రాగంలో డ్యూయట్ చేసి ఆహా అనిపించారు. అదే 'ఆఖరిపోరాటం' చిత్రంలో శృంగార రస వర్షగీతం 'స్వాతి చినుకు సందెవేళలో లేలేతవణుకు అందగత్తెలో' పల్లవిగా సాగుతుంది.

'నాభీహృత్కంఠరసన'ల ద్వారా ఉద్భవించి ఉరికివచ్చే 'సప్త స్వర సుందరులను' భజించిన నాద యోగులలో ఇళయరాజా ఒకడు. 'నాదసుధారసంబిలను నరాకృతి ఆయెరా' అన్న త్యాగయ్యగారి మాటకు సాక్ష్యమే అతని జీవితం. 'సీతాకోకచిలక', 'సాగరసంగమం', 'సితార', 'అన్వేషణ', 'కీచురాళ్ళు', 'శ్రీ ఏడుకొండలస్వామి', 'రుద్రనేత్ర', 'గీతాంజలి', 'ఆఖరిపోరాటం', 'జగదేకవీరుడు అతిలోకసుందరి', ఇలా ఎన్నని చెప్పగలను, ఏదని చెప్పగలను. ఎన్ని రసయోగాలు, ప్రయోగాలు ! రచనకీ రాగరచనకీ – ఎన్ని నియమాలు ! ప్రాణాయామాలు ! ధ్వని శాసనానికి పదాలు రాయడాలు. 'ఆఖరిపోరాటం' చిత్రంలో ఒక పాటకు కేవలం దరువు వినిపించి దీనికి రాయండి గురువుగారూ' అన్నాడు రాజా. అదొక మామూలు డ్యూయెట్ సన్నివేశం. నేను కొంచెం ఆలోచించాను. శబ్దం ఏ మాటని స్ఫురింపజేస్తుందో అవే మాటలతో రాయండి అన్నాడు – అప్పుడు రాసిన గీతం.

'ఎప్పుడు ఎప్పుడు గుప్పెడు ముద్దుల చప్పుడు బుగ్గల్లో
హత్తుకునే మత్తులలో మెత్తని వత్తిడిలో
ఇప్పటికిప్పుడు చిచ్చుల కుంపటి పెట్టకు గుండెల్లో
తాకిడికో దూకుడుకో దక్కిన చెక్కిలితో
నీ ఒంపుల సొంపే నా ఒంటికి పంపే
అల్లికలో అందికలో మల్లిక పూసిన మాపటిలో'

అలాగే ఒకే వాద్యం వినిపిస్తూ – దరువు విడిగా లేకుండా స్ఫురణకు మాత్రమే తంత్రిలో పలికిస్తూ – అక్కడి సన్నివేశానికి ఆ ట్యూన్ వచ్చిందని ఆ సన్నివేశానికి ఈ ట్యూన్‌కే మీకు ఏది రాయాలనిపిస్తే అది రాయండి అని

అన్నాడొకసారి.

'గోపెమ్మ చేతిలో గోరుముద్ద...రాధమ్మ చేతిలో వెన్నముద్ద
ముద్ద కావాలా ముద్దు కావాలా...ఆవిందా ఈవిందా నాముద్దు గోవిందా'

ఈ మధురగీతం అలా వచ్చిందే. అదొక సరసం, అదో చిలిపి తనపు మోజువీడు చిన్నరసం.... అందులో 'అలూ అరూ ఇణీ' తెలుగింటి మూల మూలలనుంచి ధైర్యంగా వచ్చి మనతో ఆడుకుంటాయి. ఎంత అందంగా పొందికగా. జడకుచ్చులతో, పరికిణీలతో, ముద్దొస్తాయో ! చింతా దీక్షితులు గారి సీతీ వెంకిలా, రమణగారి సీగానపెసూనాంబలా! పాట ఆగినా అవి మనసులో జ్ఞాపకాలుగా ఆడుతూనే వుంటాయి. ఆ పాట రాసి, అది 'ప్రేమించు-పెళ్లాడు' లో వచ్చి ఎంతకాలమైందో - అయినా ఆ పాట మధురంగా సరసుల హృదయాలలో స్మృతివీణలు మీటుతూనేవుంది.

లతామంగేష్కర్, బాలు కలసి ఆలపించిన యుగళగీతం అప్పటికప్పుడు కంపోజ్‌చేసి రాసినది అంటే ఎవరికైనా నమ్మడం కష్టం. 'తెల్లచీరకు తకధిమి తపనలు రేగెనమ్మ సందెవెన్నెల్లో...సిరిమల్లె పూలకు సరిగమ ఘుమఘుమ సోకెనమ్మ జంటముద్దుల్లో' అనే పాటలో చరణాలను సంగీత పరంగా లతాజీ మెచ్చుకుంటే అప్పటికప్పుడే అవి రాయడంలో రచయిత చూపిన విన్నాణాన్ని ఇళయరాజా ఆవిడకు చెప్పి నన్ను ఎంతో గౌరవించాడు. ముఖ్యంగా...

'కార్తీకం కలిసివస్తే ...నీ పరువం అడుగుతున్నా
హేమంతం కరుగుతుంటే...నీ అందం కడుగుతున్నా
వైశాఖం తరుముతుంటే...నీ ఒళ్ళో ఒదుగుతున్నా
ఆషాడం ఉరుముతుంటే...నీ మెరుపే చిదుముకున్నా'
వంటి చరణాలలో సన్నివేశ సాహిత్యానికి లతాజీ చాలా సంతోషించారు.

ఇళయరాజా పాట కంపోజింగు ఆర్భాటంగా వుండదు. గిటారు, తబలాల సహకారంతో ఎలుగెత్తి అబద్ధ సాహిత్యాలు పాడి ట్యూన్లు దర్శక నిర్మాతల చేత ఓకే చేయించే 'గిమ్మిక్కు' బొత్తిగా అతనికి లేవు. కనీసం తబలా అయినా లేకపోతే గత్తు ఎలా తెలుస్తుందనుకోడానికి ఆస్కారం వుండదు. తాను చాలా తక్కువ స్థాయిలో రహస్యోపదేశం చేస్తున్నట్లు పాడుతూ కుడి చేతివేలితో హార్మోనియం మీద దరువు వేస్తాడు. దూరంగా కూర్చున్న సహాయకుడు సౌందరరాజన్ స్వరాలు రాసుకుంటారు. పాట టేపు అయిపోతుంది.

ఒకసారి విజయలక్ష్మి ఆర్ట్స్ మూవీస్ (శ్రీ త్రివిక్రమరావు) కంపోజింగ్‌కు

నేనూ యండమూరి వీరేంద్రనాద్ ఇద్దరమే వెళ్ళాము. అదొక ఏకాంత నిర్జన ప్రదేశం. తమిళనాడు నడిబొడ్డున వున్న సుందర పర్వత ప్రాంతం. ఇళయరాజా చాలా సందర్భాలలో అటువంటి ప్రదేశాలలో 'ప్రత్యూష పవనాంకురములు పైకొనువేళ కంపోజింగు కార్యక్రమం పెట్టేవాడు. ఆరోజు ఉదయం మా పాటల స్వరకల్పన. మేము ముగ్గురమూ సౌందరరాజన్ మాత్రమే ఉన్నాము. ఏదో తపోముద్రలో హార్మోనియం ముందు చాలా సేపు కూర్చున్నాడు. మాకు అర్థంకాలేదు. ఒక ఇరవై నిముషాల తరువాత మెల్లిగా కళ్ళు తెరిచి 'ఈ క్షణం నాకు ఒక మహాపురుషుడు దర్శనమిస్తున్నాడు. సినిమాకి చేసే సంగీతం జనం కోసం-మన ప్రతిభా పాటవాల ప్రదర్శనకు కాదు. అది నిరూపించి ఒకదారి చూపించిన గురువు ఒక్కరే. ఆయనెవరో తెలుసా? ఒకే చిత్రంలో ఒకే రాగంలో దాదాపు అన్ని పాటలూ చేసి అన్నీ హిట్ చేసిన ఆయనెవరో తెలుసా?' అని అడిగాడు. నాకేం చెప్పాలో ఎవరని చెప్పాలో తెలియలేదు. కానీ సంకోచిస్తూనే శంకర్ జైకిషన్ అన్నాను. 'ఆ క్రెడిట్ అంతా ఘంటసాల గారిది' అని ఖచ్చితంగా అనేశాడు. అనడమే తడవుగా హార్మోనియం మీద 'పాతాళభైరవి' చిత్రంలోని పాటల పల్లవులు, రాగాలు గుర్తున్నంతవరకు పాడి - ఇది సామాన్యమైన విషయం కాదు అన్నాడు. వెంటనే ఆ ఉత్సాహధోరణిలో ఒక ట్యూన్ పాడి 'ఇది మీ డ్యూయట్‌కి యిస్తున్నాను' అని నన్ను రాయమన్నాడు. ఆ పాటే 'శుభలేఖ రాసుకున్నా ఎదలో ఎపుడో' అనే పల్లవితో అందరినోట చాలాకాలం వినిపించింది. ఇప్పటికి 'అటువంటి పాట ఒకటి యివ్వండి గురువుగారూ' అనేవాళ్ళున్నారు.

ఇళయరాజా అంటే యువరాజు అని అర్థం. కళలకు రాజు నటరాజు ఒక్కడే - ఆ నటరాజు పాదాల తలవాల్చడం నయనాభిషేకాన తరించడం అతని రాజరికం - అది అందరికి లభ్యమయ్యే వరంకాదు. జూన్ 2వ తేది ఇళయరాజా పుట్టినరోజు. సప్తసాగరాలుగా పొంగే సంగీతానికి ప్రాక్ పశ్చిమాలు లేవని చాటిన వైతాళికుడు జన్మించిన రోజు - అతనితో నాకు గల అనుబంధంతో అనురాగంతో శతవసంతాలు జీవించాలని మళ్ళీ తెలుగు సినిమాను సంగీతంతో అభిషేకించాలని కోరుకుంటున్నాను.

ఇద్దరుమిత్రుల పుట్టినరోజుల పురస్కారంగా మొదలెట్టిన ఈ వ్యాసార్థంలో జూన్ 4వ తేదిన జన్మించిన ప్రియమైన దుర్మార్గుడు. నేను గీతమైతే తాను గానమైనవాడు. అద్వితీయుడైన రెండవవాడు, నాకు ప్రాణసమానమైనవాడు, నావాడు బాలసుబ్రహ్మణ్యం.

జనార్దన రెడ్డి సి.ఎం.గా ఉన్నప్పుడు నంది అవార్డ్స్ ఫంక్షన్ ఒక సంవత్సరం నెల్లూరులో జరిగింది. అవి ప్రదానం చేయడానికి వచ్చిన నేటి తమిళనాడు ముఖ్యమంత్రి శ్రీమతి జయలలిత ఒకగొప్ప చారిత్రక సత్యం చెప్పారు. 'భారతదేశంలో సరిహద్దులంటూలేని రాష్ట్రాలు రెండే రెండు. అవి ఆంధ్ర తమిళ రాష్ట్రాలు' అన్నది ఆ సత్యం. ఉమ్మడి సాహితీ, సంగీత, నాట్య, కళా, సాంస్కృతిక చరిత్ర ఈ రెండు రాష్ట్రాలకు ఉన్నట్టు మరే ఇతర రాష్ట్రాలకు లేదని ఆమె అన్నారు. ఈ రెండు రాష్ట్రాల సరిహద్దు పల్లె కోనేటంపేటలో పుట్టిన బాలు ఆంధ్రులకీ తమిళులకీ ఉమ్మడి సినీ గాయకుడు. తమిళాంధ్ర దేశాలకు బాలులాగ ఉర్రూతలూగించిన గాయకుడు మరొకరు లేరు. ఘంటసాల, టి.ఎం.సౌందరరాజన్‌లు ఒక విధంగా ఆంధ్ర తమిళ రంగాలకే పరిమితమైనారు. కానీ బాలు గళం ఈ రెండు రంగాలకూ కాక కన్నడ, హిందీ రంగాలకు కూడా వ్యాపించి తెలుగు గాయకశ్రేణికి అఖండమైన కీర్తి ఆర్జించిపెట్టింది.

సాధనతో ఒక వ్యక్తి ఎంతటి శక్తిగా మారగలడో నిరూపిస్తుంది బాలసుబ్రహ్మణ్యం జీవితం. ముత్యాలొలికే దస్తూరి, మూలాగ్రాలెరిగిన ఆంధ్ర సాహితీ పరిచయం, ధ్వన్యనుకరణ వంటి కళలలో ప్రవేశం, అనర్గళంగా ఆంగ్లంతో పాటు దేశబాషలు అయిదారు మాట్లాడగల వాగ్ఝరి అతని నిధులు. శాస్త్రీయ సంగీతం గురువువద్ద నేర్చుకొనకపోయినా మామ, పుహళేంది వంటి విజ్ఞులవల్ల దానిని సాధించి పాడి మెప్పించిన సాధకుడు. ఇవన్నీ అతనిని గూర్చిన నిజాలు. సంగీత దర్శకుడుగా గంగిగోవుపాలవంటి నాలుగైదు చిత్రాలే చేసినా మధురంగా , మనోహరంగా సంగీతం వినిపించినవాడు బాలు. మయూరి, జాకీ, తూర్పువెళ్ళేరైలు అతని సంగీత దర్శకత్వ ప్రతిభకు దర్పణాలు.

ఉషాకిరణ్ సంస్థ నిర్మించిన 'మయూరి' చిత్రం సినీనిర్మాణ రంగంలో ప్రయోగాత్మకమైన మణిపూస. ఆ చిత్రానికి అందులో వున్న ఉదాత్త సన్నివేశానికి బాలు సమకూర్చిన సంగీతం కథలో వున్న 'మూడ్'ను ఇనుమడింప చేయడమేకాక, ఎంతో హార్దికమైన హాయిని శ్రోతలకు పంచిపెట్టింది. అటువంటిదే మరొక గొప్ప చిత్రం సంగీత రచన జరిగికూడా ఉషాకిరణ్ సంస్థ నిర్మించడం జరగలేదు. ఆ చిత్రం పేరు ప్రతిమ. గణేశ్ పాత్రో కథ, దర్శకత్వం అనుకున్న చిత్రమది. అందులోకూడా బాలు ఎంతో హృదయ పూర్వకమైన సంగీతం, నేను హృదయ పూర్వకమైన సాహిత్యం అందించాము. కొన్ని నా భావ గీతాలు కూడా బాలు ట్యూన్ చేసిన పద్ధతి విని మళ్ళీ దేవదాసు వంటి సినిమా తెలుగులో తీస్తే ఇతనే సంగీతం చెయ్యాలి అనుకున్నవారున్నారు. 'బ్రతుకులాంటి పాటలు బ్రతకలేని

బాటలో బాటసారిని నన్నీ పాటపాడనీ' వంటి గీతాలను మధుర విషాద గీతాలుగా మలిచిన మనస్వి అతను. బాపూరమణలకు బాలూ అన్నా అతని సంగీతమన్నా ఎంతో యిష్టం. 'చుట్టూ చెంగావి చీర' (తూర్పువెళ్ళేరైలు), 'శశివదన మనవి వినలేవా' (జాకీ), 'అలా మండిపడకే జాబిలి' (జాకీ), 'కోనసీమలో కొంగుజారిన ఆకుపచ్చ చందమామా' (సీతమ్మపెళ్ళి) లాంటి పాటలన్నీ బాలూ సంగీత దర్శకత్వ మధురిమకు స్వర దర్పణాలు. 'గీతాంజలి' పేర నేను వెలువరించిన 'క్రీస్తు గానసుధ' ఆడియో కాసెట్‌లో ప్రతిపాట మధురాతి మధురం. ఒకనాడు శ్రుతిలయలే జననీ జనకులు కాగ – అని ఆలపించిన బాలు ఈనాడు శ్రుతి లయల వంటి ఇద్దరు పాపలకు (కవలలు) తాత అయినారు.

గొంతులు మార్చి పాడడంలో గాత్రధారులకు కొత్తకోణాలు ఆవిష్కరించి 'దశకంఠుడు' అనిపించుకున్న బాలు 'రమైతీతి రామః' అన్నట్లు మరో నాదమూర్తి. 'బాలోచ్చిష్టం స్వరం సర్వం' అంటే అతన్ని కొంతైనా అర్థం చేసుకున్నట్లే. అన్నిటికి మించి బాలూని కళాకారుడిగా పెంచినది పూర్వులు, పెద్దలు అయిన సంగీత సాహితీ కోవిదులపట్ల అతనికున్న భక్తిభావం. ఘంటసాలగారి యందు అతనికిగల భక్తి, గౌరవాలు, ఆరాధన ఆదర్శప్రాయమైనవి.

మహామహులైన సంగీత దర్శకుల, రచయితల మధుర గీతాలెన్నో పాడే అవకాశం ఇతరగాయకులకన్నా ఎక్కువగా అతనికి దొరికింది. చరిత్ర సృష్టించిన చిత్రాలకు పాడి చరితార్థుడైనాడు. ఎప్పుడో ఒక మహాయతిని గూర్చి ఆయన అతీతశక్తులకు ప్రణమిల్లి 'మనిషికిన్ని మహిమలా...ఘనసిద్ధుల గరిమలా ఎదలోనే దైవమున్న హనుమలా...ఎదిగితే నీ దేహం తిరిగే తిరుమల' అని పాడుకున్నది బాలు విషయంలోనూ నిజమైంది. లేకపోతే ఇన్ని వైవిధ్యంగల పాటలతోపాటు, పాండితి ప్రమాణాలు మెండుగా నిండుగావున్న వాగ్గేయాలవంటి పాటలు బాలూ పాడగలిగి వుండేవాడా ! స్ఫుటమైన తెలుగు సంస్కృత తమిళ కన్నడ పదాలను ఉచ్చారణా సౌలభ్యంతో పాడడానికి మానవశక్తి కన్న దేవదత్తమైన గళం వుండాలి. అతని కంఠం నిజంగా దేవదత్తమే – ధ్వన్యనుకరణలో, గాత్రదానంలో, గాత్రపరమైన నటనలో ఇంతటి కళాకారుడు ఇంతవరకు రాలేదు.

బాలూకి సాహిత్యమంటే అమితమైన అభిమానం. ఎక్కడెక్కడి పద్యాలో, గీతాలో అవలీలగా అతని స్మృతిపథంలోనుండి వస్తాయి. 'పెళ్లినాటి ప్రమాణాలు' చిత్రంలో పింగళివారు రాసిన డైలాగులన్నీ నోటికి వచ్చు. రఘురామయ్య గంధర్వగానంలోని 'తాన్'లను అనువాసికంగా ఆ మహానుభావుడే అంటున్నాడా

అన్నంతగా వినిపించగల చేవ అతని సొత్తు. డబ్బింగ్ రంగంలో అతని నేర్పు ప్రథమపంక్తిలో నిలబెట్టింది. నిద్రలేచింది మొదలు నిద్రపోయేవరకు నిర్నిద్ర గాత్రావధానమే అతని జీవితం. 'నేను సైతం విశ్వఘోషకు తీపిగొంతుకనిచ్చి మ్రోశాను' అనగల మొనగాడు. చిత్రవాణిజ్యంలో తెలుగుపాట విలువ, మర్యాద కాపాడుతూ పాడుతున్నవాడు. పాటల్లోనే కాదు, మాటల్లోను మంచి చమత్కారి. హాస్యం అంటే ఇష్టం, సంగీతం అంటే ప్రాణం. వెరసి అతనొక 'హాసం' ! నటుడుగానూ రాణించాడు. వ్యాపారవేత్తగా కొన్ని సినిమాలు నిర్మించి వేలు పోగొట్టుకొని చేతులూ కాల్చుకున్నాడు. ఇటువంటి పనులే ఒకటి రెండు ఇళయరాజా కూడా చేసాడు. ఆమాటకొస్తే ఘంటసాలగారి పేరు ముందు చెప్పాలి.

నేనంటే అతనికి వున్న ప్రేమ, అభిమానం ఇతరులు చెప్పగా వినడానికి అలవాటు పడిపోయాను. కానీ సమక్షంలో ఎప్పుడూ విమర్శించడమే పనిగా పెట్టుకున్న కఠినాత్ముడు. ప్రేమ ఎంత మధురం ప్రియురాలు అంత కఠినం ! ఆత్రేయ మాటకు తిరుగేముంది !

ఆ చిరంజీవి నూరు వసంతాలు తెలుగుపాట కోసం ఆరు ఋతువులూ ఆమనులై పుంస్కోకిలా కలరవంతో నిరంతర గాన గంధర్వుడై వర్ధిల్లాలని తల్లి సరస్వతిని ప్రార్థిస్తున్నాను.

*చిత్రగాన కల్పవృక్షానికి ఫలపుష్పభరితమైన కొమ్మలెన్నో ! అందులో ఇళయరాజా ఒక చిటారు కొమ్మ, బాల రసాలసాల అభినవ ఘంటసాల బాలసుబ్రహ్మణ్యం ఒక పుంస్కోకిల, ఏ కొమ్మనుంచి పాడినా ఈ కోకిల గానం మధురమే. స్వరాయురస్తు అని దీవించవలసింది రసజ్ఞ లోకమే....*

('హాసం' హాస్య సంగీత పత్రిక 1-15 జూన్ 2003 సంచికనుండి పునర్ముద్రితం... ఆ పత్రిక యాజమాన్యానికి ప్రత్యేక కృతజ్ఞతలతో...)



## "ఆయన లేకుంటే ఆ సినిమా లేదు.. ఆ సినిమా లేకుంటే నేను లేను"

......వంశీ

*"సితార, అన్వేషణ, ప్రేమించు-పెళ్లాడు, లేడీస్ టైలర్, మహర్షి, శ్రీకనకమాలక్ష్మి రికార్డింగ్ డాన్స్ ట్రూప్, ఆలాపన, చెట్టుకింద ప్లీడరు, ఏప్రిల్ ఒకటి విడుదల, డిటెక్టివ్ నారద ఇవన్నీ వంశీ సినిమాలని చెప్పటం అనవసరం. వీటికి సంగీత దర్శకుడు ఇళయరాజా అని ప్రత్యేకంగా చెప్పటం అంతకంటే అనవసరం.*

*'సీతాకోక చిలక' సినిమా 'మ్యూజిక్ సిట్టింగ్స్' లో ఉండగా మొదటిసారి వంశీ ఇళయరాజాను చూసారు. సినిమాకి వంశీ అసోసియేట్ డైరెక్టర్. అప్పటికే ఇళయరాజాను ఎంతో ఆరాధిస్తున్న వంశీకి ఆయనతో పరిచయ భాగ్యం జరిగింది. ఆ పరిచయాన్ని మరిక ఒదులుకోలేదు. గట్టిగా పట్టుకున్నారు. పట్టుబట్టి తన సినిమాలకు పాటలు చేయించుకున్నారు.*

*ఇళయరాజా - వంశీలది ముప్పై సంవత్సరాల అనుబంధం. వంశీకి ఇళయరాజా అంటే భక్తి. ఇళయరాజాకు వంశీ అంటే వాత్సల్యం. ఆ ఇద్దరి మధ్య అనుబంధం సంగీతమయం. వంశీ ఆత్మను ఇళయరాజా గ్రహించినంతగా మరెవ్వరూ గ్రహించలేదనిపిస్తుంది. రీ రికార్డింగ్ జరుగుతున్నప్పుడు వంశీ ఏం మాట్లాడకపోయినా అతనికి ఏం కావాలో ఖచ్చితంగా అదే మ్యూజిక్ ఇచ్చేవాడట ఇళయరాజా.*

*'నువ్వేం చెప్పక్కర్లేదు, నీకేం కావాలో రీల్ చెబుతోంది' అనే వాడట. తెలుగు సినిమాల్లో ఇంత పొయెటిక్ పార్టనర్‌షిప్ ఏర్పడటం బహు అరుదు.*

ఇళయరాజాది మదురైకు వంద కిలోమీటర్ల దూరంలో ఉండే పణ్ణైపురం అనే చిన్న గ్రామం. ఒక పెద్దకొండ అంచున ఆ ఊరు ఉంటుంది. ఆ కొండ అవతలి పక్క నుండి కేరళ రాష్ట్రం. ఇళయరాజాతో పాటు వెళ్ళి ఆ ఊరు చూసొచ్చాను. ఆ ఊరికి కొంతదూరంలో ఉండే మరో పల్లెను చూపిస్తూ 'ఇది భారతీరాజా ఊరు. ఇదిగో ఇక్కడే మేమిద్దరం చిన్నప్పుడు కలిసి తిరిగేవాళ్లం'

అని చూపించారు ఇళయరాజా.

ఇళయరాజాది నిరుపేద కుటుంబం. ఆయన తల్లి చక్కగా పాడేదట. అందువల్ల పుట్టిన నలుగురు అన్నదమ్ములకు సంగీతం అబ్బింది. ఇళయరాజా మూడోవాడు. పెద్దన్నయ్య పావలర్ వరదరాజన్. కమ్యూనిస్టు భావాలు ఉన్నవాడు. అక్కడి జానపద గీతాలతో విప్లవ సాహిత్యాన్ని అల్లి ఊరూరు తిరిగి పాడేవాడు. ఆయనతో పాటు ముగ్గురు సోదరులు కూడా సైకిళ్ల మీద తిరుగుతుండేవాళ్లు. ఒక్కో పూట ఒక్కో ఊరిలో ఆగడం, పాడటం, వాళ్లిచ్చిన ఐదో పదో సంపాదించుకోవడం ఇదీ పని. ఆ కచేరీల్లో ఇళయరాజా హార్మోనియం వాయించేవాడు. రెండో అన్నయ్య భాస్కర్ డోలక్ వాయించేవాడు. తమ్ముడు గంగై అమరన్ దరువు వేసేవాడు.

అలా కొంతకాలం గడిచాక, అప్పటికే మద్రాస్‌కు వచ్చి సినిమా ప్రయత్నాలు చేస్తున్న భారతీరాజా దగ్గరకు వచ్చారు నలుగురు అన్నదమ్ములూ. భారతీరాజా ఉంటున్న గదికి వాళ్లందరూ రిక్షాలో వెళ్లారట. సినిమాల్లో పనిచేయాలని ఉందని చెప్పారట.

"సినిమాల్లో మ్యూజిక్ అంటే ఒట్టి హార్మోనియం వాయించడం కాదు. చాలా ఇన్‌స్ట్రుమెంట్స్ ఉంటాయి. వాటిలో ఏదైనా నేర్చుకో" అని ఇళయరాజాకు సలహా ఇచ్చాడు భారతీరాజా. అప్పుడు ఇళయరాజా బాగా ఆలోచించి గిటార్ నేర్చుకోవడం మొదలు పెట్టాడు. అప్పటికే ఆయన జి.కె.వెంకటేష్ దగ్గర కుదురుకున్నాడు.

"పొద్దున నుంచి సాయంత్రం వరకు రికార్డింగ్స్ దగ్గర ఉండేవాణ్ణి. ఎనిమిది గంటలకు ఇల్లు చేరుకొని పన్నెండు దాకా పడుకొని రాత్రి ఒంటిగంట నుంచి తెల్లవారే వరకు గిటార్ వాయించడం ప్రాక్టీసు చేసేవాణ్ణి. చిన్న గది కదా, పైగా రాత్రి పూట సాధన అంటే అందరికి ఇబ్బంది. అందుకని వాయించడం మానేసి నొటేషన్ రాయడం మొదలుపెట్టాను" అన్నాడాయన.

అలా నొటేషన్ రాయడాన్ని సాధన చేసిన ఇళయరాజా ఆ తర్వాత నొటేషన్ రాయడంలో ఎంత ఖ్యాతి గడించారో అందరికి తెలిసిందే. పదిహేను నిమిషాల్లో ట్యూన్, అరగంటలో నొటేషన్, నలభై అయిదు నిమిషాల్లో పాట, అంతేకాదు, అలా అర్ధరాత్రుళ్లు చేసిన గిటార్ సాధనతోనే ఆయనకు ప్రఖ్యాతమైన ట్రినిటీ మ్యూజిక్ ఆఫ్ లండన్ వారి గోల్డ్‌మెడల్ దక్కింది.

అన్ని విధాలా ఆదరిస్తున్న జి.కె. వెంకటేష్ ఉన్నా, సినిమా సంగీతం మీద బాగా అవగాహన ఉన్నా అవకాశాలు మాత్రం రాలేదు ఇళయరాజాకి. అప్పుడాయన ఒకసారి నిర్మాత పంజు అరుణాచలంను కలిశాడు. అవకాశం ఇస్తే తన సత్తా చూపిస్తానని చెప్పాడు. పంజు అరుణాచలంకు నమ్మకం కుదిరింది. కానీ సినిమా ఇచ్చే ధైర్యం కలుగలేదు. అయినప్పటికీ తన సొంత డబ్బుతో ఒక కల్యాణమండపం బుక్ చేసి, ఫుల్ ఆర్కెస్ట్రాను ఇళయరాజాకు ఇచ్చి ఒక మ్యూజిక్‌ప్రోగ్రామ్ ఏర్పాటు చేసారు. దానిని ఇళయరాజా కండెక్ట్ చేసిన తీరు చూసాక, ఎవరు ఎన్ని అడ్డంకులు పెట్టినా కాదనకుండా తన సినిమాలో అవకాశం ఇచ్చారు. దాని పేరు 'అణ్ణక్కిళి'. తొలి సినిమాతోనే ఇళయరాజా ఒక ప్రభంజనమై తమిళనాడును ఒక ఊపు ఊపేశాడు. అప్పటివరకు ఆయన నిర్మాతల వెంట తిరిగాడు. ఆ తర్వాత నిర్మాతలు ఆయన వెంట తిరగడం మొదలు పెట్టారు.

నేను 'మంచుపల్లకి' తీసాను. ఆడింది. కానీ గొప్పగా ఆడలేదు. పేరొచ్చింది. కానీ వెంటనే అవకాశాలు రాలేదు. ఇంకో సినిమా వరకే ఛాన్స్, అది సక్సెస్ కాకపోతే మళ్లీ ఎవరి దగ్గరో అసిస్టెంట్‌గా కుదిరిపోక తప్పదు. అలాంటి పరిస్థితిలో "సితార" తీసే అవకాశం వచ్చింది. తీశాను. నా సర్వశక్తులు పెట్టి జాగ్రత్తగా తీశాను. డబుల్ పాజిటివ్ తయారయ్యింది. రీ రికార్డింగ్ జరగడానికి మూడు రోజుల ముందు సురేష్‌మహల్‌లో అందరం కూర్చొని చూశాం. పూర్తయ్యేసరికి చాలామంది ముఖంలో ఎక్స్‌ప్రెషన్ లేదు. కొంతమంది పెదవి విరిచారు.

సినిమాల్లో సంభాషణలే లేవు; సైలెన్స్ ఎక్కువగా ఉంది; దాంతో బోర్ కొడుతుంది.. ...రకరకాలుగా.....నిర్మాత ఏడిద నాగేశ్వరరావు కూడా డల్ అయిపోయారు. 17 లక్షల పెట్టుబడి, సినిమా అటు ఇటు అయితే మొత్తం గోవింద. డబ్బు కంటే ముఖ్యంగా 'శంకరాభరణం', 'సాగరసంగమం' లతో వచ్చిన పేరుకు నష్టం. ఇదంతా గమనించిన నాకు ఆ రాత్రి నిద్ర లేదు. ఏంటి పరిస్థితి? ఏంటి ఇలాంటి కామెంట్స్ వస్తున్నాయి? బాగా తీయలేదా అని ఒకటే బెంగ. రేపు రీ రికార్డింగ్ జరుగుతుందనగా ఇవాళ ఇళయరాజా డబుల్ పాజిటివ్ చూసాడు. చూస్తున్నంత సేపు ఏమి మాట్లాడలేదు. మొత్తం అయ్యాక నన్ను బయటికి పిలిచి షేక్ హ్యాండ్ ఇచ్చాడు. "బ్రహ్మాండంగా తీశావు. చూడు దీనికి మ్యూజిక్ ఎలా చేస్తానో?" అన్నాడు సవాలుగా.

సాధారణంగా ఆయన ఆ మాట అనడట. అలా ఆయన అమాట అనడంతో నా ప్రాణం లేచొచ్చింది. నిర్మాత మొఖంలో వెలుగొచ్చింది. ఆ మరుసటి రోజు

నుంచి ఒక్కో రీలు రీ రికార్డింగ్ జరుగుతుంటే ఒక అద్భుతం తెర మీద సాక్షాత్కరిస్తున్నట్టు అందరూ నోరు తెరిచి చూస్తుండిపోయారు. మద్రాసులో టాక్ ఆఫ్ ది టౌన్ అయ్యిందా సినిమా. రిలీజయ్యాక అంతే సంచలనం సృష్టించింది. నిజానికి ఇళయరాజా లేకపోతే ఆ సినిమా లేదు, ఆ సినిమా లేకపోతే నేను లేను.

అప్పట్నించి ఇళయరాజా నన్ను ఇష్టపడ్డాడు. వ్యక్తిగా కంటే టెక్నీషియన్‌గా, ఆయన నా కంటే కూడా నాలోని టెక్నీషియన్‌కే మంచి స్నేహితుడు. నన్ను ఒరే అనేవాడు. ఏమప్పా అని పిలిచేవాడు. ఎంత ప్రేమించాడంటే 'అంధా కానూన్' నిర్మాత అట్లూరి పూర్ణచంద్రరావుకు పరిచయం చేసి, ఇతడు హిందీలో కూడా మంచి సినిమా తీయగలడు అని రికమండ్ చేసి వాళ్ల ఆఫీసుకు పంపించాడు. అంతేకాదు తను నిర్మాతగా 'ఇళయరాజా పిక్చర్స్' బానర్ మీద ఒక సినిమా తీయడానికి నన్ను దర్శకుడిగా పెట్టుకున్నాడు. వాళ్లన్నయ్య భాస్కర్‌చేత అడ్వాన్స్ కూడా ఇప్పించాడు. ఆ సినిమా పేరు 'సౌందర్యలహరి'. దురదృష్టం, ఆరెండు ప్రాజెక్టులూ వర్కవుట్ కాలేదు.

'సితార' తర్వాత ఫారెస్ట్ బ్యాక్ డ్రాప్‌తో ఒక సినిమా తీయాలనుకున్నాను. అరకులో కూర్చుని పదిహేను రోజుల పాటు స్క్రిప్ట్ రాసుకున్నాను. పచ్చటి ఫైల్‌లో ఆ కాగితాలు పెట్టుకున్నాను. మద్రాసు రాగానే ఇళయరాజా డేట్సు వెంటనే దొరకడంవల్ల ఇద్దరం కలిసి మదురై వెళ్లాం. ఆ ఊరికి దూరంగా ఉండే హోటల్ తమిళనాడులోని ఒక సూట్ ఇళయరాజాకు ఇష్టం. అందులోనే మ్యూజిక్ సిట్టింగ్స్‌కి కూర్చుందామని అనుకున్నాం. హోటల్ చేరుకున్నాక ఆ ఉదయం నా రూములో విశ్రాంతిగా పడుకొని ఉంటే రాజాగారి అసిస్టెంటు వచ్చాడు. "ఏంటి పడుకున్నావు. ఆయన హార్మోనియం పెట్టెను ముందేసుకొని కూర్చుని ఉన్నాడు. నిన్ను రమ్మంటున్నాడు" అన్నాడు. ఉలిక్కిపడి లేచి సిద్ధమయ్యాను. పెట్టె తెరిచి చూస్తే గుండె ఆగినంత పని. స్క్రిప్ట్ ఫైల్ లేదు. పచ్చటి ఫైలే పెట్టుకున్నామూగానీ అదీ ట్రీట్‌మెంట్ ఫైలు. అసలు ఫైలు అరకులో మర్చిపోయాను. సరే ఏమైతే అదవుతుందని వెళ్లాను. కథ చెప్పు అన్నాడు. నోటికొచ్చింది చెప్పాను. ఏమిటో కాస్త గందరగోళంగా ఉంది. సిట్యుయేషన్స్ చెప్పు అన్నాడు. నోటికొచ్చినవి చెప్పాను. ఒక్కో సిట్యుయేషన్‌కి ఒక్కో అద్భుతమైన ట్యూన్ కట్టాడు. మహాభాగ్యం అనుకున్నాను. మద్రాసు వచ్చేశాం. అది ఇందిరాగాంధీ చనిపోయిన టైము. షూటింగులు జరగడం లేదు. కొంత టైము దొరికింది. ఆ టైములో కూర్చుని ఆయన కట్టిన ట్యూన్‌లకు అనుగుణంగా తిరిగి కథ రాసుకున్నాను. ఆ సినిమా పేరు 'అన్వేషణ'. ఇదీ ఆ సినిమా పాటల

వెనుకున్న కథ.

చాలామందికి ఇళయరాజా అగ్నిహోత్రుడు. నాకు మాత్రం వెలుగు వెన్నెల గోదావరి. 'ప్రేమించు - పెళ్లాడు' సినిమా ఒప్పుకున్నాను. కానీ చివరి నిమిషం వరకూ మ్యూజిక్ డైరెక్టర్ ఖరారు కాలేదు. నిర్మాతగారేమో యస్.పి. బాలసుబ్రహ్మణ్యంను గానీ, సత్యంగానీ పెట్టమని అడిగారు. నేనేమో ఇళయ రాజానే కావాలని పట్టుపట్టాను. ఈ గొడవలో టైము దగ్గర పడిపోయింది. చివరకు నా మాటే నెగ్గింది. ఇళయరాజా పేరు ఖరారయ్యింది. కానీ ఎప్పుడు కావాలంటే అప్పుడు ఇళయరాజా దొరకడు గదా, దొరికించుకోవడానికి వెళ్లాను. తప్పనిసరిగా నాకోసం చేయాలి అన్నాను. ఎక్కడికి వెళ్లేంత టైము లేదు. మద్రాసులోనే కూర్చున్నాడాయన. మొత్తం నలభై అయిదు నిముషాల్లో ఆ పాటల ట్యూన్లు కట్టాడు. వాటిని విన్నవాళ్లు ఎవరూ ఆ విషయం నమ్మలేదు. ఇది నిజం. ఈ ట్యూన్లన్నీ రెప్పపాటు కాలంలో రెడీ అయినవే. నా సినిమాలన్నింటిలో ఈ సినిమా పాటలు బెస్ట్ అని అనుకుంటూ ఉంటాను.

ఇళయరాజా తక్కువ మాట్లాడతాడు. సాత్విక ఆహారం భుజిస్తాడు. భక్తి ఎక్కువ. ఇరవై నాల్గుగంటలూ బిజీగా ఉంచే సినిమా లోకం నుంచి విముక్తి కోసం ప్రతి పౌర్ణమి నాడు తిరువణ్ణామలై వెళతాడు. ఆ రోజంతా అక్కడే ప్రశాంతంగా గడుపుతాడు. మళ్లీ మరుసటి రోజు నుంచి రికార్డింగ్స్‌కు ఫ్రెష్‌గా హాజరవుతాడు. ఆయనేదైనా సినిమా మ్యూజిక్ చేస్తున్నప్పుడు ఆ సినిమా తనకు నచ్చకపోతే సినిమా బాగాలేదు అనేవాడు కాదు. స్క్రిప్ట్ బాగా లేదు అనేవాడు. స్క్రిప్ట్ బాగాలేనప్పుడు సినిమా ఎలాబాగుంటుంది? నేను తీసిన డిటెక్టివ్ నారద డబుల్ పాజిటివ్ చూస్తూ - ఫలానా చోట ఫలానా షాట్ తీశావే..... ఆ ఒక్క షాట్ మీదే సినిమా మొత్తం తీయొచ్చు. అదొక్కటే నాకు నచ్చింది' అన్నాడు.

ఇళయరాజా కుటుంబ సభ్యులందరూ నాకు బాగా పరిచయం. ఆయన ఇద్దరబ్బాయిలు, అమ్మాయి భవతారిణి నన్ను గౌరవించేవారు. ఇళయరాజా ఒకర్ని గౌరవిస్తున్నాడంటే అతడు అందరూ గౌరవించదగ్గ మనిషని వాళ్ల భావం. ఒకసారి వాళ్ల ఇంటికి వెళ్లాను. ఇది చాలా ఏళ్ల క్రితం మాట. ఆయన దగ్గర ఒక పెద్ద ఆడియో సిస్టమ్ ఉండేది. చెయ్యెత్తు స్పీకర్లు. అప్పట్లోనే రిమోట్‌తో ఆపరేట్ చేసే సౌకర్యం ఉండేది. లక్ష రూపాయలు పెట్టి కొన్నాడట. 'చాలా బాగుందే' అన్నాను. 'తీసుకోమ్మా' అని వెంటనే వాళ్ల బావమరిది చేత మా యింటికి పంపాడు. ఇళయరాజా హాబీ ఫొటోగ్రఫీ. ఆయన దగ్గర విలువైన కెమెరాలు ఉండేవి. ఏదైనా 'కెమెరా బాగుందే' అంటే ఇచ్చేసేవాడు. నేను

ఏదడిగినా కాదనేవాడు కాదు. ఒకోసారి దర్శకుడిగా, ఒకోసారి తమ్ముడిగా, ఒకోసారి చిన్నపిల్లాడిగా నేనాయనకు కనిపించేవాణ్ణేమో.

'చెట్టు కింద ప్లీడరు' లో రాజేంద్రప్రసాద్ దగ్గర ఒక డొక్కు కారుంటుంది. అది ఆగినప్పుడల్లా పాత సామాన్లు కొనేవాడొకడొచ్చి వేధిస్తూ ఉంటాడు. వాడెప్పుడు ఊడిపడతాడో తెలియదు. ఒకసారి హీరో హీరోయిన్లు దూర ప్రయాణం చేస్తుంటే కారాగిపోతుంది. కూలీలు రోడ్డేస్తుంటారు. పాత సామాన్లవాడు ఎప్పుడొస్తాడో అన్న భయం. 'అక్కడొక పాట పెడితే ఎలా ఉంటుంది' అన్నాను. ఇళయరాజా ఎంత ఎగ్జయిట్ అయ్యాడో చెప్పలేను. 'భలే తమాషా సిట్యుయేషన్. మంచి పాట పెడదాం' అన్నాడు. ఆపాట ఎంత హిట్ అయ్యిందో తెలుసుకదా. ఆ 'చల్తీకానామ్ గాడీ' పాటలో కూలీలు రోడ్డేసే దృశ్యాలకు అనువుగా ఇళయరాజా ఇచ్చిన బీట్‌ను ఎవరు మర్చిపోగలరు.....!?

నేను ఇళయరాజాను నా సినిమాలు చేసేటప్పుడు మాత్రమే కలవను, ఇతరుల సినిమాలు చేసేటప్పుడు కూడా కలుస్తాను. ఆయన రీ రికార్డింగ్‌లోని ఏదైనా థీమ్ మ్యూజిక్ నాకు నచ్చితే గుర్తుపెట్టుకొని ఆట్యూన్‌లో పాట కట్టించుకునేవాణ్ణి. 'స్వాతిముత్యం' లోని థీమ్ మ్యూజిక్‌తో శ్రీ కనకమాలక్ష్మి రికార్డింగ్ డాన్స్ ట్రూప్‌లో ఒక పాట చేయించుకున్నాను.

ఇళయరాజా నాకు చేసిన పాటలు కొన్ని మీరు వినలేదు. ఎందుకంటే వాటిని నా సినిమాల్లో వాడలేదు కాబట్టి. 'మహర్షి' కోసం ఆయన చేసిన రెండు మంచి పాటలు నా దగ్గర అలాగే ఉండిపోయాయి. 'ఆలాపన' కోసం చేసిన ఒక అద్భుతమైన పాట కూడా అలాగే ఉంది. బాలూ గానం చేసిన తన పాటల్లో అది బెస్ట్ సాంగ్ అని ఇళయరాజా మెచ్చుకునేవాడు.

ఇళయరాజాకు నా మీద ప్రత్యేక అభిమానం ఉందనడానికి యింకో ఉదాహరణ చెబుతాను. ఒకసారి ఏదో క్రికెట్ మ్యాచ్ చూడటానికి మద్రాస్ వచ్చారు లతా మంగేష్కర్. ఆ సంగతి ఇళయరాజాకు తెలిసింది. వెంటనే నన్ను పిలిపించి - లతాజీ ఇక్కడే ఉన్నారు. వెంటనే సినిమా ఉంటే చెప్పు. పాటలు కంపోజ్ చేసి పాడిద్దాం. చాలా ఏళ్ల క్రితం ఆమె తెలుగులో పాడారు. మళ్లీ నా సినిమాలో పాడితే బాగుంటుంది అన్నాడు. ఆ సలహాకు నేను తబ్బిబ్బై నేను తీయాలనుకున్న 'గాలికొండపురం రైల్వేగేటు' కు రెండు పాటలు రికార్డు చేయించాను. ఆ సినిమా తీయలేదు కాబట్టి వాటిని వినే అవకాశం శ్రోతలకు రాలేదు. ఇది జరిగిన కొంత కాలం తర్వాత 'ఆఖరిపోరాటం' లో ఆమె పాడిన వేరే పాటను వినగలిగారు మన వాళ్లు.

తన ఊళ్లో ఉన్నప్పుడు ఇళయరాజా ఒక మురళీగానం వినేవాడట. అబ్బ ఎంత గొప్పగా ఉంది ఈ మురళీ గానం - ఎప్పటికైనా నేనిలా వాయించగలనా అని అనుకునేవాడట. ఆయన మద్రాసు వచ్చి పెద్ద మ్యూజిక్ డైరెక్టర్ అయ్యాక మళ్లీ తన ఊరు వెళ్లినప్పుడు తిరిగి అదే మురళీగానం విన్నాడట. అబ్బ....ఏమిటి యింత తప్పుగా వాయిస్తున్నాడు అని ఆశ్చర్యపోయాడట. వాస్తవానికి అతడి మురళీనాదంలో మార్పులేదు. మార్పల్లా ఇళయరాజాలోనే. ఆయన ఎదుగుదలలోనే, ఎవరికైనా ఆత్మికమైన ఎదుగుదల ముఖ్యం అని రాజా భావిస్తాడు.

ఇళయరాజాకు సెంటిమెంట్స్ ఎక్కువ. ముహూర్తాలను, శకునాలను నమ్ముతాడాయన. అలాగే తనకిష్టమైన వాటిని వదులుకోడు. ఒకసారి ఇళయరాజా గారి అబ్బాయి చిన్న పిల్లాడిగా ఉన్నప్పుడు రికార్డింగ్ థియేటర్‌కు వచ్చి పొరపాటున రాజాగారి హార్మోనియం పెట్టెను కాలితో నెట్టాడట. అది చూసి ఇళయరాజా నొచ్చుకుంటూ 'అలా చేయకూడదమ్మా. చాలా ఏళ్ల క్రితం రెండు వందలు పెట్టి కొన్న హార్మోనియం పెట్టె అది. కన్నతల్లి లాంటిది' అన్నాడట. ఇప్పటికి రాజా ఆ హార్మోనియం పెట్టె మీదే బాణీలు వినిపిస్తాడు. ఆయన సెంటిమెంట్ అలాంటిది.

నాకు సలిల్‌చౌదరి అంటే ఇష్టం. యస్.పి.కోదండపాణి అంటే ఇష్టం. వీళ్లిద్దరికన్నా ఇళయరాజా అంటే ఇంకా ఇష్టం. నేనొక సినిమా చేస్తున్నానంటే ఇళయరాజా ఉంటేనే చేయగలను. 'జోకర్' సినిమా తీస్తున్నప్పుడు నా పరిస్థితి వేరు. అప్పటికే ఫ్లాప్స్ ఇచ్చాను. అంతేగాక జోకర్‌కు పెద్ద బడ్జెట్ లేదు కూడా. ఇళయరాజా డిమాండ్ చేసే రెమ్యూనరేషన్‌ను తట్టుకునే పరిస్థితిలో నిర్మాత లేడు. ఆయన లేక, వేరేవాళ్లతో చేయలేక ఇక తప్పనిసరి పరిస్థితిలో నేనే సంగీత దర్శకుడిగా మారాను. ఇప్పటికే కాదు ఎప్పటికైనా నా పాటలు అంటే ఇళయరాజా పాటలే, నా సినిమా అంటే ఇళయరాజా సినిమానే'.

('హాసం' హాస్య సంగీత పత్రిక 1-15 జూన్ 2002 సంచికనుండి పునర్ముద్రితం... ఆ పత్రిక యాజమాన్యానికి ప్రత్యేక కృతజ్ఞతలతో...)



# పాటల బాట

# పాటల బాట

## పాటల బాట

# పాటల బాట

## పాటల బాట

# పాటల బాట

# పాటల బాట

## పాటల బాట

## పాటల బాట

# పాటల బాట

# పాటల బాట

## పాటల బాట

# భద్రకాళి (1977)
# (తొలిపరిచయం)

రచన : **దాశరథి** గానం : **జేసుదాస్, సుశీల**

:::::: Opening Music ::::::

పల్లవి

ఆమె చిన్ని చిన్ని కన్నయ్యా ... కన్నులలొ నీవయ్యా
నిన్ను చూసి మురిసేనూ ... నేను మేను మరిచేనూ
ఎత్తుకొని ముద్దాడీ ... ఉయ్యాలలూపేనూ
జోలపాట పాడేనూ ... లాలిపాట పాడేనూ

:::::: BIT ::::::

చరణం

అతడు నీ ఒడిలొ నిదురించీ... తీయనీ కలగాంచీ...
పొంగిపొంగి పోయానూ... పుణ్యమెంతొ చేశానూ...
ఆమె నీ ఒడిలో నిదురించీ... తీయని కలగాంచీ
అతడు పొంగిపొంగీ పోయానూ... పుణ్యమెంతొ చేశానూ (Bit)
ఏడేడు జన్మలకూ నాతోడు నీవమ్మా...
ఈనాటి ఈ బంధం ఏనాడు విడదమ్మా
ఆమె అమ్మవలె రమ్మనగా పాపవలె చేరేవూ (Bit)
నా చెంత నీవుంటే స్వర్గమే నాదౌనూ (Bit)
అతడు గాయత్రి మంత్రమునూ జపించే భక్తుడనే...
కోరుకున్న వరములనూ ఇవ్వకున్న వదలనులే

:::::: BIT ::::::

చరణం

ఆమె స్నానమాడి శుభవేళా కురులలో పువ్వులతో...
అతడు దేవివలే నీవొస్తే నా మనసు నిలువదులే...
ఆమె అందాల కన్నులకూ కాటుకను దిద్దేనూ...
చెదుచూపు పడకుండా ... అదరు చుక్కపెట్టేనూ...
చిన్ని చిన్ని కన్నయ్యా ... కన్నులలొ నీవయ్యా (Bit)

Contd...

| | |
|---|---|
| అతడు | నిన్ను చూసి మురిసేనూ.. నేను మేను మరిచేనూ (Bit) |
| ఆమె | ఎత్తుకొని ముద్దాడీ ... ఉయ్యాలలూపేనూ... |
| అతడు | జోలపాట పాడేనూ... |
| ఆమె | లాలిపాట పాడేనూ... జోలాలీ... |
| అతడు | జోలాలీ... |
| ఆమె | జోలాలీ... |
| అతడు | జోలాలీ... |
| ఇద్దరు | జోజోజో... |

★★★




## మనసులో మాట

సహజమైన సంగీత వాయిద్య పరికరాలతో సంగీతం సమకూరిస్తే అందులో మన మనసు కనిపిస్తుంది. యంత్రాలతో సంగీతం అంటే ఎప్పుడూ యాంత్రికంగానే ఉంటుంది. సంగీతం అనేది ఎప్పుడు ఎలా పుడుతుందో ఎవ్వరికీ తెలియదు. అది సహజంగా వస్తుంది.... అంతే.

– ఇళయరాజా

## భద్రకాళి (1977)

రచన : కొసరాజు గానం : సుశీల

:::::: Opening Music ::::::

పల్లవి అడిగావే అక్కడా...ఇకచూస్కో ఇక్కడా... (Bit) ॥2॥
జోరుగా ఆడతా....తియ్యగా పాడతా...రా...
అమ్మగారు వుండేది దేనికీ...ఈ అయ్యగారి బుద్ధి తీర్చడానికీ
రావయ్యా..ఇటురావయ్యా...
అడిగావే అక్కడా...ఇకచూస్కో ఇక్కడా...
జోరుగా ఆడతా....తియ్యగా పాడతా...రా...
అమ్మగారు వుండేది దేనికీ...ఈ అయ్యగారి బుద్ధి తీర్చడానికీ
రావయ్యా..

:::::: BIT ::::::

చరణం పట్టుచీర కట్టుకొని పైలా పచ్చీసుగా...నాలాగా ఎవరైనా
నడిచే వారున్నారా...(Bit) ॥2॥
వయసున్నదీ...వయసున్నదీ...హొయలున్నదీ
వలపున్నదీ...కులుకున్నదీ...నీమోజు తీరుస్తా...
రావయ్యా...హాయ్ మావయ్యా...మామయ్యా...ఇటు రావయ్యా
అడిగావే అక్కడా...ఇకచూస్కో ఇక్కడా...
జోరుగా ఆడతా....తియ్యగా పాడతా...రా...
అమ్మగారు వుండేది దేనికీ...ఈ అయ్యగారి బుద్ధి తీర్చడానికీ
రావయ్యా..

:::::: BIT ::::::

చరణం పిచ్చి పిచ్చి ఆశల్ని పెంచుకుంటావా..రాయిలా నేనుంటే
నీకేమి తక్కువ... (Bit) ॥2॥
ఊపులేదా...ఊపులేదా...రూపులేదా...
షేపులేదా చెప్పవయ్యా...ఆడీ చూపించనా...
రావయ్యా...హాయ్ మామయ్యా...మామయ్యా....ఇటు
వయ్యా... (Follow up Music & wistle)

★★★

## వయసు పిలిచింది (1978)

రచన : వేటూరి		గానం : బాలు

:::::: Opening Music ::::::

పల్లవి	హే ... ముత్యమల్లే మెరిసిపోయే మల్లెమొగ్గా
అరె... ముట్టుకుంటే ముడుసుకుంటావ్ ఇంత సిగ్గా
మబ్బే మసకేసిందిలే ... పొగమంచే తెరగా నిలిసిందిలే
ఊరూ నిదరోయిందిలే... మంచి చోటే మనకూ కుదిరిందిలే
మబ్బే మసకేసిందిలే... పొగమంచే తెరగా నిలిసిందిలే

:::::: BIT ::::::

చరణం	కురిసే సన్నని వానా ... సలిసలిగా వున్నది లోనా (Bit) ॥2॥
గుబులౌతుందే గుండెల్లోనా ...
జరగనా కొంచెం... నేనడగనా లంచం...
చలికి తలలు వంచం...నీ ఒళ్లే పూలమంచం
వెచ్చగ వుందామూ... మనమూ ...
హే ... పైటలాగా నన్ను నువ్వు కప్పుకోవే ....
గుండెలోనా గువ్వలాగా వుండిపోవే...
మబ్బే మసకేసిందిలే... పొగమంచే తెరగా నిలిసిందిలే

:::::: BIT ::::::

చరణం	పండే పచ్చని నేలా ... అది బీడైపోతే మేలా (Bit) ॥2॥
వలపుకురిస్తే ... వయసు తడిస్తే ...
పులకరించు నేలా...అది తొలకరించు వేళా
తెలుసుకో పిల్లా .... ఈ బిడియమేల మల్లా
అ ... ఉరికే పరువమిదీ ... మనదీ ...
హే ... కాపుకొస్తే కాయలన్నీ జారిపోవా ...
దాపుకొస్తే కోర్కెలన్నీ తీరిపోవా ...
మబ్బే మసకేసిందిలే ... పొగమంచే తెరగా నిలిసిందిలే

:::::: BIT ::::::

Contd...

చరణం నవ్వని పువ్వే నువ్వా... నునువెచ్చని తేనెలు ఇవ్వా (Bit) ॥2॥
దాగదు మనసే ... ఆగదు వయసే
ఎరగదే పొద్దు... అది దాటుతుంది హద్దూ
ఇయ్యవా ముద్దు ... ఇక ఆగనే వద్దు...
ఇద్దరమొకటివనీ... కానీ...
హే ... బుగ్గమీదా మొగ్గలన్నీ దూసుకోనీ
రాతిరంతా జాగారమే చేసుకోనీ ...
మబ్బే మసకేసిందిలే ... పొగమంచే తెరగా నిలిసిందిలే
ఊరూ నిదరోయిందిలే ... మంచి చోటే మనకూ కుదిరిందిలే
మంచి చోటే మనకూ కుదిరిందిలే

★★★



# వయసు పిలిచింది (1978)

రచన : **ఆరుద్ర** గానం : **బాలు, సుశీల**

:::::: Opening Music ::::::

పల్లవి

అతడు ఇలాగే.. ఇలాగే... సరాగమాడితే
వయ్యారం .. ఈ యవ్వనం.. ఊయలూగునే

ఆమె ఇలాగే.. ఇలాగే... సరాగమాడితే (Bit)
వయ్యారం .. ఈ యవ్వనం.. ఊయలూగునే

:::::: BIT ::::::

చరణం

అతడు వయసులో వేడుందీ.. మనసులో మమతుందీ (Bit) ॥2॥

ఆమె మమతలేమో సుధామయం... మాటలేమో మనోహరం

అతడు మదిలో మెదిలే మైకమేమో...

ఆమె ఇలాగే.. ఇలాగే... సరాగమాడితే (Bit)
వయ్యారం .. ఈ యవ్వనం.. ఊయలూగునే

:::::: BIT ::::::

చరణం

ఆమె కంటిలో కదిలేవూ – జంటగా కలిశావూ (Bit) ॥2॥

అతడు నీవు నేనూ సగం సగం – కలిసిపోతే సుఖం సుఖం

ఆమె తనువూ... మనసూ... తనివి రేపునే

అతడు ఇలాగే.. ఇలాగే... సరాగమాడితే (Bit)
వయ్యారం .. ఈయవ్వనం.. ఊయలూగునే (Long Bit)

ఇద్దరు లలలలలలలలలా...లలలలా...రరరరారా ॥2॥

:::::: BIT ::::::

చరణం

అతడు భావమే నేనైతే... పల్లవే నీవైతే (Bit) ॥2॥

ఆమె ఎదలోనా ఒకే స్వరం... కలలేమో నిజం నిజం

అతడు పగలూ.. రేయీ... ఏదోహాయీ...

ఆమె ఇలాగే.. అతడు : ఇలాగే...

ఆమె సరాగమాడితే (Bit)

అతడు వయ్యారం... ఆమె : ఈ యవ్వనం..

ఇద్దరు ఊయలూగునే ॥2॥ ఆహోహోహోహో...

★★★

# వయసు పిలిచింది (1978)

రచన : **వేటూరి** గానం : **వాణీజయరాం**

పల్లవి నువ్వడిగింది ఏనాడైనా లేదన్నానా.... (Bit) ॥ 2 ॥
నువు రమ్మంటె ఎక్కడికైనా రానన్నానా...
నీ ముద్దు ముచ్చట కాదంటానా
సరదాపడితే వద్దంటానా... హయ్యా ...
నువ్వడిగింది ఏనాడైనా లేదన్నానా
నువు రమ్మంటె ఎక్కడికైనా రానన్నానా
నీ ముద్దు ముచ్చట కాదంటానా
సరదాపడితే వద్దంటానా... హయ్యా ...

:::::: BIT ::::::

చరణం

నీ కోసమే మరుమల్లెలా పూచింది నా సొగసూ.. (Bit) }
నీ పూజకే కర్పూరమై వెలిగింది నా మనసూ... (Bit) } ॥ 2 ॥
దాచినదంతా నీ కొరకే... ॥ 2 ॥
నీ కోరిక చూస్తే ... నను తొందర చేస్తే
నా ఒళ్లంతా ఊపేస్తూవుంది ... నాలో ఏదో అవుతోందీ
నువ్వడిగింది ఏనాడైనా లేదన్నానా...
నువు రమ్మంటె ఎక్కడికైనా రానన్నానా
నీ ముద్దు ముచ్చట కాదంటానా
సరదా పడితే వద్దంటానా... హయ్యా ...

:::::: BIT ::::::

చరణం నీ మగతనం నా యవ్వనం శృంగారమే పిలిచే (Bit)
నీ అనుభవం ఈ పరవశం సంగీతమై పలికే (Bit)
పరుగులు తీసే నా పరువం.... ॥ 2 ॥
నీ కథలే విందీ... నువు కావాలందీ ...
నా మాటేమీ వినకుండావుంది... నీకూ నాకే జోడందీ ...
నువ్వడిగింది ఏనాడైనా లేదన్నానా...

Contd...

నువు రమ్మంటె ఎక్కడికైనా రానన్నానా..
నీ ముద్దు ముచ్చట కాదంటానా
సరదాపడితే వద్దంటానా.. హయ్యా...
రరరరరరరర...రరరరరరరర...రరరరరరరర...రరర (Bit)
రరర...రరర...రా...రారారారా...రారారారా...
రరరరరరరర...రరరర...
నువ్వడిగింది ఏనాడైనా లేదన్నానా...
నువు రమ్మంటె ఎక్కడికైనా రానన్నానా
నీ ముద్దు ముచ్చట కాదంటానా
సరదా పడితే వద్దంటానా... హయ్యా ...

★★★

SEDE 13391
SRI CHITRA
Vayasu Pilichindi
Music : Ilaiyaraaja
SIDE ONE
Elage Elage
P Susheela & S. P. Balasubrahmanyam
Hello My Rita
S P Balasubrahmanyam
SIDE TWO
Nuvvadigindi
Vani Jairam
S. P. Balasubrahmanyam
EMI

## వయసు పిలిచింది (1978)

రచన : **వేటూరి** గానం : **బాలు**

:::::: Opening Chord ::::::

సాకీ మాటే మరచావే (Bit) చిలకమ్మా ... మనసు విరిచావే
అంతట నీవే కనిపించీ... అలజడి రేపావే
Come on ... Claps... (Long Bit)

పల్లవి హల్లో మైరీటా (Bit) ఏమైంది నీమాటా (Bit) ॥2॥
పాడేవు సరికొత్త పాటా ... మారింది నీ బాటా...
హల్లో మైరీటా (Bit) ఏమైంది నీమాటా (Bit)...
పాడేవు సరికొత్త పాటా ... మారింది నీ బాటా ...

:::::: BIT ::::::

చరణం నీ పెదవులు చిలుకును మధురసం } ॥2॥
నీ హృదయం మాత్రం పాదరసం (Bit)
నాలో రేపావూ...జ్వాలా (Bit) ఒకరితో పాడేవూ ... జోలా (Bit)
నను మరచిపోవడం న్యాయమా
మనసమ్మినందుకూ ... నమ్మినందుకూ
వలపు గుండెకే గాయమా ? ...
కథలే మారెను కలలే మిగిలెను హేయ్ !
హల్లో మైరీటా (Bit) ఏమైంది నీమాటా (Bit)
పాడేవు సరికొత్త పాటా ... మారింది నీ బాటా ....

:::::: BIT ::::::

చరణం ప్రేమన్నది దేవుని కానుక ...అది నీకు కేవలం వేడుకా (Bit)॥2॥
కృష్ణుడు ఆశపడీ రాగా (Bit) రాధిక వేరుపడీ ... పోదా (Bit)
ఎడబాటు సహించదు హృదయమూ
ఒక నాటికైన నీ జీవితాన... కనరాకపోవునా ఉదయమూ
నిజమే తెలుసుకో (Bit) గతమే తలుచుకో .... హేయ్ (Long Bit)
హల్లో మైరీటా ... ఏమైంది నీమాటా (Bit) ॥ 2॥
పాడేవు సరికొత్త పాటా ... మారింది నీ బాటా
మాటే మరచావే చిలకమ్మా... మనసు విరిచావే

★★★

## వయసు పిలిచింది (1978)

రచన : వేటూరి | గానం : రామకృష్ణ , జానకి

:::::: Opening Music ::::::

పల్లవి

అతడు ఆ.. ఆ.. ఆ.. ఆ.. ఆఆఆఆ ... ఆఆఆఆ ... (Long Bit)
జీవితం మధుశాలా... యవ్వనం రసలీలా ... ॥2॥
రేపటి మాటేలా ... నవ్వుకో ఈవేళా
జీవితం మధుశాలా ... యవ్వనం రసలీలా...

:::::: BIT ::::::

చరణం

ఆమె ఓ ... ఆఆఆ ... ఆఆఆ ... ఆఆఆ ... ఆ... ఆ...
పెదవే మధుకలశం.... అందుకో ప్రేమరసం ॥2॥
అందమే నీకు వశం ... చిందుకో ఉల్లాసం
వచ్చిందీ మధుమాసం .. నేడే నీ కోసం
జీవితం నీకు వరం ... చేరుకో సుఖతీరం
నా బిగి కౌగిలిలో ... రాసుకో శృంగారం
జీవితం నీకు వరం... చేరుకో సుఖతీరం

:::::: BIT ::::::

చరణం

అతడు ఆ... ఆ... ఆ ... ఆఆఆఆ ...
చక్కని పక్కవుందీ... పక్కపై చుక్కేవుందీ ॥2॥
చుక్కకూడ పక్కనె వుందీ... పక్క కూడ పక్కుమంది
మక్కువైతే దక్కేనందీ..దక్కితే చిక్కేముందీ...
జీవితం మధుశాలా... యవ్వనం రసలీలా

:::::: BIT ::::::

చరణం

ఆమె ఆ... ఆ... ఆఆఆ ... ఆఆఆ ...
అతడు ఆ... ఆఆఆ... ఆఆ... ఆఆఆ...
ఆమె కన్నులే కలుసుకొంటే... వెన్నెలే వేడికదా ... ॥2॥
అతడు కన్నెతో కలిసివుంటే ... స్వర్గమే చేదుకదా

Contd...

| | |
|---|---|
| ఆమె | ఇద్దరం ఒక్కటైతే... మనకథే కావ్యసుధా ... |
| అతడు | జీవితం మధుశాలా ... యవ్వనం రసలీలా |
| ఆమె | రేపటి మాటేలా... నవ్వుకో ఈ వేళా... |
| అతడు | జీవితం మధుశాలా ... యవ్వనం రసలీలా |
| ఆమె | ఓ ఒ ఓ .... |
| అతడు | యవ్వనం రసలీలా |
| ఆమె | ఓ ఓ ఓ .... |
| అతడు | యవ్వనం.. రసలీలా |

★★★



## తెలుసుకుందాం

ఇళయరాజాకు చిన్ననాడే సినిమా పాటలపై మక్కువ ఏర్పడిందనడానికి ఒక చిన్న సంఘటన గుర్తు చేసుకుందాం. రాజా మూడవ తరగతిలో వుండగా తమిళ 'లైలామజ్నూ' సినిమాని ఒక టూరింగ్ టాకీస్‌లో చూశారు. ఆ సినిమాలో చిన్నారి మజ్నూ స్కూల్లో పాఠాలకు బదులుగా పలకమీద 'లైలా... లైలా' అని రాస్తాడు. అది చూసిన మేష్టారు మజ్నూని బెత్తంతో కొడతాడు. ఆ సినిమాలో వచ్చే లైలా పాట రాజాకు ఎంతగా నచ్చిందంటే మరుసటి రోజు బడిలో పలకమీద 'లైలా... లైలా' అని వరసగా రాసేశారు. రాజాకు పంతులుగారి బెత్తంతో బడితపూజ తప్పలేదు.

## పంచభూతాలు (1979)

రచన : సి. నారాయణరెడ్డి                    గానం: బాలు , సుశీల

:::::: Opening Music Bit ::::::

ఆమె      అఅఅ... ఆఅ... ఆఆఆఅ... అఅఅఅ...

అతడు     అఅ... అ... ఆఅఅ ... అఅఅ ....

ఆమె      అఅఅఅ... అఅ ... ఆఅ ...      (Long Bit)

పల్లవి

ఆమె      కవ్వించే కళ్లల్లో కలలేవో ఏవోఏవో కదలాడే ఈ వేళా (Bit) ॥2॥

అతడు     ఆ కలల కదలికల ఊగెనులే ... తొలకరి వలపుల రసడోలా..
         ఆఅఆఅఆఅ...

ఆమె      కవ్వించే కళ్లల్లో కలలేవో ఏవో ఏవో...కదలాడే ఈ వేళా...

అతడు     ఆ కలల కదలికల ఊగెనులే...తొలకరి వలపుల రసడోలా...ఆఅఅ

:::::: BIT ::::::

చరణం

ఆమె      అనురాగ వీణపై మనసేమొ నాదమై
         ఇలతీయగా మ్రోయగా పదములాడగా

అతడు     సుదతి తనువే మదన ధనువై అదనుగని ...
         పదును పదును మరుల విరులు కురియగ...

ఆమె      కవ్వించే కళ్లల్లో కలలేవో ఏవో ఏవో కదలాడే ఈ వేళా

అతడు     ఆ కలల కదలికల ఊగెనులే... తొలకరి వలపుల రసడోలా ...
         ఆఅఆ

:::::: BIT ::::::

చరణం

బృందం    ఆఅ అఅఅ అఅ... ఆఅ
ఆమె      అఆఅ...అఆఅ...ఆఅఅ...      } ॥2॥

అతడు     లలిత పవన కర చలిత జలదగతిలో (Bit)
         నవ వికచ కుసుమ ముఖముఖర భ్రమర నుతిలో (Bit)

Contd...

ఆమె వనమే... వధువై... మనువే వరమై పులకించే ఈ వేళా
అతడు ఆషాఢమేఘమే ఆనంద రాగమై...
చలచల్లగా... జల్లుగా... కవితలల్లగా
ఆమె ప్రియుని తలపే పెళ్లిపిలుపై చెలియకై
ముత్యాల పందిట రత్నాల పల్లకి నిలుపగ
అతడు కవ్వించే కళ్లల్లో కలలేవో ఏవో ఏవో
కదలాడే ఈ వేళా...
ఆమె ఆ కలల కదలికల ఊగెసులే తొలకరి వలపుల రసడోలా... ఆఆఆ
అతడు కవ్వించే కళ్లల్లో కలలేవో ఏవోఏవో కదలాడే ఈ వేళా

★★★



## యుగంధర్ (1979)

రచన : **సి. నారాయణరెడ్డి** గానం : **జానకి**

:::::: Opening Chord ::::::

పల్లవి నా పరువం...నీకోసం...నా పరువం...నీ కోసం
పానుపువేసి వున్నదీ...వాకిలి తీసి వున్నదీ
కోరిక పండగా...నిండుగా
నా పరువం...నీ కోసం...నా పరువం...నీ కోసం

:::::: BIT ::::::

చరణం రాకరాక వచ్చానోయి మీ ఇంటికి...ఈ పొదరింటికీ
లేకలేక నచ్చావోయి నాకంటికి...నా చిగురొంటికీ (Bit) } ॥2॥
ఈ సమయం...నా హృదయం...ఈ పరువం...నా హృదయం
నిన్ను చూసి నాగులాగ వూగుతున్నదీ ...చెలరేగుతున్నదీ...
నా పరువం...నీకోసం...నా పరువం...నీ కోసం

:::::: BIT ::::::

చరణం ఒక్కమాటు ఇక్కడే నువ్వుండిపోరా... రుచులందుకోరా
తియ్యగా నేనిప్పించేది తీసుకోరా ...ఆపై చూసుకోరా (Bit) } ॥2॥
ఈ రోజూ ... ఇక రాదూ ... ఈ రోజూ ... ఇక రాదూ...
ఈ కన్నెవయసు అందుకేలే కాగుతున్నది...సెగ కాచుకున్నది
నా పరువం ... నీ కోసం ... నా పరువం ... నీ కోసం
పానుపువేసి వున్నదీ...వాకిలి తీసివున్నదీ
కోరిక పండగా ... నిండుగా
నా పరువం ... నీ కోసం ... నా పరువం ... నీ కోసం ..

★ ★ ★

## యుగంధర్ (1979)

రచన : ఆచార్య ఆత్రేయ                    గానం : బాలు, జానకి

:: Opening Music ::

పల్లవి

ఆమె	దాదాదా...దాదా...దాస్తే దాగేదా...
నీపై..నాకున్న మోహం..నాలో...రేపింది తాపం...
పాపం నీదా..నాదా...
దాదాదా...దాదా...దాస్తే దాగేదా

:::::: BIT :::::

చరణం

ఆమె	ఉరితాడంటి బిగికౌగిలిలో ఉక్కిరి బిక్కిరీ చేసేస్తా
మిన్నాగునురా...విషకన్యనురా..సొగసులతోనే కాటేస్తా
ఇది నీవంతో...మరి నావంతో...ఏదోఒకటీ..ఇక తేలాలీ
దాదాదా...దాదా...దాస్తే దాగేదా

:::::: BIT :::::

చరణం

అతడు	పుట్టాము గనక..తప్పదు చావక
ముందూ వెనకా తేదాగా...
ఏతాడైనా...మూడేముళ్లూ
సంబరమంతా మూన్నాళ్ళూ
కథ జరగాలీ...తుది తేలాలీ
నీకూ....నాకూ...ముడివేయాలీ...
దాదాదా...దాదా...దాస్తే దాగేదా...

ఆమె	నీపై... నాకున్న మోహం...నాలో...రేపింది తాపం...
పాపం నీదా..నాదా...(Bit)

★★★

## యుగంధర్ (1979)

రచన : సి. నారాయణరెడ్డి గానం : బాలు, బృందం

పల్లవి

అతడు నాకోసమే మీరొచ్చారు...మీకోసమే నేనొచ్చాను ॥2॥
ఇంతకు నేను ఎవరో తెలుసా...నాపేరే...యుగంధర్...(Bit)
యుగంధర్...(Bit) యుగంధర్...

బృందం యుగంధర్...

అతడు యుగంధర్...

:::::: BIT :::::

చరణం

బృందం యే...లాలలా...లాలలా...లాలలా...లాలలా...
లాలలా...లాలలా...లాలలా...లాలలా...(Bit)

అతడు మీరంతా చూసేది నన్నుకాదు...
ఈ వూరంతా అనుకునేది నేనుకాదు.. } ॥2॥
మంచికే...మంచినీ...మనిషిలో..మనిషినీ...
ఏ ఎదలో ఏముందో...ఏ పొదలో ఏముందో
పసికట్టి పట్టేస్తా...బుసకొట్టి కాటేస్తా...నాపేరే...

బృందం యుగంధర్ (Bit) యుగంధర్ (Bit) యుగంధర్...
యుగంధర్...యుగంధర్...

:::::: BIT :::::

చరణం

బృందం లాల...లాల...లల్లాలా...లాలాలా...లల్లాలా...లాలాలా...
లల్లాలా...లా...లల్లాలా...లా...లల్లాలా..లా...లల్లాలా...
లా...లాల లాల లాలాలా...లాలాలా...లల్లాలా..లాలాలా (Bit)

అతడు నామాటే వేదవాక్కు నావాళ్లకు..
నాపేరంటే హడల్ దొంగనాయాళ్లకు } ॥2॥
మంచికే...మంచినీ...మనిషిలో..మనిషినీ..

Contd...

ఏవేషం వేస్తానో...ఏవేళ వస్తానో...
ఎదురొస్తే ఏరేస్తా...ఏదైనా సాధిస్తా...నాపేరే....

బృందం యుగంధర్ (Bit) యుగంధర్ (Bit) యుగంధర్...
యుగంధర్...యుగంధర్...

అతడు నాకోసమే మీరొచ్చారు...మీకోసమే నేనొచ్చాను
ఇంతకు నేను హహా...ఎవరో తెలుసా...నాపేరే...

బృందం యుగంధర్ (Bit) రిమంబర్ (Bit) యుగంధర్...
రిమంబర్...యుగంధర్...

★★★



## కాళరాత్రి (1979)

రచన : జాలాది                                                    గానం : బాలు, సుశీల

:::::: Opening Music ::::::

పల్లవి

ఆమె     ఓరయ్యో...చాలయ్యో...బులపాటం ॥2॥
నను మెచ్చానన్నావూ...మనసిచ్చానన్నావూ...
ఆ పెద్దా చిన్నా మెచ్చారని అందలమెక్కావయ్యో.. ॥2॥ (Bit)

అతడు     ఓలమ్మో...బుల్లెమ్మో...అలిగావా...
నిన్నుమెచ్చేవచ్చానూ...మనసిచ్చేవున్నానూ...
ఆ నింగీ నేలా ఏమైపోనీ...నీతోవుంటానేనూ ॥2॥

:::::: BIT ::::::

చరణం

అతడు     వేగుచుక్కలెన్నున్నా వెన్నెలకాదూ..
సంపదలెన్నున్నా సుఖమేరాదూ...
ఆమె     జాబిల్లివెన్నెల్లో చీకటిరాదూ...
జతగా నువ్వుంటే ఆకలికాదూ...
అతడు     సొగసులునీవై...మగసిరినాదై
చెలరేగే కోరిక చల్లారనీ...
ఆమె     పదేపదేకావాలీ అదేఅదే మళ్లీమళ్లీ...
అతడు     ఓలమ్మో....బుల్లెమ్మో...అలిగావా...
నిన్ను మెచ్చేవచ్చానూ..మనసిచ్చేవున్నానూ...
ఆమె     ఆ పెద్దా చిన్నా మెచ్చారని అందలమెక్కావయ్యో..
అతడు     ఓలమ్మో...బుల్లెమ్మో...అలిగావా...

:::::: BIT ::::::

Contd...

చరణం

ఆమె నీ కొంటెచూపు నన్ను కొరికేస్తుందీ..
వయసే వరదలై పరుగేస్తుందీ...

అతడు మల్లె ఒళ్లు చూస్తుంటే మనసొతుందీ...
రేపటి ఆశలన్ని నెమరేస్తుందీ...

ఆమె మేఘం నీవై...మెరుపును నేనై...
రాగానికి అనురాగం ముడివేయనా...

అతడు పదేపదే కావాలీ అదే అదే మళ్లీ మళ్లీ...

ఆమె ఓరయ్యో...చాలయ్యో..బులపాటం..
ననుమెచ్చాసన్నావూ...మనసిచ్చానన్నావూ...

అతడు ఆ నింగీ నేలా ఏమైపోనీ...నీతోవుంటానేనూ

ఆమె ఓరయ్యో...చాలయ్యో...బులపాటం...

:::::: BIT ::::::

చరణం

అతడు ఆకలి కోరికలే ఎదురొస్తుంటే...

ఆమె అల్లరివయసు నన్ను తరిమేస్తుంటే...

అతడు ఆమని కోయిలవై కవ్విస్తుంటే...

ఆమె రేయికి వెన్నెలవై నవ్విస్తుంటే...

అతడు కాలము నీవై..

ఆమె గమనము నీవై..

అతడు క్షణాలనే యుగాలుగా మార్చేద్దామా...

ఆమె క్షణం క్షణం పదలకుండ నువ్వూ నేనూ సగంసగం

అతడు లాలల్లా..లాలల్లా..లాలల్లాలా..
లారలల్లాలల్లాల్లా..లారలల్లాలల్లాలా..

ఆమె ఆ నింగీ నేలా ఏమైపోనీ...నీతోవుంటానేనూ...

అతడు ఆ నింగీ నేలా ఏమైపోనీ...నీతోవుంటానేనూ...

ఇద్దరు లాలల్లా...లాలల్లా...లాలల్లాలా...

★★★

## అమ్మ ఎవరికైనా అమ్మ (1979)

రచన : **ఆచార్య ఆత్రేయ** గానం : **బాలు**

పల్లవి

అమ్మా... (Long Bit) ...
అమ్మా...నీవులేని నేనూ...మోడైన మానూ...
నాకళ్లలో...కన్నీళ్లలో...కలకాలం ఉంటావమ్మా...
అమ్మా...నను కన్న దైవమా...నను కన్న దైవమా...
అమ్మా...నీవులేనినేనూ...మోడైన మానూ...

:::::: **BIT** ::::::

చరణం

అమ్మ ఎవరికైనా అమ్మ అన్నావు నువ్వూ ...
కాదనీ...లేదనీ..అన్నాను నేనూ... (Bit) ||2||
నిజము ఋజువు చేసీ నీవు వెళ్లిపోయావూ... (Bit)
నీకు చితిని పేర్చీ...నేను పాపినయ్యానూ...
నీవు రావు...నేను పోను...అమ్మా...
నీవులేని నేనూ...మోడైన మానూ...

:::::: **BIT** ::::::

చరణం

బ్రతుకిచ్చిన నా దైవాన్నీ...మృత్యువేల దోచే...
శవములా...బ్రతకమనీ...నన్నేలనిలిపే... (Bit) ||2||
మరల నీవు భువిలో పుట్టీ నన్ను మన్నించాలీ... (Bit)
మనిషి దేవుడయ్యే మార్గం మాకు నువ్వు చూపాలీ...
నీవు రావు...నేను పోను...అమ్మా...
నీవులేని నేనూ...మోడైన మానూ...
నాకళ్లలో...కన్నీళ్లలో...కలకాలం ఉంటావమ్మా...
అమ్మా...నను కన్న దైవమా...నను కన్న దైవమా...

★★★

# ఎర్రగులాబీలు (1979)

రచన : ఆచార్య ఆత్రేయ గానం : బాలు, జానకి

:::::: Opening Music ::::::

పల్లవి

ఆమె రూరూ రురు రూరూ రూరురూ ...రూరురూ...రూరూరురూరూరు..
రూరూ...రూరూరూ...రూరూరూ...రూరూరూ (Bit)

అతడు ఎర్రగులాబీ విరిసినది... తొలిసారీ నను కోరీ
ఆశే రేపింది నాలో ... అందం తొణికింది నీలో...
స్వర్గం వెలిసింది భువిలో ...

ఆమె ఈ... ఎర్రగులాబీ విరిసినది ....తొలిసారీ నిను కోరీ
ఆశే రేపింది నీలో ... అందం తొణికింది నాలో
స్వర్గం వెలిసింది భువిలో ... ఈ ఎర్రగులాబీ విరిసినదీ ...

:::::: BIT ::::::

చరణం

ఆమె లతనై ... నే జతనై ... నిన్నే పెనవేయనా
అతడు కథనై ... నీ కలనై ... నిన్నే మురిపించనా
ఆమె నేనిక నీకే సొంతమూ ...
అతడు ననస నసన నన ... నీకెందుకు ఈ అనుబంధమూ
ఆమె నసన ... ననస...నసన... ననస...సనస...ననస...నననా ...
అతడు ఈ ... ఎర్రగులాబీ విరిసినది ... తొలిసారీ ననుకోరీ
ఆమె ఆశే రేపిందినీలో ... అందం తొణికింది నాలో
స్వర్గం వెలిసింది భువిలో...
అతడు ఈ ఎర్రగులాబీ విరిసినదీ ...

:::::: BIT ::::::

చరణం

ఇద్దరు ప...పపపా...పపపా...పపపా...పపా...పాపపా...(Bit)
అతడు పెదవినీ ఈ మధువునూ నేడే చవిచూడనా

Contd...

ఆమె నాదనీ ఇక లేదనీ నీకే అందివ్వనా
అతడు వయసును వయసే దోచేదీ ...
ఆమె నన నన నన నన... అది మనసుంటేనే దొరికేది ...
అతడు నన నన నన నన నన నన నన నన నన నన నన నన నన నా ...
ఆమె ఈ ఎర్రగులాబీ విరిసినది... తొలిసారీ నిను కోరీ
అతడు ఆశే రేపింది నాలో... అందం తొణికింది నీలో
స్వర్గం వెలిసింది భువిలో ...
ఆమె ఈ... ఎర్రగులాబీ విరిసినదీ ...
ననన ననన ననన అహహహా... (నవ్వు)

★★★



## ఎర్రగులాబీలు (1979)

రచన : **వేటూరి** గానం : **బాలు, జానకి**

పల్లవి

ఆమె ఊ... ఊ... ఊ... ఊ... లాలాలల ... లాలాలల ... లాఆ Bit)
ఎదలో... తొలివలపే... విరహం... జతకలిసే
మధురం ఆ తలపే... నీ పిలుపే.... (బాలు హమ్మింగ్‌తో)
అతడు ఎదలో...తొలివలపే... విరహం...జతకలిసే
మధురం ఆ తలపే... నీ పిలుపే ... ఎదలో తొలి వలపే

:::::: BIT ::::::

చరణం

అతడు రోజాలతో పూజించనీ.... విరితేనెలే... నను తాగనీ (Bit)
ఆమె నాయవ్వనం పులకించనీ... అనురాగమే పలికించనీ
అతడు కలగన్నదీ ... నిజమైనదీ
ఆమె కథలే... నడిపిందీ...
అతడు ఎదలో... తొలివలపే ... విరహం జతకలిసే
మధురం ఆ తలపే... నీ పిలుపే ... (జానకి హమ్మింగ్‌తో)
ఆమె ఎదలో తొలివలపే ...

:::::: BIT :::::

ఆమె పయనించనా నీ బాటలో... మురిపించనా నా ప్రేమలో (Bit)
అతడు ఈ కమ్మనీ... తొలిరేయినీ ... కొనసాగనీ... మన జంటనీ
ఆమె మోహాలలో మన ఊహాలే
అతడు సాగే... చెలరేగే...
ఎదలో... తొలివలపే... విరహం...జతకలిసే
మధురం ఆ తలపే... నీ పిలుపే... (జానకి హమ్మింగ్‌తో)
ఆమె ఎదలో... తొలివలపే... విరహం... జతకలిసే
మధురం ఆ తలపే... నీ పిలుపే... (బాలు హమ్మింగ్‌తో)
ఎదలో తొలివలపే...

★★★

## అజేయుడు (1979)

రచన : రాజశ్రీ　　　　　　　　　　　　గానం : బాలు , జానకి

(జానకి ఆలాపనతో Opening Music Bit )

పల్లవి

ఆమె　　అ... ఆహా ... అహా ... అ... అ...

అతడు　　అ... ఆహాహా. ఆ ... ఆహా.. ఆ (Bit)

అతడు　　నీ... పెదవులలోనా .... తేనెల వానా ...
నాలో పొంగే కన్నెరాగం ... అది మారుమోగు జీవితాంతం
నీ... పెదవులలోనా ... తేనెలవానా ...

:::::: BIT ::::::

చరణం

అతడు　　విరిసే దోరవలపే.. ఎద చిలికే అమృతం (Bit) ॥ 2 ॥
మెరిసే కోటి కురులే... విరజాజుల తోరణం... హోయ్! హోయ్!!
మెరిసే కోటి కురులే... విరజాజుల తోరణం...
నను అల్లరి చేసే చల్లని ఊహల తెలియాడు దేవి నీవే

ఆమె　　నీ... పెదవులలోనా... తేనెలవానా ...

:::::: BIT ::::::

చరణం

ఆమె　　తెలిపే ఓరకనులూ... మరులొలికే గాథలే (Bit) ॥ 2 ॥
అలలా పొంగి హృదయం... వినిపించే పాటలే ...హోయ్! హోయ్!!
అలలా పొంగి హృదయం... వినిపించే పాటలే....
ఇక నీలో సగమై... నీవే జగమై నిలిచేనోయి ఎదలో నేను

అతడు　　నీ...పెదవులలోనా .... తేనెలవానా ...

:::::: BIT ::::::

చరణం

ఆమె　　రాగం... ప్రేమరాగం ... విరబూసే యవ్వనం (Bit) ॥ 2 ॥

అతడు　　ఒకటై ... మనసులొకటై ...ఉంటేనే జీవితం .... హోయ్! హోయ్!!
ఒకటై ... మనసులొకటై ...ఉంటేనే జీవితం

ఆమె　　నా ఆటా పాటా... మనసూ మమత ... అన్నీ నాకు నీవే కాదా ...
నీ... పెదవులలోనా ... తేనెలవానా...

అతడు　　నీలో పొంగే... కన్నెరాగం ... అది మారుమోగు జీవితాంతం
నీ... పెదవులలోనా... తేనెలవానా

★★★

# గురు (1980)

రచన : ఆచార్య ఆత్రేయ గానం: బాలు , జానకి

:::::: Opening Music ::::::

పల్లవి

ఆమె పేరు చెప్పనా... నీ రూపు చెప్పనా (Bit)
పేరు చెప్పనా (Bit) నీ రూపు చెప్పనా (Bit)
నీ పేరే అనురాగం ... నీ రూపమూ శృంగారము
నీ చిత్తమూ నా భాగ్యము ...

అతడు పేరు తెలుసునూ (Bit) నీ రూపు తెలుసునూ (Bit) ॥2॥
నీ పేరే .... ఆనందం... నీ రూపమూ అపురూపము
నీ నేస్తమూ నా స్వర్గము ...

ఆమె పేరు చెప్పనా... (Bit) నీ రూపు చెప్పనా

:::::: BIT ::::::

చరణం

అతడు పూవుల చెలీ ... నవ్వొక సిరీ దివ్వె లేలనే... నీ నవ్వులుండగా
ఆమె మమతల గని... మరునికి సరి మల్లెలేలరా... నీ మమతలుండగా...
అతడు నీ కళ్లలో నా కలలనే పండనీ
ఆమె నీ... కలలలో నన్నే నిండనీ
అతడు మనకై భువిపై దివినే దిగనీ
ఆమె పేరు చెప్పనా (Bit) నీ రూపు చెప్పనా(Bit)
అతడు పపపాపపా... (Bit) పపపాపపా...పా

:::::: BIT ::::::

చరణం

ఆమె నీ వొక సెల... నేనొక అల... నన్ను ఊగనీ... నీ గుండెలోపలా...
అతడు విరి సరముల... కురులొక వల... నన్ను చిక్కనీ... ఆచిక్కు లోపలా...
ఆమె నీ మెప్పులూ... నా సొగసుకే మెరుగులూ
అతడు ఆ మెరుగులూ వెలగనీ వెలుగులై
ఆమె మనమే వెలుగూ చీకటి జతలూ

Contd...

అతడు	పేరు తెలుసునూ (Bit) నీ రూపు తెలుసునూ (Bit)
ఆమె	పపపాపపా... పపపాపపా... పా

:::::: BIT ::::::

చరణం

అతడు	పెదవికి సుధ... ప్రేమకు వ్యధ... అసలు అందమూ
అది కొసరుకుందమూ...
ఆమె	చెదరని జత... చెరగని కథ రాసుకుందమూ... పెనవేసుకుందమూ...
అతడు	నీ హృదయమూ... నా వెచ్చనీ ఉదయమూ...
ఆమె	నీ ఉదయమూ... దినదినం మధురమూ...
అతడు	ఎన్నో యుగముల యోగము మనమూ
ఆమె	పేరు చెప్పనా (Bit) నీ రూపు చెప్పనా (Bit)
అతడు	పేరు తెలుసునూ (Bit) నీ రూపు తెలుసునూ (Bit)
ఆమె	నీ పేరే అనురాగం... లాలాలలా... లాలాలలా...
అతడు	లాలాలలా...లాలాలలా...పపపాపపా...(Bit) పా...పపపాపపా...(Bit)

★★★

## మనసులో మాట

నా ఇన్నేళ్ల సినీ సంగీత ప్రయాణంలో మనసుకు నచ్చని పని ఎప్పుడూ చెయ్యలేదు. కథ నచ్చితేనే దానికి సంగీతం అందించాను... అందిస్తాను కూడా! *A Wednesday* చిత్రం కథ కమల్ హాసన్ వినిపించారు. ఆ కథ అంతా హింస నేపథ్యంగా సాగేదే! నేను సంగీతం చెయ్యలేనని కమల్‌కు చెప్పాను. నా సమాధానంతో కమల్ నిరాశ చెందారు. నన్ను ఒప్పించలేని కథకి నేను సంగీతం ఇవ్వలేను.

ఒక సన్నివేశం ఇచ్చి దానికి బాణీ కట్టమని గిరిగీస్తే... మనిషిని నాలుగు గోడల మధ్యపెట్టి తలుపులు వేసినట్లుగా ఉంటుంది. సంగీతానికి హద్దులుండవు. అది స్వేచ్ఛా విహంగంలా విహరించాలి. అప్పుడే అందులో ఆత్మ కనిపిస్తుంటుంది. అర్థం చేసుకొని అందుకు తగ్గట్టుగా సంగీత దర్శకుడు బాణీ ఇచ్చేందుకు ప్రయత్నించాలి.

– ఇళయరాజా

## గురు (1980)

రచన : ఆచార్య ఆత్రేయ　　　　గానం : జానకి, బృందం

:::::: Opening Music ::::::

పల్లవి

ఆమె　నా...వందనము..సరసుల...రసికుల...సదసుకూ ॥2॥
నా పాట మీరు మెచ్చేందుకూ...మీ దీవెనలను ఇచ్చేందుకూ
శుభము అందరకూ...
నా...వందనము..సరసుల...రసికుల...సదసుకూ

:::::: BIT ::::::

చరణం

బృందం　దితితై...దితితై (Bit) దితితై...దితితై (Long Bit)
ననననన...నననన...ననననన...నననన...నా...

ఆమె　తేటతేనియ తెలుగుంది...తీయతీయని తలపుంది..(Bit) ॥2॥
రాగం వుందీ...నాలో వేదం వుందీ...(బృందం : లలల...లలల)
పాటే పాటై..పాటే...ఆటై...నీకుగాను లోకమెదుట
నాట్యమాడనా...ప్రియా...
నా...వందనము..సరసుల...రసికుల...సదసుకూ

:::::: BIT ::::::

చరణం

బృందం　లలల...హోయ్...హోయ్...హోయ్‌హోయ్‌హోయ్‌హోయ్...ల
హోయ్...హోయ్...హోయ్‌హోయ్‌హోయ్‌హోయ్..
లలలలల...లలలలల...లా...లలలలల...లలలలల...లా...
(Long Bit)

ఆమె　పాడమన్నది అనురాగం..ఆడమన్నది ఆనందం...(Bit) ॥2॥
అందాలన్నీ...నీకే ఇవ్వాలనీ... (బృందం : లలల...లలల)
కాచీ దాచీ...వేచే...నన్ను...వేళచూచి వేగవచ్చి
స్వీకరించరా...ప్రియా...
నా...వందనము..సరసుల...రసికుల...సదసుకూ
నా పాట మీరు మెచ్చేందుకూ...మీ దీవెనలను ఇచ్చేందుకూ
శుభము అందరకూ...
నా...వందనము..సరసుల...రసికుల...సదసుకూ

★★★

## కొత్తజీవితాలు (1981)

రచన : ఆచార్య ఆత్రేయ　　　　　　　　　　గానం : సుశీల

:::::: Opening Music ::::::

పల్లవి　మనసే వెళ్లెనే... (Bit) మనసే వెళ్లెనే...
మమతే మరచీ...తోడులేని నేనూ...పాడుతున్న పాటా...
తోడులేని నేనూ...పాడుతున్న పాటా...వినరాదా...
మనసే వెళ్లెనే...

:::::: BIT ::::::

చరణం　గుడిగంటలోనా...పతి గుండెలోనా... పాటలన్నీ ఆటలాయెనే...
నా ఆశలడియాసలై పోవునా... తన బాధలను తానె తుడిచేయునా...
మనసే..వెళ్లెనే...మమతే మరచీ...

:::::: BIT ::::::

చరణం　లాలలలలాల...లాలలా...లాలలలాలా...లాలలా...లాలలలాల..
లలలాలలా...లలలాల...లాలా...లలలాలలాలా... (Long Bit)
నడినీటిలోనా...సుడిగాలిలోనా...ఊగిపోతున్న నావనైతినే...
దయలేని సుడిగాలి కబళించునా...దరిజేర్చుచుక్కాని కనిపించునా...
మనసే..వెళ్లెనే...మమతే మరచీ...

:::::: BIT ::::::

చరణం　నాతోడు తానై...తన నీడ నేనై... నిండు బ్రతుకు పండగలదనీ...
కలలెన్నో కన్నాను ఈ కళ్లతో...కడతేరి పోలేను కన్నీళ్లతో...
మనసే..వెళ్లెనే...మమతే మరచీ...
తోడులేని నేనూ...పాడుతున్న పాటా...వినరాదా...
మనసే వెళ్లెనే...

★★★

### మీకు తెలుసా?

"తంతననం.. తనతాళంలో" (కొత్తజీవితాలు - 1981 - సి. నారాయణ రెడ్డి) పాటను సుశీల, జానకి బృందం చేత ఇళయరాజా పాడించడమే విచిత్రం ! ఈ పాటను హీరో హీరోయిన్ల (హరిప్రసాద్, సుహాసిని) ప్రణయ సన్నివేశంలో తమ వెనక వుండే గ్రూప్ డాన్సర్స్ పాడినట్లు దర్శకుడు భారతీరాజా చిత్రీకరించారు. సుశీల, జానకి గార్లతో గ్రూప్ డాన్సర్లకోసం పాడిచడం ఇళయరాజా చేసిన గొప్ప ప్రయోగం.

## కొత్త జీవితాలు (1981)

రచన: సి. నారాయణరెడ్డి గానం : సుశీల, జానకి, బృందం

:::::: Opening Music ::::::

పల్లవి (ఆలాపన)

బృందం తం... తననం... తననం... తననం... తననం... తననం..త...
ఇద్దరు ఆఆఆఆ... ఆఆఆఆ... ఆఆఆఆ... ఆఆఆ... ఆఆఆ... (Bit)
బృందం తం... తననం... తననం... తననం... తననం... తననం...తననం
ఆమె 1 తం... తననం... తన తాళంలో... రసరాగంలో... మృదునాదంలో
నవ జీవన భావన పలికెనులే...
ఆమె 2 తం... తననం... తన తాళంలో... రస రాగంలో... మృదునాదంలో
నవ జీవన భావన పలికెనులే...
ఆమె 1 నవ భావనయే... సుమమోహనమై... ఆపై... వలపై... పిలుపై...
కళలొలుకగ
ఆమె 2 తం... తననం... తన తాళంలో... రసరాగంలో... మృదునాదంలో
నవ జీవన భావన పలికెనులే....

:::::: BIT ::::::

చరణం

ఇద్దరు (ఆలాపన Followed by music bit)
తనన తని నననని నననని తనన తని నననని నననని
తనన తని ననదని నననని తనన తనన తనన తనన...(Long Bit)
ఆమె 2 ఉల్లము ఝల్లన అల్లరి తెమ్మెర వీచెనులే... మదిదోచెనులే
మరుమల్లెలు సైగలు చేసెనులే (Bit)
బృందం (ఆలాపన) ఆఆఆ ఆఆఆ ...
ఆమె 1 ఉల్లము ఝల్లన అల్లరి తెమ్మెర వీచెనులే... మదిదోచెనులే
మరుమల్లెలు సైగలు చేసెనులే
ఆమె 2 కన్నియ ఊహలు వెన్నెలలై కదలే కదలే విరిఊయలలై
ఆమె 1 పున్నమి వేసిన ముగ్గులలో... కన్నులు దాచిన సిగ్గులలో
ఆమె 2 తేనెల కందని తీయని కోరికలే.. చిరుమనుదను చిలుకగ
ఇద్దరు తం... తననం... తన తాళంలో... రసరాగంలో... మృదునాదంలో
నవ జీవన భావన పలికెనులే....

Contd...

:::::: BIT ::::::

చరణం

బృందం (ఆలాపన Followed by music bit)
ఆఆఆ... ఆఆఆ ... ఆఆఆ... ఆఆఆ... (Long Bit)

ఆమె 1 పొంచిన మదనుడు పువ్వుల బాణం నాటెనులే
ఎదమీటెనులే... పులకింతలు హద్దులు దాటెనులే (Bit)

బృందం (ఆలాపన) ఆఆఆ... ఆఆఆ.. ఆఆఆ... ఆఆఆ...

ఆమె 2 పొంచిన మదనుడు పువ్వుల బాణం నాటెనులే...
ఎద మీటెనులే... పులకింతలు హద్దులు దాటెనులే

ఆమె 1 మ్రోగెను పరువము రాగిణియై మురిసే...మురిసే చెలి మోహినియై...

ఆమె 2 వన్నెల చుక్కల పందిరిలో...వెన్నెల రాయని కౌగిలిలో

అమె 1 ఇద్దరి పెదవుల ముద్దుల అల్లికలే మధు మధురిమ లొలుకగ

ఇద్దరు తం... తననం తన తాళంలో... రసరాగంలో... మృదునాదంలో
నవజీవన భావన పలికెనులే...

ఆమె 2 నవభావనయే... సుమమోహనమై..
ఆపై...వలపై...పిలుపై...కళలొలుకగ

ఇద్దరు తం... తననం... తన తాళంలో... రసరాగంలో... మృదునాదంలో
నవజీవన భావన పలికెనులే
తం... తననం... తననం.. తననం.. తననం.. తననం... తననం... తననం...

★★★



## కొత్త జీవితాలు (1981)

రచన: **సి. నారాయణరెడ్డి** గానం : **బాలు, జానకి**

:::::: Chord ::::::

పల్లవి

అతడు పొంగిపొరలే అందాలెన్నో పొంగిపొరలే... (Long Bit)

ఆమె కన్నె మదిలో అందాలెన్నో పొంగిపొరలే ॥2॥
కోనల్లోన... లోయల్లోన... నేలపైన నింగి కదలే...
వన్నెకాడు నన్ను కలిసే... (Long Bit)

అతడు పూలే రమ్మనగా... పరువాలే ఝుమ్మనగా ॥2॥
పవనాలే జిల్లనగా... హృదయాలే ఝల్లనగా
పొంగి పొరలే అందాలెన్నో పొంగి పొరలే...
కోనల్లోన... లోయల్లోన... నేలపైన నింగి కదలే...
వన్నెకాడు నిన్ను కలిసే...

:::::: BIT ::::::

చరణం

ఆమె (ఆలాపనతో Long Bit) కుకుకుక్కూ... కుకుకుక్కూ... (7 Times)
కోయిల పాటలలోనా... ఆ కోవెల గంటలలోనా...(Bit) ॥2॥
మ్రోగిందీ... నాదం... మ్రోగిందీ... రాగం
ఆగిందీ కాలం... అది నీకోసం...

ఇద్దరు ఆఆఆ... ఆఆఆ.... ఆఆఆ... ఆఆఆ... ఆఆఆ... ఆఆఆ...

ఆమె కన్నెమదిలో అందాలెన్నో పొంగిపొరలే...

అతడు కోనల్లోన... లోయల్లోన...నేలపైన నింగి కదలే...

ఆమె వన్నెకాడు నన్ను కలిసే...

:::::: BIT ::::::

చరణం

అతడు పాఠం నేర్పే భామా తొలిపాఠంలే మన ప్రేమా (Bit) ॥2॥
కన్నుల్లో... మౌనం... కన్నుల్లో... మౌనం
నవ్వుల్లో గానం... అది నాకోసం

ఇద్దరు ఆఆఆ... ఆఆఆ... ఆఆఆ... ఆఆఆ... ఆఆఆ... ఆఆఆ...

అతడు పొంగి పొరలే అందాలెన్నో పొంగి పొరలే...

ఆమె కోనల్లోన... లోయల్లోన... నేలపైన నింగి కదలే...

అతడు వన్నెకాడు నిన్ను కలిసే...

ఇద్దరు లాల లాల లాలా... లాలా లాలలా...

★★★

## మౌనగీతం (1981)

రచన : ఆచార్య ఆత్రేయ గానం : బాలు, జానకి

:: Opening Music బూట్ల చప్పుళ్లతో ::

అతడు Hellow ఆమె Hi
అతడు Good Morning ఆమె Good Morning
అతడు How do you do ? ఆమె Fine ! Thank you
అతడు ఉహు .... How, you joining me
ఆమె OK. With Pleasure (Bit)
ఆలాపన తదనినన... ఓ... ఓ... ఓ... (నవ్వు)

పల్లవి
అతడు పరువమా... చిలిపి పరుగు తీయకూ....
ఆమె పరువమా... చిలిపి పరుగు తీయకూ
అతడు పరుగులో... పంతాలు పోవకూ...
ఆమె పరుగులో... పంతాలు పోవకూ...
అతడు పరువమా...
ఆమె చిలిపి పరుగు తీయకూ...

:::::: BIT :::::

చరణం
అతడు ఏ ప్రేమ కోసమో...చూసే చూపులూ...ఏ కౌగిలింతకో..చాచే చేతులూ
ఆమె తీగలై... హా... చిరుపూవులై పూయా
గాలిలో... హా... రాగాలుగా మ్రోగా
అతడు నీ గుండె వేగాలు తాళం వేయా... పరువమా...
ఆమె చిలిపి పరుగు తీయకూ

:::::: BIT :::::

చరణం
ఆమె ఏ గువ్వ గూటిలో స్వర్గం వున్నదో...ఏ చెట్టు నీడలో సౌఖ్యం వున్నదో
అతడు వెతికితే... హా... నీ మనసులో లేదా
దొరికితే... హా... జత కలుపుకోరాదా
ఆమె అందాక... అందాన్ని... ఆపేదెవరూ.. పరువమా
అతడు చిలిపి పరుగు తీయకూ....

★★★

## మౌనగీతం (1981)

రచన : ఆచార్య ఆత్రేయ గానం : బాలు, జానకి

:: Opening Music ::

పల్లవి

ఆమె పబబప... పబబపప... పబబప... పబబపప
చెలిమిలో వలపురాగం... వలపులో మధుర భావం
రాగం... భావం కలిసే ప్రణయగీతం... పాడుకో..

అతడు పబబప ఆమె : పాడుతూ

అతడు పబబప ఆమె : ఆడుకో

అతడు పబబప

ఆమె చెలిమిలో వలపు రాగం... వలపులో మధుర భావం

:::::: BIT :::::

చరణం

అతడు ఉయ్యాలలూగినాను... నీ ఊహలో (Bit)
నెయ్యాలు నేర్చినాను... నీ చూపులో (Bit)

ఆమె ఆరాధనై గుండెలో... ఆలాపనై గొంతులో

అతడు అలలలాగా... కలలలాగా... ॥2॥ కదలిరాగా...

ఆమె చెలిమిలో వలపురాగం... వలపులో మధుర భావం

:: BIT :::::

చరణం

ఆమె నులివెచ్చనైన తాపం... నీ స్నేహమూ (Bit)
ఎదగుచ్చుకున్న భావం... నీ రూపమూ (Bit)

అతడు తుది లేని ఆనందమూ.. తొణుకాడు సౌందర్యమూ

ఆమె శ్రుతిని చేర్చి... స్వరము కూర్చి... ॥2॥ పదము కాదా...

అతడు చెలిమిలో... వలపురాగం... వలపులో మధురభావం
రాగం... భావం కలిసే ప్రణయగీతం...పాడుకో

ఆమె పబబప... అతడు పాడుతూ...

ఆమె పబబప అతడు ఆడుకో...

ఆమె పబబప

అతడు పబబప... పబబపప.. పబబప.. పబబపప...

★★★

## మౌనగీతం (1981)

రచన : ఆచార్య ఆత్రేయ గానం : సుశీల, బృందం

పల్లవి

బృందం (ఆలాపనతో) ల..లల..లల..లల..లల..లల..లల..లల..లల..
లల..లల..లల..లాలలల..లల..లా.. (Bit) ॥2॥
లాలలలలా..లాలలలలా..లాలలలలా..లాలలలలలా..లాలలలలలా..
లాలలలలా...లాలలలలా...లాలలలలా...లా...(Long Bit)
నా రాగమే..తొలిపాటై పాడెనే... ఆ పాటకూ...ఎదవీణై మ్రోగెనే...
మీటేదెవరో...పాడేదెవరో... తెలుసుకో...నేనే..
నా రాగమే...తొలిపాటై పాడెనే

:::::: BIT ::::::

చరణం ప్రేమన్నదీ...ఆరాధనా...ఆరాధనే..ఒక వేదనా...
కరిగే కర్పూరమూ...ఈ జీవితమూ...(Bit)
నిలిచే మణిదీపమూ...తొలిస్నేహమూ...(Bit)
నిజమూ...దు:ఖమూ..ఎదలో ఏకాంతమూ...
నా రాగమే...తొలిపాటై పాడెనే

:::::: BIT ::::::

చరణం నీ మౌనమే...నా శూన్యమూ...
నా హృదయమే...ఒక ధ్యానమూ...
శిలలో దాగున్నదీ...తెలియని శిల్పమూ..
మలిచే దెవరన్నదీ..ఎరగము మనమూ...(Bit)
తపమై..జపమై...ప్రేమను ప్రేమించుమూ
నా రాగమే..తొలిపాటై పాడెనే... ఆ పాటకూ...ఎదవీణై మ్రోగెనే...
మీటేదెవరో...పాడేదెవరో... తెలుసుకో...నేనే..
నా రాగమే...తొలిపాటై పాడెనే

★★★

## అమావాస్య చంద్రుడు (1981)

రచన: **వేటూరి** గానం : **బాలు, జానకి, టి.వి. గోపాలకృష్ణన్, బృందం**

సాకి

బృందం సరిగమపదని సప్తస్వరాలు మీకూ ...
అవి ఏడురంగుల ఇంద్రధనుస్సులు మాకూ } ॥2॥
మనసే ఒక మార్గమూ... మమతే ఒక దీపము
ఆ వెలుగే మాకు దైవమూ...
సరిగమ పదని సప్తస్వరాలు మీకూ...
అవి ఏడురంగుల ఇంద్రధనస్సులు మాకూ (Bit)

బృందం ఆలాపన (Followed by Long Bit)

పల్లవి

అతడు సుందరమో...సుమధురమో ...చందురుడందిన...చందన శీతలమో
మలయజ మారుత శీకరమో... మనసిజ రాగవశీకరమో
సుందరమో...సుమధురమో...చందురుడందిన...చందన శీతలమో...

:::::: BIT ::::::

చరణం

బృందం ఆలాపన (Followed by Long Bit)

ఆమె ఆనందాలే... భోగాలైతే (ఆలాపన)
హంసానందీ రాగాలైతే... నవవసంత గానాలేవో..సాగేనులే...
సురవీణా నాదాలెన్నో మోగేనులే ...

అతడు వేకువలో.... వెన్నెలలో... చుక్కలు చూడని కోనలలో
మావుల కొమ్మల పూగిన కోయిల వేణువులూదిన గీతికలో
సుందరమో... సుమధురమో...

ఆమె చందురుడందిన చందన శీతలమో...

:::::: BIT ::::::

చరణం

బృందం ఆలాపన (Followed by Long Bit)

అతడు అందాలన్నీ... అందేవేళా... (ఆలాపన)

Contd...

బంధాలన్నీ పొందేవేళా ... కన్నుల్లో గంగాయమునా పొంగేనులే...
కౌగిట్లో సంగమమేదో సాగేనులే...

ఆమె కోరికలే చారికలై ఆడిన పాడిన సందడిలో
మల్లెల తావుల పిల్లనగ్రోవులు పల్లవి పాడిన పందిరిలో
సుందరమో... సుమధురమో...

అతడు చందురుడందిన చందన శీతలమో (Bit)

ఆమె మలయజ మారుత శీకరమో...మనసిజ రాగవశీకరమో...
సుందరమో... సుమధురమో...చందుడందిన చందన శీతలమో (Bit)

★★★

## మీకు తెలుసా?

ఇళయరాజా సంగీత దర్శకత్వం నిర్వహించిన అధికశాతం సినిమాలకు వేటూరి సుందరరామమూర్తే పాటలు రాశారు. వీరిరువురి పరిచయం 'అమావాస్య చంద్రుడు' (1981) చిత్రం ద్వారా జరిగింది. సింగీతం శ్రీనివాసరావు దర్శకత్వంలో కమలహాసన్, మాధవి జంటగా నటించిన ఈ చిత్రం తమిళంలో 'రాజాపార్వై' గా ఏకకాలంలో నిర్మించారు. తమిళ చిత్రానికి వైరముత్తు, తెలుగు విభాగానికి వేటూరి పాటలు రాశారు. వేటూరి మ్యూజిక్ సిట్టింగ్‌కు వెళ్లే సమయానికి ఇళయరాజా తమిళ పాటకు ట్యూన్ ఇవ్వడం, వైరముత్తు పల్లవి రాయడం జరిగిపోయింది. అవి ఇళయరాజా బాగా బిజీగా వున్న రోజులు. దర్శకుడు సింగీతం వేటూరిని ఇళయరాజాకు పరిచయం చేశారు. "వైరముత్తు వచ్చినపుడే యీ కవిగారు వస్తే బాగుండేదికదా. నేను చాలా బిజీగా వున్నాను. తమిళకవి ఇలా ట్యూన్ ఇవ్వగానే అలా పల్లవి రాసిచ్చాడు. ఇప్పటికే నాకు లేటయిం"దని పుల్లవిరుపుగా అనడం వేటూరికి కోపం తెప్పించింది. "నేనూ బిజీనే. అలా చెప్పుకోవడం పద్ధతికాదు. వస్తాను" అంటూ వేటూరి లేచి వెళ్లబోతే సింగీతం కల్పించుకొని ఇద్దరికి సర్దిచెప్పారు. ఇళయరాజాకు పరిస్థితి అర్థమైంది. వేటూరికి సారీ చెప్పి ట్యూన్ వినిపించారు. "ఇలా వినగానే తమిళకవి అలా రాసిచ్చా"రనే మాటలు వేటూరికి రోషాన్ని తెప్పించాయి. వెంటనే "పల్లవి రాసుకుంటారా" అన్నారు. ఇళయరాజా ఆశ్చర్యపోతూ "ఇప్పుడే చెప్పేస్తారా అయితే చెప్పండి" అన్నారు. వేటూరి ఆసువుగా పల్లవి చెప్పారు. అదే...

"సుందరమో... సుమధురమో... చందురుడందిన చందన శీతలమో
మలయజమారుత శీకరమో... మనసిజ రాగ వశీకరమో"

అనే పల్లవి. ఇళయరాజా అది పాడుకొని చూసి వేటూరిని అభినందిస్తూ "ఎంత మధురంగా వుంది. అందుకే సుబ్రహ్మణ్య భారతి మహాకవి సుందర తెలుగు అన్నా"రని ప్రశంసించారు. అలా ఇళయరాజా - వేటూరి స్నేహ బంధం బలపడి ఒకటిన్నర దశాబ్దం పాటు కొనసాగింది.

# అమావాస్యచంద్రుడు (1981)

రచన : వేటూరి గానం : బాలు

:::::: Opening Chord ::::::

పల్లవి (ఆలాపనతో) ఊ...ఉఉఊఊఊం...ఊఉఉఉఊంఉంఊం
ఆఅఆ...హా...రరరరరరర...రరరరరారర...
కళకే...కళయా... అందమూ...
ఏ కవీ...రాయనీ...తీయనీ...కావ్యమూ...
కళకే...కళయా... అందమూ...

:::::: BIT ::::::

చరణం నీలికురులు పోటీపడెనూ...మేఘమాలతో...
కోలకనులు పంతాలాడే...గండుమీన్ల(ల)తో
వదనమో...జలజమో...నుదురదీ ఫలకమో...
చెలి కంఠం పలికే శ్రీశంఖమో...
కళకే...కళయా... అందమూ...

:::::: BIT ::::::

చరణం పగడములను ఓడించినవీ...చిగురు ఎదవులూ..హాం...ఆఆఆ...
వరుసతీరి మెరిసే పళ్లూ...మల్లెతొడుగులూ...
చూపులో...తూపులో...చెంపలో...కెంపులో....
ఒక అందం తెరలో దోబూచులు
కళకే...కళయా...అందమూ...

:::::: BIT ::::::

చరణం తీగలాగ ఊగే నడుమూ...ఉండిలేనిదీ...
దానిమీద పుప్పొ పూచీ...నాభి ఉన్నదీ...
కరములో...కొమ్మలో...కాళ్లవీ...బోదెలో...
ఈ రూపం...ఇలలో...అపురూపము....
కళకే...కళయా... అందమూ...

★★★

## సీతాకోకచిలక (1982)

రచన : **వేటూరి** గానం : **బాలు, శైలజ**

బృందం *ఓం... శతమానం భవతి శతాయుః పురుషశ్శతేంద్రియః*
*ఆయుష్యేవేంద్రియే ప్రతితిష్ఠతీ...*

బృందం ఓ... ఓ... ఓ...ఒఒఓ...ఒఒఓ... (Long Bit)

పల్లవి

ఆమె మాటే మంత్రమూ (Bit) మనసే బంధమూ (Bit)
ఈ మమతే... ఈ సమతే ... మంగళవాద్యమూ
ఇది కల్యాణం... కమనీయం... జీవితం

అతడు ఓ... మాటే మంత్రమూ... మనసే బంధమూ (Bit)
ఈ మమతే... ఈ సమతే... మంగళవాద్యమూ
ఇది కల్యాణం... కమనీయం.... జీవితం

ఆమె ఆ.... ఓ... ఓ... మాటే మంత్రమూ...

అతడు మనసే బంధమూ...

:::::: BIT ::::::

చరణం

బృదం లలలల లాలలల...(Bit) లలలల లలలల (Bit)
లాలలాల...లాలలాల...లాలలాల...లాలలాల... (Bit)

అతడు నీవే... నాలో స్పందించిన...
ఈ ప్రియలయలో శ్రుతికలిసే ప్రాణమిదే...

ఆమె నేనే నీవుగా..(Bit) పువ్వూ తావిగా (Bit)
సంయోగాల సంగీతాలు విరిసే వేళలో..

అతడు మాటే మంత్రమూ... మనసే బంధమూ

ఆమె ఈ మమతే... ఈ సమతే... మంగళవాద్యమూ

అతడు ఇది కల్యాణం... కమనీయం... జీవితం...

ఆమె ఓ... ఓ... మాటే మంత్రమూ...

అతడు మనసే బంధమూ...

Contd...

బృందం　లలలల లాలలా లలా....లలలల లలలా...
లాలలాలలా...లలలలలా...లలలలలా (హమ్మింగ్)

:::::: BIT ::::::

చరణం

ఆమె　నేనే... నీవై ప్రేమించినా...
ఈ అనురాగం పలికించే పల్లవిదే ...

అతడు　ఎదనాకోవెలా (Bit) ఎదుటే దేవతా (Bit)
వలపై వచ్చి... వరమేయిచ్చి కలిసే వేళలో

ఆమె　మాటే మంత్రమూ (Bit) మనసే బంధమూ (Bit)

అతడు　ఈ మమతే... ఈ సమతే... మంగళవాద్యమూ...

ఆమె　ఇది కల్యాణం... కమనీయం... జీవితం

ఇద్దరు　ఓఓ... లాలాలాలలా... లాలాలాలలా...
ఊహు హూహుహూ... ఊహూహూహుహూ

★★★



# సీతాకోకచిలుక (1982)

రచన : **వేటూరి** గానం : **బాలు, సుశీల**

:::::: Opening Music ::::::

పల్లవి

అతడు సాగర సంగమమే... ప్రణయ... సాగర సంగమమే (Bit) ॥ 2 ॥
కలలే అలలై ఎగసిన కడలికి ॥ 2 ॥
కలలో... (Bit) ఇలలో (Bit) కలలో, ఇలలో దొరకని కలయిక
సాగర సంగమమే ప్రణయ... సాగర సంగమమే

:::::: BIT ::::::

చరణం

అతడు కన్యాకుమారీ నీపదములు నేనే – ఆఆఆఆ.. ఆఆఆఆ.. ఆఆఆఆ..ఆఆఆ..
కన్యాకుమారీ నీపదములు నేనే – కడలి కెరటమై కడిగిన వేళ
సుమసుకుమారీ నీచూపులకే – తడబడి వరములు అడిగిన వేళా (Gap)

ఆమె అలిగిన నాకొల అలకలు నీలో పులకలు రేపి
పువ్వులు విసిరిన పున్నమి రాతిరి నవ్విన వేళా... సాగర

అతడు సంగమమే...

ఆమె ప్రణయా...

అతడు సాగర సంగమమే

:::::: BIT ::::::

చరణం

అతడు అఆఆ.. (Bit) అఆఆ.. (Bit) ఆఆఆ.. (Long Bit)
భారతభారతి పదసన్నిధిలో–కులమత సాగర సంగమ శ్రుతిలో
నా రతి నీవని వలపుల హారతి–హృదయము ప్రమిదగ వెలిగిన వేళా...

ఆమె పరువపు ఉరవడి పరువిడి నీఒడి కన్నుల నీరిడి
కలసిన మనసున సందెలు కుంకుమ చిందిన వేళా...

అతడు సాగర సంగమమే

ఆమె ప్రణయా... సాగర సంగమమే

ఇద్దరు సాగర సంగమమే

★★★

## సీతాకోకచిలుక (1982)

రచన : **వేటూరి** గానం : **ఇళయరాజా, వాణీ జయరాం**

ఆలాపన

ఆమె సాగామాపానీసా... సానీపామాగాసా..
మమపా పపపా... గమప గమగసా ...
నినిసాసస గగసాసస... నీ సగాగ మమపా...
సాసనీనీ పాపమామ గాగసాసనీస

పల్లవి

అతడు } అలలు కలలు ఎగసి ఎగసి అలసి సొలసి పోయే
ఆమె } ససస నినిని పపప మమమ గగగ ససస నినిసా (సమాంతరంగా)
అతడు } పగలు రేయి ఒరిసి మెరిసే సంధ్యారాగంలో
ఆమె } పగపా పపపా మమపాపపపా పని సనిపద నిపమాగా(సమాంతరంగా)
ప్రాణం ప్రాణం కలిసీ విరిసే జీవన రాగంలో .... (Long Bit)
తనన నన నన నన తనన నన నాన
అలలు కలలు ఎగసి ఎగసి అలసి సొలసి పోయే
పగలు రేయి ఒరిసి మెరిసే సంధ్యారాగంలో (Bit)
ప్రాణం ప్రాణం కలిసీ విరిసే జీవనరాగంలో (Bit)
అలలు కలలు ఎగసి ఎగసి అలసి సొలసి పోయే
తనన నన నన నన తనన నన నాన

అతడు తకథోం తకథోం తకథోం తకథోం తకతకతకథోం (Bit)
ఆమె తకథోం తకథోం తకథోం తకథోం తకతకతకథోం (Bit)
అతడు తకథోం తకథోం తకథోం తకథోం
ఆమె తకథోం తకథోం తకథోం తకథోం

:::::: **BIT** ::::::

చరణం

ఆమె నీ చిరునవ్వుల సిరిమువ్వల సవ్వడి వింటే...
ఆ.. ఆ.. అ.. అ.. అ.. అ.. అ.. అ..ఆ..అ..ఆ..అ.. ఆఅహా..
నీ చిరునవ్వుల సిరిమువ్వల సవ్వడి వింటే
ఆ సందడి విని డెందము కిటికీలు తెరుచుకుంటే..(Bit)
నీ కిలుకుమనే కులుకులకే కలికి వెన్నెల చిలికే (Bit)
నీ జడలో గులాబికని మల్లెలెర్రబడి అలిగే
నువు పట్టుచీర కడితే ఓ పుత్తడి బొమ్మా
ఆ కట్టుబడికి తరించేను పట్టుపురుగు జన్మ...నా పుత్తడి బొమ్మా
అలలు కలలు ఎగసి ఎగసి అలసి సొలసి పోయే..

★★★

## సీతాకోకచిలక (1982)

రచన : **వేటూరి** గానం : **బాలు, వాణీ జయరాం, బృందం**

:::::: Opening Music :::::: **(చప్పట్లతో)**

పల్లవి

బృందం ఓ...తందనాన...తందనాననాన తందనాననాన తందనాననాన

ఆమె ఆఆఆఆ... ఆఆఆఅ... ఆఆఆఆఆఆఆ

బృందం తందనాన

ఆమె ఆఆఆఆఆ.. ఆఆఆఅ.. ఆఆఆఆఆఆఆ

బృందం తందనాన (Bit)

ఆమె మిన్నేటి సూరీడు వచ్చేనమ్మా...
పల్లె కోనేటి తామర్లు విచ్చేనమ్మా

బృందం మిన్నేటి సూరీడు వచ్చేనమ్మా...
పల్లె కోనేటి తామర్లు విచ్చేనమ్మా

ఆమె అందమైన రంగవల్లులై
ఎండలన్ని పూలజల్లులై ముద్దుకే పొద్దుపొడిచి

బృందం మిన్నేటి సూరీడు వచ్చేనమ్మా...పల్లె కోనేటి తామర్లు విచ్చేనమ్మా

:::::: **BIT** ::::::

చరణం

అతడు ఓ.... చుక్కా నవ్వవే (Bit) వేగులచుక్కా నవ్వవే (Bit)
కంటి కోలాటాలా జంట పేరంటాలా

ఆమె ఓ.... చుక్కా నవ్వవే.. (Bit) నావకు చుక్కా నవ్వవే (Bit)
పొందు ఆరాటాలా.. పొంగు పోరాటాలా

అతడు మొగ్గ తుంచుకుంటే మొగమాటాలా...

ఆమె బుగ్గ దాచుకుంటే బులపాటాలా...

అతడు దప్పికంటె తీర్చడానికిన్ని తంటాలా...

బృందం మిన్నేటి సూరీడు వచ్చేనమ్మా
పల్లె కోనేటి తామర్లు విచ్చేనమ్మా } ॥2॥

:::::: **BIT** :::::: Contd...

చరణం

బృందం ఈ..ఆ..ఆ..ఆఆఆ...ఆఆఆ...ఆఆఆ...ఆఆఆ...ఆఆఆ...

అతడు ఓ..రామచిలకా (Bit) చిక్కని ప్రేమమొలకా (Bit)
గూడు ఏమందమ్మా...ఈడు ఏమందమ్మా

ఆమె ఈదుకున్న గోదు నువ్వే గోరింకా..
తోడుగుండి పోవే కంటినీరింకా..

అతడు పువ్వునుంచి నవ్వులూ తుంచలేరులే ఇంకా...

బృందం మిన్నేటి సూరీడు

ఆమె లాలాలాలా

బృందం మిన్నేటి సూరీడు

ఆమె లాలలాల...లాలాలా...లాలల

బృందం మిన్నేటి సూరీడు వచ్చేనమ్మా...
పల్లె కోనేటి తామర్లు విచ్చేనమ్మా

ఆమె అందమైన రంగవల్లులై...
ఎండలన్ని పూలజల్లులై ... ముద్దుకే పొద్దుపొడిచి

బృందం మిన్నేటి సూరీడు వచ్చేనమ్మా...
పల్లె కోనేటి తామర్లు విచ్చేనమ్మా

★★★



## వసంతకోకిల (1982)

రచన : **గోపి** గానం : **బాలు**

:::::: Opening Music ::::::

పల్లవి

ఈలోకం... (Bit) అతిపచ్చన... (Bit) తోడుంటే (Bit) నీ పక్కనా (Bit)
ఎదలో... ఎదగా మసలే మనసుంటే...
జతగా... నడిచే మనిషుంటే...
ఈలోకం (Bit) అతిపచ్చన... (Bit) తోడుంటే (Bit) నీ పక్కనా (Bit)

:::::: BIT ::::::

చరణం

ప్రేమకులేదూ... వేరే అర్థం ॥2॥
ప్రేమకు ప్రేమే పరమార్థం ॥2॥
ప్రేమించు... ఆప్రేమకై... జీవించూ...
నవ్వుతూ... నవ్వించూ...
ఈలోకం (Bit) అతిపచ్చన... (Bit) తోడుంటే (Bit) నీ పక్కనా (Bit)
ఎదలో... ఎదగా మసలే మనసుంటే...
జతగా... నడిచే మనిషుంటే...
ఈలోకం (Bit) అతిపచ్చన... (Bit) తోడుంటే (Bit) నీ పక్కనా (Bit)

:::::: BIT ::::::

చరణం

ప్రతినదిలోనూ... అలలుంటాయీ (Bit) ॥2॥
ప్రతి ఎదలోనూ... కలలుంటాయీ ॥2॥
ఏకలలు... ఫలియించునో... శ్రుతిమించునో...
కాలమే చెబుతుందీ...
ఈలోకం (Bit) అతిపచ్చన... (Bit) తోడుంటే (Bit) నీ పక్కనా (Bit)
ఎదలో... ఎదగా మసలే మనసుంటే...
జతగా... నడిచే మనిషుంటే...
ఈలోకం (Bit) అతిపచ్చన... (Bit) తోడుంటే (Bit) నీ పక్కనా (Bit)

★★★

## వసంతకోకిల (1982)

రచన : **గోపి** గానం : **జానకి**

పల్లవి

ఊరించే...వయసిదీ...లాలించే మనసిదీ...
రేయంతా మేలుకొన్నదీ...పగలంతా కలలు కన్నదీ ॥2॥
నీ కోసమే...తననా...నననా...నననా...

:::::: BIT ::::::

చరణం

రేపవలు ఒంటరితనమూ...కనుమూయనీయదూ... (Bit)
పడకింట నీదే తలపూ...ఘడియాగనీయదూ...(Bit)
రవ్వంత జాలితో..కరుణించవా...హా..
ఈ రాగవీణనూ...పలికించవా..
బదులేదిరా...తననా...నననా...నననా..
ఊరించే...వయసిదీ...లాలించే మనసిదీ...
రేయంతా మేలుకొన్నదీ...పగలంతా కలలు కన్నదీ...
నీ కోసమే...తరరూ...తురురూ...తురురూ...

:::::: BIT ::::::

చరణం

కోరికలు తారకలైతే.. మనిషి బ్రతుకెందుకురా...(Bit)
కోరింది తీరకపోతే...బ్రతికి ఫలమేమిటిరా...(Bit)
ఏ పూవు పూచినా...జత మాలకే..
నేనేమి చేసినా...నీ పొందుకే..
బదులేదిరా...తరరా...తరరా..తరరా..
ఊరించే...వయసిదీ...లాలించే మనసిదీ...
రేయంతా మేలుకొన్నదీ...పగలంతా కలలు కన్నదీ...
నీ కోసమే...తననా...నననా...నననా...

★★★

## వసంత కోకిల (1982)

రచన : **గోపి** గానం : **బాలు**

:::::: Opening Music ::::::

పల్లవి కథగా కల్పనగా కనిపించెను నాకొక దొరసానీ (Bit) ॥2॥
నా మదిలోనీ పాటగా... ఆమని విరిసే తోటగా
లాలీలాలో (Bit) జో... లాలీలో (Bit) ॥2॥
కథగా కల్పనగా కనిపించెను నాకొక దొరసానీ

:::::: **BIT** ::::::

చరణం మోసం తెలియని లోకం మనదీ.... (Bit)
తీయగ సాగే రాగం మనదీ (Bit)
ఎందుకు కలిపాడో... బొమ్మలను నడిపే వాడెవడో (Bit)
నీకూ నాకూ సరిజోడనీ... కలలోనైన విడరాదనీ
కథగా కల్పనగా కనిపించెను నాకొక దొరసానీ (Bit)
నా మదిలోనీ పాటగా... ఆమని విరిసే తోటగా
లాలీలాలో (Bit) జో... లాలీలో (Bit) ॥2॥

:::::: **BIT** ::::::

చరణం కారడవులలో కనిపించావూ.... (Bit)
నామనసేమో కదిలించావూ... (Bit)
గుడిలో పూజారై... నా హృదయం నీకై పరిచానూ (Bit)
ఈ అనుబంధమేజన్మదీ... ఉంటే చాలు నీ సన్నిధీ
కథగా కల్పనగా కనిపించెను నాకొక దొరసానీ (Bit)
నా మదిలోనీ పాటగా... ఆమని విరిసే తోటగా
లాలీలాలో (Bit) జో... లాలీలో (Bit) ॥4॥

★★★

## అమర గీతం (1982)

రచన : వేటూరి　　　　　　　　　　　　　　గానం : బాలు

సాకీ　నెలరాజా... (Bit) పరుగిడకూ... (Bit) చెలివేచే... (Bit) నాకొరకూ... (Bit)
ఒక్కమారు పోయీ... చెలిని గాంచుమా... (Bit)
నివేదించుమా... (Bit) విరహమే...

పల్లవి　నెలరాజా... పరుగిడకూ... చెలివేచే... నాకొరకూ...
ఒక్క మారు పోయీ... చెలిని గాంచుమా ... (Bit)
నివేదించుమా... విరహమె...
నెలరాజా... పరుగిడకూ... చెలివేచే... నాకొరకూ

:::::: BIT ::::::

చరణం　మబ్బులలో తళుకుమనే మెరుపేలే చెలి అందం
ముచ్చటగా ముత్యంలా మెరిసిపడే సఖి పరువం　॥2॥
వాడి పోనిదీ... వనిత యవ్వనం...ఆడిపాడితే... కనుల నందనం
అణువణువూ విరిసేలే లావణ్యం (Bit)
నెలరాజా... పరుగిడకూ...
ఒక్కమారు పోయీ... చెలిని గాంచుమా...
నివేదించుమా... విరహమె... నెలరాజా... పరుగిడకూ...

:::::: BIT ::::::

చరణం　ముంగిటనే రాచిలుకా పలికేనూ స్వాగతము
మురిపెంగా తమరాకా నా చెలితో తెలిపేనూ　॥2॥
కొండవాగులా... మల్లెతీగెలా... పులకరించినా... సన్నజాజిలా...
విరహిణిలా వేచేనూ... జవరాలే (Bit)
నెలరాజా... పరుగిడకూ.. చెలివేచే... నాకొరకూ
ఒక్కమారు పోయీ... చెలిని గాంచుమా...
నివేదించుమా... విరహమె...నెలరాజా... పరుగిడకూ...

(Followup Music)

★★★

## అమరగీతం (1982)

రచన : **వేటూరి** గానం : **బాలు**

పల్లవి (ఆలాపనతో) ఆ..ఆ..ఆ..ఆ..ఆ..ఆ..ఆ..
నాదరూప గానమునకు రసభంగమో.. ॥2॥
ముదమగు నాదరూప గానమునకు రసభంగమో...
ప్రకృతికే ఇంత ఆగ్రహమా...ఇందరిలో నాకపజయమా...
స్వర నాదరూప గానమునకు రసభంగమో...
ముదమగు నాదరూప గానమునకు రసభంగమో...

:::::: BIT ::::::

చరణం పాటకు నాసర్వం అంకితమూ..
పొంగును అణువణువే పరవశమూ.. (Bit) ॥2॥
మనసు మురిపించు...సుధలు కురిపించు...మధుర సంగీతమూ...॥2॥
దేవి గుడిలోన...ప్రజల సముఖాన....కమ్మని తేనెల సోనలు కురిసే
నాదరూప గానమునకు రసభంగమో..
ముదమగు నాదరూప గానమునకు రసభంగమో...

:::::: BIT ::::::

చరణం ఆనందరాగావేశం...మదిలో పొంగ...ఆ రమ్య గానామృతం ఊరించంగ..
పాటకు లోకం పులకించంగ... మధురస ఝరిలో దోగాడంగ... ॥2॥
అంకితమౌను...అమ్మకి నేడు..కమ్మని ఈ గీతం...
త్యాగరాజు హృదయంలాగా...జయదేవుని కావ్యంలాగా...॥2॥
ముక్తిసాధనం...రసనివేదనం...తరులు గిరులు పులకరించు
నాదవేద సారమైన గానమిది..సుమధురనాదవేదసారమైన గానమిదీ..
గానమె నాకు జీవనమే..నా బ్రతుకునకది నందనమే..
స్వర నాద వేదసారమైన గానమిదీ...
సుమధుర నాద వేదసారమైన గానమిదీ...

★★★

## అమరగీతం (1982)

రచన : వేటూరి	గానం: బాలు

పల్లవి (ఆలాపనతో) ఆఆఆఅఅఆ...ఆఆఅఅఆఆ...అఆఆ...ఆఆఆఆ
కోటి కవితలె ఆలపించును...పాట పరవశమూ...(Bit)
కొంటెవలపుల...జుంటితేనెల...చిందు రసజగమూ...(Bit)
నీ ఎదలో స్నేహం...నా మదిలో రాగం...
రవళించు కల్యాణ సంగీతమూ...
కోటి కవితలె ఆలపించును...పాట పరవశమూ...

:::::: BIT ::::::

చరణం ఊగిపోవు హృదయానా..ఊరించు మోహం.. (Bit)
కళలొలికే...నాచెలి వదనం (Bit)
కన్నులందు కురిసేనూ..ఆనందమేఘం... (Bit)
అమృతమే..చిందే అధరం...(Bit)
విరిసినదీ...హరివిల్లులా...నాకవితా...శాకుంతలా...
నడకలో హంసలే తడబడును..నవ్వుల..పువ్వుల ముత్యాలె రువ్వేను
కోటి కవితలె ఆలపించును...పాట పరవశమూ...(Bit)
నీ ఎదలో స్నేహం...నా మదిలో రాగం...
రవళించు కల్యాణ సంగీతమూ...

:::::: BIT ::::::

చరణం భామ నవ్వు మురిపించే...కమ్మనైన వేదం...(Bit)
పలుకులలో...మురళీనాదం (Bit)
ఆ గాన మాధురియే..శంకరాభరణం...(Bit)
ఆ పలుకే...మోహనరాగం...(Bit)
అడుగులలో...హంసధ్వనీ...అలరించే...శివరంజనీ..
భూమిపై వెలసిన కల్యాణి...అమృతవర్షిణి నారాణి కీర్వాణి
కోటి కవితలె ఆలపించును...పాట పరవశమూ (Bit)
కొంటె వలపుల...జుంటితేనెల...చిందు రసజగమూ (Bit)
నీ ఎదలో స్నేహం...నా మదిలో రాగం...
రవళించు కల్యాణ సంగీతమూ...
కోటి కవితలె ఆలపించును...పాట పరవశమూ...(Bit)

★★★

# అమరగీతం (1982)

రచన : **వేటూరి** గానం: **బాలు, జానకి**

:::::: Opening Music ::::::

పల్లవి

ఆమె మదిలోన నిన్ను తలచి హృదయాన కోరి పిలిచీ...
నీ దరికి చేరువేళా..కోశాను జాజిపూలే...
నా ఎదుటనే..గుడిముందరే...ఆపూలు చెదరిపోయే...
ఊఊఊ...మదిలోన నిన్ను తలచీ....హృదయాన కోరి పిలిచీ

:::::: BIT ::::::

చరణం

అతడు రాగమురళి పాటేవింటే...రాధ మనసు ఆగేనా...
చెంతచేరి ఆదరాన ఆ..(దగ్గు) పలుకరించదో (దగ్గు)
ఆమె రాగమురళి పాటేవింటే...రాధ మనసు ఆగేనా...
చెంతచేరి ఆదరానా...పలుకరింపదో...
అతడు రాధ వినని ఈ...ఈగానం...అడవిలో వసంతమూ...
బ్రతుకె భారమూ...అంధకారమూ...
మదిలోన నిన్ను తలచీ...హృదయాన కోరి పిలిచీ...

:::::: BIT ::::::

చరణం

అతడు మధురమైన భావంతోటే...(దగ్గు) మురళిపాట సాగేనా (దగ్గు)
రాధమనసు మూగైపోతే...(దగ్గు)...
ఆమె మధురమైన భావంతోటే...మురళిపాట సాగేనా..
అతడు రాధమనసు మూగైపోతే..రక్తిగుడేనా...
ఆమె కలల మనసు గాయమైతే...
అతడు కాలం అది మాన్పుతుందీ...
ఈ వియోగమూ...ఎంతకాలమూ...
ఆమె ఆఆఆ...మదిలోన నిన్ను తలచీ...
అతడు హృదయాన కోరి పిలిచీ..
ఆమె నీ దరికి చేరువేళా..
అతడు కోశాను జాజిపూలే
ఆమె నా ఎదుటనే..గుడిముందరే...ఆపూలు చెదరిపోయే...
అతడు ఊఊఊ...మదిలోన నిన్ను తలచీ....హృదయాన కోరి పిలిచీ

★★★

## అమరగీతం (1982)

రచన : వేటూరి                                                    గానం : బాలు

:::::: Opening Chord ::::::

పల్లవి   వేదనగా...విధి శోధనగా...మిగిలే వలపే ఓ కలగా ॥2॥
నీ అనురాగాల...మధురిమలే...రగిలెను నాలో గురుతులుగా
వేదనగా...విధి శోధనగా...మిగిలే వలపే ఓ కలగా..

:::::: BIT ::::::

చరణం   నీ చూపే..నాకో జ్యోతీ..నీ తలపే...ఎదలో గీతీ...(Bit)
తొలి చెలిమే...వరమై తోచే...ప్రతిక్షణమే బరువై నిలిచే (Bit)
మరి ఒక జన్మం నాకిమ్మనీ..ప్రణయంలోనా గెలుపిమ్మనీ
నీకై దేవుని వేదగనే...ఆఆఆ...ఆఆ..
వేదనగా...విధి శోధనగా..మిగిలే వలపే ఓ కలగా

:::::: BIT ::::::

చరణం   ఆశలు బాసలు అలరించే...ఆగని ఊహలు మురిపించే
ఆడుతు పాడుతు చేరానే...శిలలే నీలో రువ్వానే
తలపులు చెదరిన అలలాయే...ఇరువురి కలలు కథలాయే
కాలము త్వరగా రాదాయే...ఆఆఆ...ఆఆ...ఆఆఆ...
వేదనగా...విధి శోధనగా..మిగిలే వలపే ఓ కలగా...
నీ అనురాగాల...మధురిమలే...రగిలెను నాలో గురుతులుగా...
వేదనగా...విధి శోధనగా...మిగిలే వలపే ఓ కలగా..

★ ★ ★

### మనసులో మాట

ఇళయరాజా అంటూ అందరూ నన్ను గొప్పగా చూస్తారు. అలా చేసే వాళ్లకు బాగానే ఉంటుంది. మరి నన్ను నేను కూడా అలాగే చూసుకోమంటారా ? నేనెవరో నాకు తెలుసు. నా ప్రయాణం ఎక్కడ నుండి మొదలైందో నాకు తెలుసు. నేను గొప్పవాడ్జని నాకు నేను చెప్పుకోవడం నచ్చదు.   – ఇళయరాజా

## టిక్... టిక్... టిక్... (1982)

రచన : ఆచార్య ఆత్రేయ
గానం : బాలు, జానకి, T.V. గోపాల కృష్ణన్

(సరిగమల ఆలాపనతో Opening )

పల్లవి

ఆమె ఓ నటనమయూరీ వయ్యారీ... ఓ నటనమయూరీ వయ్యారీ...
నడయాడే నీపాదం... శ్రీపాదం ॥2॥
నడకలూ... కులుకులే నీ నాట్యం...
అతడు సగరిగమ పదనిస
ఆమె ఓ... సిరిసిరి మువ్వల చిన్నారీ...
అతడు I Love You... I Love You... I Love You... ॥2॥
ఆమె అభినయం... అనునయం... నీ అందం
అతడు సగరిగమ పదనిస

:::::: BIT ::::::

చరణం

అతడు నీ చిలిపి కోపం... (Bit) నా... వలపు దీపం (Bit)
నీ నటన వేగం... (Bit) నా... నయన రాగం (Bit)
ఆమె అదోముద్దు అదో మత్తు నీకు... అదే నువ్వు అదే నవ్వు నాకు (Bit)
అతడు ఇదే అగ్ని ఇదే జ్వాల నాకు... ఇదే లీల ఇదే హేల నీకు
వెలైతినీ నేను నిదురకు... బలైతినీ నీదు సొగసుకు
నీ గడపకు తోరణముగ నేనుండిన చాలంటిని...సనిదపమపదని
ఆమె నా... అడుగుల మడుగుల చెలికాడా

:::::: BIT ::::::

చరణం

ఆమె లలాలలాలలాలలాలాలాలా ... లలాల లాలలాల లాల ॥2॥ (Long Bit)
అతడు నీ... పెదవిపైన (Bit) నా ప్రేమరచన (Bit)
ఆమె నీ... మనసులోన (Bit) నా మమతవాన (Bit)
అతడు ఒకే కోవెలోకే దేవి నాకు...ఒకే పువ్వు ఒకే పూజ నీకు (Bit)
అతడు ఒకే జపము ఒకేతపము నీకు...ఒకే వరము ఒకే యుగము నాకు

Contd...

| | |
|---|---|
| అతడు | తపించితీ నిన్నుపొందక |
| ఆమె | వరించితీ నీకు అందక... |
| అతడు | నా హృదయము... |
| ఆమె | నా జన్మము... |
| అతడు | నీ పరమని... |
| ఆమె | నీ వశమని... |
| అతడు | సనిదపమపదని.... ఓ...నటన మయూరీ వయ్యారీ (Bit) |
| | I Love You... I Love You... I Love You... ॥2॥ |
| | నడకలు... కులుకులే నీ నాట్యం... |
| | సగరిగమ పదని... ఓ నటన మయూరీ వయ్యారీ... |

★★★



## టిక్ టిక్ టిక్ (1982)

రచన : ఆచార్య ఆత్రేయ  గానం: ఇళయరాజా, జానకి, బృందం

(ఆలాపనతో)

పల్లవి

బృందం  లాలా...లాలా...లాలాలలలల..లాలలలా...లాలా..లాలా...లాలా
లలలలలాలా...॥2॥  (Long Bit)

ఆమె  ఇది ఒక మరోలోకం...ఇది ఒక మనోవేదం...॥2॥
తీరిపోదూ...(Bit) తీపిదాహం...(Bit) హే...
ఆరిపోదూ...(Bit) లోని తాపం (Bit)
పరువమే...లేడి పరుగూ..ప్రణయమే..లేత వెలుగూ
ఇది ఒక మరోలోకం...ఇది ఒక మనోవేదం...

:::::: BIT ::::::

చరణం

అతడు  ఆ...నాదిరిదానా...ధిరనన...ధిరనన...ధిరనన..
నాదిరిదానా..నానా (Bit) ॥2॥
నాదిరిదానా..నాదిరిదానా..నాదిరిదానా..నాదిరిదానా..
నాదిరిదానా..నాదిరిదానా..నాదిరిదానా..దిరిదానా..దిరిదానా..
నాదిరిదానా..నాదిరి..దదదదదదదద...
నాదిరిదిరిదిరి...నాదిరిదిరిదిరి...నాదిరిదిరిదిరి...నాదిరిదిరిదిరి
నాదిరిదిరి దిరిదిరిన దిరిదిరిన దిరిదిరిన...దిరిదిరిన..

ఆమె  వాన వస్తేనే...వరద వస్తుందీ...
వలపు పుడితేనే...హే...మలుపు వస్తుందీ... } ॥2॥
తోడు ఉండీ తేనెటీగ రాకకోసం...ఓఓఓఓ...
నేను వున్నా...నాకు తగిన తోడుకోసం..ఓఓ...
తోడు వుంటే...దోరవయసే...సొంతమౌతుంది...
ఇది ఒక మరోలోకం...ఇది ఒక మనోవేదం...

:::::: BIT ::::::

Contd...

చరణం

ఆమె లాలల..లాలల..లా..లా..లా..లా..ననన ననననన...
నా...నన...నా...నన...(Long Bit)
లేని వంపుల్లో...ఉన్న సొంపుల్లో... } ॥2॥
కన్నె బుగ్గల్లో..హోయ్..ఉన్న కెంపుల్లో...
వాడిపోనీ...వన్నెలన్ని వలపు పొంగై...ఓఓఓఓ...
ఏడురంగుల ఇంద్రధనసె కోటిరంగై...ఓఓ...
ఊగుతున్నా నడుముచుట్టే భూమి చుడుతుంది... (Bit)
ఇది ఒక మరోలోకం (Bit)...ఇది ఒక మనోవేదం..(Bit)
తీరిపోదూ...(Bit) తీపిదాహం...(Bit)
ఆరిపోదూ...(Bit) లోని తాపం (Bit)
పరువమే...లేడి పరుగూ..ప్రణయమే..లేత వెలుగూ
ఇది ఒక మరోలోకం...ఇది ఒక మనోవేదం...

★★★

2000 666
CREATIVE COMMERCIALS
TICK TICK TICK
(TELUGU)
Music: Ilaiyaraja
Lyric: Athreya
SIDE ONE
OH NATANA MAYURI
S. Janaki, S. P. Balasubrahmanyam & Gopalakrishnan
SIDE TWO
IDI MAROLOKAM
S. Janaki
ILAIYARAJA (Music)
ATHREYA (Lyric)
P 1982
AVM
45 R.P.M. EXTD. PLAY
PRODUCED BY
AVM MUSIC SERVICE
MADRAS-600 026

## మధురగీతం (1982)

రచన : **రాజశ్రీ** గానం : **బాలు, బృందం**

Opening Music

పల్లవి

అతడు కొండగాలి తిరిగే...తొలి ఊహలన్ని పెరిగే...
మకరందం కురిసేనూ...ఆనందం తెలిపేనూ..
చెలరేగె గానమే... (బృందం : ఆఆఆ...)
సరదాల జీవితం.... (బృందం : ఆఆఆ)
నవ్వులే పల్లవించెనే... (బృందం : లలలలలలా)
మురిపాలు పొంగెనే... (బృందం : లలలలలలా)
కొండగాలి తిరిగే...తొలి ఊహలన్ని పెరిగే...

:::::: BIT ::::::

చరణం

బృందం లాలాలలాలా...లలల లాలాలలాలా (Bit)... లాలాలలాలాలలాలాలా..
లలలాలాలలా...లలలాలాలలా...లలలాలాలలా...(Long Bit)

అతడు విను వీధుల్లో...మేఘంకదిలీ...తేలియాడెనే...
విరిసే...మెరిసే...పూవుల హృదయం కలసిపాడెనే..
తలపులన్నీ..పలకరించే...కవితలన్నీ మదిపూరించే...
ఇది రాగ పూరితం...ఊరించు ఈ క్షణం..
నవ్వులే పల్లవించెనే... (బృందం : లలలలలలా)
మురిపాలు పొంగెనే... (బృందం : లలలలలలా)
కొండగాలి తిరిగే...తొలి ఊహలన్ని పెరిగే...

:::::: BIT ::::::

చరణం

బృందం లలలా...లాలలాలా..లలలలాలాలా లాలాలా...
లాలాలా...లాలాలా...లలల లాలాలలాలాల లాలాల లాలాలా...

అతడు ఏదో తెలిసీ..తెలియని బంధం...సాగిరేగెనే...
ఆశలు చిలికే ఉరికే మనసే...చిందులేసెనే..
కమ్మని కలలే...పన్నీరొలికే..ముద్దుల కథలే నసులాలించే..

Contd...

ఈ తీపి పాటలే...అందాల బాటలే..
నవ్వులే పల్లవించెనే... (బృందం : లలలలలలా)
మురిపాలు పొంగెనే... (బృందం : లలలలలలా)
కొండగాలి తిరిగే...తొలి ఊహలన్ని పెరిగే...
మకరందం కురిసేనూ...ఆనందం తెలిపేనూ..
చెలరేగె గానమే... (బృందం : ఆఆఆ...)
సరదాల జీవితం.... (బృందం : ఆఆఆ)
నవ్వులే పల్లవించెనే... (బృందం : లలలలలలా)
మురిపాలు పొంగెనే... (బృందం : లలలలలలా)
కొండగాలి తిరిగే...తొలి ఊహలన్ని పెరిగే...

★★★



# మధురగీతం (1982)

రచన : **రాజశ్రీ** గానం : **సుశీల**

:::::: Opening Music ::::::

పల్లవి ఆనందరాగం..కోరే ప్రాయం... ॥2॥
నీ నవ్వులో (Bit) విరులే తోచెనే... (Bit)
ఈక్షణం (Bit) యవ్వనం (Bit) నీకోసం పాడేనే
ఆనందరాగం...కోరే ప్రాయం...

:::::: **BIT** ::::::

చరణం అదరిన కలలలో ముసిరిన కథలలో
ఊగే...రేగే...తీయని తీరని కోరికలే...(Bit)
విరిసిన మల్లెలలో...పరచిన వెన్నెలలో...
ఏవో... తోచే ...అచ్చట ముచ్చటలెరుకలే (Bit)
తొలకరి వన్నెల పందిరిలో...గడసరి కన్నుల వాకిటలో...
ఆశలు తీరా...బాసలు తీరా...ఆడాలీ...పాడాలీ...
ఆనందరాగం...కోరే ప్రాయం...
లాలాలలాలా...లాలాలాలా...

:::::: **BIT** ::::::

చరణం అలిగిన దీపములే...కలిపిన బంధములే...
నాలో...నీలో...చేసెను...రేపెను సందడులే (Bit)
చెరగని స్నేహములే...తరగని మోహములే...
నన్నూ...నిన్నూ...పొందిన అల్లరి చేసెనులే... (Bit)
మనసున రాగము పూచినది... పరువము నీపై వీచినదీ...
నీ జతలోనా..మైమరచేనా..నీనీదై...నీతోడై...
ఆనందరాగం..కోరే ప్రాయం...
నీ నవ్వులో (Bit) విరులే తోచెనే... (Bit)
ఈక్షణం (Bit) యవ్వనం (Bit) నీకోసం పాడేనే
ఆనందరాగం...కోరే ప్రాయం...
లాలాలలాలా..లాలాలాలా...

★★★

# మధురగీతం (1982)

రచన : **రాజశ్రీ** గానం : **బాలు, జానకి, బృందం**

:: Opening Music ::

పల్లవి

బృందం ఆ..ఆ..ఆ..ఆ...ఆఆఆ...ఆఆఆ...ఆ...
అతడు నవ్వులలోన... బృందం : ఆఆఆ..ఆఆఆ..ఆఆఆ..ఆఆఆ..ఆ
అతడు పువ్వులవాన... బృందం : ఆఆఆ..ఆఆఆ..ఆఆఆ..ఆఆఆ..ఆ
అతడు నవ్వులలోన....పువ్వులవాన...
నీలో చిలికింది వయసు...నాలో ఉరికింది మనసు
భావం నవరాగాలే...కదలాడే శుభయోగాలే
నవ్వులలోన... బృందం : ఆఆఆ..ఆఆఆ..ఆఆఆ..ఆఆఆ..
పువ్వులవాన... బృందం : ఆఆఆ..ఆఆఆ..ఆఆఆ..ఆఆఆ..

:::::: **BIT** :::::

చరణం

బృందం లలలల్లల...లలలల్లా...లలలల్లల...లలలల్లా
లలలాలలల...లలలాలలల...లలలాలలల...లలలొల్ల...
లలలాల్లలలలలా... (Long Bit)
ఆమె కన్నూ కన్నూ కలిసిన వేళా అతడు : ఆం
ఆమె నీకూ నాకు బంధం వేసి ఆలాపించేనే అతడు : ఓఓఓ
ఆమె తీయని ఊసులు చిందులు వేసీ అతడు : ఊం
ఆమె ఊగే తూగే తలపే రేగే కథలే పాడేనే
అతడు కమ్మని వలపే కానుకలైతే...కులికే కోరికలే...తీరే వేడుకలే
ఆమె జీవితమే వరించే రాగం
నవ్వులలోన... బృందం : ఆఆఆఆ...ఆఆఆఆ...ఆఆఆఆ
పువ్వులవాన... బృందం : ఆఆఆఆ...ఆఆఆఆ...ఆఆఆఆ

Contd...

:::::: BIT :::::

చరణం

బృందం ఊఊఉఊంఊఊఊం...ఊఊఉఊంఊఊఊం ॥2॥
అతడు పరువం పాడే పల్లవినేనై ఆమె : ఊం
అతడు పగలు రేయి తోడూ నీడై నీతో సాగనా ఆమె : ఆఆఆ...
అతడు ఆశలు పొంగే అనురాగాలు ఆమె : ఊంఊ
అతడు అందీ అందని అనుబంధాలు నీలో చూడనా
ఆమె సొగసులు కురిసే నీ ఒడిలోన సోలి తేలనా...తేలియాడనా
అతడు ఈనాడే ఫలించే స్నేహం
నవ్వులలోన... బృందం : అఅఅ అఆఆ..ఆఆఆ..ఆఆఆ..
అతడు పువ్వులవాన... బృందం : అఅఅ అఆఆ..ఆఆఆ..ఆఆఆ..
ఆమె నీలో చిలికింది వయసు...నాలో ఉరికింది మనసు
భావం నవరాగాలే
అతడు కదలాడే శుభయోగాలే
ఆమె భావం నవరాగాలే
అతడు కదలాడే శుభయోగాలే

★★★

# అభిలాష (1983)

రచన : ఆచార్య ఆత్రేయ　　　　　　　　గానం : బాలు, జానకి

సాకీ

అతడు　తారా రూ... రారారా.. రారారా.. జుజూజుజా...

ఆమె　రూరూరూ.. తక తక తక తక.. తూరు తూరూరూ...

అతడు　జూ జు జు జూ...జూ జూ...

ఆమె　ప ప ప ప పాపా....

అతడు　ప ప ప ప పాపా...

ఆమె　త ర రు రూ.. రురురురూ.. రురురురురూ...

అతడు　లరలలలా...

ఆమె　ఊయ్ ! (Long Bit)

పల్లవి

అతడు　వేళా పాళా లేదు కుర్రాళ్లాటకూ..ఓడే మాట లేదూ.. ఆడే వాళ్లకూ..

ఆమె　ఏది గెలుపో...　　　　　　అతడు : హాయ్..హాయ్

ఆమె　ఏది మలుపో...　　　　　　అతడు : హాయ్..హాయ్

ఆమె　తెలియువరకు ఇదే ఇదే ఆట మనకు
　　వేళా పాళ లేదూ.. కుర్రాళ్లాటకూ.. ఓడే మాట లేదూ.. ఆదేవాళ్లకూ

అతడు　తకధిమి తథోంత.. తకధిమి తథోంత..
　　తకధిమి తథోంత తరికిట తరికిటత...

:::::: BIT ::::::

చరణం

అతడు　మన్మధుడు నీకూ... మంత్రి అనుకోకూ
　　నీ వయసు కాచేందుకూ... హాంఆఆం... ఓఓఓ...　(Bit)

ఆమె　వయసు ఒక చాకూ – అది వాడుకోకూ
　　నా మనసు కోసేందుకూ.. ఊఊ.. ఊఊఊ.. (Bit)

అతడు　మనసే లేదు నీకు – ఇచ్చేశావు నాకూ

ఆమె　లేదనీ.. నీదనీ.. కలగని నిజమని అనుకొని ఆడకు
　　లాలా.. లాల..లాలా.. లాలాలాలలా... తకధిమి తథోంత
　　తకధిమి తథోంత... తకధిమి తథోంత.. తరికిట... తరికిటత

Contd...

:::::: BIT ::::::

చరణం

అతడు కలలకొక రూపూ... కనులకొక కైపూ

తొలిమబ్బు విరిపానుపూ...ఊఊఊ..ఊఊఊ..ఉఊఊ (Bit)

ఆమె కవితలిక అపూ... కలుసుకో రేపూ..

చెబుతాను తుది తీరుపూ... ఉఊ..ఊఊ (Bit)

అతడు అహ ఏ తీర్పు వద్దు.. ఇదిగో తీపి ముద్దూ

ఆమె వద్దనీ.. ముద్దనీ.. చిదమని పెదవిని చిటికెలు వేయకు

అతడు వేళాపాళ లేదూ కుర్రాళ్లాటకూ...

ఆమె ఓడే మాట లేదూ ఆడే వాళ్లకూ...

అతడు హ్హా... ఏది గెలుపో

ఆమె హ్హా హ్హా.. ఏది మలుపో

అతడు హోయ్ హోయ్...

ఇద్దరు తెలియువరకు ఇదే ఇదే ఆట మనకు...

లాలా.. లాలలాలా..లాలాలాలలా..

తకధిమి తథోంత.. తకధిమి తథోంత...

తకధిమి తథోంత...తరికిట తరికిటత

★★★



## అభిలాష (1983)

రచన : **ఆచార్య ఆత్రేయ** గానం : **బాలు, జానకి, బృందం**

:::::: Opening Bit ::::::

ఆలాపన

బృందం తూరె తుత్తూ.. (Bit) తూరె తూరె తూరె తూరె..
తూరె తుత్తూ.. (Bit) తూరె తూరె తూరె తూరె.. తూరె తుత్తూ (Long Bit)

పల్లవి

అతడు ఉరకలై గోదావరీ – ఉరికె నా ఒడిలోనికీ
ఆమె సొగసులై బృందావనీ – విరిసె నా సిగలోనికీ
అతడు జత వెతుకు హృదయానికీ ... శ్రుతి తెలిపె మురళీ
ఆమె చిగురాకు చరణాలకీ ...సిరిమువ్వ రవళీ... రసమయం... జగతీ...
ఉరకలై గోదావరీ ఉరికె నా ఒడిలోనికీ
బృందం తుత్తూ...తురత్తురుతుత్తు... (Bit) తురత్తురుతూరూరూ..

:::::: BIT ::::::

చరణం

ఆమె నీ ప్రణయ భావం – నా జీవరాగం ॥2॥
రాగాలూ తెలిపీ – భావాలూ నిజమైనవీ
లోకాలూ మురిసీ – స్నేహాలూ ఋజువైనవీ
అనురాగరాగాల – స్వరలోకమే మనదైనదీ
అతడు ఉరకలై గోదావరీ – ఉరికె నా ఒడిలోనికీ
ఆమె జత వెతుకు హృదయానికీ... శ్రుతి తెలిపె మురళీ
అతడు చిగురాకు చరణాలకీ ...సిరిమువ్వ రవళీ... రసమయం... జగతీ

:::::: BIT ::::::

చరణం

అతడు నా పేద హృదయం – నీ ప్రేమ నిలయం ॥2॥
నాదైన బ్రతుకే – ఏనాడో నీదైనదీ
నీవన్న మనిషే... – ఈనాడు నాదైనదీ
ఒక గుండె అభిలాష – పదిమందికీ బ్రతుకైనదీ
ఆమె ఉరకలై గోదావరీ – ఉరికె నా ఒడిలోనికీ
అతడు సొగసులై బృందావనీ – విరిసె నా సిగలోనికీ
ఆమె జత వెతుకు హృదయానికీ ... శ్రుతి తెలిపె మురళీ
అతడు చిగురాకు చరణాలకీ ...సిరిమువ్వ రవళీ ...
ఇద్దరు రసమయం..జగతీ

★★★

## అభిలాష (1983)

రచన : **వేటూరి** గానం : **బాలు, జానకి**

పల్లవి

అతడు యురేకా... ఆమె : (నవ్వు) (Long Bit)

ఆమె తారత... తారత... తారతా... తారత... తారత... తారతా (Long Bit)

అహ్హహ్హా.. (నవ్వు)

అతడు హే... నవ్వింది మల్లెచెండూ (Bit) ...నచ్చింది గాళ్ ఫ్రెండూ (Bit)

దొరికెరా మజాగ ఛాన్సు... జరుపుకో భలే రొమాన్సూ

యురేకా... సకమీకా... (Bit) నీ ముద్దు తీరేదాకా (Bit)

నవ్వింది మల్లెచెండూ... నచ్చింది గాళ్ ఫ్రెండూ...

దొరికెరా మజాగ ఛాన్సు... జరుపుకో భలే రొమాన్సూ

యురేకా... సకమీకా...సకమిక.... సకమిక... సకమిక... సకమిక...

:::::: BIT ::::::

చరణం

ఆమె తాతరతాతా... తాతరతాతా... (Bit) తాతర తాతరతాతా (Long Bit)

అతడు లవ్వు సిగ్నల్ నాకివ్వగానే... నవ్వుకున్నాయ్... నా యవ్వనాలే

ఆమె (నవ్వు)

అతడు ఏహెహే... (ఆమె : నవ్వు)

అతడు ఆ నవ్వుతోనే (ఆమె : నవ్వు), కదిలెయ్యగానే (ఆమె : నవ్వు)

నాటుకున్నయ్ నవ నందనాలే

అహా... చూపుల్లో... నీరూపం... కనురెప్పల్లో నీ తాళం

కన్నుగొట్టి కమ్ముకుంటా... కాలమంతా అమ్ముకుంటా...

రబబ్బా (ఆమె : హా) రబబ్బా (ఆమె : హా)

రబబ్బా (ఆమె : హా) రబబ్బా (ఆమె : హా)

కన్నెఈడు జున్నులన్ని జుర్రుకుంటా...

నవ్వింది మల్లెచెండూ.. (ఆమె : నవ్వు)

ఓయ్... నచ్చింది గాళ్ ఫ్రెండూ (ఆమె : నవ్వు)

దొరికెరా మజాగ ఛాన్సు... జరుపుకో భలే రొమాన్సు

యురేకా... సాకమీకా... అహా... హ్హా హ్హా.. Contd...

ఆమె	లల్ల లలల్లా... తరరా... తరర్రా (Bit)

ఆమె	తరరర... తరా... పబబబబబా...

:::::: BIT ::::::

చరణం

అతడు	కస్సుమన్న... (ఆమె: అ..) ఓ కన్నెపిల్ల (ఆమె : అ...)
యస్సు అంటే (ఆమె : నవ్వు) ఓహో కౌగిలింతా (ఆమె : నవ్వు)
హెహ్హెహ్హో.. కిస్సులిచ్చి నే కౌగిలిస్తే (ఆమె : ఆహ్హాహ్హా)
అరె తీరి పోయే (ఆమె నవ్వు) నాకున్న చింత...
నేను పుట్టిందే నీకోసం... ఈ జన్మంతా... నీ ధ్యానం
ముద్దుపెట్టి మొక్కుకుంటా.. మూడుముళ్ళు వేసుకుంటా
షబబ్బ (ఆమె : అర్రె) షబబ్బ షబబ్బ (ఆమె : అ)సబరి బరబ్బ
ఏడుజన్మలేలుకుంటా నేను జంటగా...
నవ్వింది మల్లెచెండూ... (ఆమె : నవ్వు)
నచ్చిందీ గాళ్ ఫ్రెండూ... (ఆమె : నవ్వు)
అర్రె... దొరికెరా మజాగ ఛాన్సూ
జరుపుకో భలే రొమాన్సూ...
యురేకా... సకమీకా... (ఆమె : నవ్వు)
నీ ముద్దు తీరేదాకా ... (ఆమె : నవ్వు)
యురేకా... సకమీకా... (ఆమె : నవ్వు)
నీ ముద్దు తీరేదాకా ... (ఆమె : నవ్వు) } ॥2॥
హుర్రే....

★★★

## మీకు తెలుసా?

"జానకి కలగనలేదు రాముని సతి కాగలదని ఏనాడు" (రాజకుమార్ 1983) పాటకు పల్లవి ఆచార్య ఆత్రేయ రాశారు. ఆయన అకాలమరణం చెందడంతో చరణాలను వేటూరి పూర్తిచేసారు. ఆత్రేయ గారికి గురుదక్షిణగా పాట రచన ఆత్రేయ పేరుతోనే వుంచేశారు.

# అభిలాష (1983)

రచన : **వేటూరి** గానం : **బాలు, జానకి**

:: Opening Music ::

పల్లవి

బృందం (Humming) అ ఆ.. అ ఆ... ఆఆ...ఆఆ... (Bit)
ఆఆ...అఆ...ఆఆ...ఆఆ...(Bit)
అతడు బంతీ చామంతీ ముద్దాడుకున్నాయిలే...
ఆమె మల్లీ మందారం పెళ్ళాడుకున్నాయిలే...
అతడు నిద్దరనే సెలవడిగీ... ఇద్దరినీ కలవమని...
ఆమె నిద్దరనే సెలవడిగీ... ఇద్దరినీ కలవమని...
బంతీ చామంతీ ముద్దాడుకున్నాయిలే

:::::: **BIT** :::::

చరణం

అతడు తేనెవాగుల్లో మల్లె పూలల్లే తేలిపోదాములే
ఆమె గాలివానల్లో మబ్బు జంటల్లే రేగిపోదాములే
అతడు విసిరే కొనచూపే.. ముసురై పోతుంటే
ఆమె ముసిరే వయసుల్లో.. మతి అసలే పోతుంటే
అతడు వేడెక్కి గుండెల్లో తలదాచుకో...
ఆమె తాపాలలోవున్న తడి ఆర్చుకో...
అతడు ఆకాశమంటే.. ఎదలో జాబిల్లి నీవే.. వెన్నెల్లు తేవే
ఆమె బంతీ చామంతీ ముద్దాడుకున్నాయిలే...
అతడు నిద్దరనే సెలవడిగీ.. ఇద్దరినీ కలవమని...
ఆమె నిద్దరనే సెలవడిగీ.. ఇద్దరినీ కలవమని...
అతడు బంతీ చామంతీ ముద్దాడుకున్నాయిలే

:::::: **BIT** :::::

Contd...

చరణం

| | |
|---|---|
| ఆమె | తారతా.. తరరా.. తరరా |
| అతడు | తారతా.. తరరా.. తరరా (Long Bit) |
| ఆమె | పూత పెదవుల్లో పుట్టు గోరింట బొట్టుపెట్టిందిలే |
| అతడు | ఎర్ర ఎర్రంగా కుర్ర బుగ్గల్లో సిగ్గు తీరిందిలే |
| ఆమె | ఒదిగే మనసేదో.. ఒకటై పొమ్మంటే |
| అతడు | ఎదిగే వలపంతా.. ఎదలొకటై రమ్మంటే |
| ఆమె | కాలాలు కరిగించు కౌగిళ్లలో... |
| అతడు | దీపాలు వెలిగించు నీ కళ్లతో... |
| ఆమె | ఆమాట వింటే.. కరిగే నాప్రాణమంతా.. నీ సొంతమేలే |
| అతడు | బంతీ చామంతీ ముద్దాడుకున్నాయిలే... |
| ఆమె | మల్లీ మందారం పెళ్ళాడుకున్నాయిలే... |
| అతడు | నిద్దరనే సెలవడిగీ ఇద్దరినీ కలవమని... |
| ఆమె | నిద్దరనే సెలవడిగీ ఇద్దరినీ కలవమని... |
| ఇద్దరు | బంతీ చామంతీ ముద్దాడుకున్నాయిలే |

★★★



## అభిలాష (1983)

రచన : **వేటూరి** గానం : **బాలు, జానకి**

:::::: Opening Music ::::::

పల్లవి

అతడు సందెపొద్దులకాడ సంపంగి నవ్వింది..అందగత్తెనుచూడ జాబిల్లి వచ్చిందీ
మబ్బుపట్టే కళ్ళు... తబ్బిబ్బులయ్యే ఒళ్ళు..ఎవ్వరికిస్తుందో
ఏమౌతుందో ఎవ్వరికిస్తుందో ఏమౌతుందో

ఆమె సందెపొద్దులకాడ సంపంగి నవ్వింది..అందగాడికి తోడు చలిగాలి రమ్మందీ
ఎల్లువయ్యే ఈడు... ఏడెక్కి పోయేవాడు...ఎన్నడు వస్తాడో
ఏమిస్తాడో ఎన్నడు వస్తాడో ఏమిస్తాడో

:::::: BIT ::::::

చరణం

ఆమె కొండా కోనా జలకాలాడే వేళ...కొమ్మా రెమ్మా చీర కట్టే వేళ (Long Bit)

అతడు పిందె పండై చిలక కొట్టే వేళ...పిల్లాపాప నిదరేపోయె వేళ

ఆమె కలలో కౌగిలి కన్నులు దాటాలా

అతడు ఎదలే పొదరిల్లై వాకిలి తియ్యాలా
ఎదటే తుమ్మెదే పాటా పువ్వుల బాట వెయ్యాలా
సందె పొద్దులకాడ సంపంగి నవ్వింది..
అందగత్తెనుచూడ జాబిల్లి వచ్చిందీ

ఆమె ఎల్లువయ్యే ఈడు ఏడెక్కి పోయేవాడు
ఎన్నడు వస్తాడో ... ఏమిస్తాడో ॥2॥

:::::: BIT ::::::

చరణం

అతడు మల్లె జాజి మత్తుజల్లే వేళ...పిల్ల గాలీ జోలాపాడే వేళ... (Long Bit)

ఆమె వానే వాగై వరదై పొంగే వేళ ... నేనే నీవై వలపై సాగే వేళ

అతడు కన్నులు కొడుతుంటే ఎన్నెలపుట్టాలా

ఆమె పుట్టిన ఎన్నెల్లో పుటకలు కాగాలా...
పగలే ఎన్నెల గుమ్మ చీకటి గువ్వలాడాలా సందె పొద్దులకాడ..
సంపంగి నవ్వింది..అందగాడికి తోడు..చలిగాలి రమ్మందీ

అతడు మబ్బుపట్టే కళ్ళు..తబ్బిబ్బులయే ఒళ్ళు ..ఎవ్వరికిస్తుందో..
ఏమౌతుందో అరెరెరెరె... ఎవ్వరికిస్తుందో... ఏమౌతుందో
సందెపొద్దులకాడ... సంపంగినవ్వింది

ఆమె అందగాడికి తోడు... చలిగాలి రమ్మందీ...

★★★

## సాగర సంగమం (1983)

రచన : **వేటూరి** గానం : **జానకి**

పల్లవి ఓం... ఆఆఆఆ... ఓం ఓం.... ఆఆఆఆ... ఓం.... (Long Bit)
ఓం నమశ్శివాయ... ఓ... ఓ... ఓం... నమశ్శివాయా
చంద్రకళాధర సహృదయా... చంద్రకళాధర సహృదయా
సాంద్రకళా పూర్ణోదయ లయనిలయా... ఓఓఓఓఓం...
ఓఓఓఓం...నమశ్శివాయా...ఓఓఓఓం...నమశ్శివాయా...

:::::: BIT ::::::

చరణం పంచభూతములు ముఖపంచకమై..ఆరు ఋతువులు ఆహార్యములై ॥2॥
ప్రకృతీ పార్వతి నీతో నడచిన...ఏడుఅడుగులే స్వర సప్తకమై....
సగమదని.. సదద.. మదని.. సగమ దదద (Bit)
ససస (Bit) నీ...గ... మగసని... దమగ... స
నీ ధృక్కులే అటు అష్టదిక్కులై (Bit) నీ వాక్కులే... నవరసమ్ములై
తాపసమందార... ఆ... ఆ... ఆ... ఆ... ఆ...
నీ మౌనమే (Silence) దశోపనిషత్తులై ఇలవెలయా...
ఓం... ఓఓఓఓం... ఓఓఓం... నమశ్శివాయా

:::::: BIT ::::::

చరణం త్రికాలములు నీ నేత్రత్రయమై...చతుర్వేదములు ప్రాకారములై ॥2॥
గజముఖ.. షణ్ముఖ ప్రమథాదులు.. నీ..సంకల్పానికి ఋత్విజవరులై..
అద్వైతమే నీ ఆదియోగమై...నీ లయలే ఈ కాలగమనమై...
కైలాసగిరివాస.. నీగానమే... జంత్ర గాత్రముల శ్రుతికలయా...
ఓం... ఓఓఓం... ఓఓఓఓం... నమశ్శివాయ...
చంద్రకళాధర సహృదయా
సాంద్రకళా పూర్ణోదయ లయనిలయా.... (Bit)

★★★

## సాగర సంగమం (1983)

రచన : **వేటూరి** గానం : **బాలు, జానకి**

:::::: Opening Music ::::::

పల్లవి

ఆమె ఆ....ఆ....ఆ....ఆ....ఆ.... (Bit)
మౌనమేలనోయీ... మౌనమేలనోయి... ఈ మరపురాని రేయీ
మౌనమేలనోయీ... ఈ మరపురాని రేయీ...
ఎదలో వెన్నెల (Bit)... వెలిగే కన్నుల ॥2॥
తారాడే హాయిలో... (Bit) .. ఇంత
మౌనమేలనోయి.. ఈ మరపురాని రేయి

:::::: BIT ::::::

చరణం

అతడు పలికే పెదవి ఒణికింది ఎందుకో (Bit)
ఒణికే పెదవి వెనకాల ఏవింటో
ఆమె కలిసే మనసులా.. (Bit) విరిసే వయసులా (Bit) ॥2॥
అతడు నీలినీలి ఊసులూ.. లేతగాలి బాసలూ
ఆమె ఏమేమొ అడిగినా...మౌనమేలనోయి.. ఈ మరపురాని రేయీ

:::::: BIT ::::::

చరణం

ఆమె హిమమే కురిసే చందమామ కౌగిటా (Bit)
సుమమే విరిసే వెన్నెలమ్మ వాకిటా
అతడు ఇవి ఏడడుగులా... (Bit) వలపూ మడుగులా (Bit) ॥2॥
ఆమె కన్నెఈడు ఉలుకులూ... కంటిపాప కబురులూ
అతడు ఎంతెంతో తెలిసినా...
మౌనమేలనోయి... ఈ మరపురాని రేయి...
ఇంత మౌనమేలనోయి ఈ మరపు రాని రేయి
ఎదలో వెన్నెల... వెలిగే కన్నులా ॥2॥ తారాడే హాయిలో (Bit)
ఆమె ఉహూ హు హూ... ఉహూహుహూ
ఇంత మౌనమేలనోయి.. ఈ మరపు రాని రేయి
అతడు ఉహూ హు...హూ...హుహూ

★★★

## సాగర సంగమం (1983)

రచన : **వేటూరి** గానం : **బాలు, బృందం**

:::::: Opening Music ::::::

పల్లవి

అతడు
తకిట తధిమి తకిట తధిమి తందాన
హృదయ లయల జతుల గతుల తిల్లాన... } ॥2॥
తడబడు అడుగుగుల తప్పని తాళానా...
తడిసిన పెదవుల రేగిన రాగానా... } ॥2॥
శ్రుతిని లయని ఒకటిచేసి
తకిట తధిమి తకిట తధిమి తందాన...
హృదయ లయల జతుల గతుల తిల్లాన } ॥2॥

:::::: BIT ::::::

చరణం

అతడు
నరుడి బ్రతుకు నటన... ఈశ్వరుడి తలపు ఘటన
ఆ రెంటి నట్టనడుమ... నీ కెందుకింత తపన (Bit) } ॥2॥
తెలుసా మనసా నీకిది తెలిసీ అలుసా
తెలిసీ తెలియని ఆశల వయసీ వరసా...
తెలుసా మనసా నీకిది తెలిసీ అలుసా
తెలిసీ తెలియని ఆశల లలలా... లలలా...
ఏటిలోని అలలవంటి కంటిలోని కలలు కదిపి
గుండియలను అందియలుగచేసీ....
తకిట తధిమి తకిట తధిమి తందాన
హృదయ లయల జతుల గతుల తిల్లాన
తడబడు అడుగుల తప్పని తరికిటతోం.. తరికిటతోం.. తరికిటతోం..
తడిచిన పెదవుల రేగిన ఆఆఆ... ఆఆఆ... ఆఆఆ...
శ్రుతిని లయని ఒకటిచేసి
తకిట తధిమి తకిట తధిమి తందాన...
హృదయ లయల జతుల గతుల తిల్లాన

:::::: BIT ::::::

Contd...

చరణం

అతడు పలుకు రాగమధురం... నీ బ్రతుకు నాట్య శిఖరం
సప్తగిరులుగా వెలిసే సుస్వరాల గోపురం (Bit) } ॥2॥
అలరులు కురియగ నాడెనదే...
అలకల కులుకుల అలమేల్ మంగా } ॥2॥
అన్న అన్నమయ్య మాట... అచ్చతేనె తెనుగుపాట
పల్లవించు పదకవితలు పాడీ.....

బృందం (ఆలాపన) (Bit)

అతడు తకిట తధిమి తకిట తధిమి తందాన...
హృదయ లయల జతుల గతుల తిల్లాన
తడబడు అడుగుల తప్పని తాళాన...
తడిసిన పెదవుల రేగిన రాగాన...
శ్రుతిని లయని ఒకటిచేసి
తకిత తధిమి తకిట తధిమి తందాన...
హృదయ లయల జతుల గతుల తిల్లాన

★★★



## సాగర సంగమం (1983)

రచన : **వేటూరి** గానం : **బాలు, శైలజ**

:::::: Opening Music ::::::

పల్లవి

అతడు వే... వేల గోపెమ్మల మువ్వగోపాలుడే
మా ముద్దు గోవిందుడే... మువ్వగోపాలుడే...మా ముద్దు గోవిందుడే
అహ.. అన్నుల మిన్నల కన్నుల వెన్నెల వేణువులూదాడే
మది వెన్నలు దోచాడే

అతడు ఆ... అహహ వే.. వేల గోపెమ్మల మువ్వగోపాలుడే...
మా ముద్దు గోవిందుడే...

:::::: BIT ::::::

చరణం

అతడు మన్నుతిన్న చిన్నవాడే... మిన్నుకన్న వన్నెకాడే (Bit) ॥2॥

ఆమె కన్నతోడు లేనివాడే... కన్నెతోడు వున్నవాడే
మోహనాల వేణువూదే మోహనాంగుడితడేనే ॥2॥

అతడు ఆ...అఆఆ...ఆఆఆ...
చీరలన్నిదోచి దేహచింతలన్ని తీర్చినాడే
పోతన్న కైతలల్లీ పోతపోసుకున్నాడే
మా మువ్వగోపాలుడే... మా ముద్దు గోవిందుడే

ఆమె ఆ... అహహ... వే... వేల గోపెమ్మల మువ్వగోపాలుడే
మా ముద్దు గోవిందుడే...

:::::: BIT ::::::

చరణం

ఆమె వేయి పేరులున్నవాడే... వేల తీరులున్నవాడే (Bit) ॥2॥

అతడు రాసలీలలాడినాడే..రాయబారమేగినాడే
గీతార్థసారమిచ్చీ... గీతలెన్నొ మార్చేనే ॥2॥

ఆమె ఆ..ఆఆఆ..ఆఆఆ... నీలమై నిఖిలమై కాలమై నిలిచాడే
వరదయ్య గానాల వరదలై పొంగాడే
మా మువ్వగోపాలుడే... మా ముద్దు గోవిందుడే

Contd...

అతడు ఆ... ఆహహా... వే... వేల గోపెమ్మల మువ్వగోపాలుడే
మా ముద్దు గోవిందుడే...

ఆమె అహా.. అన్నుల మిన్నల కన్నుల వెన్నెల వేణువులూదాడే
మది వెన్నలు దోచాడే

అతడు అహా... అన్నుల మిన్నల కన్నుల వెన్నెల వేణువులూదాడే..
మది వెన్నలు దోచాడే...

ఆమె ఆ... అహహా.. వే... వేల గోపెమ్మల మువ్వగోపాలుడే

అతడు మా ముద్దు గోవిందుడే...

★★★



## సాగర సంగమం (1983)

రచన : **వేటూరి** గానం : **బాలు, శైలజ**

:: Opening Music ::

సాకీ

అతడు గా...మా..రీ..గమగస...(గమగస) మగస...(మగస)...గస (గస)
నీ..సా..(సా)నిదమగ..(నిదమగ)..దమగ..మగ (మగ)..సరీసానీ.. (సరిసానీ)
గమాగ..(గమాగ)..గమాగ మదామ..దనీద..నిసానిరీ..(నిసానిరీ) (Bit)

( Bracket లో Echo Sounds)

:::::: **BIT** :::::

పల్లవి

అతడు వేదం... అణువణువున నాదం... నా పంచప్రాణాల నాట్యవినోదం
నాలో రేగేనెన్నో హంసానందీ రాగాలై... వేదం...
వేదం... అణువణువున నాదం..ఆ..ఆ..ఆ..

:::::: **BIT** :::::

చరణం

అతడు సాగర సంగమమే ఒకయోగం...
నిరిసని దమగా...గదమగరిసనీ...నిరిసనిదమగా
మదనిసరీ...సగారి... మగదమ...గమద...నిసాని
దనిమద...గమ..రిగస...సాగర సంగమమే ఒకయోగం
క్షారజలధులే క్షీరములాయే
ఆ మధనం ఒక అమృతగీతం...జీవితమే చిరనర్తనమాయే (Bit)
పదములు తామే పెదవులు కాగా ॥2॥
గుండియలే అందియలై మ్రోగా...వేదం అణువణువున నాదం

:::::: **BIT** :::::

చరణం

ఆమె (ఆలాపనతో) ఆ..ఆ..ఆ.. మాతృదేవోభవా..పితృదేవోభవా..ఆచార్యదేవోభవా..
ఆచార్యదేవోభవా...అతిథిదేవోభవా...అతిథిదేవోభవా(Bit)

Contd...

ఎదురాయె గురువైన దైవం (Bit) ఎదలాయె మంజీరనాదం (Bit)
గురుతాయె కుదురైన నాట్యం (Bit) గురుదక్షిణైపోయె జీవం (Bit)

అతడు నటరాజ పాదాన తలవాల్చనా...నయనాభిషేకాన తరియించనా

ఆమె నటరాజ పాదాన తలవాల్చనా...నయనాభిషేకాన తరియించనా

అతడు సుగమము(Bit) ..రసమయ(Bit) ...సుగమము..రసమయ
నిగమము భరతము గాదా...

ఆమె వేదం... అణువణువున నాదం...నా పంచప్రాణాల నాట్యవినోదం
నాలో రేగేనెన్నో హంసానందీ రాగాలై...
వేదం...వేదం...వేదం... అణువణువున నాదం...
నా పంచప్రాణాల నాట్యవినోదం...
నాలో రేగేనెన్నో హంసానందీ రాగాలై... వేదం...
వేదం... వేదం... వేదం...

అతడు *జయంతితే సుకృతినో...రససిద్ధాః కవీశ్వరాః నాస్తి తేషాం యశః
కాయే జరామరణజం భయం...నాస్తి...జరామరణజం భయం...
నాస్తి జరామరణజం భయం...*

★★★



# సాగర సంగమం (1983)

రచన : **వేటూరి** గానం : **బాలు, శైలజ బృందం**

:::::: Opening Bit ::::::

అతడు *శ్లో॥ వాగర్థావివసంపృక్తౌ - వాగర్థ ప్రతిపత్తయే ।*
*జగతః పితరౌవందే - పార్వతీపరమేశ్వరౌ.. వందే.. పార్వతీ ప.. రమేశ్వరౌ ॥*

బృందం ఆలాపన

:::::: **BIT** ::::::

పల్లవి

అతడు నాద వినోదము నాట్య విలాసము - పరమ సుఖము పరమూ
అభినయ వేదము - సభకనువాదము సలుపు పరమ పదమూ
**భావములో (ఆమె : ఆఆఆఆ) భంగిమలో (ఆమె : ఆఆఆఆ)**
**గానములో (ఆమె : ఆఆఆఆ) గమకములో (ఆమె : ఆఆఆఆ)**
భావములో... భంగిమలో - గానములో... గమకములో
ఆంగికమౌ తపమీగతి సేయగ
నాద వినోదము నాట్య విలాసము - పరమ సుఖము పరమూ (Bit)

ఆమె అభినయ వేదము సభకనువాదము....సలుపు పరమ పదమూ...

ఇద్దరు ఆ...ఆ...ఆ...ఆ...ఆ...ఆ...

:::::: **BIT** ::::::

చరణం

అతడు ని..ని..మదనిని మదనిసని..రిసనిదని మగమదాద గమాప రిగస (Long Bit)

ఆమె కైలాసాన కార్తీకాన శివరూపం-ప్రమిదేలేని ప్రమధాలోక హిమదీపం (Bit)

అతడు కైలాసాన కార్తీకాన శివరూపం-ప్రమిదేలేని ప్రమధాలోక హిమదీపం

అతడు నవరస నటనం

ఆమె దని సరిసనిస

అతడు జతియుత గమనం

ఆమె దని సరిసనిస

అతడు నవరస నటనం - జతియుత గమనం

ఇద్దరు సితగిరి చరణం - సురనది పయనం

అతడు భరతమైన నాట్యం... ఆమె : ఆ...ఆ...ఆ... } ॥2॥

ఆమె బ్రతుకు నిత్య నృత్యం... ఆమె : ఆ...ఆ...ఆ... } ॥2॥

Contd...

అతడు  తపనుని కిరణం – తామస హరణం
బృందం ఉ...ఊ...ఊ...ఊ...ఊ...
అతడు  తపనుని కిరణం తామస హరణం .. శివుని నయన త్రయ లాస్యం
ఆమె  ధిరన... ధిరన.. నన  అతడు : తకిట తకిట ధిమి
ఆమె  ధిరన... ధిరన.. నన  అతడు : నాట్యం.. (Bit)
ఆమె  ధిరన... ధిరన.. నన  అతడు : తకిట తకిట ధిమి
ఆమె  ధిరన... ధిరన.. నన  అతడు : లాస్యం... (Bit) అతడు
నమక చమక సహజం (Bit) – నటః ప్రకృతీ పాదజం (Bit)
నర్తనమే శివ కవచం – నటరాజ పాద సుమరజం
ఆమె  ధిరనన  అతడు : ధిరనన
ఆమె  ధిరనన  అతడు : ధిరనన
అతడు  ధిర..ధిర..ధిర..ధిర... ధిర..ధిర..ధిర..ధిర..
నాద వినోదము – నాట్య విలాసము...పరమ సుఖము పరమూ
ఆమె  అభినయ వేదము – సభకనువాదము...సలుపు పరమ పదమూ...

:::::: BIT ::::::

చరణం
ఆమె  తన నననన తన నననననన...(Bit)  ॥4సార్లు॥
అతడు  ఝుమకు ఝుమకు జింజిన జింజిన...ఝుమకు ఝుమకు జిన జిన జిన
కిన్నెరసాని వచ్చిందమ్మా ఎన్నెల పైటేసీ...
బృందం ఝుమకు ఝుమకు జింజిన జింజిన..ఝుమకు ఝుమకు జిన జిన జిన
అతడు  కిన్నెరసాని వచ్చిందమ్మా ఎన్నెలపైటేసీ...
విశ్వనాథ పలుకై అది విరుల తేనె చినుకై...
కూనలమ్మ కులుకై అది కూచిపూడి నడకై ...
కిన్నెరసాని వచ్చిందమ్మా ఎన్నెలపైటేసీ
ఆమె  కిన్నెరసాని వచ్చిందమ్మా ఎన్నెలపైటేసీ
అతడు  పచ్చని చేలా (ఊఊఊ) ...పావడ గట్టి ...(ఊఊఊ)
ఓయ్..పచ్చని చేలా...పావడ గట్టి ...కొండమల్లెలే కొప్పున పెట్టీ
వచ్చే దొరసాని.. మా వన్నెలకిన్నెరసానీ ॥2॥
కిన్నెరసాని వచ్చిందమ్మా – ఎన్నెల పైటేసీ
ఇద్దరు  కిన్నెరసాని వచ్చిందమ్మా – ఎన్నెల పైటేసీ  (Follow up Music)

★★★

## రాజకుమార్ (1983)

రచన : ఆచార్య ఆత్రేయ గానం : బాలు, సుశీల

(మంగళవాయిద్యాలతో)

:: Opening Music ::

పల్లవి

ఆమె జానకి కలగనలేదు రాముని సతి కాగలనని ఏనాడూ (Bit)
అతడు రాముడు అనుకోలేదు జానకి పతి కాగలనని ఆనాడు (Bit)
ఆమె ఆనాడు ఎవరూ అనుకోనిదీ... ఈనాడు మనకూ నిజమైనదీ
అతడు ఆ రామాయణం... మన జీవన పారాయణం
రాముడు అనుకోలేదు జానకి పతి కాగలనని ఆనాడు

:::::: BIT ::::::

చరణం

అతడు చెలి మనసే శివధనుసైనది... తొలిచూపుల వశమైనదీ (Bit)
వలపు స్వయంవరమైనపుడు గెలువనిది ఏదీ ? (Bit)
ఆమె ఒక బాణము ఒక భార్యన్నది... శ్రీరాముని చిరయశమైనది (Bit)
శ్రీవారు ఆ వరమిస్తే... సిరులన్నీ నావీ...
అతడు తొలి చుక్కవునీవే... చుక్కాని నీవే...
ఆమె తుదిదాకా నీవే.. మరుజన్మకు నీవే...
అతడు ఆఆఆఆ... ఆఆఆఆ... ఆఆఆఆ... ఆఆ...
ఆమె జానకి కలగన లేదు రాముని సతి కాగలనని ఏనాడూ (Bit)
అతడు రాముడు అనుకోలేదు జానకి పతి కాగలనని ఆనాడూ (Bit)

:::::: BIT ::::::

చరణం

ఆమె సహవాసం మనకు నివాసం... సరిహద్దు నీలాకాశం (Bit)
ప్రతిపొద్దు ప్రణయావేశం... పెదవులపై హాసం (Bit)
అతడు సుమసారం మనసంసారం... మణిహారం మన మమకారం (Bit)
ప్రతిరోజూ ఒక శ్రీకారం... పరవశ శృంగారం (Bit)
ఆమె జతవంటే నీవే... కథకానిది నీవే (Bit)
అతడు కలలన్నీ నావే... కలకాలం నీదే
ఆమె ఆఆఆఆ... ఆఆఆఆ... ఆఆఆఆ... ఆఆఆఆ...
అతడు రాముడు అనుకోలేదు జానకి పతి కాగలనని ఆనాడు (Bit)
ఆమె జానకి కలగనలేదు రాముని సతి కాగలనని ఏనాడూ (Bit)
అతడు ఆనాడు ఎవరూ అనుకోనిదీ... ఈనాడు మనకూ నిజమైనదీ
ఆమె ఆ రామాయణం... మన జీవన పారాయణం...
ఇద్దరు లాలలలాలాలాల లాలల లాలాలాల.. లాలాలా (Bit) ॥2॥

★★★

## మంత్రిగారి వియ్యంకుడు (1983)

రచన : **వేటూరి** గానం : **బాలు, జానకి, బృందం**

:: Opening Music ::

పల్లవి

బృందం ఆఆ... ఆఆ... ఆఆ...

అతడు ఏమనినే (బృందం : ఓ.. ఓ..) చెలిపాడుదునో (బృందం : ఓ.. ఓ..)
తికమకలో (బృందం : ఓ.. ఓ...)
ఈ మకతికలో (బృందం : ఓ.. ఓ..)
తోటలలో... పొదమాటులలో... తెరచాటులలో (బృందం : ఓ.. ఓ..)

ఆమె ఏమనినే (బృందం : ఓ.. ఓ..) మదిపాడుదునో (బృందం : ఓ.. ఓ..)
తికమకలో... (బృందం : ఓ.. ఓ..) ఈ మకతికలో (బృందం : ఓ.. ఓ..)

:::::: BIT :::::

చరణం

అతడు నవ్వు... చిరునవ్వు... విరబూసే పొన్నలా (Bit)
ఆడు... నడయాడు... పొన్నల్లో నెమలిలా (Bit)

ఆమె పరువాలే పొద్దుల్లో... ప్రణయాలే పాటల్లో (Bit)

అతడు నీ చూపులే నిట్టూర్పులై... నా చూపులే ఓదార్పులై

ఆమె నా ప్రాణమే నీ వేణువై ... నీ ఊపిరే నా ఆయువై
సాగే... తీగసాగే... రేగిపోయే ... లేత ఆశల కౌగిట
ఏమనినే (బృందం : ఓ ఓ...) మది పాడుదునో (బృందం : ఓ ఓ..)
తికమకలో... (బృందం : ఓ ఓ...) ఈ మకతికలో (బృందం : ఓ ఓ..)

అతడు లాల లాల లాలా... (Bit)

ఆమె లాల లాల లాలలాలా (Bit)

అతడు లాలాలాల లా...ఆహాఁ... (Bit)

ఆమె లాల లాల లాల లాలా...

:::::: BIT :::::

చరణం

బృందం ఆఆఆఆ (Bit) ఆఆఆఆ... ఆఆఆఆ... ఆఆఆఆ... (Bit)

Contd...

ఆమె చిలక... గోరింక కలబోసే కోరిక (Bit)
పలికే వలపంతా... మనదేలే ప్రేమిక (Bit)

అతడు రసపుష్ప పాటల్లో... ఈ రాగసుమాలల్లో

ఆమె ఏ గోపికో దొరికిందని... ఈ రాధికే మరుపాయెనా
నవ్వించిలే బృందావని... నాతోడుగా వున్నావని

అతడు ఊగే... తనువులూగే... మనసూగే రాసలీలలు ఆడగ

ఆమె ఏమనినే (బృందం : ఓ.. ఓ..) మది పాడుమనే (బృందం : ఓ.. ఓ..)
తొలకరిలో, తొలి అల్లరిలో.. మన అల్లికలో (బృందం : ఓ.. ఓ..)

అతడు ఏమనినే (బృందం : ఓ.. ఓ..) చెలిపాడుమనే (బృందం : ఓ..ఓ..)
తికమకలో (బృందం : ఓ.. ఓ..) ఈ మకతికలో (బృందం : ఓ.. ఓ..)

★★★



## మంత్రిగారి వియ్యంకుడు (1983)

రచన : వేటూరి　　　　　గానం : బాలు, జానకి

.: Opening Music :.

పల్లవి

ఆమె　మనసా...శిరసా...నీ నామము చేసెదనీవేళా...(Bit)
మనసా (Bit) శిరసా (Bit) నీ నామము చేసెదనీవేళా...
భవబంధనమో...భయకంపనమో
శివశంకర పఠికింపగ శరణని...
మనసా...(Bit) శిరసా...(Bit) నీ నామము చేసెదనీవేళా

:::: BIT ::::

చరణం

ఆమె　తాండవమాడే నటరాజైనా...ఆఆఆఆఆ...
తలచినవేళ హితుడేలే...
అతడు　తాండవమాడే ...నటరాజైనా... తలచినవేళా ...హితుడేలే...
ఆమె　గిరిజనులే ఆ శివునే గురి విడకా ధ్యానించగా
అతడు　ఆ...శివశంకర నామము చేసిన నీకిక చింతలు ఉండవులే
ఆమె　బెరుకుమాని ప్రేమించీ...ప్రేమమీర లాలించి
అతడు　యముడి చూపు తప్పించీ... తప్పులున్న మన్నించెయ్...
ఆమె　ఇష్టదైవమతనిమీద దృష్టిని నిలిపి శివుని పిలువవేల
ఓ...మనసా...(Bit) శిరసా...(Bit) నీ నామము చేసెదనీవేళా...
అతడు　భవబంధనమో...భయకంపనమో
శివశంకర పఠికింపగ శరణని...
మనసా...(Bit) శిరసా...(Bit) నీ నామము చేసెదనీవేళా

:::: BIT ::::

Contd..

చరణం

అతడు　రపపపపాప్పా...రబప్పాప్పా పాప్పాప్ప...పపపపపాప్పా...(Bit)
తురుత్తూతూరు...రూరూరూరురూ...రూరురూ

ఆమె　తుత్తురుత్తురూ...తుత్తురుత్తురూ...తుత్తురుత్తురూ...

అతడు　తుత్తత్తురు...తుత్తత్తురు...తుత్తత్తురు...

ఆమె　తుత్తతురు....తుత్తతురు....తుత్తతురు....

అతడు　సప్తమహర్షుల సన్నిధిలో...
గరి..రిస..సని..నిద...గ..ప...పగమపదస...పదసరిగమగ...
సప్తమహర్షుల సన్నిధిలో

ఆమె　సప్తమహర్షుల సన్నిధిలో...సప్తస్వరాల ప్రియశ్రుతిలో

అతడు　గౌరివలే...ఆ శివునీ...గౌరవమే...కాపాడూ

ఆమె　ఆ నగజాతకు ఈ భూజాతకు కలిసిన జాతకమీ వరుదే

అతడు　లంక చెఱను విడిపించి (Bit) శంకలన్ని తొలగించి (Bit)

ఆమె　ఈసులన్ని కరిగించి (Bit) నీ సుశీలమెరిగించెయ్.. (Bit)

అతడు　లగ్నమైన మనసుతోడ పెళ్లికి లగ్నమిపుడు కుదురువేళ
ఓ...మనసా...(Bit) శిరసా...(Bit) నీ నామము చేసెదనీవేళా

ఆమె　భవబంధనమో...భయకంపనమో
శివశంకర వణికింపగ శరణని...
మనసా...(Bit) శిరసా...(Bit) నీ నామము చేసెదనీవేళా

★★★

## మనసులో మాట

యాదృచ్ఛికంగా వచ్చేదే సంగీతం అంటే ! దీనికో సమయమంటూ ఉండదు. బెంగుళూరులో ఒకపాట రికార్డింగ్ చేస్తున్నాను. సదా అనే గిటారిస్టు సరిగ్గా వాయించడం లేదు. లయ తప్పుతోంది. అతన్ని తప్పు సరిచేసుకొమ్మని 'సదా' అన్నాను. అతను మరలా తప్పుగా వాయించాడు 'సదా' అని మరలా అన్నాను. ఆ తర్వాత కూడా అదే తంతు. అప్పుడు "సదా ... సదా .... సదా... " అంటూ ఒక బాణీ కట్టేశాను. అలా అప్రయత్నంగా వచ్చేదే సంగీతం.

– ఇళయరాజా

# మంత్రిగారి వియ్యంకుడు (1983)

రచన : **వేటూరి** గానం : **జానకి, బృందం**

పల్లవి

బృందం లాలాలాలా లాలాలలలలలా... (Bit) లలలలలలాల... లలలలలాల...

లలలల..లలాల..లలలలలలాలా..

లాలాలాలా..లలలలలా.. (Long Bit)

ఆమె అమ్మగదే...బుజ్జిగదే...నాపై కోపమా...

దానికదే...దీనికిదే...అంటే నేరమా...

సారీలు చెబుతున్నా..నీ పట్టు నీదేనా...

గుంజీలు తీస్తున్నా...నీ బెట్టు నీదేనా...

అమ్మగదే...బుజ్జిగదే...నాపై కోపమా...

ఐ లవ్‌యూ...ఐలవ్‌యూ... ॥2॥

:::::: BIT :::::

చరణం

ఆమె ఈ పడుచు కోపాలు...తాటాకు మంటా..

అవి రేపు తాపాలై...కలిపేను జంటా...

మెరిసింది కొసమెరుపూ...తెలిసిందిలే వలపూ

రానివ్వు నావైపూ..రవ్వంత నీ చూపూ

వెంటపడ్డా...వేడుకున్నా...జంటకాదు వెళ్లు వెళ్లమంటే

ఏట్లోన పాట్లోన పడతాను...చస్తానులే...

నే చచ్చి...నీప్రేమ...సాధించుకుంటానులే...

అమ్మగదే...బుజ్జిగదే...నాపై కోపమా...

దానికదే...దీనికిదే...అంటే నేరమా...

సారీలు చెబుతున్నా..నీ పట్టు నీదేనా...

గుంజీలు తీస్తున్నా...నీబెట్టు నీదేనా...

అమ్మగదే...బుజ్జిగదే...నాపై కోపమా...

:::::: BIT :::::

Contd...

చరణం

ఆమె సరసాలు విరసాలై...వచ్చింది తంటా...
రగిలింది గుండెల్లో... సాగలేని మంటా...
ఈ వెక్కిరింతల్లో...వేధించి చంపొద్దూ..
నీఎత్తి పొడుపుల్తో..ప్రాణాలు తీయొద్దూ...
బైబై...గుడ్‌బై...గుడ్‌లక్ టూ యూ డార్లింగ్
ఇన్నాళ్ళ బంధాలు ఈనాడె తీరేనులే...
కన్నీటి వీడ్కోలు కడసారి చెప్పాలిలే...
అమ్మగదే...బుజ్జిగదే...రావే తల్లిగా...
దేనికదే...ప్రాప్తమనీ...అమ్మా చల్లగా...
ఐ లవ్‌యూ...ఐలవ్‌యూ... (Bit) ||2||

★★★

MUDDU ART MOVIES

మంత్రిగారి వియ్యంకుడు

MANTHRIGARI VIYYANKUDU

ILAIYARAJA

SIDE A

1. CHI... PO. THAPPULLA KUPPA
S.P. Balasubrahmaniyam
2. YEMANINE CHELI
S. Janaki & Chorus

SIDE B

1. MANAKU DOSTHI
S.P. Balasubrahmaniyam
2. SALA SALA
S. Janaki & S.P. Balasubrahmaniyam

LYRICS: VETURY SUNDRARAMA MURTHY

PRODUCER:

BAPU

# రాగమాలిక (1983)

రచన : **వేటూరి** గానం : **బాలు, జానకి**

పల్లవి

ఆమె కోయిలా..కోయిలా... నా విరహాలు వినరాదా (Long Bit)

కోయిలా..కోయిలా... నా విరహాలు వినరాదా (Bit) ॥2॥

అతడు కరిగే...వలపే...లేని కన్నీటి వరదాయె

ఆమె కోయిలా...కోయిలా...నా విరహాలు వినరాదా...

:::::: **BIT** :::::

చరణం

ఆమె ఆ..ఆ..ఆ.. మిన్నేటి జాబిలి కోనేటిలో

చెరబట్టు కథలే నీ కథలా?

మిన్నేటి జాబిలి కోనేటిలో...చెరబట్టు కథలే నీ కథలా

అతడు విరిసే ...కుసుమం...విధి గోధూళిలో కలిసే

అలసే మనసే బరువాయె

ఆమె ఆ...ఆ..ఆ..

అతడు కోయిలా...కోయిలా...నా విరహాలు వినరాదా...

:::::: **BIT** :::::

చరణం

ఆమె చిగురించు కలలే కరిగెనమ్మా...కడగంటి అలలై మరిగెనమ్మా

అతడు చిగురించు కలలే కరిగెనమ్మా...కడగంటి అలలై మరిగెనమ్మా

మురిసే ...మువ్వలే...మురిపించేది ఏనాడో..

ఆమె కలువ...వెన్నెలా విడిపోయే

అతడు ఆ..ఆ..ఆ..కోయిలా...కోయిలా... నా విరహాలు వినరాదా...(Bit)

ఆమె కరిగే...వలపే వేడి కన్నీటి వరదాయె

అతడు కోయిలా...కోయిలా...నా విరహాలు వినరాదా...(Bit)

★★★

## రాగమాలిక (1983)

రచన : **వేటూరి** గానం : **బాలు**

పల్లవి ఆఆఆహా...ఆ...హా..ఆఆఆ...హాహా...అఅఅ..
అఅఅ...ఆఆఆ (Long Bit)
పువ్వైపుట్టి పూజే చేసి పోని రాలిపోనీ ॥2॥
పూవుగా ప్రాణాలు పోని..తావిగా నన్నుండిపోనీ ॥2॥
పువ్వైపుట్టి పూజే చేసి పోని రాలిపోనీ ॥2॥

:::::: BIT :::::

చరణం నీవే నాకు రాగం...సాగనీవే హృదయతాళం
గీతం నీకు హారం..దేవిపాదం నాకు తీరం
దేవి పూజవేళ రాగమేలే పూలహారం
నాదం నాకు ప్రాణం...చెరగరాదీ చైత్రమాసం
రేగే అగ్నిగుండం...నన్ను తాకి పొందు శాంతం
నేనే నాదం...ఆఆఆఆ...తనంద నందం దంద నందం
దంద నందం...దంద నందం..నందం...దంద నందం..
దంద నందం..దంద నందం

:::::: BIT :::::

చరణం నాదే సూర్య నేత్రం...ఇంక నీదే చంద్రహాసం
నువ్వే చూడకుంటె...నాకు లేదే సుప్రభాతం
రాగం వింతదాహం తీరకుందీ తీపిమోహం
వీచే గాలిలోనె దాచుకున్నా నాదుగానం
లోకాలేడు నాలో ఆడిపాడే నాట్యవేదం
నీకే అంకితం...ఆఆఆఆఆ...తనంద నందం
దంద నందం...దంద నందం...దంద నందం...
పువ్వైపుట్టి పూజే చేసి పోని రాలిపోని
పూవుగా ప్రాణాలు పోని..తావిగా నన్నుండిపోని
దందనం...దంద నందం...దంద నందం...దందనం
దందంద పువ్వైపుట్టి పూజే చేసి పోని రాలిపోనీ
నందం దంద నందం దంద నందం దంద నందం

★★★

## రాగమాలిక (1983)

రచన : **వేటూరి** గానం : **బాలు**

పల్లవి పూజ కొరకై విరిసే పూలను తుంచనేల భువిలో
నీ పూజ కొరకై విరిసే పూలను తుంచనేల భువిలో
ఇది ఏఘటనో...దివిలో సభలో...విధి నిర్ణయమో
నీ పూజ కొరకై విరిసే పూలను తుంచనేల భువిలో

:::::: BIT :::::

చరణం చలిగాలి తొడికేటి పువ్వుల జాతీ
వడగాలి వసివాడే ఏమా నీతీ (Bit) } ॥2॥
కోవెల వుంటే దీపం ఏదీ?
దీపం ఉండీ నీ వెలుగేదీ?
పొగిలెను సుమ నా ఎదను గరళం
పొరలెను సుమ భాష్ప జలగళం
బంగరు కల అది కరిగిన కథ
నా బ్రతుకే మారెను రాయిలా
కనులను ముసిరిన కటిక చీకటుల
మనసున నిండిన వేళలో
విడివడి వెడలెను మురిపము ఎదవిడి
మువ్వల మోహన రవళితో
కళలు వడబోసి కన్న ముఖదీపమెలిగె
మూగదై...నా..మదిలోనె
పూజ కొరకై విరిసే పూలను తుంచనేల భువిలో
ఇది ఏఘటనో...దివిలో సభలో...విధి నిర్ణయమో
నీ పూజ కొరకై విరిసే పూలను తుంచనేల భువిలో

★★★

## రాగమాలిక (1983)

రచన : **వేటూరి** గానం : **జానకి**

పల్లవి నాదం నీ దీవనే... (Bit) నీ రాగాలాపనే (Bit)
నీ రాగగీతం పాడుతుంటే...పలుకే పాలూరదా...
ఓ...పువ్వే వికసించదా (Long Bit)
నాదం నీ దీవనే... (Bit) నీ రాగాలాపనే (Bit)
నీ రాగగీతం పాడుతుంటే...పలుకే పాలూరదా...
ఓ..పువ్వే వికసించదా...నాదం నీ దీవనే

:::::: **BIT** :::::

చరణం అమృతగానం... ఈ అనురాగం...
నదులు జతిగా పాడునే.. (Bit)
నదిని విడిచే అలను నేనై.. ఎగసి ముగిసీ పోదునే (Bit)
కన్నుల మౌనమా...కలకే రూపమా
దాచకె మెరుపులే కన్నీరు మేఘమా
మరుమల్లెపువ్వంటి మనసే...
తొలిసారి విరిసే...నాదం నీ దీవనే...

:::::: **BIT** :::::

చరణం కోయిలల్లే నాదమధువే పొందుకోరే జీవినే (Bit)
నిదురపోనీ కనులలోనీ కలలు మాసీ పోవునే (Bit)
కోవెల పాటలు పువ్వుల తోరణం
ఎంతకు మాయని తీయని జ్ఞాపకం
వెన్నెల్లో అల్లాడు సమయం (Bit)
విధి నాకు విరహం...
నాదం నీ దీవనే... (Bit) నీ రాగాలాపనే (Bit)
నీ రాగగీతం పాడుతుంటే...పలుకే పాలూరదా...
ఓ..పువ్వే వికసించదా...నాదం నీ... దీవనే...

★★★

## రాగమాలిక (1983)

రచన : **వేటూరి** గానం : బాలు, జానకి, బృందం

బృందం *శ్లో॥ అవిద్యానామంత స్తిమిర మిహిర ద్వీపనగరీ*
*జడానాం చైతన్య స్తపక మకరంద శ్రుతిఝరీ...*
*పవిత్రాణాం చింతామణి భువనికా జన్మ జలధౌ*
*నిమగ్నానాం దంష్ట్రా భువరిషు వరాశ్రియ భవలీ...*

పల్లవి

ఆమె ఆ...ఆ...ఆ...(Bit)
నదికి అందం పూవనం...అలల గీతం చామరం ॥2॥

అతడు నవ్వుతుంటే యవ్వనం...ఒక దేవతోత్సవ తోరణం
నదికి అందం పూ...వనం..అలల గీతం చామరం

:::::: BIT :::::

చరణం

ఆమె జలకమాడే కురులలో తన తనువు నిలిపే దేవతా

అతడు కలల మెరిసే మేనిలో ఇది బ్రహ్మదేవుని సొగసులో

ఆమె యవ్వనాలే పువ్వులై ... ఎదహత్తుకోనీ ప్రేమలై

అతడు ఎదను కురిసే..ఆఆఆ...ఎదను కురిసే వెన్నెలా

ఆమె నువు నిలిచిపోవే కన్నులా...ఊహలై...
నదికి అందం పూవనం...అలల గీతం చామరం

అతడు నవ్వుతుంటే యవ్వనం...ఒక దేవతోత్సవ తోరణం
నదికి అందం పూ...వనం..అలల గీతం చామరం
సరినిస..(Bit) పమరిగ..(Bit) సరినిస..(Bit) పమరిగ..(Bit)
మదపమ..మదనిస...నిదపమ..మదనిస (Bit) ససస...
ససరిరినిని సస...దద దద దద నిని పప దద (Bit)
రిమద నిదప సనిద నిసనిదప మగ దపమ నిదప
సనిదప సరి రిరి గగ మమ ప సద నిని దద పపమ రిగమప
సలలిత స్వర భోగమే ఎద పలకరించే పుణ్యమే

ఆమె ఉదయగానం ప్రాణమై..నా హృదయ కమలం విరియునే

Contd...

| | |
|---|---|
| అతడు | ఎగసెమది సంగీతమే.. |
| ఆమె | ఎదుటపడితే స్నేహమే.. |
| అతడు | విరహామిటుపై సాగదే... |
| ఆమె | ఇది వెండివెన్నెల పరువమే |
| అతడు | అధర సుధలే...మధురమే |
| ఆమె | జత కలిసి పదమై పోవులే...పోవులే.. |
| | నదికి అందం పూవనం...అలల గీతం చామరం |
| అతడు | నవ్వుతుంటే యవ్వనం...ఒక దేవతోత్సవ తోరణం |
| ఇద్దరు | ఊఊఊఊ ఊఉఊ...ఊఊ ఉఊఊ ఊఉఊ |

★★★



## సితార (1984)

రచన : **వేటూరి** గానం : **బాలు, శైలజ, బృందం**

శ్లోకం

అతడు ఓం.. బృందం : ఓం...ఓం...

అతడు ఓంకారపంజర శుకీం... బృందం : ఓం...

అతడు ఉపనిషదుద్యాన కేళికలకంఠీం బృందం : ఓం...

అతడు ఆగమ విపిన మయూరీ బృందం : ఓం...

అతడు ఆర్యామంతర్విభావయే గౌరీ బృందం : ఓం...

అతడు గౌరీ... బృందం : ఓం...

పల్లవి

అతడు అర్జునమంత్రం...అపురూపం (Bit) ॥2॥
శృంగారానికీ మణిదీపం...॥2॥
అర్జునమంత్రం...అపురూపం

:::::: BIT :::::

చరణం

ఆమె మదన జనకుడికి ఆహ్లాదం..మా జనకుడికిది అవరోధం (Bit) ॥2॥

అతడు మనో వేగమున..మరోలోకమున..మనో రథములిటు పరుగిడగా ॥2॥

ఇద్దరు సుభద్రార్జునులమూ...మేమే సుభద్రార్జునులమూ ॥2॥

అతడు **ఆఅఅఅ...ఆఅఅఅ...ఆఅఅఅ....ఆఆఆఆ...ఆఅఅఅ...
ఆఅఅఅ...ఆఆఆఆ....**

ఆమె ఆ...ఆ...ఆ...తదనిరిస అతడు : త...తరికిటత..తరికిట

ఆమె తదమదప అతడు : త...తరికిటత..తరికిట

ఆమె నిరిస అతడు : త...తరికిట

ఆమె రిమగ అతడు : త...తరికిట

ఆమె దపమ అతడు : తరికిట

ఆమె దపమ అతడు : తరికిట

ఆమె పదనిస అతడు : త...తరికిటత..

Contd...

:::::: **BIT** :::::

చరణం

అతడు నెలవంకలో వుంచినవ్వా...ఇలవంక రావేమి నువ్వా

ఆమె అహ్హా..అహ్హా..అహ్హా..అహ్హహ్హా..అహ్హా..అహ్హా..అహ్హా..అహ్హహ్హా..

అతడు నెలవంకలో వుంచినవ్వా...ఇలవంక రావేమి నువ్వా
గుండెతోటలో ఒత్తులేసినా మొక్కజొన్న పాలకంకీ (Bit)
చుక్కముగ్గులా నింగి ముంగిటా నక్కివున్న బాలఎంకీ (Bit)
మక్కువైన పిల్లఎంకీ...హోఁ మక్కువైన పిల్లఎంకీ...
నా ఎంకి... హే.. హేహే నెలవంకలో వుంచినవ్వా..అహ్హా..
ఇలవంక రావేమి నువ్వా...
నెలవంకలోవుంచి నవ్వా...ఆహ్హా ఇలవంక రావేమి నువ్వా

:::::: **BIT** :::::

చరణం

అతడు తేటతేట నీరువోసి...తేటులలగ పూలుకోసి ॥2॥
చిగురాకుల నీవ్రేళులు చిదిమినంత చిగురులాయె ॥2॥
ఓ... అరాళకుంతలా..శకుంతలా...(Long Bit)
మదనుని పదవులు పెదవులు మరి ఒకమారిటు సోకగా

ఆమె గపనిద...పపప...పపప...నిసమగ...ససస...ససస

అతడు ప్రణయ పరీరంభవేళ చుంబనమైనను తాకగ

ఆమె గపనిద...పపప...పపప...నిసమగ...ససస...ససస

అతడు రావే...ఇటురావే...

ఆమె ఊహూఁ...ఊహుహూహూఁ...

అతడు సురతమో...అది నవరస భరితమో...

ఆమె ఆఆఆఆఆ....

అతడు సురతమో...అది నవరస భరితమో...
ప్రతిమదనుల భరతమో..మరి భరతుని ఉదయమో (Long Bit)
ఆ...ఆ...ఆ..ఆ....ఆ...ఆఆఆఆ..ఆ...ఆ...

★★★

## సితార (1984)

రచన : వేటూరి　　　　　　　　　　గానం : బాలు, జానకి

(చప్పట్లు, గాజుల శబ్దంతో)

పల్లవి
ఆమె　అహ హహహ... (Long Bit)
అతడు　జిలిబిలి పలుకుల చిలిపిగ పలికిన ఓమైనా..మైనా (Bit)
కిలకిల నగవుల వలపులు చిలికిన ఓమైనా..మైనా (Bit)
మిలమిల మెరిసిన తార (Bit) మిన్నుల విడిన సితార (Bit) ॥2॥
మధువుల పెదవుల – మమతలు విరిసిన ఓ మైనా.. ఓ మైనా
కలలను పెంచకు కలతను దాచకు – ఏమైనా.. ఓమైనా..
జిలిబిలి పలుకుల చిలిపిగ పలికిన ఓమైనా..మైనా (Bit)
కిలకిల నగవుల వలపులు చిలికిన ఓమైనా..మైనా

:::::: BIT ::::::

చరణం
అతడు　అడగనులే చిరునామా ఓమైనా.. ఓమైనా
చిరునవ్వే పుట్టిల్లూ నీకైనా.. నాకైనా
తారలకే సిగపువ్వా – తారాడే సిరిమువ్వా ॥2॥
హరివిల్లూ రంగుల్లో వర్ణాలే... (Bit)
చిలికిన చిలకవు – ఉలకవు పలకవు ఓమైనా... ఏమైనా
జిలిబిలి పలుకుల చిలిపిగ పలికిన ఓమైనా..మైనా

:::::: BIT ::::::

చరణం
ఆమె　ఉరుములలో అలికిడిలా..వినిపించే యీ మైనా
మెరుపులలో నిలకడగా..కనిపించే యీ మైనా
ఎండలకే అల్లాడే..వెన్నెలలో క్రీనీడా ॥2॥ వినువీధి వీణల్లో రాగంలా(Bit)
ఆశల ముంగిట ఊహల ముగ్గులు నిలిపేనా ఏమైనా
అతడు　జిలిబిలి పలుకుల చిలిపిగ పలికిన ఓమైనా..మైనా (Bit)
ఆమె　తొలకరి వయసుల మిణుగురు సొగసులదేమైనా..మైనా (Bit)
అతడు　మిల మిలమెరిసిన తారా(Bit)..మిన్నుల విడిన సితార (Bit)
ఆమె　గుడికే చేరని దీపం (Bit) పడమటి సంధ్యారాగం (Bit)
అతడు　మధువుల పెదవుల మమతలు విరిసిన ఓ మైనా.. ఓ మైనా
ఆమె　చుక్కలు అందక దిక్కుల దాగిన నేనేలే ఆ మైనా
అతడు　జిలిబిలి పలుకుల చిలిపిగ పలికిన ఓమైనా..మైనా (Bit)
ఆమె　తొలకరి వయసుల మిణుగురు సొగసులదేమైనా..మైనా

★★★

# సితార (1984)

రచన : వేటూరి గానం : బాలు, జానకి, బృందం

:::::: Opening Music ::::::

పల్లవి

బృందం కుకు కుకు కుకు కుకు కుకు కుకు కుకు కుకు కుకు...
కుకుకుకుకు కు కూ.. కుకుకుకుకుకు కూ...
కుకుకు.. కుకుకు.. కుకుకు.. కుకుకు.. కుకుకు..
కుకుకు.. కుకుకు.. కుకుకు... కుకుక్కు... కుకుక్కు.. కుకుక్కు.
కుకుక్కు. కూ (Bit) కుకుకుకు.. కుక్కుక్కు. కుకుకుకు... కుక్కుక్కు.. కు..

అతడు కుకుకూ.. (Bit) కుకుకూ (Bit)
కుకుకూ (Bit) కుకుకూ (Bit) కోకిల రావే ॥2॥
రాజీ వాసమూ నీకు ఎందుకో..కో..కో-రెక్కవిప్పుకో చుక్కలందుకో..కో..కో
కుకుకూ (Bit) కుకుకూ (Bit) కోకిల రావే...

బృందం కుకుకు కుకుకు కుకుకు కుకుకు... కుకుకుక్కు.. కూ.. కుక్కు.
కూకుక్కు.. కుకుక్కు. కుకుకుక్కు. కూకుక్కు. కూకుక్కు.. కూకుక్కు.
కుకుకుక్కుక్కు. కుకుకుక్కుక్కు. కుకుకుక్కుక్కు. కుకుకుక్కుకూ...

:::::: BIT ::::::

చరణం

అతడు రంగులలోకం .. పిలిచేవేళా – రాగం నీలో... పలికేవేళా
విరులా.. తెరలే... తెరచీరావే – బిడియం.. విడిచీ... నడచీ..రావే
నా పాటల తోటకురావే ఈ పల్లవి పల్లకిలో ॥2॥
స్వరమైరావే.. విరిపొదల.. ఎదలకూ..
కుకుకూ (Bit) కుకుకూ (Bit) కోకిల రావే... (Bit)

బృందం పిప్పి పీపీ పీపీ పీపీ... పిప్పీ పిప్పీ పీపీపీ...
పిప్పీపిప్పీపీపిపిపీ... పీపిపిపీపిపి పీపీపీ ॥3॥

:::::: BIT ::::::

చరణం

అతడు సూర్యుడు నిన్నే.. చూడాలంటా.. చంద్రుడు నీతో ఆడాలంటా
బురుజూ.. బిరుదూ.. విడిచీరావే.. గడపా.. తలుపూ.. దాటీరావే
నువ్వేలే రాజ్యం వుందీ .. ఆ నాలుగు దిక్కులలో ॥2॥
లయగా రావే ప్రియ హృదయ జతులకూ (Bit)
కుకుకూ (Bit) కుకుకూ (Bit) కోకిల రావే ॥2॥ రాజీ వాసమూ
నీకు ఎందుకో.. కో.. కో.. రెక్క విప్పుకో.. చుక్కలందుకో.. కో.. కో
కుకుకూ (Bit) కుకుకూ (Bit) కోకిల రావే.....

★★★

## సితార (1984)

రచన : వేటూరి                గానం : జానకి, బృందం

పల్లవి

ఆమె    ఆ... ఆ... ఆ... ఆ... ఆ... ఆ... (Long Bit)
వెన్నెల్లో గోదారి అందం... నది కన్నుల్లో కన్నీటి దీపం ॥2॥
అది నిరుపేద నా గుండెలో... చడి నిట్టూర్పు సుడిగుండమై
నాలో సాగే మౌన గీ...తం...
వెన్నెల్లో గోదారి అందం... నది కన్నుల్లో కన్నీటి దీపం...

:::::: BIT ::::::

చరణం

బృందం    ఆ... ఆ... ఆ... ఆ... ఆ... ఆ... (Long Bit) ఆ... ఆ... ఆ... ఆ...
ఆమె    జీవిత వాహిని అలలై ఆఆఆఆ....ఆ...ఆ...ఆ...ఆ...
జీవిత వాహిని అలలై ఊహకు ఊపిరి వలలై
బంధనమై జీవితమే నిన్నటి చీకటి గదిలో
ఎడబాటే... ఒక పాటై... పూలతీవెలో... సుమవీణ మోగునా...
వెన్నెల్లో గోదారి అందం... నది కన్నుల్లో కన్నీటి దీపం

:::::: BIT ::::::

చరణం

ఆమె    నిన్నటి శరపంజరాలు దాటిన స్వరపంజరాన నిలచీ
బృందం    ఆఆఆఆ... ఆఆఆ... ఆఆఆ... ఆఆఆ... ఆఆఆ...
ఆమె    కన్నీరే పొంగిపొంగి తెరలచాటు నా చూపులు
చూడలేని మంచు బొమ్మనై...
యవ్వనాలు అదిమిఅదిమి... పువ్వులన్ని చిదిమిచిదిమి
వెన్నెలంత ఏటిపాలు చేసుకొంటినే... నాకు లేదు మమకారం...
బృందం    నాన నాన నాన నాన...
ఆమె    మనసు మీద అధికారం...
బృందం    నాన నాన నాన నాన...
ఆమె    నాకు లేదు మమకారం... మనసుమీద అధికారం
ఆశలు బాసిన వేసవిలో...

Contd...

ఆవేదనలో రేగిన ఆలాపన సాగే...
మదిలో కలలే నదిలో వెల్లువలై పొంగారే...
మనసూ... పయసూ... కరిగీ మధించిన సరాగమే...
కలతను రేపిన వలపుల ఒడిలో (Bit)
తిరిగే (Bit) సుడులై (Bit) ఎగసే ముగిసే
కథనేనా... ఎగసే ముగిసే కథనేనా... (Bit)

★★★




## నంది పురస్కారం

సితార చిత్రంలో ఎస్. జానకి ఆలపించిన వేటూరి గీతం "వెన్నెల్లో గోదారి అందం... నది కన్నుల్లో కన్నీటి దీపం" కి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ నంది అవార్డు లభించింది.

## సితార (1984)

రచన : వేటూరి　　　　　　　　　గానం : బాలు, శైలజ, బృందం

:: Opening Music ::

ఆలాపన

బృందం　తన్ననన్ననన్న... తన్ననన్ననన్నన (Bit)
　　　తన్ననన్ననన్న... తన్ననన్ననన్నన (Bit)
　　　తన్ననన్ననన్న... (Bit) తన్ననన్ననన్న (Bit)
　　　తన్ననన్ననన్న... (Bit) తన్ననన్ననన్న... (Long Bit)

పల్లవి

అతడు　చమకు చమకు ఝంఝిన్న ఝంఝిన్న
　　　చమకు చమకు ఝిన్న ఝిన్న ఝిన్న

అతడు　కిన్నెరసాని వచ్చిందమ్మా వెన్నెల పైటేసీ

బృందం　చమకు చమకు ఝంఝిన్న ఝంఝిన్న...
　　　చమకు చమకు ఝిన్న ఝిన్న ఝిన్న

అతడు　కిన్నెరసాని వచ్చిందమ్మా వెన్నెల పైటేసీ
　　　విశ్వనాథ పలుకై అది విరుల తేనె చినుకై
　　　కూనలమ్మ కులుకై అది కూచిపూడి నడకై

ఆమె　పచ్చని చేలా ... బృందం : తన్ననన్ననన్న

ఆమె　పావడ గట్టీ... బృందం : తన్ననన్ననన్న

ఆమె　పచ్చని చేల పావడగట్టీ...కొండమల్లెలే కొప్పునబెట్టీ
　　　వచ్చే దొరసాని...మా వన్నెల కిన్నెరసాని
　　　కిన్నెరసాని వచ్చిందమ్మా వెన్నెల పైటేసీ
　　　కిన్నెరసాని వచ్చిందమ్మా వెన్నెల పైటేసి

:::::: BIT :::::

చరణం

అతడు　ఎండలకన్నే సోకనిరాణీ...పల్లెకు రాణీ పల్లవపాణీ
　　　కోటను విడిచీ...పేటను విడిచీ ॥2॥

ఆమె　కనులా గంగా పొంగేవేళా...నదిలా తానే సాగేవేళా
　　　రాగాల రాదారి పూదారి అవుతుంటే
　　　ఆ... రాగాల రాదారి పూదారి అవుతుంటే

Contd...

అతడు కిన్నెరసాని వచ్చిందమ్మా వెన్నెల పైటేసీ
ఆమె కిన్నెరసాని వచ్చిందమ్మా వెన్నెల పైటేసీ

:::::: BIT :::::

చరణం

అతడు మాగాణమ్మ చీరలునేసే..... మలిసందెమ్మా కుంకుమపూసే
ముువ్వల బొమ్మా... ముద్దులగుమ్మా ॥2॥

అతడు గడపాదాటీ నడిచేవేళా (Bit)...అదుపే విడిచీ ఎగిరేవేళ (Bit)
వయ్యారి అందాలు గోదారి చూస్తుంటే...
ఈ... వయ్యారి అందాలు గోదారి చూస్తుంటే...

ఆమె కిన్నెరసాని వచ్చిందమ్మా వెన్నెల పైటేసీ
అతడు కిన్నెరసాని వచ్చిందమ్మా వెన్నెల పైటేసీ
ఆమె విశ్వనాథ పలుకై అది విరుల తేనె చినుకై
అతడు కూనలమ్మ కులుకై అది కూచిపూడి నడకై
ఆమె పచ్చని చేలా.... బృందం : తన్ననన్ననన్న
అతడు పావడగట్టి.... బృందం : తన్ననన్ననన్న
ఆమె ఓయ్ ! పచ్చని చేలా పావడగట్టి...
అతడు అ...కొండమల్లెలే కొప్పున బెట్టీ...
ఆమె వచ్చే దొరసాని... మా వన్నెల కిన్నెరసాని
అతడు వచ్చే దొరసాని... మా వన్నెల కిన్నెరసానీ....

★★★



## ఛాలెంజ్ (1984)

రచన : **వేటూరి** గానం : **బాలు, జానకి**

:: ఆలాపనతో Opening Music ::

పల్లవి

అతడు ఓం శాంతి (Bit) ఓం శాంతి (Bit) వయ్యారి (Bit) వాసంతీ (Bit)
నీఈడులో వుంది వేగం... హ్హా... నీ తోడు నాకుంది భాగం
చాంకుచక్ చక చాం... చక చంచక చక్‌చక చాం... ॥ 2 ॥

ఆమె ఓం శాంతి (Bit) ఓం శాంతి (Bit) నీదేలే (Bit) పూబంతీ (Bit)

:::::: BIT ::::::

చరణం

అతడు ఒంపు ఒంపునా హంపి శిల్పమే చూశా... కన్నేశా...
ఆ.. లేతనడకలో హంసగమనమే చూశా... కాజేశా...
కన్నె నడుమా... కల్పనా... కవులు పాడే కావ్యమా...
కదిలివచ్చే శిల్పమా... కరిగిపోనీ... స్వప్నమా...

ఆమె నీ ఊహలో ఇలా... ఉప్పొంగినా అలా..
ఉయ్యాలలూగే.. యవ్వనాలా... నవ్వులన్నీ నీవే కాదా...

అతడు ఓం శాంతి (Bit) ఓం శాంతి (Bit) వయ్యారి (Bit) వాసంతీ (Bit)

ఆమె నీ చూపు నా పూలబాణం (Bit) నీ ఊపిరే నాకు ప్రాణం (Bit)

ఇద్దరు చాంకుచక్‌చక చాం... చక చంచక చక్‌చక చాం ॥2॥

ఆమె ఓం శాంతి (Bit) ఓం శాంతి (Bit) నీదేలే (Bit) పూబంతీ (Bit)

:::::: BIT ::::::

చరణం (బృందం ఆలాపన Followed by Long Bit)

అతడు నీలవేణిలో కృష్ణవేణినే చూశా... ముడివేశా...
ఆ.. పడతి కొంగులో కదలి పొంగులే చూశా.. చుట్టేశా
మేని విరుపా మెరుపులా... ఆ... బుగ్గ ఎరుపా వలపులా
నీలికనులా పిలుపులా... మత్తులా.. మైమరపులా

ఆమె నీ చూపుతోయిలా... వేశావు సంకెలా...
ఇన్నాళ్ల నించీ... వేచివున్నా... వెన్నెలంతా నీదేకాదా

అతడు ఓం శాంతి (Bit) ఓం శాంతి (Bit) వయ్యారి (Bit) వాసంతి (Bit)
నీఈడులో వుంది వేగం... నీతోడు నాకుంది భాగం

ఇద్దరు చాంకుచక్ చక చాం... చక చంచక చక్‌చక చాం ॥2॥

★★★

# ఛాలెంజ్ (1984)

రచన : **వేటూరి** గానం : **బాలు, జానకి**

:: Opening Music ::

పల్లవి

ఇద్దరు ప..బబ..ప..బబ..పబబ..పబబ..పబబబబబబబా (Long Bit)

అతడు హే... హేహ్హే... హే... హే... హెహ్హే

సాయంకాలం (Bit) సాగరతీరం (Bit)..నాచెలి ఒళ్లో (Bit) చలి సందళ్లో (Bit)

రోజూ... మోజుగా... జల్సా చేయరా...

విరజాజిపూల గంధమంటి అందమంత నీదిరా

ఆమె సాయంకాలం (Bit) సాగరతీరం (Bit)

వెచ్చని ఒళ్లో (Bit) వెన్నెల గుళ్లో (Bit)

తాజా... మోజులే... రోజూ... చూడరా...

నడిరాతిరల్లే పగటిపూట రాసలీలలాడరా

:::::: BIT :::::

చరణం

అతడు కాపురమొస్తే కాదంటానా... కౌగిలి నీకే లేదంటానా (Bit) ॥ 2 ॥

కవ్వించి నవ్వించి... కసితీరా కరిగించి...కథ కాస్తా నడిపించనా...

ఆమె ఆహాహాహాహా...

మరుమల్లె మరీ విచ్చుకొనేవేళ... కళ్లు మరీ గిచ్చుకొనే వేళ...

మరుమల్లె మరీ విచ్చుకొనే వేళ... కళ్లు మరీ గిచ్చుకొనే వేళ

రానంటానా పొదరింటికీ... పూతకొచ్చి పండుతున్న పులకరింత వేళకీ

అతడు సాయంకాలం (Bit)

ఆమె సాగరతీరం (Bit)

:::::: BIT :::::

చరణం

ఆమె సిగ్గని చెప్పి పొమ్మంటానా... చక్కెర విందే లేదంటానా (Bit) ॥ 2 ॥

రేపంటూ మాపంటూ అంతటితో ఆపంటూ తెల్లారిపోనిస్తానా

అతడు లాలాలాలాల చెలిగాలి మరీ చంపితినేవేళా...

Contd...

జంటచలీ పెంచుకునేవేళా...
చెలిగాలి మరీ చంపితినే వేళా... జంట చలీ పెంచుకునేవేళా..
రమ్మంటావా.. సందిళ్లకే.. ఒంటిగుండి చావలేనె సలపరింత గోలకీ

ఆమె సాయంకాలం (Bit) సాగరతీరం (Bit)
అతడు నా చెలి ఒళ్లో (Bit) చలి సందళ్లో (Bit)
ఆమె తాజా మోజులే (Bit) రోజూ చూడరా (Bit)
అతడు విరజాజిపూల గంధమంటి అందమంత నీదిరా
ఇద్దరు సాయంకాలం (Bit) సాగరతీరం (Bit) ॥2॥

★★★



## ఛాలెంజ్ (1984)

రచన: **వేటూరి** గానం : **బాలు, జానకి**

:::::: Opening Music ::::::

పల్లవి

అతడు ఇందువదన కుందరదన - మందగమన మధురవచన
గగన జఘన సొగసు లలనవే ॥2॥
తొలి వలపే తెలిపె చిలిపి సిగ్గేలనే..చెలి చిగురు తొడిగె వగల మొగ్గేలనే
ఐ లవ్ యూ ఓ హారికా... నీ ప్రేమకే జోహారికా.. ॥2॥
ఇందువదన కుందరదన - మందగమన మధురవచన
గగన జఘన సొగసు లలనవే

:::::: BIT ::::::

చరణం

అతడు కవ్వించే (Bit) కన్నులలో (Bit) కాటేసే (Bit) కలలెన్నో (Bit)
పకపక నవ్వులలో ...పండిన వెన్నెలవై నన్నందుకో
ఆమె కసికసి చూపులతో కొసకొస మెరుపులతో నన్నల్లుకో
అతడు ముకుళించే పెదవుల్లో మురిపాలూ..ఋతువుల్లో మధువంతా సగపాలూ
సాహోరే... భామా... హోయ్...
ఇందువదన కుందరదన - మందగమన మధురవచన
గగన జఘన సొగసు లలనవే
తొలి వలపే తెలిపే చిలిపి సిగ్గేలనే..చెలి చిగురు తొడిగె వగల మొగ్గేలనే
ఐ లవ్ యు ఓ హారికా నీ ప్రేమకే జోహారికా.. ॥2॥

:::::: BIT ::::::

చరణం

ఆమె మీసంలో (Bit) మిసమిసలు (Bit) మోసాన్నే (Bit) చేస్తుంటే(Bit)
బిగిసిన కౌగిలిలో సొగసరి మీగడలే దోచేసుకో
అతడు రుసరుస వయసులతో ఎడదల దరువులతో ముద్దాడుకో
ఆమె తొలిపొద్దు ఎండల్లో సరసాలూ ...పడగొట్టె పరువంలో ప్రణయాలూ
జోహారే... ప్రేమా... హోయ్...
అతడు ఇందువదన కుందరదన - మందగమన మధురవచన
గగన జఘన సొగసు లలనవే
తొలి వలపే తెలిపే చిలిపి సిగ్గేలనే..చెలి చిగురు తొడిగే వగల మొగ్గేలనే
ఐ లవ్ యు ఓ హారికా నీ ప్రేమకే జోహారికా.. ॥2॥
ఇందువదన కుందరదన - మందగమన మధురవచన
గగన జఘన సొగసు లలనవే...హై

★★★

## ఛాలెంజ్ (1984)

రచన: **వేటూరి** గానం : **జానకి**

:::::: Opening Music ::::::

పల్లవి

ఆమె మనసే మైకం వయసే దాహం...గుసగుసా ఈడు బుసలు కొట్టెరా
కసకసా నన్ను కౌగిలించరా
మనసే మైకం వయసే దాహం ॥2॥

:::::: BIT ::::::

చరణం

ఆమె (నవ్వు) – (బృందం ఆలాపన)
వచ్చి కౌగిలించినా... పిచ్చి నాకు తీరదూ...
పిచ్చి ఎంత తీరినా... కచ్చ నాకు ఆగదూ... ॥2॥
ఆగలేనురో..వచ్చి నన్ను ఆదుకో.. అందమింక మోయలేను అర్ధరాత్రిలో
ఎదలో తాపం చెలరేగే వేళా...నను తాకి పోరా... నా మోజు తీరా...
మనసే మైకం... వయసే దాహం
గుసగుసా ఈడు బుసలు కొట్టెరా.. హ్హహ్హహ్హహ్హ...
కసకసా నన్ను కౌగిలించరా... హేహే
మనసే మైకం... వయసే దాహం...

:::::: BIT ::::::

చరణం

ఆమె హాహాహా... హో (Long Bit)
ఎంత నచ్చజెప్పినా... చందమామ లేవదూ...
ఎంత చిచ్చికొట్టినా రెప్పవాలి చావదూ... ॥2॥
ఉండలేనురో..గుండె వేడి తీర్చిపో..ముక్కుపచ్చలార్చిపోర ఒక్కరాత్రిలో
ఎదిగే అందం... ఒడిచేరేవేళా... హద్దు దాటిపోరా నా హాయితీరా
మనసే మైకం..వయసే దాహం..గుసగుసా ఈడు బుసలుకొట్టెరా..హ్హహ్హ
కసకసా నన్ను కౌగిలించరా..
మనసే మైకం... వయసే దాహం ॥ 2 ॥)

★★★

# ఛాలెంజ్ (1984)

రచన : **వేటూరి** గానం : **బాలు, జానకి**

:::::: Opening Music ::::::

పల్లవి

అతడు భామా... ఈ తిప్పలు తప్పవు ఎప్పటికైనా... ఉహూ.. ఉహూం..హూం
ఆమె మామా...నీ పప్పులు ఉడకవు ఆపరగోల... అహాం... అహాం... ఆ...
అతడు వద్దంటే వయసొచ్చీ...
ఆమె వద్దన్నా మనసిచ్చీ...
అతడు నిద్దరకే సెలవిచ్చెయ్ ఈవేళా... ఓ...
భామా... ఈ తిప్పలు తప్పవు ఎప్పటికైనా...

:::::: BIT ::::::

చరణం

అతడు తప్పంటూ చెయ్యకపోతే తగలాటమూ... (Bit)
ఆమె నిప్పంటి వయసులతోన చెలగాటమూ... (Bit)
అతడు అయితే మరి ఎందుకు చెప్పు మోమాటమూ... (Bit)
ఆమె ఆడదాని మోమాటాలే ఆరాటమూ... (Bit)
అతడు వానాకాలం... ముసిరేస్తుంటే... వాటేసుకునే.. హక్కేవుందీ...
ఆమె ఇది వానో..గాలో..పొంగో... వరదో... రారా...
మలిపొద్దులు పుచ్చక బుద్ధులతో... ఈవేళా...
మామా...నీ పప్పులు ఉడకవు ఆపరగోల...
అతడు ఉహూంహుహు... ఉహుంఉహుంఉహుం
భామా... ఈ తిప్పలు తప్పవు ఎప్పటికైనా..
ఆమె లల..లల..లల..లలాల..

:::::: BIT ::::::

చరణం

ఆమె ఏ దిక్కూలేని చోటే ఏకాంతమూ... (Bit)
అతడు నాదిక్కూ మొక్కూ నువ్వే సాయంత్రమూ... (Bit)
ఆమె ఇప్పట్లో వద్దు మనకు వేదాంతమూ... (Bit)
అతడు సిగ్గంటూ బుగ్గివ్వటమే సిద్ధాంతమూ... (Bit)

Contd...

ఆమె కవ్వింతల్లో...కసిగా వుంటే....కౌగిలికన్నా...దారేముందీ...
అతడు అది రైటో...కాదో...నైటో...పగలో...రావే..
చెలి ఆకలి తీర్చకు చూపులతో ఈ వేళా...
భామా....
ఆమె ఆఁ...
అతడు ఈ తిప్పలు తప్పవు ఎప్పటికైనా...
ఆమె ఎహే..హెహే..ఎహె..హెహే..మామా..నీ పప్పులు ఉడకవు ఆపరగోల
అతడు పప...పప్ప...ప...పపపపప...వద్దంటె వయసొచ్చీ..
ఆమె వద్దన్నా మనసిచ్చీ...
అతడు నిద్దరకే సెలవిచ్చెయ్ ఈవేళా...ఓ...
భామా...ఈ తిప్పలు తప్పవు ఎప్పటికైనా..
ఆమె పప..పప్ప..పప..పప్ప..మామా...నీ పప్పులు ఉడకవు ఆపరగోలా...
అతడు తురు..తురు...రరురురురురు...

★★★

CREATIVE COMMERCIALS

ECHO

చాలెంజ్

CHALLENGE

SIDE A
1. OM SANTHI
S.P. Balasubrahmaniyam & S. Janaki
2. SAYAMKALAM
S.P. Balasubrahmaniyam & S. Janaki

SIDE B
1. INDUVADANA
S.P. Balasubrahmaniyam & S. Janaki
2. OH! BHAMA
S.P. Balasubrahmaniyam & S. Janaki

Lyric
VETURI SUNDARARAMAMURTHY

MUSIC

PRODUCER:
K.S. RAMA RAO

DIRECTOR
A. KODANDARAMI REDDY

## కిలాడి (1984)

రచన : రాజశ్రీ                    గానం : బాలు, జానకి

:: Opening Music ::

పల్లవి

అతడు   ఆమనిలా పాడు...మల్లియలా చూడు ॥2॥
కళ్ళల్లో కొలువున్నావు

ఆమె   ఆ...

అతడు   గుండెల్లో జతకోరేవు

ఆమె   ఆ...

అతడు   శతకోటి పూలపొంగువో...
ఆమనిలా పాడు...మల్లియలా చూడు

:::::: BIT :::::

చరణం

అతడు   నన్నే మురిపించే వరము వలపే విరిసి
నీ కన్నుల చిలికే స్వరము అలలై కురిసి ॥2॥

ఆమె   సాగరమ్ము పొంగు రీతి సాగె బంధమే...

అతడు   లలలల లలలా...

ఆమె   ఈక్షణం వరాలప్రేమ నాకు ప్రాణమే

అతడు   లలలల లలలా...సోయగం...నా బంధనం
నందనం...హరిచందనం...నే...నే...నీవూ హోయ్‌హోయ్

ఆమె   ఆమనిలాపాడు...మల్లియలా చూడు...
కళ్ళల్లో కొలువున్నావు

అతడు   ఆ...

ఆమె   గుండెల్లో జతకోరేవు...

అతడు   ఊఁ

ఆమె   శతకోటి పూలపొంగువో..
ఆమనిలా పాడు మల్లియలా చూడు ...

:::::: BIT :::::

Contd...

చరణం

ఆమె ఊరించే అల్లరి తలపే ఊరేగేనే...
మరిపించే ఊహలు తెలిపే నా ఎదలోనె ॥2॥

అతడు తీయనీ రాగాలు కోటి పల్లవించెనే
ఆమె లలలల లలలా...
అతడు తీరని స్వప్నాలె నేడు ఆలకించెనే
ఆమె లలలల లలలా...ఈక్షణం నీవేజగం
జీవితం...నీకంకితం నే..నే..నీవూ...హోహో..
అతడు ఆమనిలా పాడు...మల్లియలా చూడు
ఆమె ఆమనిలా పాడు...మల్లియలా చూడు
అతడు కళ్ళల్లో కొలువున్నావు
ఆమె ఆ...
అతడు గుండెల్లో జతకోరేవు
ఆమె శతకోటి పూలపొంగులే...
ఇద్దరు ఆమనిలా పాడు...మల్లియలా చూడూ

★★★



## మాంగల్యబంధం (1985)

రచన : **ఆచార్య ఆత్రేయ** గానం : **బాలు, జానకి**

:::::: Opening Music ::::::

పల్లవి

అతడు నా నిలయమూ...నీహృదయమే..

ఆమె నా సకలమూ...నీప్రణయమే...

అతడు ఇది కోరుకున్న భోగం..

ఆమె ఇది మన పూర్వ పుణ్య యోగం

అతడు మనమే...ఇహమూ...పరమూ...

నా నిలయమూ...నీహృదయమే...

:::::: BIT ::::::

చరణం

అతడు నా వలపువీణా..మీటావునీవూ.

నీ చెలిమిపాటా...పాడానునేనూ..

ఆలాపనై...

ఆమె ఆఅఆఅ...ఆఅఆఅ...ఆలాపనే...ఆరాధనై...

చెయ్యీచెయ్యీ చేర్చీ...చేయును కల్యాణం

అతడు ఓఒఒఓ...కనులూ కనులూ కలిపీ కట్టును మాంగల్యం

ఆమె అఅఅఅ...నా...నిలయమూ...నీహృదయమే..

అతడు ఇది కోరుకున్న భోగం...

ఇది మన పూర్వ పుణ్యయోగం...

అతడు మనమే...ఇహమూ...పరమూ...

నా నిలయమూ...నీహృదయమే...

:::::: BIT ::::::

చరణం

ఆమె నా ప్రేమగీతం...నీ సుప్రభాతం...

నీ రమ్యరూపం...నారత్నదీపం...

ఆ కాంతిలో..

Contd...

| | |
|---|---|
| అతడు | ఓఓఓఓ...ఓఓఓఓ...ఆ కాంతిలో...ఆ శాంతిలో... |
| | నేనూ నీవూ కలిసీ...మనమై పోదామూ... |
| ఆమె | ఒఒఒఓ...ప్రేమకు వేరే పేరూ...మనమై వుందామూ... |
| అతడు | ఒఒఒఓ...నా...నిలయమూ...నీ..హృదయమే... |
| ఆమె | ఇది కోరుకున్న భోగం... |
| | ఇది మన పూర్వ పుణ్య యోగం... |
| ఇద్దరు | మనమే...ఇహమూ...పరమూ... |
| | నా నిలయమూ...నీహృదయమే... |

★★★



## అన్వేషణ (1985)

రచన : **వేటూరి** గానం : **బాలు, జానకి**

:: Opening Music ::

పల్లవి

అతడు సా... నిసరీసాని.... సా నిసమగామరి...
పదసా... నిసరీసాని... సా... నిసమగామరి
పద సససని రిరిరిస గగగరి మమమగ పా..సా ని ద ప మ గ రి ..స ని
కీరవాణి.... (Bit) చిలకల (Bit) కొలికిరో (Bit) పాడవేమే (Bit)
వలపులే (Bit) తెలుపగా (Bit)
విరబూసిన ఆశలు (Bit) విరిశేనెలు చల్లగ (Bit)
అలరులు కురిసిన ఋతువుల తడిసిన మధురసవాణి (Bit)
కీరవాణి (Bit) చిలకల (Bit) కొలికిరో (Bit) పాడవేమే (Bit)
వలపులే (Bit) తెలుపగా... ఆ..

:::::: BIT :::::

చరణం

అతడు గరిస...పమగ...పాని... సరిగరిగస ...నీద
ఈ పూలలో అందమై (Bit) ఈ గాలిలో గంధమై (Bit)
నా తోటలో చైత్రమై (Bit) ఈ బాటనే నడచిరా (Bit)
ఆమె నీ గగనాలలో... నే... చిరుతారనై...
నీ అధరాలలో... నే... చిరునవ్వునై
స్వరమే... లయగా... ముగిసే...
సలలిత కలరుత స్వరసుత గతియుత గమకము తెలియకనే...
కీరవాణి (Bit) చిలకల (Bit) కలకల (Bit) పాడలేదూ (Bit)
వలపులే (Bit) తెలుపగా (Bit)
ఇల రాలిన పూవులు (Bit) వెదజల్లిన తావుల (Bit)
అలికిడి ఎరుగని పిలుపుల అలిగిన మంజులవాణి... (Bit)
కీరవాణి (Bit) చిలకల (Bit) కలకల (Bit) పాడలేదూ (Bit)
వలపులే తెలుపగా... ఆ...

Contd..

:::::: **BIT** :::::

చరణం

అతడు నీకన్నులా నీలమై (Bit) నీ నవ్వులా వెన్నెలై (Bit)
సంపెంగలా గాలినై (Bit) తారాడనా నీడనై (Bit)

ఆమె నీ కవనాలలో... నే తొలిప్రాసనై...నీ జవనాలలో...జాజులవాసనై
ఎదలో... ఎదలే... కదిలే...
పదుచుల మనసుల పంజర శుకముల పలుకులు తెలియకనే...
కీరవాణి (Bit) చిలకల (Bit) కలకల (Bit) పాడలేదూ.. (Bit)
పలవులే (Bit) తెలుపగా (Bit)

అతడు విరబూసిన ఆశలు (Bit) విరితేనెలు చల్లగ (Bit)
అలరులు కురిసిన ఋతువుల తడిసిన మధురసవాణి (Bit)
కీరవాణి (Bit) చిలకల (Bit) కొలికిరో (Bit) పాడవేమే (Bit)
పలవులే (Bit) తెలుపగా... అ...(Bit)

★★★



# అన్వేషణ (1985)

రచన : **వేటూరి** గానం : **బాలు, జానకి**

:: చప్పట్లతో Opening Music ::

పల్లవి

అతడు ఏకాంత వేళ... ఆమె ఊఁవూఁవూఁ
అతడు ఏకాంత సేవ... ఆమె ఊఁవూఁవూఁవూఁ
అతడు ఏకాంత వేళ (Bit) ఆమె కౌగిట్లో
అతడు ఏకాంత సేవ (Bit) ఆమె ముచ్చట్లో
అతడు పడుచమ్మ దక్కే (Bit) ఆమె దుప్పట్లో
అతడు దిండల్లె వుండు (Bit) ఆమె నిద్దట్లో
అతడు కవ్వింతగ... ఒళ్లుతుళ్లింతగ... మల్లెపువ్వుల్లో తావల్లె కన్నుల్లో ఎన్నెల్లై
ఏకాంత వేళ (Bit) ఆమె కౌగిట్లో
అతడు ఏకాంత సేవ (Bit) ఆమె ముచ్చట్లో
అతడు ఏకాంత వేళా...

:::::: BIT ::::::

చరణం

అతడు ముద్దు సాగిన... ఆమె ముచ్చట్లో } ॥2॥
అతడు పొద్దు వాలదు... ఆమె ఇప్పట్లో
అతడు కమ్ముకున్న... ఆమె ఈ కౌగిట్లో
అతడు కాటుకంటి... ఆమె నా చెక్కిట్లో
అతడు నన్ను దాచుకో... ఆమె నా వంట్లో } ॥2॥
అతడు పడకు ఎప్పుడూ... ఆమె ఏ కంట్లో
ఆమె ఆ... అతడు చప్పట్లా
ఆమె ఈ... అతడు తిప్పట్లా
ఆమె నా... అతడు గుప్పెట్లో...ని (Bit)
అతడు ఏకాంత వేళ (Bit) ఆమె కౌగిట్లో
అతడు ఏకాంత సేవ (Bit) ఆమె ముచ్చట్లో
అతడు పడుచమ్మ దక్కే (Bit) ఆమె దుప్పట్లో
అతడు దిండల్లె వుండు (Bit) ఆమె నిద్దట్లో

Contd...

అతడు కవ్వింతగ... ఒళ్లుతుళ్లింతగ... మల్లెపువ్వుల్లా తావల్లె కన్నుల్లో ఎన్నెల్లె
అతడు ఏకాంత వేళ (Bit) ఆమె కౌగిట్లో
అతడు ఏకాంత సేవ (Bit) ఆమె ముచ్చట్లో
అతడు ఏకాంత వేళా

:::::: BIT :::::

చరణం
అతడు గుబులు చూపుల ఆమె గుప్పెట్లో } ॥2॥
అతడు ఎవరు చూడని ఆమె చీకట్లో
అతడు చిక్కబోములే ఆమె ఏకంట్లో
అతడు ఎదలు కలుపుకో ఆమె సందిట్లో
అతడు దేవుడొచ్చినా ఆమె సందట్లో } ॥2॥
అతడు ఎదురులేదులే ఆమె ఇప్పట్లో
ఆమె ఆ... అతడు చీకట్లో
ఆమె రా... అతడు కౌగిట్లో
ఆమె ఊ... అతడు నిద్దట్లో (Bit)
ఆమె ఏకాంతవేళ (Bit) అతడు కౌగిట్లో
ఆమె ఏకాంతసేవ (Bit) అతడు ముచ్చట్లో
ఆమె పదుచమ్మదక్కే అతడు దుప్పట్లో
ఆమె దిండల్లె వుందు అతడు నిద్దట్లో
ఆమె కవ్వింతగ... ఒళ్లుతుళ్లింతగ... మల్లెపువ్వుల్లా తావల్లె కన్నుల్లో ఎన్నెల్లె
ఏకాంతవేళ... (Bit)
అతడు కౌగిట్లో... ఏకాంతసేవ (Bit)
ఆమె ముచ్చట్లో
ఇద్దరు ఏకాంత వేళా....

★★★



## అన్వేషణ (1985)

రచన : **వేటూరి** గానం : **జానకి**

(చిలక చప్పుళ్లు)

పల్లవి

ఆమె పపగ... పపగ (చిలక చప్పుడు) పపగ
(చిలక చప్పుడు)... పపగ (చిలక చప్పుడు) (Bit)
పపగపస (Bit) పపగపస (Bit)
ఎదలో లయ (Bit) ఎగసే లయ (Bit)
ససమ (Bit) నినిరి (Bit) ససమ... నినిరి ...
గగగ (Bit) మమమ (Bit) ససస (Bit) ససస (Bit) ససస (Bit)
ఎదలో లయ (Bit) ఎగసే లయ (Bit)
ఎగసీ...ఎగిరీ... ఎదలో ఒదిగే శుకమా (Bit) స్వరమా (Bit)
పికమా (Bit) పదమా (Bit) సుఖమా

:::::: BIT :::::

చరణం

గా... గా... ఆఆ... (Bit) ఆ... హో...
దివ్యమే.. ఈ దర్శనం... శ్రావ్యమేలే స్పందనం
శోధనే నా జీవనం... సాధనేలే జీవితం
వెతలే శ్రుతులై కలిసే ఆలాపనా... వెతికీ వెతికీ బ్రతుకే అన్వేషణా...
నాలో నేడే విరుల వానా...
ఎదలో లయ (Bit) ఎగసే లయ (Bit)
ఎగసీ... ఎగిరీ... ఎదలో ఒదిగే శుకమా (Bit) స్వరమా (Bit)
పికమా (Bit) పదమా (Bit) సుఖమా (Bit)

:::::: BIT :::::

చరణం

కోకిల గీతం(Bit)..తుమ్మెద నాదం(Bit)కోకిల గీతం..తుమ్మెద నాదం
జలజలపారే సెలగానం (Bit) ఘుమఘుమలాడే సుమరాగం (Bit)
(చిలక చప్పుడు) ఆరెరె... ఆ... (Bit) ఆ... (Bit)
ఆ... (Bit) ఆఆ... ఆఆ... ఆఆ... ఆ...
కొండకోనా... ఎండవానా.... ఏకమైనా... ప్రేమగీతం

Contd...

ఔనా... (Bit) మైనా... (Bit) నీవే (Bit) నేనా (Bit)
శుకపికముల కలరవముల స్వరలహరులలో...

:::::: BIT :::::

చరణం

సససస... (Bit) దదదద... పపపప... రిరిరిరి...
నినినిని... సససస... (Bit)...రిరిరిరి... నినినిని ... సససస... (Bit)
కలికీ... చిలుకా... పలికేదేమో... ఒడిలో... ప్రియుడే... ఒదిగినవేళా...
విరులా... తెరలో.. జరిగేదేమో.. మరులే.. పొంగీ.. పొరలిన వేళా ..
కలికీ... చిలుకా... పలికే దేమో...
ఒడిలో... ప్రియుడే... ఒదిగిన...వేళా (Bit) సససస... (Bit) సససస...
విహంగమా... సంగీతమా... ॥2॥
సంగీతమే విహంగమై చరించగా... స్వరాలతో వనాంతమే జ్వలించగా
ఎన్నాళ్ళు సాగాలి ఏకాంత అన్వేషణా...
అలికిడి ఎరుగని తొలకరి వెలుగులో
కలికీ... చిలుకా... పలికేదేమో... ఒడిలో.. ప్రియుడే... ఒదిగినవేళా...
రులా..తెరలో..జరిగేదేమో..మరులే..పొంగీ..పొరలినవేళా..(Bit)
సససస... (Bit) దదదద.. పపపప (Bit)
సససస... (Bit) దదదద... పపపప

★★★



## అన్వేషణ (1985)

రచన : **వేటూరి** గానం : **బాలు, జానకి, ఇళయరాజా, బృందం**

పల్లవి

అతడు ఇలలో (ఇలలో)...కలిసే (కలిసే)...శిథిలాకాశమూ
కడదాక జరిగేనా...నా అన్వేషణా...
ఇలలో (ఇలలో)...కలిసే (కలిసే)...(Long Bit)

ఆమె ఇలలో ...కలిసే ... శిథిలాకాశమూ..
కలలో (కలలో)...పలికే (పలికే)...శుక సంగీతమూ.
కడదాక జరిగేనా...నా అన్వేషణా...
ఇలలో (ఇలలో)...కలిసే (కలిసే)...శిథిలాకాశమూ

::::: BIT :::::

చరణం

బృందం అహా...అహా...అహాఅఆ...అహా...అహా...అహాఆ...
అహహా...అహహా...అహహా...సరిదనిసరిప...సరిదని
సరిని..సరిదనిసరిప...సరిదనిసరిని...ఆ...ఆ...ఆ...
సరిసరిసరిసనినిని...అ...అ...ఆ...(పక్షుల కిలకిలారావం)

ఆమె పగబట్టిన యీ అగచాట్లు...గడచిన కొద్దీ గ్రహపాట్లు
నా నీలిక్రీనీడలా... ॥2॥
బాటసారి పాడేపాటా...పక్షులన్ని పాడేవేళ ॥2॥
పల్లవించి రాలేనా...బ్రతుకే...రగిలే...స్వరమై...
ఇలలో ...కలిసే ... శిథిలాకాశమూ..

::::: BIT :::::

చరణం

బృందం అఅహా...అహా...ఆ...అహా...హాహాహాహా....హాహాహాహా...
సరిగమసరిగ...ఆ..సరిసరిసరిగ...అ...ఆఆఅఆ...
ఆఆఅఆ...పనిససస...ససస...సససస....(పక్షుల కిలకిలారావం)

ఆమె రాహువు వెనకే వస్తున్నా...తీతువు తలపై కూస్తున్నా
నే...రాలిపోలేనులే... ॥2॥
తోటమాలి నాటేతోటా...తొలకరించి పూసేవేళా ॥2॥
గాలివాన తాకేనా...మృతిలో...ముగిసే...శ్రుతిలా...
ఇలలో (ఆఆఆ)...కలిసే (ఆఆఆ)... శిథిలాకాశమూ
కడదాకా...జరిగేనా... నా అన్వేషణా... అ...ఆ...ఆ... ॥2॥

★★★

## జ్వాల (1985)

రచన : **వేటూరి** గానం : **బాలు, జానకి**

:: Opening Music ::

పల్లవి

అతడు కలికి చిలక చలికి దరికి చేరగనే...
చినుకులిగిరి వలపు రగిలి కోరగనే
జాణ మేన...వానవీణ, ఝల్లుమన్నదీ
ప్రేమగాలి సోకి నన్ను అల్లుకున్నదీ } ॥2॥
కౌగిలింతలోనే... హే... హై...
కలికి చిలక చలికి దరికి చేరగనే...
చినుకులిగిరి వలపు రగిలి కోరగనే

:::::: BIT :::::

చరణం

ఆమె వానొచ్చి తడిశాక వయసెంతో తెలిసింది తొలిసారిగా (Bit)
నీవొచ్చి కలిశాక మనసంటే తెలిసింది ఒకలీలగా (Bit)
అతడు ఆ గాలివానల్లే కలిశాము... ఎదమంటల్లో చలిగుళ్లో చేరాము
మెరుపల్లే... ఉరుమల్లే కలిశాము...
తొలి వయసుల్లో వడగళ్లే ఏరాము... (Bit)
ఆమె మనం మనం... మనం మనం వరించడం (Bit)
తరించడం... ఇహంపరం (Bit)
అతడు క్షణ క్షణం నిరీక్షణం సుఖం సుఖం...
ఆమె లలాల... కలికి చిలక చలికి దరికి చేరగనే...
వయసు తడిసి వలపు రగిలి కోరగనే
మెరుపు తీగలాంటి మేను మెలిక పడ్డదీ
ఉరుముతున్న నిన్ను చూసి ఉలికి పడ్డదీ... } ॥2॥
కౌగిలింతలోనే.. హే... హే...
కలికి చిలక చలికి దరికి చేరగనే...
వయసు తడిసి వలపు రగిలి కోరగనే

:::::: BIT :::::

Contd...

చరణం

అతడు వాటేసు కుంటేనే వయసొచ్చే ఈ సందె సందిళ్లలో... హో... (Bit)
వయ్యారి అందాలు వరదల్లే పొంగేటి కౌగిళ్లలో... హొc... (Bit)

ఆమె సూరీడు వెళ్లాక సాయంత్రం.. తొలి నాతుడు కోరిందీ నీమంత్రం (Bit)
చుక్కల్లో వచ్చిందీ ఆకాశం.. చలి చూపుల్లో తెచ్చిందీ ఆవేశం (Bit)

అతడు ప్రియం ప్రియం... ప్రియం ప్రియం జతి స్వరం (Bit)
పరస్పరం... స్వయంవరం... (Bit)

ఆమె నరం నరం ఒకే స్వరం నిరంతరం

అతడు తరార...కలికి చిలక చలికి దరికి చేరగనే..
చినుకులిగిరి వలపు రగిలి కోరగనే
జాణ మేన... వాన వీణ ఝల్లుమన్నదీ
ప్రేమగాలి సోకి నన్ను అల్లుకున్నదీ

ఆమె మెరుపుతీగలాంటి మేను మెలిక పడ్డదీ...
ఉరుముతున్న నిన్ను చూసి ఉలికి పడ్డదీ...

అతడు కౌగిలింతలోనే... హే...హై... కలికి చిలక చలికి దరికి చేరగనే

ఆమె వయసు తడిసి వలపు రగిలి కోరగనే...

★★★



## జ్వాల (1985)

రచన : గోపి గానం : జానకి

పల్లవి

ఊc... ఊc... ఊఉఊcఉ.... ఊcఉఊcఉ.... ఊ... ఊ... (Bit)
ఆ... ఆ... ఆహోహో... ఆ.. ఆ.. ఆ.. ఆ.. (Bit)
ఏవేవో... కలలు కన్నాను... మదిలో (Bit) ॥2॥
మౌన మురళినై... విరహ వీణనై...
స్వామి గుడికి చేరువైన వేళలో...
ఏవేవో... కలలు కన్నాను... మదిలో...

:::::: BIT :::::

చరణం

సుడి గాలులలో ... వెలిగే దీపం
ఈ కోవెలలో... ఎటుచేరినదో
ఏ జన్మలోని బంధమో... ఇదే ఋణానుబంధమో ॥2॥
నీకు నేను దానినై... నాకు నువ్వు దాసతై
సాగిపోవు వరమే చాలు
ఏవేవో... కలలు కన్నాను.... మదిలో...

:::::: BIT :::::

చరణం

నా కన్నులలో.. వెలుగై నిలిచీ
సిరివెన్నెలగా... బ్రతుకే మలిచీ
నిట్టూర్పుగొన్న గుండెకు... ఓదార్పు చూపినావురా ॥ 2 ॥
నాది పేదమనసురా... కాన్కలీయలేదురా
కనుల నీరె కాన్కరా.... (Bit)
ఏహోవో... కలలు కన్నాను... మదిలో (Bit)
మౌన మురళినై... విరహ వీణనై
స్వామి గుడికి... చేరువైన వేళలో...

★★★

## జల్సాబుల్లోడు (1985)

రచన : **రాజశ్రీ** గానం : బాలు, శైలజ

:::::: Opening Music ::::::

పల్లవి

అతడు ఆఆ.. ఆఆ.. (Bit) ఆఆ.. ఆ.. ఆఆ.. (Bit) ఆఆ.. ఆఆ.. (Bit)
ఆఆ.. ఆ.. ఆఅ.. (Bit) ఆ.. ఆఆ.. అ.. ఆ.. అ.. ఆ.. (Bit)
ఆఆ.. ఆఆ.. (Bit) ఆఆ.. ఆ.. ఆఆ.. (Bit) ఆఆ.. ఆఆ.. (Bit)
ఆ.. అఅ.. అ.. ఆ.. అ.. ఆ.. (Bit) ఆ.. అ.. ఆ.. అ.. ఆ.. అఆ.. (Long Bit)
అందాలా... ఆమనీ... నీలోకన్నానే... కలలే తీరేనే...
ఆలపించె రాగమే... స్నేహబంధమే

ఆమె అందాలా... ఆమనీ... నీలోకన్నానే.. కలలే తీరేనే...

:::::: BIT ::::::

చరణం

అతడు నీవే దీపం... నిజముగా... చిందే శోభ నీవే...
ఆమె నీదో యోగం సోకెనే... నాలో ఊహ నీవే...
అతు అమృతాలు పంచవా... ఆశ తీర్చవా... ॥2॥
ఆమె పలకరించు ఆశలోన... కురిసె నేడు మూగభావన
అతడు మనసు తెలిసె... మధుర మేదో...
ఆమె అందాలా... ఆమనీ... నీలోకన్నానే... కలలే తీరేనే...
అతడు ఆలపించె రాగమే... స్నేహబంధమే...
ఆమె అందాలా... ఆమనీ... నీలోకన్నానే...
అతడు కలలే తీరేనే...

:::::: BIT ::::::

చరణం

ఆమె పొంగే పాలవెన్నెలా... ఊగే చూపులోనా...
అతడు ఊగే పూలడోలలా... నిన్నే అందుకోనా...
ఆమె కమ్మనైన భావనా... నాకు ప్రాణమే... ॥2॥
అతడు కలలు నేడు... కవిత పాడు.. కథలు రేపు ఊసులాడు
ఆమె తిలకరాగం... నాకువేదం...
అతడు అందాలా... ఆమనీ.. నీలోకన్నానే... కలలే తీరేనే...
ఆమె ఆలపించె రాగమే... స్నేహబంధమే...
అతడు అందాలా... ఆమనీ... నీలోకన్నానే...
ఇద్దరు కలలే తీరేనే...

★★★

## ప్రేమించు పెళ్ళాడు (1985)

రచన : **వేటూరి** గానం: **బాలు, జానకి**

(నవ్వుతో Opening Music )

పల్లవి

అతడు వయ్యారి గోదారమ్మ... ఒళ్లంత ఎందుకమ్మ కలవరం (Bit)
కడలి ఒడిలో కలిసిపోతే కల... వరం (Bit)

ఆమె ఇన్ని కలలిక ఎందుకో.. కన్నె కలయిక కోరుకో
కలవరింతే కౌగిలింతై...

అతడు వయ్యారి గోదారమ్మ... ఒళ్లంత ఎందుకమ్మ కలవరం (Bit)

బృందం (హమ్మింగ్) ఆ... ఆ... ఆఆఆ... లలాలలాల...లలాలలాల...
లాలలాల...లలాలలాల...లలలలాలలాల...లలలలాలాలాలా..లా..

:::::: BIT :::::

చరణం

అతడు నిజము నా స్వప్నం...

ఆమె ఆహా.. కలనో.. అతడు : ఒహో...

ఆమె లేనో.. అతడు : ఒహో...

ఆమె హో

అతడు నీవు నా సత్యం...

ఆమె అహా... అవునో... అతడు : ఒహో...

ఆమె కానో... అతడు : ఒహో...

ఆమె హో

అతడు ఊహ నీవే... ఆమె : అహహహా...

అతడు ఉసురు కారాదా..? ఆమె : ఆహా...

అతడు మోహమల్లే... ఆమె : ఆహాహాహా...

అతడు ముసురుకోరాదా...?? ఆమె : ఆహా...

అతడు నవ్వేటి నక్షత్రాలు... మువ్వల్ని ముద్దాడంగ
మువ్వగోపాలుని రాధికా

ఆమె ఆకాశ వీణా... గీతాలలోన... ఆలాపనై...నే కరిగిపోనా

అతడు వయ్యారి గోదారమ్మ.... ఒళ్లంత ఎందుకమ్మ కలవరం

:::::: BIT :::::

Contd...

చరణం

| | | |
|---|---|---|
| బృందం | (హమ్మింగ్) తందాన తాననాన...తందాన తాన నాన...నా... (Bit) ॥2॥ | |
| అతడు | తాకితే తాపం | ఆమె : ఒహో... కమలం |
| అతడు | ఒహో | ఆమె : భ్రమరం |
| అతడు | ఒహో | ఆమె : హో |
| అతడు | సోకితే మైకం | ఆమె : ఒహో.. అధరం |
| అతడు | ఓహో | ఆమె : అధరం |
| అతడు | ఓహో | ఆమె : హో |
| అతడు | ఆటవెలదీ | ఆమె : అహహాహో... |
| అతడు | ఆడుతూరావే | ఆమె : ఆహహాహో |
| అతడు | తేటగీతీ | ఆమె : ఆహహాహ |
| అతడు | తేలిపోనీవే | ఆమె : ఆహో... |

అతడు పున్నాగ కోవెల్లోన పూజారి దోసిల్లన్నీ...యవ్వనాలకు కానుకా

ఆమె చుంబించుకున్న... బింబాధరాల...సూర్యోదయాలే పందేటివేళ...

అతడు వయ్యారి గోదారమ్మ ఒళ్లంత ఎందుకమ్మ కలవరం (Bit)
కడలి ఒడిలో కలిసిపోతే కల...వరం (Bit)

ఆమె ఇన్ని కలలిక ఎందుకో... కన్నెకలయిక కోరుకో (Bit)
కలవరింతే కౌగిలింతై...

అతడు వయ్యారి గోదారమ్మ ఒళ్లంత ఎందుకమ్మ కలవరం (Bit)

★★★



## ప్రేమించు పెళ్ళాడు (1985)

రచన : **వేటూరి** గానం: బాలు, జానకి

:: Opening Music ::

పల్లవి

అతడు ఈ చైత్ర వీణా ఝుంఝుమ్మనీ...

ఆమె ఈ చైత్ర వీణా ఝుంఝుమ్మనీ...

అతడు రొదగా నా ఎదలో తుమ్మెదలా చేసే ప్రేమాలాపనా

ఆమె రొదగా నా ఎదలో తుమ్మెదలా చేసే ప్రేమాలాపనా (Bit)

అతడు ఈ చైత్రవీణా ఝుంఝుమ్మనీ...

ఇద్దరు లాలలాల... లాలలాల... లాలలాల... లాలలాల...

లాలలాలా... లాలలాలా... లాలలాల... లాలలా...లా..

లలలా లలాల లాలాలలాల... లాలలా...

:::::: **BIT** :::::

చరణం

అతడు విడిపోలేనీ.. విరితీవెలలో కురులే మరులై పోతుంటే... హోయ్

ఆమె ఎడబాటేదీ.. ఎదలోతులలో అదిమే వయసే పుడుతుంటే

అతడు తనువూ తనువూ.. తరువూ... తరువై పుప్పొడి ముద్దే పెడుతుంటే

ఆమె పూలే గంధం పూస్తుంటే

అతడు తొలిగా... నా చెలితో... కౌగిలిలో సాగే ప్రేమారాధనా (Bit)

ఆమె ఈ చైత్రవీణా ఝుంఝుమ్మనీ...

అతడు ఈ చైత్రవీణా ఝుంఝుమ్మనీ...

ఇద్దరు లాలలాల... లాలలాల... లాలలాల... లా...

లాలలాలా... లాలలాలా... లాలలాల... లా

లలలా... లలాల లాలా లలాల... లలలా.. లల్లల్లాల..లల్లల్లాల..

లల్లల్లాల..ల..లల్లల్లాల..లల్లల్లాల..లల్లల్లాల..లా..

లల్లలలాలా లాలాలాలా హోయ్!

:::::: **BIT** :::::

Contd...

చరణం

అతడు     గళమే పాడే అలకోయిలనే వలచీ పిలిచే నా గీతం... హోయ్
అతడు     నదులై సాగే ఋతు శోభనమే అభిషేకించే మకరందం
ఆమె     గగనం భువనం కలిసే సొగసే సంధ్యారాగం అవుతుంటే
అతడు     లయలే ప్రియమై పోతుంటే... హోయ్
ఆమె     వనమే... యవ్వనమై... జీవనమై సాగే రాధాలాపనా (Bit)
అతడు     ఈ చైత్రవీణా... ఝుంఝుమ్మనీ ...
ఆమె     ఈ చైత్రవీణా... ఝుంఝుమ్మనీ ...
అతడు     రొదగా     ఆమె : నా ఎదలో
అతడు     తుమ్మెదలా చేసే...
ఇద్దరు     ప్రేమాలాపనా...

★★★



## ప్రేమించు పెళ్లాడు (1985)

రచన : **వేటూరి** గానం: **బాలు, జానకి, బృందం**

:: Opening Chord ::

బృందం లాలా లాలా...లాల్లాలలా...
ల..ల..ల..ల..ల..ల..ల..ల..లాలాలలా...
లాల..లాల..లాలలాల..లాల..లాలా...లాలలల...
లాలలల...లాల..లలలలలా...లలాల...లలాలల...లల..లలలా..(Bit)

ఆమె గోపెమ్మ చేతులో గోరుముద్ద... అతడు : ఊహుహు
ఆమె రాధమ్మ చేతులో వెన్నముద్ద అతడు : ఊహుహు
ఆమె ముద్దు కావాలా ... అతడు : ఊహుహు
ఆమె ముద్ద కావాలా అతడు : ఆహోహో
ఆమె ముద్దు కావాలా ... అతడు : ఊహుహు
ఆమె ముద్ద కావాలా అతడు : ఆహోహో
ఆమె ఆవిందా ఈవిందా నాముద్దు గోవింద
గోపెమ్మ చేతిలో గోరుముద్ద... అతడు : ఊహుహు
ఆమె రాధమ్మ చేతిలో వెన్నముద్ద అతడు : ఊహుహు

:::: **BIT** ::::

చరణం

బృందం (హమ్మింగ్)
అతడు రాదారంత రాసలీలలు ఆమె : అలు...అరూ..ఇణీ
అతడు రాగాలైన రాధగోలలు ఆమె : అలు...అరూ..ఇణీ
అతడు రాధా... రాధాబాధితుణ్ణిలే...ప్రేమారాధకుణ్ణిలే
ఆమె అహోహోహో...జారుపైట లాగనేలరా.. అతడు : అహ అహ
ఆమె ఆరుబైట అల్లరేలరా... అతడు : అహ అహ
ఆమె ముద్దుబేరమాడకుండ ముద్దలింక మింగవా
గోపెమ్మ చేతులో గోరుముద్ద... అతడు : ఊహుహు
ఆమె రాధమ్మ చేతులో వెన్నముద్ద అతడు : ఊహుహు
ఆమె ముద్దు కావాలా ... అతడు : ఊహుహు }
ఆమె ముద్ద కావాలా అతడు : ఆహోహో } ॥2॥

Contd...

ఆమె	ఆవిందా ఈ విందా నాముద్దు గోవింద
గోపెమ్మ చేతులో గోరుముద్ద...	అతడు : ఊహుహు
రాధమ్మ చేతులో వెన్నముద్ద...	అతడు : ఆహోహో

:::::: BIT :::::

చరణం
బృందం	(హమ్మింగ్) (Bit)
ఆమె	వెలిగించాలి నవ్వు మువ్వలు
అతడు	అలా...అలా...అహహా..
ఆమె	వినిపించాలి మల్లె గువ్వలు
అతడు	ఇలా...ఇలా...ఇలా...
ఆమె	కాదా...చూపే లేత శోభనం ...మాటే తీపి లాంఛనం
అతడు	ఆహహోహో...వాలుజళ్ల ఉచ్చులేసినా	ఆమె : ఆహో...
అతడు	కౌగిలింత ఖైదు వేసినా...	ఆమె : ఆహో...
అతడు	ముద్దుమాత్రం ఇచ్చుకుంటె ముద్దాయల్లే వుండనా
గోపెమ్మ చేతులో గోరుముద్ద...	ఆమె : ఊహుహు
అతడు	రాధమ్మ చేతులో వెన్నముద్ద	ఆమె : ఊహుహు
అతడు	ముద్దు కావాలి ...	ఆమె : ఆహోహో
అతడు	ముద్ద కావాలి	ఆమె : ఊ
అతడు	ముద్దు కావాలి ...	ఆమె : ఆహో
అతడు	ముద్ద కావాలి	ఆమె : ఆహోహో
అతడు	ఆవిందు ఈ విందు నాముద్దు గోవింద
అతడు	గోపెమ్మ చేతులో అహహ్హా...	ఆమె : ఊహు...
అతడు	రాధమ్మ చేతులో అహహ్హా...	ఆమె : ఊ...

★★★

## మీకు తెలుసా?

ప్రేమించు - పెళ్ళాడు చిత్రానికి ట్యూన్ ఇస్తూ దరువు లేకుండా కేవలం గిటార్ తంత్రిని పలికించి పాట రాయమని వేటూరి గారిని ఇళయరాజా కోరారు. సన్నివేశానికి అదే మ్యూజిక్ బిట్ అవుతుందనీ, తనకు ఏది స్ఫురిస్తే అది రాయమని చెప్పారు రాజా. వేటూరి ఒక చిలిపి తనపు రసావిష్కరణ చేసి శ్రోతల హృదయాలలో స్మృతి వీణలు పలికించారు. ఆపాట....'గోపెమ్మ చేతిలో గోరుముద్ద... రాధమ్మ చేతిలో వెన్నముద్ద.. ముద్దుకావాలా... ముద్దకావాలా.. ఆవిందా.. ఈ విందా.. నా ముద్దు గోవిందా...

## ప్రేమించు పెళ్లాడు (1985)

రచన: **వేటూరి** గానం : **బాలు, జానకి**

:::::: Opening Music ::::::

పల్లవి

అతడు నిరంతరమూ వసంతములే...మందారములా మరందములే
స్వరాలు సుమాలుగ పూచే...పదాలు ఫలాలుగ పండే
నిరంతరమూ వసంతములే...మందారములా మరందములే

ఆమె నిరంతరమూ వసంతములే...మందారములా మరందములే
స్వరాలు సుమాలుగ పూచే...పదాలు ఫలాలుగ పండే
నిరంతరమూ వసంతములే...మందారములా మరందములే

:::::: BIT ::::::

చరణం

ఆమె హాయిగా పాటపాడే...కోయిలే మాకు నేస్తం...
అతడు తేనెలో తానమాడే...తుమ్మెదే మాకు చుట్టం...
ఆమె నదులలో వీణమీటే...తెమ్మెరే మాకు ప్రాణం...
అతడు అలలపై నాట్యమాడే...వెన్నెలే వేణుగానం...
ఆమె ఆకశానికవి తారలా...
అతడు ఆశకున్న విరిదారులా...
ఆమె ఈ సమయం ఉషోదయమై...మా హృదయం జ్వలిస్తుంటే...
నిరంతరమూ వసంతములే...మందారములా మరందములే...
అతడు స్వరాలు సుమాలుగ పూచే...పదాలు ఫలాలుగ పండే
నిరంతరమూ వసంతములే...
ఆమె మందారములా మరందములే...

:::::: BIT ::::::

చరణం

అతడు అగ్ని పత్రాలు రాసీ ... గ్రీష్మమే సాగిపోయే...
ఆమె మెరుపు లేఖల్లు రాసీ...మేఘమే మూగవోయే...

Contd...

| | |
|---|---|
| అతడు | మంచు ధాన్యాలు కొలిచీ...పౌష్యమే వెళ్లిపోయే... |
| ఆమె | మాఘ దాహాలలోనా...అందమే అత్తరాయే... |
| అతడు | మల్లెకొమ్మ చిరునవ్వులా... |
| ఆమె | మనసులోని మరుదివ్వెలా... |
| అతడు | ఈ సమయం రసోదయమై... మా ప్రణయం ఫలిస్తుంటే<br>నిరంతరమూ వసంతములే...మందారములా మరందములే |
| ఆమె | స్వరాలు సుమాలుగ పూచే...పదాలు ఫలాలుగ పండే<br>నిరంతరమూ వసంతములే... |
| అతడు | మందారములా మరందములే... |

★★★



## శ్రీ షిర్డీసాయిబాబా మహాత్మ్యం (1985)

రచన : ఆచార్య ఆత్రేయ గానం : బాలు, బృందం

:::::: Opening Music ::::::

ఆలాపన

అతడు సాయిబాబా.. సాయిబాబా.. సాయినాధా
సాయిదేవా.. సత్యం .. నిత్యం.. నీవేకావా } (Echo)

పల్లవి :

అతడు నువులేక అనాధలం (Bit) బ్రతుకంతా అయోమయం (Bit) ॥2॥
బాబా.. ఓ బాబా !
ఇక నీ పరీక్షకు మేమాగలేమూ - ఇటులీ నిరీక్షణ మేమోపలేమూ

బృందం నువులేక అనాధలం బ్రతుకంతా అయోమయం - బాబా.. ఓబాబా

:::::: BIT ::::::

చరణం

అతడు మాపాలి దైవమ్మనీ మాదిక్కు నీవేనని...కొలిచాము దినం దినం సా..యీ...
మాఆర్తి చూస్తావని సాక్షాత్కరిస్తావని...వేచాము క్షణంక్షణం సా...యీ...
శ్రీరాముడైనా.. శ్రీకృష్ణుడైనా...ఏ దైవమైనా.. ఏ ధర్మమైనా
నీలోనె చూచాము సా..యీ...!
రావా... బాబా ...రావా... రక్షా... దక్షా... నీవేకదా మా బాబా
నువు లేక అనాధలం (Bit) బ్రతుకంతా అయోమయం (Bit)

బృందం నువులేక అనాధలం బ్రతుకంతా అయోమయం బాబా.. ఓ బాబా

:::::: BIT ::::::

చరణం

అతడు మా యేసు నీవేసని... మా ప్రభువూ నీవేననీ
ప్రార్థనలు చేశామయా నిన్నే...
అల్లాగా వచ్చావని చల్లంగ చూస్తావని - చేశాము సలాం సలాం నీకే (Bit)
గురునానకైనా .. గురుగోవిందైనా...గురుద్వారమైనా.. నీ ద్వారకేనని
నీ భక్తులైనాము సా..యీ

బృందం రావా.. బాబా..రావా..

అతడు రక్షా..దక్షా నీవే కదా మా బాబా
నువు లేక అనాధలం (Bit) బ్రతుకంతా అయోమయం (Bit)

Contd...

| | |
|---|---|
| బృందం | నువులేక అనాధలం... బ్రతుకంతా అయోమయం |
| | బాబా.. ఓ బాబా |
| అతడు | ఇక నీ పరీక్షకు మేమాగలేమూ...ఇటులీ నిరీక్షణ మేమోపలేమూ |
| బృందం | నువులేక అనాధలం బ్రతుకంతా అయోమయం - బాబా.. ఓ బాబా (Bit) |
| అతడు | కృష్ణసాయి కృష్ణసాయి...రామసాయీ... |
| బృందం | కృష్ణసాయి కృష్ణసాయి...రామసాయీ... |
| అతడు | అల్లా సాయీ...మౌలా సాయీ... |
| బృందం | అల్లా సాయీ...మౌలా సాయీ... |
| అతడు | నానక్‌సాయీ...గోవింద్‌సాయీ...ఏసుసాయీ...షిర్డీసాయీ ఓం |
| బృందం | నానక్‌సాయీ...గోవింద్‌సాయీ...ఏసుసాయీ...షిర్డీసాయీ ఓం |
| అతడు | సాయీసాయీ...బాబాసాయీ... |
| బృందం | సాయీసాయీ...బాబాసాయీ... |
| అతడు | సాయీసాయీ...బాబాసాయీ... |
| బృందం | సాయీసాయీ...బాబాసాయీ... ॥3॥ |
| అతడు | ఓం... |

★★★



## శ్రీ షిర్డీసాయిబాబా మహాత్మ్యం (1985)

రచన : ఆచార్య ఆత్రేయ గానం : జేసుదాస్

:::::: Opening Music ::::::

పల్లవి

మా పాపాల తొలిగించు దీపాలనీవే వెలిగించి నావయ్యా
మమ్ము కరుణించినావయ్యా...
జన్మ జన్మాల పుణ్యాల పంటల్లే నిన్ను దర్శించినామయ్యా
మేము తరియించినామయ్యా... ॥2॥

:::::: BIT ::::::

చరణం పసిపాప మనసున్న ప్రతి మనిషిలోనూ పరమాత్ముడున్నాడనీ
వాడు పరిశుద్ధుడౌతాడనీ...
గోళీల ఆటల్లో కొండంత సత్యం చాటావు ఓ సాయీ
మమ్ము సాకావు మా సాయీ ...
వాసనలు వేరైన వర్ణాలు ఎన్నైన పూలన్నీ ఒకటంటివీ
నిన్ను పూజించ తగునంటివీ
మా తడిలేని హృదయాల దయతోటి తడిపి
కలుపున్ని తీసేస్తివీ... మాలో కలతల్ని మాపేస్తివీ...
మా పాపాల తొలిగించు దీపాల నీవే వెలిగించినావయ్యా
మమ్ము కరుణించినావయ్యా...
జన్మ జన్మాల పుణ్యాల పంటల్లే నిన్ను దర్శించినామయ్యా
మేము తరియించినామయ్యా

:::::: BIT ::::::

చరణం పెడుతుంటె పెరిగేది ప్రేమన్న అన్నం... మిగిలేది ఈ పుణ్యం
ఇచ్చు మేలైన పై జన్మం..
రోగుల్ని ప్రేమించి... వ్యాధుల్ని మాపీ... మరుజన్మ ఇచ్చావయా
వారి బాధల్ని మోశావయా...
ఏనాడు పుట్టావో ఏడేడ తిరిగావో.. నువ్వెంత వాడైతివో
నువ్వు ఏనాటి దైవానివో

Contd...

ఈ ద్వారకామాయి నీవాసమాయే ధన్యులమైనామయ్యా
మాకు దైవమై వెలిశావయా....
మా పాపాలు తొలిగించు దీపాల నీవే వెలిగించినావయ్యా
మమ్ము కరుణించినావయ్యా
జన్మ జన్మాల పుణ్యాల పంటల్లే నిన్నూ దర్శించినామయ్యా
మేము తరియించినామయ్యా...
తరియించినామయ్యా... మేము తరియించినామయ్యా ॥2॥

★★★

# శ్రీ షిర్డీసాయిబాబా మహాత్మ్యం (1985)

రచన : ఆచార్య ఆత్రేయ　　　　　　　　　　గానం : బాలు

:::::: Opening Music ::::::

పల్లవి　బాబా... సాయిబాబా... బాబా... సాయిబాబా...
నీవూ మావలె మనిషివనీ..నీకూ మరణం ఉన్నదనీ..
అంటే ఎలానమ్మేది అనుకొని ఎలా బ్రతికేదీ...
బాబా సాయిబాబా... బాబా సాయిబాబా

:::::: BIT ::::::

చరణం　నువ్వే మరణించావంటే.. ఆ దేవుడెలా బ్రతికుంటాడూ ॥2॥
నువ్వే దేవుడివైతే... ఆ మృత్యువెలా శాసిస్తాడూ
తిరుగాడే కోవెల నీదేహం... శిధిలంగా అవుతుందా (Bit)
పిలిచినంతనే పలికే దైవం మూగైపోతాడా
బాబా సాయిబాబా.. బాబా సాయిబాబా...
నీవూ మావెలె మనిషివనీ.. నీకు మరణం ఉన్నదనీ
అంటే ఎలా నమ్మేది... అనుకొని ఎలా బ్రతికేదీ
బాబా సాయిబాబా.. బాబా సాయిబాబా

:::::: BIT ::::::

చరణం　దివిలో ఉన్నా భువిలోవుండే మాకై నింగిని చీల్చుకురా
దిక్కులలోన ఎక్కడవున్నా ముక్కలు చెక్కలు చేసుకురా ॥2॥
సూర్య చంద్రులను చుక్కల గుంపులు కూల్చిరాల్చి రావయ్యా
గ్రహములు గోళాలిహపరశక్తులు గగ్గోలెత్తగ రావయ్యా
నువు లేకుంటే నువు రాకుంటే ఎందుకు మాకు ఈ లోకం ॥2॥
లయం వచ్చి ప్రపంచమంతా నాశనమై పోనీ...
ముల్లోకాలు కల్లోలంలో శూన్యమైపోనీ..
రగిలే కాలాగ్నీ... ఎగిసే బడబాగ్నీ..
దైవం ధర్మాన్నీ... దగ్ధం చేసేదీ...
వేరే ఆత్మైతే.. నీవే పరమాత్మ
నీలో నన్ను ఐక్యం ఐపోనీ... పోనీ...

★★★

## శ్రీ షిర్డీసాయిబాబా మహాత్మ్యం (1985)

రచన : ఆచార్య ఆత్రేయ  గానం : జేసుదాస్, బృందం

:: Opening Music ::

పల్లవి

అతడు హే పాండురంగా (Bit) హే పండరి నాథా (Bit)
శరణం.. శరణం.. శరణం (Bit)
సాయీ శరణం బాబా శరణం శరణం (Bit)
సాయీ చరణం గంగాయమున సంగమ సమానం
ఏ క్షేత్రమైన... తీర్థమైన సాయే...
మా పాండురంగడు కరుణామయుడు సాయే ॥2॥
సాయీ శరణం బాబా శరణం శరణం (Bit)
సాయీ చరణం గంగాయమున సంగమ సమానం...

:::::: BIT :::::

చరణం

అతడు విద్యా బుద్ధులు వేడిన బాలకు అగుపించాడు విఘ్నేశ్వరుడై (Bit)
పిల్లాపాపల కోరిన వారినీ కరుణించాడు సర్వేశ్వరుడై (Bit)
తిరగలి చక్రం తిప్పి వ్యాధినీ అరికట్టాడూ విష్ణురూపుడై..
మగశా శ్యామాకు మారుతిగానూ... మరికొందరికి దత్తాత్రేయుడుగా
యద్భావం తద్భవతని దర్శనమిచ్చాడు... ధన్యులజేశాడు
సాయీ శరణం బాబా శరణం శరణం... (Bit)
సాయీ చరణం గంగాయమున సంగమ సమానం
ఏ క్షేత్రమైన... తీర్థమైన సాయే...
మా పాండురంగడు కరణామయుడు సాయే...
సాయీ శరణం బాబా శరణం శరణం... (Bit)
సాయీ చరణం గంగాయమున సంగమ సమానం

:::::: BIT :::::

చరణం పెనుతుఫాను తాకిడిలో అలమటించు దీనులను
ఆదరించె తాననాథనాథుడై...
అజ్ఞానం అలుముకొన్న అంధులను చేరదీసి

Contd...

అసలు చూపు యిచ్చినాడు వైద్యుడై...
వీధి వీధి బిచ్చమెత్తి వారివారి పాపములను
పుచ్చుకొని మోక్షమిచ్చె పూజ్యుడై
పుచ్చుకొన్న పాపములను ప్రక్షాళన చేసికొనెను
దౌత్యక్రియ సిద్ధితో శుద్ధుడై...
అంగములను వేరుచేసి ఖండయోగ సాధనలో
ఆత్మశక్తి చాటినాడు సిద్ధుడై...
జీవరాసులన్నిటికీ సాయీశరణం

బృందం సాయీశరణం

అతడు దివ్య జ్ఞాన సాధనకూ సాయే శరణం

బృందం సాయీశరణం

అతడు ఆస్తికులకు సాయే శరణం... నాస్తికులకు సాయే శరణం

బృందం ఆస్తికులకు సాయే శరణం... నాస్తికులకు సాయే శరణం

అతడు భక్తికీ సాయే శరణం... ముక్తికీ సాయేశరణం

బృందం భక్తికీ సాయే శరణం... ముక్తికీ సాయేశరణం

అతడు సాయీ శరణం బాబా శరణం శరణం (Bit)
సాయీ చరణం గంగాయమున సంగమ సమానం
ఏ క్షేత్రమైన... తీర్థమైన సాయే...
మా పాండురంగడు కరుణామయుడు సాయే } ॥3॥

★★★

## మనసులో మాట

మనసు రాయికన్నా కఠినమైంది. సంగీతం వింటూవున్నప్పుడు మన మనసు కరుగుతోందంటే సంగీతం రాళ్ళను కూడా కరిగించగలదన్న నానుడి నిజం.

వందలాది చిత్రాలకు విజయవంతమైన సంగీతం అందించడం వెనుక రహస్యం సరిగమలే ! వందలు, వేలు కాదు... కోట్లాది రాగాలు పలికించగల గొప్పదనం సరిగమల్లోనే ఉంది.

– ఇళయరాజా

# శ్రీ షిర్డీసాయిబాబా మహాత్మ్యం (1985)

రచన : **ఆచార్య ఆత్రేయ** గానం : **సుశీల, బృందం**

పల్లవి

బృందం **ఆఆఆ... ఆఆఆఆఆ... ఆఆఆ... ఆఆఆఆఆ** (Long Bit)

ఆమె దైవం మానవ రూపంలో.. అవతరించునీలోకంలో (Bit) ॥2॥

దీనుల హీనుల... పాపుల పతితుల ॥2॥

ఉద్ధరించగా.. యుగయుగాలలో...

బృందం దైవం మానవ రూపంలో... అవతరించునీలోకంలో

:::::: BIT :::::

చరణం

ఆమె త్రేతాయుగమున రాముడుగా... ద్వాపరమందున కృష్ణుడుగా... ఆఆఆ...

త్రేతాయుగమున రాముడుగా... ద్వాపరమందున కృష్ణుడుగా

కలిలో ఏసు, బుద్ధుడు, అల్లా... ॥2॥

కరుణామూర్తులుగా... ఆఆఆ...

బృందం దైవం మానవరూపంలో... అవతరించునీలోకంలో

:::::: BIT :::::

చరణం

ఆమె సమతా మమతను చాటుటకై సహనం త్యాగం నేర్పుటకై...॥2॥

శాంతి స్థాపన చేయుటకై... ॥2॥

ధర్మం నిలుపుటకై...

బృందం దైవం మానవ రూపంలో అవతరించు నీలోకంలో (Bit)

ఆమె దీనుల హీనుల... పాపుల పతితుల ॥2॥

ఉద్ధరించగా... యుగయుగాలలో....

బృందం దైవం మానవ రూపంలో... అవతరించునీలోకంలో...

★★★

# సింధుభైరవి (1985)

రచన : జి. సత్యమూర్తి                                        గానం : చిత్ర

పల్లవి

పాడలేను పల్లవైన భాషరాని దాననూ...
వెయ్యలేను తాళమైన లయ నేనెరుగనూ...
పాడలేను ...పల్లవైన ...భాషరాని దాననూ..
వెయ్యలేను తాళమైన లయ నేనెరుగనూ... } ॥2॥
తోచింది చెప్పాలనీ..ఎదుటికొచ్చి నిలుచున్నా
తోచిన మాటలనే వరుసకట్టి అంటున్నా...
పాడలేను పల్లవైన భాషరాని దాననూ...
వెయ్యలేను తాళమైన లయ నేనెరుగనూ...

:::::: BIT :::::

చరణం

అమ్మ జోలపాటలోన రాగమెంత వున్నదీ...
పంటచేల పాటలోన భాష ఎంతవున్నదీ...
ఊయలే తాళం...పైరగాలే మేళం
మమతే రాగం...శ్రమజీవనమే భావం
రాగమే లోకమంతా....ఆ..ఆ..ఆ...
రాగమే లోకమంతా...కష్టసుఖములె స్వరములంట
షడ్జమ కోకిల గాన స్రవంతికి...పొద్దు పొడుపే సంగతంట
పాడలేను పల్లవైన భాషరాని దాననూ...
వెయ్యలేను తాళమైన లయ నేనెరుగనూ...

:::::: BIT :::::

చరణం

రాగానిదేముంది రసికులు మన్నిస్తే...
తెలిసిన భాషలోనే తీయగా వినిపిస్తే...
ఏ పాటైనా...ఎద పొంగిపోదా...
ఏ ప్రాణమైనా...తమిదీరిపోదా...
చెప్పేది తప్పో...ఒప్పో...ఆ...ఆ...ఆ... (Bit)

Contd...

చెప్పేది తప్పో...ఒప్పో...రహస్యమేముంది విప్పి చెపితే
ఆహు...ఊహు...రోకటి పాటలో...లేదా మధుర సంగీతం...॥2॥
పాడలేను పల్లవైన భాషరాని దాననూ
వెయ్యలేను తాళమైన లయ నేనెరుగనూ...
తోచింది చెప్పాలనీ..ఎదుటికొచ్చి నిలుచున్నా
తోచిన మాటలనే వరుసకట్టి అంటున్నా
పాడలేను పల్లవైన భాషరాని దాననూ
వెయ్యలేను తాళమైన లయ నేనెరుగనూ...
మపదమ...పాడలేను పల్లవైన...(Bit)
స రి గ మ పదమ...పాడలేను పల్లవైన (Bit)
పదనిస నీదమగసరి...పాడలేను పల్లవైన (Bit)
ససరిగ సరిగమ గసపదమ (Bit) మమ పదమ పదని దమపదని (Bit)
పదని సరిగసని దమపదనిసని దపదని దమపద
మగమ పదమగమగస (Bit)
సాసస సాసస సాసాసస సరిగమగమగ సనిద
మామమ మామమ మామమ పదని సనిద మగ
సాసరీరి గాగమామ పాప దాద నినిస
రిగ ససనిస నినిద మపదని దనిదదమ
గమగ సరిగమగమ పదమ పదని సరిగ పదని సనిదమగ
మరిమరి నిన్నే మొరలిడ...నీమనసున దయరాదా ॥2॥
మరి మరి నిన్నే...మరిమరి నిన్నే...

★★★



# కిరాతకుడు (1986)

రచన : ఆచార్య ఆత్రేయ గానం : జానకి

:::::: Opening Music ::::::

పల్లవి

నీ మూగవీణై మోగేనా...నీ రాగమాలై పాడేనా
అనురాగం...రాగంగా...అభిమానం...గీతంగా...
నే ...పాడేనా...
నీ మూగవీణై మోగేనా...నీ రాగమాలై పాడేనా

:::::: BIT :::::

చరణం

శిలవంటి...నీహృదయంలో...శ్రుతి నేను కానా...
ఓదార్చి...నిను లాలించే ...ఒడి నేను కానా...
తనకంటూ...ఒక మనిషంటూ...ఉంటేనే బ్రతుకూ...
నిదురించే... నీహృదయంలో...కదలాడే కలనై...
నీ కంటిలో...కన్నీటినై...ఉంటాను ఓదార్పునై...
నీ మూగవీణై మోగేనా...నీ రాగమాలై పాడేనా
అనురాగం...రాగంగా...అభిమానం...గీతంగా...
నే ...పాడేనా...
నీ మూగవీణై మోగేనా...నీ రాగమాలై పాడేనా

:::::: BIT :::::

చరణం

అలిగావు...నీపలికావూ...అనురాగం కరువై...
రగిలావు... సెగలెగిశావూ...బ్రతుకంతా బరువై...
మేఘాన్నై...అనురాగాన్నై...చినికానూ చినుకై..
పులకించీ...నువు చిగురించీ...తెరవాలీ మనసై...
నీ నవ్వులో..నే పువ్వునై...పూస్తాను నీకోసమై...
నీ మూగవీణై మోగేనా...నీ రాగమాలై పాడేనా
అనురాగం...రాగంగా...అభిమానం...గీతంగా...
నే ...పాడేనా... (Follow up Music)

★★★

## కిరాతకుడు (1986)

రచన : **వేటూరి** గానం : **బాలు, జానకి**

:::::: Opening Music ::::::

పల్లవి

బృందం లలలా...లలాల...లలలా...లలాల...లాలా...లాలా...
లలలల లలాల...లలాల...లలాల...లాలా...లాలా...
లలలల లలలా...లలలల లలలా...లా...లాలా...(Bit)

అతడు నీ.. పేరే ప్రణయమా...ప్రణయమా...
నీ..రూపే హృదయమా..హృదయమా...

ఆమె నీ ప్రేమగీతిలో సుమించే సుధామధురమై...
నీ చెంత చేరనా..వరించే తొలిప్రణయమై

అతడు సాగే...రాసలీలా..

ఆమె సంధ్యా...రాగహేలా..

అతడు నీ.. పేరే ప్రణయమా...ప్రణయమా...

ఆమె నీ..రూపే హృదయమా..హృదయమా...

:::::: BIT :::::

చరణం

అతడు మనసున కురిసెను సొగసుల మధువులు ప్రియా (Bit) ప్రియా (Bit)

ఆమె పెదవులు కలిసెను పరువపు ఋతువులు ప్రియా (Bit) ప్రియా (Bit)

అతడు మనసున కురిసెను సొగసుల మధువులు ప్రియా (Bit) ప్రియా (Bit)

ఆమె పెదవులు కలిసెను పరువపు ఋతువులు ప్రియా (Bit) ప్రియా (Bit)

అతడు కౌగిలింత కావే ప్రేమదేవతా...

ఆమె కంటిచూపుతోనే...హారతివ్వనా..

అతడు నడుమును మరచిన పుడమిని వెలిసిన పడతివి నీవేలె (Bit)

ఆమె నీ.. పేరే ప్రణయమా...ప్రణయమా...

అతడు నీ..రూపే హృదయమా..హృదయమా...

:::::: BIT :::::

చరణం

బృందం లాల లాల లాలలా..లలల్లాలాలలా...(Long Bit)
లాల లాల...లాలలా...లాలల్లాలలా..(Long Bit)

Contd...

| | |
|---|---|
| ఆమె | వలపుల వలలకు వయసులు తగిలెను ప్రియా (Bit) ప్రియా (Bit) |
| అతడు | మదనుని శరముల సరిగమ తెలిసెను ప్రియా (Bit) ప్రియా (Bit) |
| ఆమె | వలపుల వలలకు వయసులు తగిలెను ప్రియా (Bit) ప్రియా (Bit) |
| అతడు | మదనుని శరముల సరిగమ తెలిసెను ప్రియా (Bit) ప్రియా (Bit) |
| ఆమె | చైత్ర వీణ నాలో పూలు పూయగా... |
| అతడు | కోకిలమ్మ నాలో వేణుపూదగా... |
| ఆమె | కవితల మరుగున మమతలు పొదిగిన ప్రియుడవు నీవేలె |
| అతడు | నీ.. పేరే ప్రణయమా...ప్రణయమా... |
| | నీ..రూపే హృదయమా..హృదయమా... |
| ఆమె | నీ ప్రేమగీతిలో సుమించే సుధామధురమై... |
| | నీ చెంతచేరనా వరించే తొలిప్రణయమై |
| అతడు | సాగే...రాసలీలా.. |
| ఆమె | సంధ్యా...రాగహేలా... |
| అతడు | ఆహో...అహహోహో... |
| ఆమె | ఆహో...అహహోహో... |

★★★



## కిరాతకుడు (1986)

రచన : వేటూరి　　　　　　　　　　గానం : బాలు, జానకి

:::::: Opening Music ::::::

పల్లవి

ఆమె　　సంపెంగ ముద్దు...నా చెంపకద్దూ..హో..ఆ... (Bit)
　　　ఏ ముద్దులో (Bit) ఏమున్నదో (Bit)
　　　ఏ పొద్దులో (Bit) ఏమౌతదో (Bit) ఏమో...ఏమో...
అతడు　అందాల బుగ్గా...మందార మొగ్గా...హో...ఆ... (Bit)
　　　ఏ ముద్దుకి (Bit) ఏమిస్తావో (Bit)
　　　ఏ పొద్దులో (Bit) ఏంచేస్తావో (Bit) ఏమో...ఏమో...
ఆమె　　సంపెంగ ముద్దు...నా చెంపకద్దూ..హో..ఆ...

:::::: BIT :::::

చరణం

ఆమె　　పెదవుల్లో నీ ప్రేమ తాకితే...ఝుమ్మంది వయ్యారం... (Bit)
అతడు　ఎదమీద ఎదబెట్టి వాలితే...పొంగింది నీ అందం... (Bit)
ఆమె　　పైరగాలి సోకితే (Bit) పైట కాస్త జారగా (Bit)
అతడు　నవ్వగానె తుమ్మెదా (Bit) మోవి మీద వాలగా (Bit)
ఆమె　　ముద్దుల్లో మువ్పూట తేలించి..లాలించి
అతడు　వద్దన్నా వలపుల్ల వాకిళ్ల తెరిపించె
　　　శృంగారాల సంధ్యారాగాలెన్నో పలికె
ఆమె　　సంపెంగ ముద్దు...నా చెంపకద్దూ..హో..ఆ... (Bit)
　　　ఏ ముద్దులో (Bit) ఏమున్నదో (Bit)
　　　ఏ పొద్దులో (Bit) ఏమౌతదో (Bit) ఏమో...ఏమో...
అతడు　అందాల బుగ్గా...మందార మొగ్గా...హో...ఆ...

:::::: BIT :::::

చరణం

అతడు　రైకల్లో జాబిల్లి దాగితే...నవ్వింది కార్తీకం... (Bit)
ఆమె　　కౌగిట్లో దోపిళ్లు సాగితే...కవ్వించే సాయంత్రం... (Bit)

Contd...

| | |
|---|---|
| అతడు | చూడలేని అందమూ...(Bit) చూపు దొంగిలించగా (Bit) |
| ఆమె | తెలిరాని వెన్నెలా (Bit) తెల్లవారి కాయగా (Bit) |
| అతడు | పొదరిళ్ల వాకిళ్ల సొగసంతా ముగ్గేసి |
| ఆమె | ముంగిళ్లు ముద్దుల్తో ఎంగిళ్లు చేసేసి... |
| | సౌందర్యాలా దీపాలెన్నో నాలో నింపి |
| అతడు | అందాల బుగ్గా...మందార మొగ్గా...హో...ఆ... |
| | ఏముద్దుకి (Bit) ఏమిస్తావో (Bit) |
| | ఏ పొద్దులో (Bit) ఏంచేస్తావో (Bit) ఏమో...ఏమో... |
| ఇద్దరు | లల్లల్లలాలా...లల్లల్లలాలా..లా... |

★★★



## స్వాతిముత్యం (1986)

రచన : **సి. నారాయణరెడ్డి** గానం : **బాలు, జానకి, బృందం**

పల్లవి

బృందం ఆ...ఆ..ఆ..ఆ...ఆఆఆ...ఆఆఆ...ఆఆఆఆ (Long Bit)
ఆమె మనసు పలికే
అతడు మనసు పలికే
ఆమె మౌనగీతం
అతడు మౌనగీతం
ఆమె మనసుపలికే మౌనగీతం నీదే... (Bit) మమత లొలికే
అతడు మమతలొలికే
ఆమె స్వాతిముత్యం
అతడు స్వాతిముత్యం
ఆమె మమతలొలికే స్వాతిముత్యం నీవే (Bit)
అణువు అణువు ప్రణయ మధువూ ॥2॥
తనువు సుమధనువూ...
అతడు ఊ..ఊఊ...మనసు పలికే మౌనగీతం నీదే (Bit)
ఆమె మమతలొలికే స్వాతిముత్యం నీవే

::::: BIT :::::

చరణం

ఆమె శిరసుపైనీ గంగనై మరుల జలకాలాడనీ
అతడు మరుల జలకాలాడనీ
బృందం ఆ...ఆ...ఆ..
ఆమె సగము మేన గిరిజనై పగలు రేయి ఒదగనీ
అతడు పగలురేయి ఒదగనీ
బృందం ఆ...ఆ...ఆ...
ఆమె హృదయమేళనలో...మధుర లాలనలో ॥2॥
వెలిగిపోనీ (Bit) రాగదీపం (Bit)
వెలిగిపోనీ రాగదీపం వేయి జన్మలుగా...

Contd...

అతడు	మనసు పలికే మౌనగీతం
ఆమె	నీదే...
అతడు	మమతలొలికే స్వాతిముత్యం
ఆమె	నీవే...

:::::: BIT :::::

చరణం
బృందం	ఆఆఆఆఆ...ఆఆఆఆఆఆ... (Long Bit)
ఆమె	కానరానీ ప్రేమకే ఓనమాలు దిద్దనీ..
అతడు	ఓనమాలు దిద్దనీ
బృందం	ఆఆఆ....
ఆమె	పెదవిపైనీ ముద్దునై...మొదటి తీపి అద్దనీ
అతడు	మొదటి తీపి....
బృందం	ఆఆఆ...
ఆమె	లలితయామినిలో...కలలకౌముదిలో
అతడు	లలితయామినిలో...కలలకౌముదిలో
ఆమె	కరిగిపోనీ (Bit) కాలమంతా (Bit)
	కరిగిపోనీ కాలమంతా... కౌగిలింతలుగా...
అతడు	మనసు పలికే
ఆమె	మనసు పలికే
అతడు	మౌనగీతం
ఆమె	మౌనగీతం
అతడు	మనసుపలికే మౌనగీతం నీదే... (Bit) మమతలొలికే
ఆమె	మమతలొలికే
అతడు	స్వాతిముత్యం
ఆమె	స్వాతిముత్యం
అతడు	మమతలొలికే స్వాతిముత్యం
ఆమె	నీవే... (Bit)
అతడు	అణువు అణువు ప్రణయ మధువూ ॥2॥
	తనువు సుమధనువూ... (Followup Music)

★★★

## స్వాతిముత్యం (1986)

రచన : సి. నారాయణరెడ్డి  గానం : సుశీల

:::::: Opening Music ::::::

పల్లవి  లాలీ లాలీ లాలీ లాలీ...లాలీ లాలీ లాలీ లాలీ
వటపత్రశాయికీ వరహాల లాలి.. రాజీవనేత్రునికి రతనాల లాలి ॥2॥
మురిపాల కృష్ణునికీ... (Bit) ఆఆఆ...ఆఆఆ...
మురిపాల కృష్ణునికి...ముత్యాల లాలి
జగమేలు స్వామికి పగడాల లాలీ
వటపత్రశాయికీ వరహాల లాలి... రాజీవనేత్రునికి రతనాల లాలి
లాలీ లాలీ లాలీ లాలీ...లాలీ లాలీ లాలీ లాలీ

:::::: BIT :::::

చరణం  కల్యాణ రామునికి కౌసల్య లాలి ॥2॥
యదువంశ విభునికి యశోద లాలీ ॥2॥
కరిరాజముఖునికీ..కరిరాజముఖునికి గిరితనయ లాలి
కరిరాజముఖునికి గిరితనయ లాలి
పరమాంశభవునికి పరమాత్మ లాలి
వటపత్రశాయికీ వరహాల లాలి ... రాజీవనేత్రునికి రతనాల లాలీ

:::::: BIT :::::

చరణం  జో జో జో జో...జో...జో జో జో జో...జో...
అలమేలుపతికీ అన్నమయ్య లాలి ॥2॥
కోదండరామునికి గోపయ్య లాలి ॥2॥
శ్యామలాంగునికి శ్యామయ్య లాలి...॥2॥
ఆగమనుతునికి త్యాగయ్య లాలీ
వటపత్రశాయికీ వరహాల లాలి... రాజీవనేత్రునికి రతనాల లాలీ
మురిపాల కృష్ణునికి...ముత్యాల లాలి
జగమేలు స్వామికి పగడాల లాలీ
వటపత్రశాయికీ వరహాల లాలి రాజీవనేత్రునికి రతనాల లాలి
లాలీ లాలీ లాలీ లాలీ...లాలీ లాలీ లాలీ లాలీ

★★★

## స్వాతిముత్యం (1986)

రచన : సి. నారాయణరెడ్డి గానం : బాలు, జానకి

పల్లవి

అతడు ఆ..ఆఆ..ఆ..ఆఆఆఆ..ఆఆ..ఆ..ఆ..ఆఆ..అ

ఆమె (వచనం) చాలా బాగ పాడుతున్నారే

అతడు ఆ...పై షడ్జమం...ఆ..మంద్రం...ఆ...ఆ...ఆ...

ఆమె చూడండి..ఆ...ఆ...ఆ...ఆ...ఆ...హో

అతడు ఆఆఆఆ...ఆఆఆ...ఆఆఆ...ఆఅఅఅఅఆ...

ఆమె నిసరిమ...పనిసరి...నిరిరిస...నిపమ పనిసా
నిపమరి మరీ...నీసా...తాననవా...తానాన...తదరీ నా...ఆఆఆ...

అతడు సువ్వి సువ్వి సువ్వాలమ్మ సీతాలమ్మా (Bit)
గువ్వాముువ్వా సవ్వాడల్లే నవ్వాలమ్మా (Bit)
సువ్వీ సువ్వీ సువ్వాలమ్మా...సీతాలమ్మా

ఆమె గువ్వాముువ్వా సవ్వాడల్లే నవ్వాలమ్మా...అ...అ...అ..

అతడు హా..హా...హ

ఆమె ఆ...ఆ...ఆ... సువ్వీ సువ్వీ సువ్వాలమ్మా...సీతాలమ్మా (Bit)

అతడు సువ్వీ...సువ్వీ....సువ్వీ

ఆమె సువ్వీ...సువ్వీ....సువ్వీ

ఇద్దరు సువ్వీ సువ్వీ సువ్వాలమ్మా...సీతాలమ్మా

:::::: BIT :::::

చరణం

అతడు ఓ..ఓ..హే..హే..హే.. (Bit)
అందా దండా వుండాలని కోదండరాముని నమ్ముకుంటే

ఆమె అందా దండా వుండాలని కోదండరాముని నమ్ముకుంటే

అతడు గుండేలేని మనిషల్లే నిను కొండా కోనల కొదిలేశాడా

ఆమె గుండే లేని మనిషల్లే..

అతడు గుండేలేని మనిషల్లే నిను కొండా కోనల కొదిలేశాడా
అగ్గిలోన దూకీ...(Bit) పువు మొగ్గలాగా తేలిన నువ్వు

Contd...

నెగ్గేవమ్మా ఒకనాడు నింగీ నేలా నీ తోడూ
ఆమె	నెగ్గేవమ్మ ఒకనాడు ...నింగీ నేలా నీతోడూ
హూ...సువ్వి సువ్వి సువ్వీ...సువ్వీ...సువ్వీ...సువ్వీ
అతడు	సువ్వి సువ్వి సువ్వాలమ్మ సీతాలమ్మా

:::: BIT ::::

చరణం

అతడు	చుట్టూ ఉన్నా చెట్టూచేమా...తోబుట్టువులింకా నీకమ్మా ॥2॥
ఆగక పొంగే కన్నీళ్లే...నీ ఆకలిదప్పులు తీర్చేనమ్మా ॥2॥
పట్టిన గ్రహణం విడిచీ (Bit)
నీ బతుకున పున్నమి పండే ఘడియ
వస్తుందమ్మా ఒకనాడు..చూస్తున్నాడు పైవాడూ
ఆమె	వస్తుందా ఆనాడు...హూ..చూస్తాడా ఆ పైవాడూ
అతడు	సువ్వి సువ్వి..సువ్వీ

★★★



## మంచి మనసులు (1986)

రచన : ఆచార్య ఆత్రేయ గానం : బాలు

పల్లవి బాబిల్లికోసం ఆకాశమల్లే...వేచాను నీరాకకై ॥2॥ (Long Bit)
బాబిల్లికోసం ఆకాశమల్లే...వేచాను నీరాకకై ॥2॥
నినుకానలేక..మనసూరుకోక...పాడాను నేనూ పాటనై
బాబిల్లికోసం ఆకాశమల్లే...వేచాను నీరాకకై ॥2॥

:::::: BIT :::::

చరణం నువ్వక్కడ...నేనిక్కడ...పాటిక్కడ..పలుకక్కడ
మనసొక్కటి కలిసున్నది ఏనాడైనా } ॥2॥
ఈ పువ్వులనే...నీనవ్వులుగా...ఈ చుక్కలనే...నీ కన్నులుగా
నునునిగ్గుల ఈ మొగ్గలు...నీ బుగ్గలుగా
ఊహల్లో తేలీ..ఉర్రూతలూగీ
మేఘాలతోటి రాగాల లేఖ..నీకంపినానూ...రావాదేవీ
బాబిల్లికోసం ఆకాశమల్లే...వేచాను నీరాకకై
నినుకానలేక..మనసూరుకోక...పాడాను నేనూ పాటనై
బాబిల్లికోసం ఆకాశమల్లే...వేచాను నీరాకకై

:::::: BIT :::::

చరణం నీపేరొక జపమైనది...నీప్రేమొక తపమైనది
నీ ధ్యానమె వరమైనది ఎన్నాళ్లైనా } ॥2॥
ఉండీలేకా....ఉన్నది నీవే...ఉన్నాకూడా...లేనిది నేనే
నా రేపటి అడియాసల రూపంనీవే
దూరాన వున్నా...నాతోడు నీవే
నీ దగ్గరున్నా..నీనీడ నాదే..నాదన్నదంతా నీవే...నీవే
బాబిల్లికోసం ఆకాశమల్లే...వేచాను నీరాకకై
నినుకానలేక..మనసూరుకోక...పాడాను నేనూ పాటనై
బాబిల్లికోసం ఆకాశమల్లే...వేచాను నీరాకకై...
వేచాను నీ రాకకై...

★★★

## మంచి మనసులు (1986)

రచన : **ఆచార్య ఆత్రేయ** గానం : **బాలు, జానకి**

:::::: Opening Music ::::::

పల్లవి

**అతడు** **ఆ...ఆఆఆ...ఆఆఆ...ఆఆఆ...** (Long Bit)
ఈ సంజ కెంజాయ కుంకుమలో...ఎన్నెన్ని రేపటి కోరికలో...
పరువములో...సరిగమలో... హృదయములో...స్వరజతులో...
ఈ సంజ కెంజాయ కుంకుమలో...ఎన్నెన్ని రేపటి కోరికలో...

:::::: BIT ::::::

చరణం

**ఆమె** ఇంద్ర ధనస్సున ఎన్నియుగాలుగ...ఏడే రంగులుగా...
**అతడు** నిండు మనస్సున నిమిషం నిమిషం...ఎన్నో పొంగులుగా... (Bit)
**ఆమె** పొంగుల ప్రాయంలా...ఇవి రంగుల స్వప్నాలూ (Bit)
**అతడు** రంగుల స్వప్నాలలో...అనురాగపు రాజ్యాలూ...(Bit)
**ఆమె** ఎన్నెన్నిటా నీ వన్నెలే...అన్నన్నిటా నీ హంగులే
దిశలే...నొసట తిలకం అలదిన
ఈ సంజ కెంజాయ కుంకుమలో...ఎన్నెన్ని రేపటి కోరికలో...
పరువములో...సరిగమలో... హృదయములో...స్వరజతులో...
**ఈ సంజ కెంజాయ కుంకుమలో...ఆ...ఆ...ఆ...**
**అతడు** సరిమగరిస (Bit)
**ఆమె** రిగమగమగ (Bit)
**అతడు** సగరిసగమ (Bit)
**ఆమె** గసరిగమగ...మగమగసరి..సాస..సాస...సాస...సాస
గరిగరి రిస పద దమమగ...(Bit)
**అతడు** రీరి రీరి రీరి రీరి...రిగమగ సరి రిస సగదమ

:::::: BIT ::::::

Contd...

చరణం

అతడు  కన్నులు కన్నులు కలసిన వేళే వెన్నెల కాచినదీ...
ఆమె  కాచిన వెన్నెల పూచిన మల్లెల కానుక లిచ్చినదీ (Bit)
అతడు  ఇచ్చిన కానుకలో...నులివెచ్చని కోరికలూ (Bit)
ఆమె  వెచ్చని కోరికలో...మనసిచ్చిన వేడుకలూ(Bit)
అతడు  నీ కన్నులే...నీలాంబరం (Bit)
ఆమె  నీ కౌగిలే...కనకాంబరం (Bit)
అతడు  మరులే విరులై విరిసే క్షణమున...ఈ సంజ కెంజాయ కుంకుమలో
ఆమె  ఎన్నెన్ని రేపటి కోరికలో...
అతడు  పరువములో...సరిగమలో...
ఆమె  హృదయములో...స్వరజతులో... ఈ సంజ కెంజాయ కుంకుమలో
అతడు  అ...అ...అ...అ...

★★★



## మనసులో మాట

అప్పుడే పుట్టిన పసిపాపలా వుండేదే నా దృష్టిలో మంచి సంగీతం అంటే ! వినగానే అది కొత్తగా అనిపించాలి. వినే శ్రోతకి ఒక కొత్త అనుభూతిని మిగల్చాలి.

– ఇళయరాజా

## నిరీక్షణ (1986)

రచన : ఆచార్య ఆత్రేయ                                                  గానం : జానకి

:: Opening Music ::

పల్లవి    లాలాల లాలాలలా...లాలాలా...లాలాలలా (Bit)
లాలాలా లాలాల లాలల...లాలాలా...లాలాలలా
ఆకాశం ఏనాటిదో...అనురాగం ఆనాటిది ॥2॥
ఆవేశం ఏనాడు కలిగెను...ఆనాడే తెలిసిందది ॥2॥
ఆకాశం ఏనాటిదో...అనురాగం ఆనాటిది ॥2॥

:::::: BIT :::::

చరణం    లాలాలాలా...లాలా (Bit) ఆఅఆ...లాలాలాలా...లాలా..ఆ..లాలా (Bit)
ఏ పువ్వు ఏతేటిదన్నది..ఏనాడో రాసున్నదీ
ఏ ముద్దు ఏమోవిదన్నది...ఏ పొద్దో రాసున్నదీ
బంధాలై పెనవేయు వయసుకు..అందాలే దాసోహమనగా
మందారం విరబూయు పెదవులు...మధువులనే చవి చూడమనగా
పరువాలే...ప్రణయాలై...స్వప్నాలే...స్వర్గాలై...
ఎన్నెన్నో శృంగార లీలలు కన్నుల్లో రంగేళి అలదెను
ఆకాశం ఏనాటిదో...అనురాగం ఆనాటిది
ఆవేశం ఏనాడు కలిగెను...ఆనాడే తెలిసిందది
ఆకాశం ఏనాటిదో...అనురాగం ఆనాటిది

:::::: BIT :::::

చరణం    ఏ మేఘం ఏ వానచినుకై...చిగురాకై మొలకెత్తునో
ఏ రాగం ఏ గుండెలోతున...ఏ గీతం పలికించునో
హృదయాలే తెరతీసి తనువుల కలబోసీ మరపించమనగా
కౌగిలిలో చెరవేసి మదనుని కరిగించీ గెలిపించమనగా
మోహాలే...దాహాలై...సరసాలే...సరదాలై..
కాలాన్నే నిలవేసి కలలకు ఇవ్వాలీ వెలలేని విలువలు
ఆకాశం ఏనాటిదో...అనురాగం ఆనాటిది
ఆవేశం ఏనాడు కలిగెను...ఆనాడే తెలిసిందది
లాలాలా..లలలలలలలల...లలల లలల లల లల...॥2॥

★★★

# నిరీక్షణ (1986)

రచన : ఆచార్య ఆత్రేయ                గానం : బాలు, శైలజ, బృందం

:::::: Opening Music ::::::

పల్లవి

బృందం  తియ్యన్ని దానిమ్మ కొమ్మల్లోనంటా...
చిన్నారి పొన్నారి చిలకల్లజంటా...
చేస్తున్న కమ్మని కాపురమూ... చూస్తున్న కన్నుల సంబరమూ...
ప్రేమకు మందిరమూ...
తియ్యన్ని దానిమ్మ కొమ్మల్లో నంటా...
చిన్నారి పొన్నారి చిలకల్లజంటా...
చేస్తున్న కమ్మని కాపురమూ... చూస్తున్న కన్నుల సంబరమూ...
ప్రేమకు మందిరమూ...
తియ్యన్ని దానిమ్మ కొమ్మల్లో నంటా...
చిన్నారి పొన్నారి చిలకల్లజంటా... (Bit)
ఆఆఅ...లాలలాలలా...లాలలాలలా...లలలల్లల్లా...లలలల్లల్లా...

:::::: BIT ::::::

చరణం

ఆమె  ఒకదేహం...ఒక ప్రాణం తమస్నేహంగా
సమభావం..సమభాగం తమ పొందుగా..

అతడు  చిలకమ్మ నెయ్యాలె ఉయ్యాలగా...
చెలికాని సరసాలె జంపాలగా...

ఆమె  అనురాగం...ఆనందం అందాలుగా...
అందాల స్వప్నాలే స్వర్గాలుగా...

అతడు  ఎడబాసి మనలేని హృదయాలుగా...
ముడిపడ్డ ఆ జంట తొలిసారిగా...

ఆమె  గూడల్లుకోగా...పుల్లల్లుతేగా...
చెలికాడు ఎటకోపోగా..అయ్యో...పాపం...

అతడు  వేచెను చిలకమ్మ....

బృందం  తియ్యన్ని దానిమ్మ కొమ్మల్లో నంటా
చిన్నారి పొన్నారి చిలకల్ల జంటా... (Long Bit)

Contd...

బృందం లాలాలాలలా...లాలలాలాలాలలా (Bit) లాలాలలాల
లాలాల లాలా లాలాలలా...లాలాలలాలాలలా...

:::::: BIT ::::::

చరణం

ఆమె ఒక వేటగాడెందో వలపన్నగా...
తిరుగాడు రాచిలుక గమనించక...

అతడు వలలోన పడితాను అల్లాదగా...
చిలకమ్మ చెలికాని సడికానక

ఆమె కన్నీరు మున్నీరై విలపించగా...
ఇన్నాళ్ల కలలన్నీ కరిగించగా...

అతడు ఎలుగెత్తి ప్రియురాలు రోదించగా...
వినలేని ప్రియుడేమో తపియించగా...

ఆమె అడివంతా నాదూ...ఆజంట గోడూ...
వినలేక మూగైపోగా...అయ్యో...పాపం...

అతడు ఏడ్చెను చిలకమ్మ...

అందరు తియ్యన్ని దానిమ్మ కొమ్మల్లోనంటా...
చిన్నారి పొన్నారి చిలకల్ల జంటా...
చేస్తున్న కమ్మని కాపురమూ...
చూస్తున్న కన్నుల సంబరమూ...ప్రేమకు మందిరమూ...
తియ్యన్ని దానిమ్మ కొమ్మల్లోనంటా...
చిన్నారి పొన్నారి చిలకల్ల జంటా...

★★★



## నిరీక్షణ (1986)

రచన : ఆచార్య ఆత్రేయ గానం : జేసుదాస్

:: Chord తో ఆలాపన ::

పల్లవి చుక్కల్లే తోచావే...ఎన్నెల్లే కాచావే...ఏడబోయావే...
ఇన్ని ఏలచుక్కల్లో...నిన్ను నేనెతికానే ॥2॥
చుక్కల్లే తోచావే...ఎన్నెల్లే కాచావే...ఏడబోయావే...

:::::: BIT :::::

చరణం పూసిందే ఆ పూలమాను నీ దీపంలో (Bit)
దాగిందే నా పేదగుండె నీతాపంలో (Bit)
ఊగానే...నీపాటలో ఉయ్యాలై...
ఉన్నానే ఈనాటికీ నేస్తాన్నై...
ఉన్నా...ఉన్నాదొకదూరం...ఎన్నాళ్లకు చేరం...
తీరందీ నేరం
చుక్కల్లే తోచావే...ఎన్నెల్లే కాచావే...ఏడబోయావే...

:::::: BIT :::::

చరణం తానాలే చేశాను నేను నీ స్నేహంలో (Bit)
ప్రాణాలే దాచావు నీవు నా మోహంలో (Bit)
ఆనాటి...నీ కళ్లలో నా కళ్లే...
ఈనాటి నా కళ్లలో కన్నీళ్లే...
ఉందా...కన్నీళ్లకు అర్థం ఇన్నేళ్లుగ వ్యర్థం
దక్కిందే రాజ్యం...
చుక్కల్లే తోచావే...ఎన్నెల్లే కాచావే...ఏడబోయావే...
ఇన్ని ఏలచుక్కల్లో...నిన్ను నేనెతికానే ॥2॥
చుక్కల్లే తోచావే...ఎన్నెల్లే కాచావే...ఏడబోయావే...

★★★

## ఆలాపన (1986)

రచన : సి. నారాయణరెడ్డి　　　　గానం : బాలు, జానకి

పల్లవి

అతడు　ఆ...ఆ...ఆఆ...ఆఆఆ...అఅఅ...అఅఆ...అఆ...అ...
అఅఅఅఅఅ...అఅఅఆ...ఆ..ఆ..ఆ..(Long Bit)
ఆ..కనులలో కలల నాచెలీ (Bit) ఆ..లాపనకు ఆదిమంత్రమై (Bit)
గొంతులోన గుండె పిలుపులా...సంధ్యలోన అందె మెరుపులా ॥2॥
ఆ...కనులలో కలల నాచెలీ (Bit) ఆలాపనకు ఆదిమంత్రమై

:::::: BIT :::::

చరణం

ఆమె　దిద్దితై..కిటతై..ధిమితై...తక ॥2॥
అతడు　అ...అ...ఆ...ఆ...అ...
ఆమె　దిద్దితై..కిటతై..ధిమితై...తక ॥2॥
తకధిమి తకఝుణు...తకధిమి తకఝుణు ॥2॥
తోం తకిటత...తకిటత ...తోం తకిటత...తకిటత
తకిట...తకిట...తకిట...తకిట...తకధిమి (Long Bit)
అతడు　నిదురించువేళా..
ఆమె　దసనిస...దసనిస...దనిదనిమా
అతడు　హృదయాంచలాన...
ఆమె　ఆఆఆఆ...అఆఆఆ...ఆఆఆఆ...ఆ..
అతడు　అలగా పొంగెను నీ భంగిమ (Bit)
ఆమె　గగ..సనిసా
అతడు　అది రూపొందిన స్వర మధురిమ (Bit)
ఆమె　సనిదనిసా
అతు　ఆ రాచనడక...రాయంచకెరుక ॥2॥
ప్రతి అడుగు శ్రుతి మయమై... కళకణమున రసధునులను మీటిన
ఆ..కనులలో కలల నాచెలీ (Bit) ఆ..లాపనకు ఆదిమంత్రమై (Bit)
గొంతులోన గుండె పిలుపులా (Bit) సంధ్యలోన అందె మెరుపులా (Bit) ॥2॥
ఆ కనులలో కలల నాచెలీ (Bit) ఆలాపనకు ఆదిమంత్రమై (Bit)
ఆమె　మగసా
అతడు　ఆఆఆ...ఆఆఆ..

Contd...

| | |
|---|---|
| ఆమె | సనిదమగ...మగసా |
| అతడు | ఆఆఆ...ఆఆఆ... |
| ఆమె | గసనిదమమ...దనిసా |
| అతడు | ఆ..ఆ..ఆ... |
| ఆమె | మదనీ... |
| అతడు | ఆఆఆఆ... |
| ఆమె | సాని...దని...సగమాగ...సగమగ...నిదసనిద మగ...<br>దమగస సమదని |
| అతడు | తకతకిట...తకఝణుత...తకధిమిత (Simultaneously) |

:::::: BIT :::::

చరణం

| | |
|---|---|
| అతడు | నీ రాకతోనే |
| ఆమె | అఅ...అఅ...అఅ...అఅ...అఅఅఅ... |
| అతడు | ఈ లోయలోనే |
| ఆమె | దసనిస...దసనిస...దనిదనిమా |
| అతడు | అణువులు మెరిసెను మణిరాసులై (Bit) |
| ఆమె | అఅఅఅఅ... |
| అతడు | మబ్బులు తేలెను పలువన్నెలై (Bit)<br>ఆ వన్నెలన్నీ..ఆ చిన్నెలన్నీ ॥2॥<br>ఆకృతులై...సంగతులై అణువణువున పులకలు ఒలికించిన<br>ఆ..కనులలో కలల నాచెలీ (Bit) ఆ..లాపనకు ఆదిమంత్రమై (Bit)<br>గొంతులోన గుండె పిలుపులా (Bit) సంధ్యలోన అందె మెరుపులా (Bit) ॥2॥<br>ఆ కనులలో కలలనాచెలీ (Bit) ఆలాపనకు ఆదిమంత్రమై (Bit) |

★★★



## ఆలాపన (1986)

రచన : **సి. నారాయణరెడ్డి** గానం : **బాలు, జానకి**

పల్లవి

అతడు కలిసె(Bit) ప్రతి సంధ్యలో (Bit) కలిగె (Bit) **పులకింతలో** (Bit) ॥2॥
నాట్యాలన్ని ...కరగాలి (Bit) నీలోనేనే ...మిగలాలి (Bit) ॥2॥

ఆమె కలిసె(Bit) ప్రతి సంధ్యలో (Bit) పలికె (Bit) ప్రతి అందెలో...

:::::: **BIT** :::::

చరణం

అతడు పొంగిపోదా సాగరాత్మా నింగికి ఆమె : ఆఆఆ..
అతడు చేరుకోదా చంద్ర హృదయం నీటికి ఆమె : ఆఆఆ...
అతడు పొంగిపోదా సాగరాత్మా నింగికి ఆమె : ఆఆఆ...
అతడు చేరుకోదా చంద్ర హృదయం నీటికి ఆమె : ఆఆఆ...
అతడు సృష్టిలోన ఉంది ఈ బంధమే (Bit) అల్లుకుంది అంతటా అందమే (Bit)
తొణికే ...బిడియం ...తొలగాలీ... వణికే ...అధరం ...పిలవాలీ...
ఇద్దరు ఆఆఆఆఆ...ఆ..ఆ..అ..ఆఆఆ...ఆఆ..
ఆమె కలిసె (Bit) ప్రతి సంధ్యలో (Bit) పలికె (Bit) ప్రతి అందెలో (Bit)

:::::: **BIT** :::::

చరణం

అతడు మేనితోనే ఆగుతాయి ముద్రలు ఆమె : ఆఆఆ
అతడు గుండెదాకా సాగుతాయి ముద్దులు ఆమె : ఆఆఆ
అతడు మేనితోనే ఆగుతాయి ముద్రలు ఆమె : ఆఆఆ
అతడు గుండెదాకా సాగుతాయి ముద్దులు ఆమె : ఆఆఆ
అతడు వింత తీపి కొంతగా పంచుకో (Bit) వెన్నెలంత కళ్లలో నింపుకో (Bit)
బ్రతుకే ...జతగా ...పారాలీ... పరువం ...తీరం చేరాలీ
ఇద్దరు ఆఆఆఆఆ...ఆ..అ..ఆ..ఆఆఆ..ఆఆ..
ఆమె కలిసె (Bit) ప్రతి సంధ్యలో (Bit) పలికె (Bit) ప్రతి అందెలో (Bit) ॥2॥
నాట్యాలెన్నో ఎదగాలీ (Bit) నాలోనేనే మిగలాలి (Bit) ॥2॥
అతడు కలిసె(Bit) ప్రతి సంధ్యలో (Bit) కలిగె (Bit) **పులకింతలో** (Bit)

★★★

## ఆలాపన (1986)

రచన : **వేటూరి** గానం : **ఇళయరాజా, జానకి**

:: Opening Music ::

పల్లవి

ఆమె తరతత తత తతత..తరర..తరతత తతతా
ప్రియతమా తమా సంగీతం...విరిసె సుమములై వసంతం
అడుగుల సడే మయూరం...అడుగుకో వయ్యారం
పలికిన పదం సరాగం...జరిగెలే పరాగం..
ప్రియతమా తమా సంగీతం...విరిసె సుమములై వసంతం
తరతత తత తతత..తరర..తరతత తతతా..హ్హా హ్హా హ్హా (Bit)

అతడు ఘుం..కఘుం... కఘ్..ఘుం...కఘ్..చకఘుం...
చుఘుం...చుఘుం...చుఘుం...చు...ఆఆఆఆ...చుఘుం...
చుఘుం...చుఘుం...చుఘుం...చుఘుం...చుఘుం...చుఘుం...
చుఘుం...చుఘుం...చుఘుం...చుఘుం...చుఘుం...చుఘుం...
చుఘుం...చుఘుం...చుఘుం...చు...ఆఆఆఆ...చుంఛకు...ఛకు..

:::::: BIT :::::

చరణం

ఆమె రేగే రాగాలన్ని నాలో ఉయ్యాలూగెలే...హా...(Bit)
ఆ...మల్లీమల్లీ నన్ను మత్తెక్కిస్తున్నాయిలే..హోయ్ (Bit)
ఓహో..రేగే రాగాలన్ని నాలో ఉయ్యాలూగెలే ...హా (Bit)
ఊఁ...మల్లీ మల్లీ నన్ను మత్తెక్కిస్తున్నాయిలే...హా...(Bit)
నాలోన లీలగా...నాగస్వరాలుగా...
పూసింది లాలసా...పున్నాగ లా (Bit)
రేయంత ఎండాయె నాగుండెలో...రేరాణి వెన్నెల్లలో
ఈ మోహమెందాక పోతున్నదో...ఈ దేహమింకేమి కాసున్నదో
వలపులే (Bit) పిలువగా (Bit)
ప్రియతమా తమా సంగీతం...విరిసె సుమములై వసంతం
తరతత తత తతత..తరర..తరతత తతతా..హ్హా హ్హా హ్హా

:::::: BIT :::::

Contd...

చరణం

ఆమె హా..హాహా..హా..హాహా..తకతక..ఆ..తకతక..ఆ..(Bit) ఆహాహా..ఆహాహా
పూలే తేనైపోయి నాలో వాగై పొంగెలే...హోయ్ (Bit)
నిన్నే నిన్నే కోరి నాట్యాలనే చేసెలే...హోయ్ (Bit)
ఓఒఓ...పూలే తేనైపోయి..నాలో వాగై పొంగెలే..హోయ్ (Bit)
యే...నిన్నే నిన్నే కోరి నాట్యాలనే చేసెలే...ఆ...(Bit)
నా పాన్పు పంచుకో...ఈ బాధ తీర్చిపో...
శివరాత్రిరవ్వనీ...ఈ రాత్తిరీ (Bit)
తేనెల్లు పొంగాలి చీకట్లలో...కమ్మన్ని కౌగిళ్లలో
నీతోడు కావాలి ఈ జన్మకీ...నేనీడనౌతాను నీ దివ్వెకీ
పెదవిలో...మధువులా...
ప్రియతమా తమా సంగీతం...విరిసె సుమములై వసంతం
తరతత తత తతత..తరర..తరతత తత తా
అడుగుల సదే మయూరం...అడుగుకో వయ్యారం
పలికిన పదం సరాగం...జరిగెలే పరాగం..
ప్రియతమా తమా సంగీతం...విరిసె సుమములై వసంతం
తరతత తత తతత..తరర..తరతత తత తా

★★★



## రాక్షసుడు (1986)

రచన : **వేటూరి** గానం : **బాలు, జానకి**

:: Opening Music ::

పల్లవి

ఆమె లా లలలా..లా లలలా...లలలా...లలలా (Bit)
లా లలలా..లలలా...లలలా (Bit)
అచ్చా అచ్చా (Bit) వచ్చా వచ్చా (Bit) ॥2॥
ఈడు వచ్చాక ఇట్టా వచ్చా (Bit) నువ్వు నచ్చాక నీకే ఇచ్చా (Bit)॥2॥
అచ్చా అచ్చా (Bit) వచ్చా వచ్చా (Bit) ॥2॥

:::::: BIT :::::

చరణం

ఆమె రేతిరవుతుంటే రేగే నాలో కచ్చా...పగటి పూటంతా ఒకటే ఇచ్చా
అతడు నిండు జాబిల్లికైనా వుంది మచ్చ...నీకు లేనందుకే నే మెచ్చా
ఆమె కాచుకో ఘటోత్కచా...కౌగిలే మజా
అతడు అందుకే ఇలా వచ్చా...చూడవే మజా
ఆమె చీకటింట (Bit) చిత్తగించా (Bit) అందమంతా (Bit) అప్పగించా (Bit)
అతడు ముద్దు మురిపాలు ముందే ఇచ్చా...ముద్దబంతుల్లో నిన్నే ముంచా
అచ్చా అచ్చా (Bit) వచ్చా వచ్చా (Bit) ॥2॥
మొదటి గిచ్చుళ్లు నిన్నే గిచ్చా (Bit) మొగ్గ సిగ్గంతా నేనే తుంచా (Bit) ॥2॥

:::::: BIT :::::

చరణం

అతడు సోకు లెన్నెన్నో నీలో నేనే చూచా...మనసుతో పాటు మాటే ఇచ్చా
ఆమె ఎన్ని రాత్రిళ్లో నీకై నేనే వేచా...మనసులో నీకు చోటే ఇచ్చా
అతడు ప్రేమ పూజకే వచ్చా...అందుకో రోజా
ఆమె చందమామనే తెచ్చా...అందుకో రాజా
అతడు మోజులన్నీ (Bit) మోసుకొచ్చా (Bit) ఈడు జోడు (Bit) రంగరించా (Bit)

Contd...

ఆమె	నీకు ప్రేమంటే తెలుసా బచ్చా...
నన్ను ప్రేమిస్తే నువ్వే నచ్చా (వ్)

అతడు	అచ్చా అచ్చా (Bit) వచ్చా వచ్చా (Bit) ॥2॥

ఆమె	ఈడు వచ్చాక ఇట్టా వచ్చా (Bit) నువ్వు నచ్చాక నీకే ఇచ్చా (Bit)

అతడు	మొదటి గిచ్చుళ్లు నిన్నే గిచ్చా (Bit) మొగ్గ సిగ్గంతా నేనే తుంచా (Bit)

ఆమె	అచ్చా అచ్చా (Bit) వచ్చా వచ్చా (Bit)

అతడు	అచ్చా అచ్చా (Bit) వచ్చా వచ్చా (Bit)

★★★



## రాక్షసుడు (1986)

రచన : **వేటూరి** గానం : **బాలు, జానకి**

:: Opening Music ::

పల్లవి

ఆమె ఓ‌ఓ...ఓ‌ఓ...ఓ‌ఓ...ఓ‌ఓ...
ఓఓఓ...ఓఒఓ...ఓఒఓ...ఒఒఓ...(Long Bit)
మల్లీ మల్లీ ఇది రానిరోజూ
మల్లిజాజి అల్లుకున్నరోజూ
అతడు జాబిలంటి ఈ చిన్నదాన్నీ... చూడకుంటే నాకు వెన్నెలేదీ
ఆమె ఏదో అడగాలనీ
అతడు ఎంతో చెప్పాలనీ...
ఆమె రగిలే ఆరాటంలో వెళ్లలేను...ఉండలేను...ఏమికానూ
అతడు మల్లీ మల్లీ ఇది రానిరోజూ
ఆమె మల్లిజాజి అల్లుకున్నరోజూ

:::::: BIT :::::

చరణం

అతడు చేరువైన రాయబారాలే...చెప్పబోతే మాట మౌనం
ఆమె దూరమైన ప్రేమధ్యానాలే..పాడలేని భావగీతం
అతడు ఎండల్లో...వెన్నెల్లో ఏంచేద్దో
ఆమె ఒక్కరం...ఇద్దరం అవుతున్నాం
అతడు వసంతాలు ఎన్నొస్తున్నా...కోకిలమ్మ కబురేదీ?
ఆమె గున్నమావి విరబూస్తున్నా...తోటమాలి జాడేదీ?
అతడు నా ఎదే తుమ్మెదై సన్నిధే చేరగా
ఆమె మల్లీ మల్లీ ఇది రానిరోజూ
అతడు మల్లిజాజి అల్లుకున్నరోజూ...

:::::: BIT :::::

Contd...

చరణం

ఆమె కళ్లనిండా నీలి స్వప్నాలే...మోయలేని వింతమోహం
అతడు దేహమున్న లేవు ప్రాణాలే...నీవు కాదా నాకు ప్రాణం
ఆమె సందిట్లో ఈ మొగ్గే పూయనీ...
అతడు రాగాలే బుగ్గల్లో దాయనీ...
ఆమె గులాబీలు పూయిస్తున్నా...తేనెటీగ అతిథేదీ
అతడు సందెమబ్బు లెన్నోస్తున్నా...స్వాతి చినుకు తడుపేదీ
ఆమె రేవులో నావలా..నీజతే కోరగా
అతడు జాబిలంటి ఈ చిన్నదాన్నీ
ఆమె చూడకుంటె నీకు వెన్నెలేదీ
అతడు ఏదో అడగాలనీ
ఆమె ఎంతో చెప్పాలనీ
అతడు రగిలే ఆరాటంలో వెళ్లలేను...ఉండలేను..ఏమికానూ
ఆమె హా...మళ్లీ మళ్లీ ఇది రాని రోజూ
అతడు మల్లిజాజి అల్లుకున్నరోజూ...
ఆమె లాలా లాలా లాల లాల లాలా
అతడు ఊహు ఊహు...ఆహా ఆహా హాహా

★★★



## రాక్షసుడు (1986)

రచన : **వేటూరి** గానం : **బాలు, జానకి**

:: Opening Music ::

పల్లవి

ఆమె గిలిగా గిలిగిలిగా గిలిగింతగా (Bit)
అతడు కసిగా కసికసిగా కవ్వింతగా (Bit)
ఆమె ఒళ్లంత తుళ్లింతలై
అతడు వాటేసుకున్నంతలై
ఆమె జపించి నీపేరే నే తపించి పోతున్నా
తెలుసా హే..పురుషోత్తమా...
అతడు గిలిగా గిలిగిలిగా గిలిగింతగా (Bit)
ఆమె కసిగా కసికసిగా కవ్వింతగా (Bit)

:::::: BIT :::::

చరణం

ఆమె వయసే నడినెత్తి కెక్కిందీ ఈ పూటా
పైటే చలిపుట్టి జారిందయ్యో!
అతడు వలపే కుడికన్ను కొట్టిందీ రమ్మంటా
పెదవే తడిచేసుకుందామమ్మో!
ఆమె ఒదిగీ ఒక్కటైతే...ఒకటే గొడవైతే
ఇంకా ప్రేమకథా ముదిరేనయ్యా
అతడు పసుపు చెక్కిళ్లో ఎరుపు దుమారం
ఆమె చిలిపీ చూపులకే వణికె వయ్యారం
అతడు పగలే కోరికలూ...పడుచూ అల్లికలూ
ఆమె ముదిరి ముదిరి మనువు కుదిరి
మనసు మనసు కలిసిన సిరిలో
అతడు గిలిగా గిలిగిలిగా గిలిగింతగా (Bit)
ఆమె కసిగా కసికసిగా కవ్వింతగా (Bit)
అతడు ఒళ్లంత తుళ్లింతలై

Contd...

ఆమె వాటేసుకున్నంతలై
అతడు జపించి నీపేరే
ఆమె నే తపించి పోతున్నా తెలుసా హే..పురుషోత్తమా
అతడు గిలిగా గిలిగిలిగా గిలిగింతగా (Bit)
ఆమె కసిగా కసికసిగా కవ్వింతగా

:::::: BIT :::::

చరణం
అతడు ఎండావానల్లో నీళ్లాడే అందాలు
ఎదలో చప్పట్లే వేసేనమ్మో
ఆమె మసక చీకట్లో చిగురేసే పరువాలు
మతినే పోగొడితే ఎట్టాగయ్యో?
అతడు నిదరే కరువైతే...కలలే బరువైతే
వయసూ గుప్పిళ్లే తెరవాలమ్మో
ఆమె సొగసూ తోటల్లో పడుచువయారం
అతడు వడిసి పట్టగనే ఎంత సుతారం
ఆమె అడిగే కానుకలూ...కరిగే కాటుకలూ
అతడు చిలిపి చిలిపి వలపు లిపిని
కలికి చిలుక గిలికిన సడిలో
ఆమె గిలిగా గిలిగిలిగా గిలిగింతగా (Bit)
అతడు కసిగా కసికసిగా కవ్వింతగా (Bit)
ఆమె ఒళ్లంత తుళ్లింతలై
అతడు వాటేసుకున్నంతలై
ఆమె జపించి నీపేరే నే తపించి పోతున్నా
తెలుసా హే..పురుషోత్తమా
అతడు గిలిగా గిలిగిలిగా గిలిగింతగా (Bit)
ఆమె కసిగా కసికసిగా కవ్వింతగా (Bit)

★★★

## రాక్షసుడు (1986)

రచన : **వేటూరి** గానం : **బాలు, జానకి**

:: Opening Music ::

పల్లవి

ఆమె నీమీద నాకు ఇదయ్యో...అందం..నే దాచలేను...పదయ్యో
గిజిగాడి గిచ్చుళ్లాయే...చలిగాలి చిచ్చాయే...
చేయించు తొలిమరియాద...యా..యా...యా...యా...

అతడు నీమీద నాకు అదమ్మో...పందెం...నీఅంతు చూస్తా..పదమ్మో
నీ కళ్ల కవ్విస్తుంటే...ఆకళ్లు మోపాయే...
చేస్తాను తొలిమరియాద...యా..యా..యా..యా..

ఆమె నీమీదనాకు ఇదయ్యో...

అతడు పందెం...నీఅంతు చూస్తా..పదమ్మో...
హే...లబా... స్రుబా..కజాకినారుసదా జికెవీ (Bit)
హే...లజై..సగా లసాచీ నయిజా...(Bit)
కురియ...కురియాకు కురియాచి కురియ
చురియ....చురియాకు కురియా...హో...
చొరియ...చొరియాచు కురియాకొ కొరియ
కొరియ...చురియా...చు కురియా...

:::::: BIT :::::

చరణం

ఆమె నీవంటి మగమహారాజే మగడే అయితే
నావంటి కాంతామణికీ బ్రతుకే హోయీ...

అతడు నీవంటి భామామణులూ దొరికేవరకే
ఈబ్రహ్మచారి పొగరూ కలుపూ చేయీ...

ఆమె నీ వీర శృంగారాలే...నీ వీర శృంగారాలే
చూపించవా...ఒకసారీ...ఒడిచేరీ...

అతడు నీమీద నాకు అదమ్మో...

ఆమె అందం..నే దాచలేను...పదయ్యో...

Contd...

చరణం

అతడు నీచాటు సరసం చూసీ గుబులే కలిగే...
నీనాటు వరసే చూసీ వలపే పెరిగే...
ఆమె నీచేతివాటం చూసీ ఎదలే అదిరే...
నీలేత మోసం చూసీ వయసే వలచే...
అతడు నీ ముద్దమందారాలే...నీముద్దమందారాలే
ముద్దాడనా...ప్రతిరేయీ...జతచేరీ..
ఆమె నీమీద నాకు ఇదయ్యో...అందం..నే దాచలేను...పదయ్యో
అతడు నీ కళ్లు కవ్విస్తుంటే...ఆకళ్లు మోపాయే...
చేస్తాను తొలిమరియాద...యా..యా..యా..యా..
ఆమె నీమీదనాకు ఇదయ్యో...
అతడు పందెం...నీఅంతు చూస్తా..పదమ్మో...

★★★

## మీకు తెలుసా?

రాక్షసుడు (1986) చిత్రంలో వేటూరి పాట "నీ మీద నాకు ఇదయ్యో ..." రికార్డింగ్ సమయంలో ఒక విచిత్రం జరిగింది. "పందెం నీ అంతుచూస్తా పదమ్మో" అనే లైనుతో పల్లవి ముగింపు రాశారు వేటూరి. ఇళయరాజాకు యీ లైను వెంట ఒక హమ్మింగ్ పెడితే బాగుంటుందనిపించి, బాలుని ఏదైనా పదాలతో కూడిన హమ్మింగ్ ఇవ్వమన్నారు. బహుముఖ ప్రజ్ఞాశాలి బాలుకి ఆలోచించాల్సి అవసరం లేదుకదా ! ఎదురుగా ఇళయరాజా గురువు జి.కె. వెంకటేష్‌గారు (జి.కె.వి.) కనిపించారు. అంతే... "హే.... లబా స్రుబా.. కజాకినారు సదా... జి.కె.వీ... కొరియ.. చురియా.. చు... కురియా" అంటూ అర్థంలేని పదాలు పాడారు. ఇదేదో ఒరియా భాష అనుకున్నారు అంతా. అది జిబ్రిష్ లాంగ్వేజ్ (అర్థంలేని భాష) అని చాలామందికి ఇప్పటికీ తెలియదు.

## ఒక రాధ ఇద్దరు కృష్ణులు (1986)

రచన : **వేటూరి** గానం : **బాలు, జానకి, బృందం**

పల్లవి

ఆమె ఆ...ఆ..ఆ..ఆహ్...హాహాహాహ్..హాఆ...ఆఆఆఆ...హొ

బృందం లలలలలల లలలలలలలా...ఆహాహా...లాలాలలాలా..
లలలలలల...లలలలలల...లలలలలల...లలలలలల

ఆమె మధురమురళి హృదయ రవళి
అధర సుధల యమున పొరలి పొంగే..ఎదపొంగే
ఈ బృందావిహారాలలోనా (Bit) నా అందాలు నీవేరా కన్నా (Bit) ॥2॥

అతడు మధురమురళి హృదయ రవళి
ఎదలు కలుపు ప్రణయ కదలి సాగే...సుడిరేగే
ఈ బృందావిహారాలలోనా (Bit) ఎవరున్నారు రాధమ్మకన్నా (Bit) ॥2॥

:::::: BIT :::::

చరణం

ఆమె గోధూళివేళల్లో...గోపెమ్మ కౌగిట్లో...
లేలేత వన్నేచిన్నే దోచే వేళల్లో (Bit)

అతడు పున్నాగ తోటల్లో...సన్నాయి సందిట్లో...
నాజూకులన్నీ నాకే దక్కే వేళల్లో (Bit)

ఆమె పగలో అవతారం...రాత్రో శృంగారం..
ఎదలో తారంగం శ్రీవారికీ (Bit)

అతడు రాగాలెన్నైనా వేణువు ఒకటేలే...
రూపాలెన్నైనా హృదయం ఒకటేలే

ఆమె నాదే నీ గీతమూ... ఇక నీదే ఈ సరసాల సంగీతం

అతడు మధురమురళి హృదయ రవళి
ఎదలు కలుపు ప్రణయ కదలి సాగే...సుడిరేగే

ఆమె ఈ బృందావిహారాలలోనా (Bit) నా అందాలు నీవేరా కన్నా (Bit)

అతడు ఈ బృందావిహారాలలోనా (Bit) ఎవరున్నారు రాధమ్మకన్నా

బృందం ఆ..అ..అ..ఆఅ..ఆఅ..లలల్లలా...లలల్లలా...
లలల్లలా...లలల్లలా...లాలాలా...లాలాలా...లాలాలా...లాలాలా

Contd...

:::::: **BIT** :::::

చరణం

| | |
|---|---|
| అతడు | హేమంతవేళల్లో..లేమంచు పందిట్లో.. |
| | నావీణ ఉయ్యాలూగే..నీలో ఈనాదే (Bit) |
| ఆమె | కార్తీక వెన్నెల్లో..ఏకాంత సీమల్లో.. |
| | ఆరాధనేదో సాగే..అన్నీ నీవాయే (Bit) |
| అతడు | ముద్దే మందారం..మనసే మకరందం.. |
| | సిగ్గే సిందూరం శ్రీదేవికీ..(Bit) |
| ఆమె | అందాలెన్నైనా అందేదొకటేలే |
| | ఆరు ఋతువుల్లో ఆమని మనదేలే |
| అతడు | పాటే...అనురాగమూ..మనబాటే ఓ అందాల అనుబంధం |
| ఆమె | మధురమురళి హృదయ రవళి |
| | అధర సుధల యమున పొరలి పొంగే..ఎదపొంగే |
| అతడు | ఈ బృందావిహారాలలోనా (Bit) ఎవరున్నారు రాధమ్మకన్నా (Bit) |
| ఆమె | ఈ బృందావిహారాలలోనా (Bit) నా అందాలు నీవేరా కన్నా (Bit) |

★★★



## ఒకరాధ - ఇద్దరు కృష్ణులు (1986)

రచన: **వేటూరి** గానం : **బాలు, జానకి**

:::::: Opening Music ::::::

పల్లవి

అతడు దుంచకు దుంచకు దుంచకు దుంచకు... దుంచకు దుంచకు
దుంచకు దుంచకు... దుంచకు దుంచకు దుంచకు దుంచకు...
దుంచకు దుంచకు దుంచకు దుంచకు... దుంచకు దుంచకు
దుంచకు దుంచకు... దుంచకు దుంచకు దుంచకు దుంచకు...
దుంచకు దుంచకు దుంచకు దుంచకు... దుంచకు దుంచకు...
దుంచకు దుంచకు..దుం..

ఆమె } లాలల్లలా...లాలలల్లల్లా
అతడు } లాలాలాలాలాలాలాలా... (Bit) (సమాంతరంగా)
ఏమి తుంటరి పిలగాడే...ఎన్ని చొరవలు చేశాడే...
ఎంత అల్లరి చినవాడే..ఎదను అల్లుకుపోయాడే..
సుప్వీ సుప్వీ సువ్వాలా వాలా...సిగ్గే పువ్వై పుయ్యాలా నాలా ॥2॥
ఏమి తుంటరి పిలగాడే...ఎన్ని చొరవలు చేశాడే...
ఎంత అల్లరి చినవాడే..ఎదను అల్లుకుపోయాడే..

:::::: BIT ::::::

చరణం

ఆమె ఎలా ఒదిగిపోనమ్మా...ఇలా అతనితో హాయ్.. (Bit)
బలే చిలిపి వాడమ్మా..కౌగిలింతలో... (నవ్వుతో)
జలకాలాటల్లో...చలి చాపౌతాడు...
నిదరోయేవేళ...కలలా వస్తాడు...

అతడు తెలుసుకోవే తొలిప్రేమా.. (Bit) వయసు విచ్చిన ప్రియభామా.. (Bit) ॥2॥
రావే రాధమ్మా...ఏదో బాధమ్మా...॥2॥
ఎదా పదా ఇక లేదమ్మా...

ఆమె ఏమి తుంటరి పిలగాడే...ఎన్ని చొరవలు చేశాడే...

అతడు అహ్హహ్హహ్హా (నవ్వు)

ఆమె ఎంత అల్లరి చినవాడే..ఎదను అల్లుకుపోయాడే.. (Bit)

అతడు యమాతారాజభానస...దుంచకు దుంచకు దుంచకు

Contd...

దుంచకు... దుంచకు... దుంచకు..దుదుం దుందుందుం
దుంచకు... దుంచకు దుంచకు దుంచకు... దుంచకు దుంచకు
దుంచకు దుదుం...దుంచకు దుంచకు దుంచకు
దుందుం...దుంచకు దుంచకు దుంచకు దుదుం...
దుంచకు దుంచకు దుంచకు దుందుం..దుందుందుందుందుం
దుందుందుం

ఆమె } ఆ...అహోహోహోహో...ఆ...అహోహోహోహో...ఆ...
అతడు } ఆ...ఆ...అహోహోహోహో... (సమాంతరంగా)

:::::: BIT ::::::

చరణం

ఆమె పైట చాటు కొస్తాడు...ఏమి పురుషుడో...హాయ్ (Bit)
ప్రేమ పూజ అంటాడు...ఎంతసరసుడో..
పెదవుల్లో చేరి మధువే దోస్తాడు
తలపుల్లో దూరి బరువై పోతాడు

అతడు అదుపులేనిది ఈ వయసూ... పొదుపు చేయకు నీ మనసూ...॥2॥
రోజా రామమ్మా..రోజా పువ్వమ్మా.. ॥2॥
రేపో మాపో తొలిరేయమ్మా...

ఆమె ఏమి తుంటరి పిలగాడే...ఎన్ని చొరవలు చేశాడే...
ఎంత అల్లరి చినవాడే..ఎదను అల్లుకుపోయాడే..

అతడు సువ్వీ సువ్వీ సువ్వాలా వాలా...సిగ్గే పువ్వై పూయాలా నీలా ॥2॥

ఆమె ఏమితుంటరి (నవ్వుతో)

అతడు అహహోహోం...

ఆమె ఎన్ని చొరవలు

అతడు ఒహోహోహో...

ఆమె ఎంత అల్లరి...

అతడు అహహోహోం...

ఆమె ఎదను అల్లుకు

అతడు అహోహోహహహహో...

★★★

# ఒక రాధ - ఇద్దరు కృష్ణులు (1986)

రచన : **వేటూరి** గానం : **బాలు, జానకి**

:::::: Opening Music ::::::

పల్లవి

బృందం తకతకధిం...డిడిడిడిడి....తకతకధిం...తకతకధిం...డిడిడిడిడి....
తకతకధిం...తూరురుత్తూరు...రుత్తుత్తూ...తూరురుత్తూ
రు...రుత్తుత్తూ...తూరురూ..రూ...రూ...యయ్యయయ్య
య్యా...వవవవవ...వవవవవ...(Bit)

అతడు దానిమ్మ మొగ్గరో... ఈగుమ్మ బుగ్గరో...
చిలకలా..హోయ్...కొరకనా...

ఆమె ఓయమ్మ సిగ్గురో...ఒళ్లంతా అగ్గిరో...
దొరగా...హోయ్...దొరకనా

అతడు నా కన్ను కోరింది పందూ...(ఆమె : హోయ్)

అతడు కౌగిళ్లకే ఈడు పందూ...హోయ్ కాయా...పందా...నువ్వా

ఆమె గుమ్మాన గుమ్మళ్లపందూ (అతడు : హోయ్)

ఆమె నీ ముద్దుకే నోరు పందూ...చెండో...దిండో..అవుతూ..

అతడు దానిమ్మ మొగ్గరో... ఈ గుమ్మ బుగ్గరో..
చిలకలా..హోయ్...కొరకనా...

ఆమె దొరగా...హోయ్...దొరకనా

:::::: BIT ::::::

చరణం

అతడు పుడుతూ పైటలేశావా...పుట్టినాక పైట ఆరుబైట వేశావా...(Bit)

ఆమె పుడుతూ ఆటకొచ్చానూ.. నైటుపక్క ఆటఆడి పేటనేలానూ...

అతడు అదేఆట చూసి...చెప్పేరేటు చూసి...కన్నెగీటి వచ్చానూ...

ఆమె నీలో నీటుచూసి..వేసే నాటుచూసి నేనూ సైటు కొట్టానూ...(Bit)

అతడు ఎంత పొదుపో నీకు...చీరతెలుపూ...

ఆమె ఎంత దుడుకో నీకు...చేతినడుగూ...

అతడు నాచెయ్యి బైటెయ్యి...దయచెయ్యి పక్కకీ...
దానిమ్మ మొగ్గరో... ఈగుమ్మ బుగ్గరో...
చిలకలా..హోయ్...కొరకనా...(Bit)

ఆమె ఓయమ్మ సిగ్గురో...ఒళ్లంతా అగ్గిరో... Contd...

దోరగా...హోయ్...దొరకనా...(Bit)
అతడు నా కన్ను కోరింది పండూ...(ఆమె : హోయ్ హోయ్)
కౌగిళ్లకే ఈడు పండూ...హోయ్ కాయా...పండా...నువ్వా
ఆమె ఓయమ్మ సిగ్గురో...ఒళ్లంతా అగ్గిరో...
దోరగా...హోయ్...దొరకనా...
అతడు చిలకలా..హోయ్...కొరకనా...

:::::: BIT ::::::

చరణం
బృందం దిగిదిగిదిగిదిదిగిది...వవ్వావ్వా...దిగిదిగిదిగిది
దిగిది...వవ్వావ్వా...దిగిదిగిది...వవ్వావ్వా...దిగిదిగిది
వవ్వావ్వా...దిగిదిగిది...వవ్వావ్వా...దిగిదిగిది...వవ్వావ్వా...
దిగిది...వ్వా...దిగిది...వ్వా...దిగిదిగిది...దిగిది...(Long Bit)
అతడు రాత్రీ మేలుకుంటావా...తెల్లవార్లు మేజువాణీ చేసుకుంటావా
ఆమె పగలే ఇంటికొస్తావా...వగలమారి పరువుదీసి వీధినేస్తావా (Bit)
అతడు తాడూపేడూ లేని ఈడూజోడు చూసి వేలం పాటకొచ్చానూ
ఆమె వేళాపాళలేని వేలం వెర్రి చూసి తాళం నేను మార్చానూ (Bit)
అతడు అర్ధరాత్రే నీకు ఆట విడుపూ (Bit)
ఆమె పొద్దుపొడుపే నీకు ఈడుకొలుపూ...
అతడు మాటల్తో దాటేసి పూటంతా గడపకూ
దానిమ్మ మొగ్గరో... ఈగుమ్మ బుగ్గరో...
చిలకలా..హోయ్...కొరకనా...
ఆమె ఓయమ్మ సిగ్గురో...ఒళ్లంతా అగ్గిరో...
దోరగా...హోయ్...దొరకనా
అతడు నా కన్ను కోరింది పండూ...(ఆమె : హోయ్)
అతడు కౌగిళ్లకే ఈడు పండూ...హోc... కాయా...పండా...నువ్వా
ఆమె గుమ్మాన గుమ్మళ్లపండూ (అతడు : హోయ్... హోయ్)
ఆమె నీ ముద్దుకే నోరు పండూ...చెండో...దిండో..అవుతూ..
అతడు దానిమ్మ మొగ్గరో... ఈ గుమ్మ బుగ్గరో..
చిలకలా..హోయ్...కొరకనా...
ఆమె ఓయమ్మ సిగ్గురో...ఒళ్లంతా అగ్గిరో...
దోరగా...హోయ్...దొరకనా

★★★

# ఒక రాధ - ఇద్దరు కృష్ణులు (1986)

రచన : **వేటూరి** గానం : **కమలహాసన్, బృందం**

:::::: Opening Music ::::::

పల్లవి

అతడు రాధా...ఎందుకింత బాధా...
వెయ్ వెయ్ తకధిమి...చెయ్ చెయ్ కథకళి...
టక్కు ముక్కూ...తాళంవెయ్! (బృందం : వెయ్...వెయ్)
అతడు ముయ్ ముయ్ తలుపులు...వెయ్ వెయ్ దరువులు
లక్కు ముక్కూ..గొళ్లెంవెయ్! (బృందం : వెయ్...వెయ్)
అతడు వాటం చూస్తే ఘుమఘుమ...అ...వర్ణంచూస్తే సరిగమ ॥2॥
వెయ్ వెయ్ తకధిమి..చెయ్‌చెయ్..కథకళి...
టక్కు ముక్కూ...తాళంవెయ్! (బృందం : వెయ్...వెయ్)
అతడు ముయ్ ముయ్ తలుపులు...వెయ్ వెయ్ దరువులు
లక్కు ముక్కూ..గొళ్లెంవెయ్! (బృందం : వెయ్...వెయ్)
అతడు అహ్హా... ఆమె : నోర్ముయ్!
బృందం ఒయ్ ఒయ్!
అతడు ముయ్యకపోతే! ఆమె : వంకాయ్!
బృందం హోయ్...హోయ్!

:::::: BIT ::::::

చరణం

అతడు కాలేజి కొచ్చి కజ్జాలు పెడితే...మ్యారేజిచేసి పంపించనా...
బృందం నీ జోరు కాస్త తగ్గించనా..
అతడు ఒహోయ్! హైక్లాసులాగ పైపోజు కొడితె...ర్యాగింగు చేసి కవ్వించనా...
బృందం వడ్డించి దారి పట్టించనా...
అతడు మాక్సీ...మిడ్డీ సోడా బుడ్డీ...బాక్సీలే చెప్పెయ్యనా..
అతడు అ... సెక్సీ లేడి నువ్వే జోడి...జిమ్మిక్సే చేసెయ్యనా...
చిలిపిముద్దులా దస్కత్ (బృందం : చెయ్...చెయ్)
అతడు వలపు ఓటునూ నాకే... (బృందం : వెయ్...వెయ్)
అతడు ఆ...చిలిపిముద్దులా దస్కత్.. (బృందం : చెయ్...చెయ్)
అతడు వలపు ఓటునూ నాకే.. (బృందం : వెయ్...వెయ్)
అతడు అ...చిలకల కులికివి..మదనుని మొలకవి రావే అమ్మడూ

Contd...

అ...వెయ్‌వెయ్ తకధిమి...చెయ్‌చెయ్ కథకళి
టక్కు ముక్కూ..తాళంవెయ్... (బృందం : వెయ్...వెయ్)
అతడు ముయ్ ముయ్ తలుపులు...వెయ్ వెయ్ దరువులు
లక్కు ముక్కూ..గొళ్లెంవెయ్! (బృందం : వెయ్...వెయ్)

:::::: BIT ::::::

చరణం
అతడు చాలించు నిక్కు...నా జన్మహక్కు.. నీ బుగ్గ నొక్కి తీరాలిలే...
బృందం ఆ మొగ్గలన్నీ రాలాలిలే...
అతడు అ...తగ్గించుటెక్కు...నాకున్న మొక్కు..నీ ముక్కుతాడు వెయ్యాలిలే...
బృందం ఆ ముద్దు హద్దు దాటాలిలే..
అతడు స్వీటీ బ్యూటీ...నాటీ హాటీ...మ్యాట్నీకే తోడవ్వనా
హా...సెక్సీ బుక్సు...లుక్సు...ట్రిక్సు...మాస్టర్‌లా నేర్పించనా..
కుక్కపిల్లలా అనకే.. (బృందం : భౌ...బౌ...)
అతడు కుర్రపిల్లలా అనవే (బృందం : లవ్..లవ్..)
అతడు అ...కుక్కపిల్లలా అనకే... (బృందం : భౌ...బౌ...)
అతడు కుర్రపిల్లలా అనవే... (బృందం : లవ్..లవ్..)
అతడు బోర్ బోర్ చదువులు...జోర్‌జోర్ జంటలు లైఫే జాలీలే
అ...వెయ్ వెయ్ తకధిమి..చెయ్ చెయ్ కథకళి
టక్కు ముక్కూ..తాళంవెయ్! (బృందం : వెయ్...వెయ్)
అతడు ముయ్ ముయ్ తలుపులు...వెయ్ వెయ్ దరువులు
లక్కు ముక్కూ..గొళ్లెంవెయ్! (బృందం : వెయ్...వెయ్)
అతడు వాటం చూస్తే ఘుమఘుమ...అ...వర్ణంచూస్తే సరిగమ ॥2॥
వెయ్ వెయ్ తకధిమి..చెయ్‌చెయ్..కథకళి...
టక్కు ముక్కూ...తాళంవెయ్! (బృందం : వెయ్...వెయ్)
అతడు ముయ్ ముయ్ తలుపులు...వెయ్ వెయ్ దరువులు
లక్కు ముక్కూ..గొళ్లెంవెయ్! (బృందం : వెయ్...వెయ్)
బృందం రాధా... అతడు : ఎందుకింత బృందం : బాధా...
బృందం రాధా... అతడు : ఎందుకింత బృందం : బాధా... ॥2॥
అతడు రాధా..

★★★

## లేడీస్ టైలర్ (1986)

రచన : సిరివెన్నెల గానం : బాలు, రాజేంద్రప్రసాద్, జానకి

పల్లవి

అతడు పొరపాటిది...తడబాటిది...గుంజీలే తీసెయ్యనా ॥2॥
ఏదో పాపం...పసివాణ్ణీ...జాలీ చూపి వదలండీ...మన్నించండి

ఆమె అతి తెలివితో మతిపోయెనా...నీ వేషం నా ముందర ॥2॥
ర ర ర ర ర ర ర ర (Bit)
దుం చికు..కుచికు..డుంచికు..కుచికు..డుంచికు..కుచికు...
(చకుకుకుకు)..డుంచికు...కుచికు...డుంచికు...కుచికు
డుంచికు...కుచికు...(చకుకుకుకు)...

:::::: BIT :::::

చరణం

ఆమె కలవ పరిచే చేపనేనూ...తాకిటఝుం..(కుచికు)...
తరికిటఝుం...(కుచికు)...తాకిటఝుం...(కుచికు)...తరికిటఝుం...
(కుచికు)...ఎరను చూసీ మోసపోనూ..

ఇద్దరు తాకిటిఝుం..(కుచికు)... తరికిటఝుం...(కుచికు)...తాకిటఝుం...
(కుచికు)...తరికిటఝుం...(కుచికు)...

ఆమె వెకిలివేషాలు ముదిరిపోతేను అసలు పాఠాలు నేర్పగా
యముడిలావాడు వెనుక వున్నాడు తెలుసునా... తెలియజెప్పనా

అతడు వద్దు వద్దు బాబోయ్...తప్పుకాయి తల్లోయ్
చెంపలేసుకుంటా..గోడకుర్చీ వేస్తా... మొన్ననే నేను కళ్లు తెరిచాను
ఇంతలో నన్ను బూచాడికిచ్చెయ్‌కు

ఆమె అతి తెలివితో మతిపోయెనా...నీ వేషం నా ముందర ॥2॥
పోనీ..పాపం..అనుకుంటే..ఓహో..చనువే ముదిరిందే మరియాదేనా..

అతడు పొరపాటిది...తడబాటిది...గుంజీలే తీసెయ్యనా

ఆమె అతి తెలివితో మతిపోయెనా...నీ వేషం నా ముందర

:::::: BIT :::::

చరణం

అతడు విలువతెలిసే నెతికిచేరా...

Contd...

ఇద్దరు	తరికిటఝుం...(కుచికు)...తరికిటఝుం...(కుచికు)...తరికిటఝుం...
(కుచికు)...తరికిటఝుం...(కుచికు)...

అతడు	బతుకు నీతో...ముడిని వేశా...

ఇద్దరు	తరికిటఝుం...(కుచికు)...తరికిటఝుం...(కుచికు)...
తరికిటఝుం...(కుచికు)...తరికిటఝుం...(కుచికు)...

అతడు	దరికి చేరాను...వరము వేడాను...కరుణతో దారి చూపవా
మనసులో మాట తెలుసుకోవమ్మ...చెలిమితో కలిమి కురియవా

ఆమె	చిన్నవాడ నిన్ను నమ్ముతాను లేహోయ్
అల్లరెందుకింక పల్లతేనె తేహోయ్
కోటి వేషాలు...మానితే చాలు...నిన్ను వెన్నంటి వుంటాను ఏనాడూ...

అతడు	పొరపాటిది...తడబాటిది...గుంజీలే తీసెయ్యనా

ఆమె	అతి తెలివితో మతిపోయెనా...నీ వేషం నా ముందర

అతడు	లాలా...లాలా...పదలండీ...

ఆమె	లాలా..లలలాలా..ముదిరిందే మరియాదేనా

అతడు	లలలాలలా..తడబాటిది

ఆమె	లాలాలా...నాముందర

అతడు	లలలాలలా...తడబాటిది

ఆమె	లాలాలా (నవ్వుతో) నా ముందర

★★★



# లేడీస్ టైలర్ (1986)

రచన : సిరివెన్నెల గానం : బాలు, శైలజ, బృందం

:: Opening Music ::

పల్లవి

ఆమె గోపీలోలా..నీపాల పద్మాలురా..
లీలా లోలా...అల్లాడుతున్నాయురా...
చన్నీళ్లలో వున్నామురా..చిన్నారులం మన్నించరా

అతడు భామా భామా తీరాన్ని చేరాలమ్మా
పరువే కోరీ...చెయ్యెత్తి మొక్కాలమ్మా
అందాక మీ అందాలకూ...ఆదిక్కులే దిక్కమ్మలూ...

ఆమె గోపీలోలా...నీపాల పద్మాలురా..

బృందం ఆఆ..ఆఆ..ఆఆఆ..ఆఆఆ..ఆఆఆ..ఊహుంహుం..
ఆహో...ఆహో..ఆహో..ఊహు..(Bit)
కృష్ణ కృష్ణ కృష్ణ కృష్ణ కృష్ణ కృష్ణ

అతడు మచ్చ మచ్చ మచ్చ మచ్చ

బృందం కృష్ణ కృష్ణ కృష్ణ కృష్ణ కృష్ణ కృష్ణ

అతడు మచ్చ మచ్చ మచ్చ మచ్చ

:::::: BIT :::::

చరణం

బృందం (నవ్వు)

ఆమె జాలి మాలిన ఈ గాలీ తెరిపార చూసీ వేసే ఈల
మావిమాటున దాగుంటే కూతవేసీ గువ్వలు నవ్వే గోల

అతడు తరుణిరో (Flute Bit) కరుణతో మోక్షం చూపే కిరణమై నిలిచానే
తనువుతో పుట్టే మాయను తెలుపగా పిలిచానే

ఆమె మోక్షం కన్నా మానం మిన్నా...మిన్ను మన్ను కన్నులు మూసేనా
గోపీలోలా..నీపాల పద్మాలురా..

అతడు భామా భామా తీరాన్ని చేరాలమ్మా

Contd...

ఆమె చన్నీళ్లలో వున్నాము‌రా..చిన్నారులం మన్నించరా
గోపీలోలా..నీపాల పడ్డాము‌రా..

:::::: BIT :::::

చరణం

బృందం ధీరన నానానా...ధీరననా..ధీరననా...ధీరననా...
ధీరననా...ధిరనన...ధిరనన...ధిరనన...ధిరనన...
ధిరనన...ధిరనన...నా

అతడు వాడిపోని సిరులెన్నో పూలు పూచేటి కొమ్మా....రెమ్మా గుమ్మా
నేను కోరే ఆ తారా ఏది మీలోన భామా భామా భామా

ఆమె తగదురా (Flute Bit)...ఇది మరీ చోద్యం కాదా సొగసరీ గోవిందా
అందరూ నీవారేగా..ఒకరితో ముడివుందా

అతడు చూసే కలలూ ఎన్నో వున్నా...చూపే హృదయం ఒకటే వుందమ్మా

ఆమె గోపీలోలా...నీపాల పడ్డాము‌రా...
లీలా లోలా...అల్లాడుతున్నాము‌రా...

అతడు అందాక మీ అందాలకూ ఆ దిక్కులే దిక్కమ్మలూ
భామా భామా తీరాన్ని చేరాలమ్మా..
పరువే కోరీ... చెయ్యెత్తి మొక్కాలమ్మా...

★★★



# లేడీస్ టైలర్ (1986)

రచన : సిరివెన్నెల                గానం : బాలు, శైలజ, బృందం

పల్లవి

అతడు ఎక్కడ ఎక్కడ ఎక్కడ...ఎక్కడ ఎక్కడ ఎక్కడ...
ఎక్కడ దాక్కున్నావే..లక్కును తెచ్చేచుక్కా..
ఎక్కువ చిక్కులు పెట్టక...చిక్కవె చప్పున చక్కగ...
టక్కుల టక్కరి పెట్టా...నిన్ను పట్టే దెట్టా..(దెట్టా)...
మచ్చున్న భామా...కనులకు కనరావా...
ఉన్నానురావా...నలుచెరగుల తిరుగుదుమరి...
ఎక్కడ ఎక్కడ ఎక్కడ...ఎక్కడ ఎక్కడ ఎక్కడ...
ఎక్కడ దాక్కున్నావే..లక్కును తెచ్చేచుక్కా..
ఎక్కువ చిక్కులు పెట్టక...చిక్కవె చప్పున చక్కగ...
టక్కుల టక్కరి పెట్టా...నిన్ను పట్టే దెట్టా..(దెట్టా)...

:::::: BIT ::::::

చరణం

బృందం ఆఆఆఅ...ఆఆఆఅఅ...అఆఆఅ...ఆఆఆఅఅ (Bit)
లలలా..ల..లలలా..ల..లలలా..ల...లలలలలా... (Bit)
లాలాల...లాలాల...లాలాల...లాలాల... (Bit)

అతడు ఆకారం చూస్తే...సరిపోదంటా... ఒకటే గురుతూ తెలిసే దెట్టా ॥2॥
ఈ మందలో...ఏ సుందరో...తియ్యాలిలే కూపీ...
ఈ మందలో...ఏ సుందరో...తియ్యాలి కూ...పీ...
గుట్టుమట్టులీసి..పుట్టుమచ్చను చూసి
టక్కున పట్టెయ్యాలి...నక్కను తొక్కెయ్యాలి
పొరపడి పరులకు దొరకక...ఎక్కడ ఎక్కడ ఎక్కడ...
ఎక్కడ ఎక్కడ ఎక్కడ....ఎక్కడ దాక్కున్నావే...లక్కును తెచ్చేచుక్కా..
ఎక్కువ చిక్కులు పెట్టక చిక్కవె చప్పున చక్కగ...
టక్కుల టక్కరి పెట్టా...నిన్ను పట్టేదెట్టా...
మచ్చున్న భామా...కనులకు కనరావా...
ఉన్నాను రావా...నలుచెరగుల తిరుగుదు మరి...
ఎక్కడ ఎక్కడ ఎక్కడ...ఎక్కడ ఎక్కడ ఎక్కడ...

Contd...

ఎక్కడ దాక్కున్నావే..లక్కును తెచ్చేచుక్కా...
ఎక్కువ చిక్కులు పెట్టక...చిక్కవె చప్పున చక్కగ...
టక్కుల టక్కరి పెట్టా...నిన్ను పట్టే దెట్టా..(దెట్టా)...(దెట్టా)...
బృందం కృష్ణాహరే...రామాహరే...కృష్ణాహరే...రామాహరే...

:::::: BIT ::::::

చరణం
అతడు (వచనం) పద్మినీ జాతి స్త్రీ...
బృందం అయ్యో...అమ్మా...అబ్బా...అయ్యో...అమ్మా...అబ్బా...(Bit)
అతడు (వచనం) పద్మినీ జాతి స్త్రీ...
బృందం నానాన..నానాన..నానానా..నా..నానాన..నానాన..నానానా..నా..(Bit)
అతడు (వచనం) పద్మినీ జాతి స్త్రీ...
శ్రీదేవీ...వాణీ...పశుపతి రాణీ...ఎదురై నిలిచే సమయములోన ॥2॥
ఎల్లాగనీ గుర్తించనూ..శ్రీదేవినీ...ఆదేవినీ
ఎల్లాగనీ గుర్తించనూ...ఆదేవి ఏదో..
గుర్తులు గుట్టుగ దాచీ...అల్లరి పెట్టే వేళా..
ఎవ్వరి నవ్వులు నమ్మను...గుండెలు ఎవ్వరికివ్వను
హారీ...హారీ..ఇకమరి...పనిసరి...
ఎక్కడ ఎక్కడ ఎక్కడ...ఎక్కడ ఎక్కడ ఎక్కడ...
ఎక్కడ దాక్కున్నావే..లక్కును తెచ్చేచుక్కా..
ఎక్కువ చిక్కులు పెట్టక...చిక్కవె చప్పున చక్కగ...
టక్కుల టక్కరి పెట్టా...నిన్ను పట్టే దెట్టా..(దెట్టా)...
మచ్చున్న భామా...కనులకు కనరావా...
ఉన్నాను రావా...నలుచెరగుల తిరుగుదు మరి...

(Followup Music)

★★★



# లేడీస్ టైలర్ (1986)

రచన : సిరివెన్నెల గానం : బాలు, జానకి, బృందం

:::::: Opening Music ::::::

పల్లవి

ఆమె హోయమ్మ...హోయమ్మ...హోయమ్మో...॥2॥
హోయమ్మ...హోయమ్మ...హోయమ్మో...
హోయమ్మ...హోయమ్మ...హోయమ్మో...
అందాల బంధాల వుందామా...ఆనందం అందుకుందామా...
బంగారు స్వప్నాలు కందామా..కౌగిల్లో పంచుకుందామా...

అతడు ఓయమ్మ...ఓయమ్మ...ఓయమ్మో...॥4॥
సింగారి గంగల్లే పొంగేనూ...కంగారై గుండె కుంగేనూ...
శృంగార రంగాన చిక్కేనూ...రంగేళి నీకె దక్కేనూ...

:::::: BIT ::::::

చరణం

బృందం జగులుబలాజింగే...జలగుబలగు..జలగుబలగు (Bit)
తాంతరు...బీంతరు...జాంతరు...బాంతరు...జలతరబరజా (Bit)
జగులుబలాజింగే...జలగుబలగు..జలగుబలగు (Bit)
జాంతరు...మీంతరు...జాంతరు...బాంతరు...జలతరబరజా (Bit)
లలలలాల...లలలా...లలల లలలా...లలల లాల...లలలా...
లలల లలలా...
చకజం..చకజం..చకజం...చంచకజం...చుంచుంచుం...
చకజం...చకజం...చకజం...చం చకజం...చం చకజం...(Bit)

ఆమె దరహాసమై...నీ అధరాలపైనే....
అతడు ఉండమ్మ...ఉండమ్మ..ఉండమ్మో....
ఆమె స్థిరవాసముండే..తరళాక్షినేనే..
అతడు ఔనమ్మ...ఔనమ్మ...ఔనమ్మో...
ఆమె నను చూడు... అతడు : సైయమ్మ...సైయమ్మ
ఆమె మనువాడు... అతడు : సైయమ్మ...సైయమ్మ

Contd...

ఆమె	అలివేణి...	అతడు : నాదమ్మ...నాదమ్మ
ఆమె	కలవాణి...	అతడు : నీవమ్మ...నీవమ్మ
అతడు	నినుకనగానే...ఎదసదిలో...అలజడి ఏదో...సుడితిరిగే...
నీవే జతవైతే...కల తీరేనీవేళా...
ఆమె	హోయమ్మ...హోయమ్మ...హోయమ్మా...॥2॥
అతడు	ఓయమ్మ...ఓయమ్మ..ఓయమ్మా...॥2॥

:::::: BIT ::::::

చరణం
బృందం	బాతర...జాతర...జీతర...జాతరవా...బాతర...బీతర...
బూతర...బాతలవా (Bit)
యాడిసలాపర..దరపరజా...పాంసలదర...కసబుసదా...(Bit)
లాలల లలలలా..లలలల లలలలా..
లలలల లలల లలల లలలల (Bit)
అతడు	మదిలోని బాలా...ఎదురైన వేళా..
ఆమె	హోయమ్మ...హోయమ్మ...హోయమ్మా...
అతడు	పదహారుపేలా మదినాక్షులేలా
ఆమె	హోయమ్మ...హోయమ్మ...హోయమ్మా...
అతడు	మురిపాలు...	ఆమె : హోయమ్మ...హోయమ్మ
అతడు	సరదాలు...	ఆమె : హోయమ్మ...హోయమ్మ
అతడు	సరసాలు...	ఆమె : హోయమ్మ...హోయమ్మ
అతడు	సగపాలు...	ఆమె : హోయమ్మ...హోయమ్మ
ఆమె	పరువము నిన్నే పిలిచెనురా...తరుణము నేడే కుదిరెనురా
ఏడు జన్మాల నీజోడు నేనేరా...
అతడు	ఓయమ్మ...ఓయమ్మ...ఓయమ్మా...॥2॥
ఆమె	హోయమ్మ...హోయమ్మ...హోయమ్మా...॥2॥
అతడు	సింగారి గంగల్లే పొంగేనూ...కంగారై గుండె కుంగేనూ...
ఆమె	బంగారు స్వప్నాలు కందామా..కౌగిల్లో పంచుకుందామా...
అతడు	ఓయమ్మ...ఓయమ్మ...ఓయమ్మా...॥2॥
ఆమె	హోయమ్మ...హోయమ్మ...హోయమ్మా...॥2॥

★★★

## ఆత్మబంధువు (1986)

రచన : **రాజశ్రీ** గానం : **బాలు, చిత్ర**

:::::: Chord ::::::

పల్లవి

ఆమె మనిషికో స్నేహం (Bit) మనసుకో దాహం (Bit) ॥2॥
లేనిదే జీవం లేదూ...జీవితం కానే కాదూ...

అతడు మమతనే మధువు లేనిదే చేదూ (Bit)

ఆమె మనిషికో స్నేహం (Bit) మనసుకో దాహం...

:::::: BIT :::::

చరణం

అతడు ఒక చిలకా...ఒద్దికైందీ...మరుచిలకా...మచ్చికైందీ (Bit)

ఆమె వయసేమో...మరచిందీ...మనసొకటై...కలిసిందీ

అతడు కట్టగట్టి ఆపాలన్నా...గంగ పొంగులాగేనా

ఆమె ప్రేమలేనినాడీనేలా..పూవులెన్నిపూచేనా..

అతడు మనిషిలేని నాడూ...దేవుడైన లేడూ

ఆమె మంచినీ కాచేవాడూ...దేవుడికి తోడూ...

అతడు మనిషికో స్నేహం (Bit) మనసుకో దాహం (Bit) ॥2॥

ఆమె లేనిదే జీవం లేదూ...జీవితం కానే కాదూ

అతడు మమతనే మధువు లేనిదే చేదూ (Bit)

ఆమె మనిషికో స్నేహం...మనసుకో దాహం...

:::::: BIT :::::

చరణం

ఆమె వయసు వయసూ..కలుసుకుంటే... పూరి గుడిసే..రాచనగరూ...(Bit)

అతడు ఇచ్చుకోనూ...పుచ్చుకోనూ..ముద్దులుంటే...పొద్దుచాలదూ...

Contd...

ఆమె ప్రేమ నీకు కావాలంటే...పిరికివాడు కారాదూ...

అతడు గువ్వ గూడు కట్టే చోట...కుంపటెత్తి పోరాదూ...

ఆమె ఓర్వలేని సంఘం...ఒప్పుకోదు నేస్తం...

అతడు జాతి మత భేదాలన్నీ...స్వార్థపరుల మోసం (Bit)

ఆమె మనిషికో స్నేహం (Bit) మనసుకో దాహం (Bit) ॥2॥
లేనిదే జీవం లేదూ...జీవితం కానే కాదూ

అతడు మమతనే మధువు లేనిదే ...చేదూ (Bit)

ఆమె మనిషికో స్నేహం (Bit)

అతడు మనసుకో దాహం...

★★★




## మనసులో మాట

ఎవరైనా మన దగ్గర్నుంచి ఏదైనా తీసుకుంటూ ఉన్నారంటే... అది వాళ్ళదగ్గర లేకనే కదా! నా స్వరాల్ని మరొకరు అనుకరిస్తున్నారంటే వాళ్లకు లేనిది యిచ్చినట్లే నేను భావిస్తాను.

– ఇళయరాజా

## ఆత్మ బంధువు (1986)

రచన : రాజశ్రీ గానం : బాలు, జానకి

పల్లవి

అతడు మూగైన హృదయమా...నీ గోదు తెలుపుమా
ఓదార్చి...తల్లివలె లాలించే ఎదదనూ ఇమ్మనీ అదుగుమా
మూగైన హృదయమా...నీ గోదు తెలుపుమా

ఆమె కాచావూ భారము (Bit) ఐనావూ మౌనము
రాకాసీ మేఘము...మూసేస్తే..చీకటులు ముంచేస్తే
అణగదూ...సూర్యుడూ ఆరదూ...

:::::: BIT :::::

చరణం

అతడు మనసన్నదీ...మాసిపోనిది... సొత్తువున్నదీ...సుఖమేలేనిదీ
ఆమె ఈవేదన ఎన్నినాళ్లది..ఓదార్చినా ఒద్దులేనిది
అతడు నా పాటకే గొంతు పలికింది లేదూ... నా కళ్లకీనాదు కన్నీళ్లురావూ...
ఆమె తడిలేని నేలైనావూ..తొలకరులు కురిసే తీరూ...
అతడు ఎవ్వరూ..అన్నదీ...
ఆమె నిన్నెరిగిన మనిషి అన్నదీ (Bit)
అతడు మూగైన హృదయమా...నీగోదు తెలుపుమా
ఓదార్చి...తల్లివలె లాలించే ఎదదనూ... ఇమ్మనీ అదుగుమా...

:::::: BIT :::::

చరణం

అతడు మనసేడ్చినా పెదవి నవ్వెను... పై పైది ఈ పగటి వేషమూ
ఆమె నీగుండెలో కోవెలున్నది...ఏ దేవతో వేచియున్నదీ
అతడు ఇన్నాళ్లు మూసిన ఈ పాదుగుడినీ..ఏ దేవతికవచ్చి తెరిచేదనీ
ఆమె ఈ కోకిలంటే చాలూ..జరిగేను ఏదైనానూ
అతడు ఎవ్వరీ కోయిలా...
ఆమె చిగురాశల చిట్టికోయిలా..
అతడు అరె..నీవా ఆ కోయిలా (Bit) ఏ కొమ్మా కోయిలా (Bit)
విన్నానే..కనులెదుట కన్నానే...పొంగులై హృదయమూ పొరలెనే
ఆమె నేనే...ఆ కోయిలా (Bit) ఉన్నా నీ లోపల (Bit) విన్నానూ...
కనులెదుట కన్నానూ... మారునా...నీ వెతా...తీరునా...

★★★

## ఆత్మ బంధువు (1986)

రచన : **రాజశ్రీ** గానం : **బాలు, చిత్ర**

పల్లవి

ఆమె పట్టి తెచ్చానులే...పండువెన్నెల్ని నేనే (Bit)
అహా..నామావఁకోసం.. (Long Bit)
పట్టి తెచ్చానులే...పండువెన్నెల్ని నేనే
అహా..నామావఁకోసం... } ॥2॥

అతడు ఏది ఏది చూడనీవేదాన్ని (Bit)
ఆమె కళ్లుముయ్యి ... చూపుతాను అన్నీ (Bit) } ॥2॥

అతడు పట్టి తెచ్చానులే...పండువెన్నెల్ని నేనే
అహా..నామల్లికోసం

:::::: BIT ::::::

చరణం

ఆమె మనసున సెగలెగసె...ఏంమాయొ వెలుపల చలి కరిచే
అతడు వయసుకు అది వరస...వరసైన పిల్లదానికది తెలుసా
ఆమె మాపటికి చలిమంటేస్తా..కాచుకో కాసంతా
అతడు ఎందుకే నను ఎగదోస్తా..అందుకే పడి చస్తా
ఆమె చింతాపూలా చీరగట్టి...పూచిందీ పూదోటా
అతడు కన్నెపూవూ కన్నూ గొడితే...తుమ్మెదకూ దొంగాటా
ఆమె దోబూచులే ఆటా..ఊహూఁ
అతడు పట్టి తెచ్చానులే...పండువెన్నెల్ని నేనే...
అహా..నామల్లికోసం

ఆమె ఏది ఏది చూడనీవాదాన్ని (Bit)
అతడు కళ్లుముయ్యి చూపుతాను అన్నీ (Bit) } ॥2॥

ఆమె పట్టి తెచ్చానులే...పండువెన్నెల్ని నేనే...
అతడు అహా..నామల్లికోసం...

:::::: BIT ::::::

చరణం

అతడు పొద్దువుంది ముద్దులివ్వనా...
ఇచ్చాక ముద్దులన్ని మూటగట్టనా

Contd...

| | | |
|---|---|---|
| ఆమె | మూటలన్నీ విప్పి చూడనా...చూశాక మూటకట్టి లెక్కచెప్పనా.. | |
| అతడు | సూటికి నూరైతేనే...కోటికి కొరతేనా | |
| ఆమె | కోటికి కోటైతేనే...కోరికలు కొసరేనా.. | |
| అతడు | నోరున్నదీ...మాటున్నదీ...అడిగేస్తే ఏంతప్పు | |
| ఆమె | రాతిరయ్యిందీ...రాజుకుందీ...చిటపటగా చిరునిప్పు | |
| అతడు | అరే..పోవేపిల్లా అంతా దూపు... | |
| ఆమె | పట్టి తెచ్చానులే...పండువెన్నెల్ని నేనే (Bit)<br>అహా..నామావంకోసం.. | ॥2॥ |
| అతడు | ఏది ఏది చూడనీవేదాన్ని (Bit) | ॥2॥ |
| ఆమె | కళ్లుమయ్యి చూపుతాను అన్నీ (Bit) | |
| అతడు | పట్టి తెచ్చానులే...పండువెన్నెల్ని నేనే<br>అహా..నామల్లికోసం | |

★★★



## సంకీర్తన (1987)

రచన : సిరివెన్నెల　　　గానం : బాలు, జానకి బృందం

పల్లవి

అతడు　ఆఅ...ఆఆఆ.... ఆఆఆ.... ఆఆఆ...ఆఆఆఆఆఆ (Long Bit)
వేవేలా...వర్ణాలా...ఈనేలా...కావ్యానా...(Bit)
అలలూ శిలలూ (Bit) తెలిపే కథలూ (Bit) పలికే నాలో గీతాలై
వేవేలా..వర్ణాలా..ఈనేలా...కావ్యానా...

(వచనం) ఓ గంగమ్మా పొద్దెక్కిపోతోంది తొందరగా రాయే

ఆమె　ఓ...తల్లి గోదారి తుళ్ళితుళ్ళి పారేటి పల్లె పల్లె
పచ్చాని పందిరీ...

బృందం　పల్లె పల్లె పచ్చాని పందిరీ..

ఆమె　నిండు నూరేళ్ళు పండు ముత్తైదువల్లె వుండు
పంటాలచ్చిమి సందడీ...

బృందం　పంట పంటాలచ్చిమి సందడీ...

ఆమె　తందైన తందతైన..తందైన తందతైన...తందైన తంద
తయ్యన...తయ్య తందైన తంద తయ్యన...

:::::: BIT :::::

చరణం

అతడు　వానవేలితోటీ నేలవీణ మీటే...నీలినింగి పాటే ఈ చేలటా (Bit)
కాళిదాసు లాటి ఈ తోటరాసుకున్నా కమ్మనైన కవితలె ఈ పూలటా (Bit)
ప్రతి కదలికలో నాట్యమేకాదా...
ప్రతి ఋతువూ ఒక చిత్రమేకాదా..ఎదకే కనులుంటే
వేవేలా వర్ణాలా... ఈనేలా కావ్యానా (Bit)
అలలూ శిలలూ (Bit) తెలిపే కథలూ (Bit)
పలికె నాలో గీతాలై...
వేవేలా వర్ణాలా... ఈనేలా కావ్యానా

బృందం　లాలాలా...ఆఆఆ...లాలాలా...ఆఆఆ...

★★★

## సంకీర్తన (1987)

రచన : **సిరివెన్నెల** గానం : **బాలు, జానకి, బృందం**

సాకీ

అతడు మనసున మొలిచిన సరిగమలే... ఈ గలగల నడకల తరగలుగా...
నా కలలను మోసుకు నిసుజేరీ... ఓ కమ్మని ఊసుని తెలిపేనే..
కవితవు నీవై...పరుగునరా... ఎదసడితో నటియించగరా...

బృందం స్వాగతం సుస్వాగతం...స్వాగతం..సుస్వాగతం... (Long Bit)

పల్లవి

బృందం కూకూ...చుకుచుకు...కూకూ...చుకుచుకు..
కూకూ...చుకుచుకు...కూకూ...

అతడు రారా స్వరముల సోపానములకు పాదాలను జతచేసీ

బృందం కుకుకూ...కుకుకూ...కీర్తనా...

అతడు తొలి ఆమనివై రా...

ఆమె పిలిచే చిలిపి కోయిలా...ఎట దాగున్నావూ...

బృందం కూకూ...చుకుచుకు...కూకూ...చుకుచుకు..
కూకూ...చుకుచుకు...కూకూ...

అతడు రారా స్వరముల సోపానములకు పాదాలను జతచేసీ
(వచనం) మీ నృత్యం చూసి నిజంగా...

ఆమె (వచనం) నిజంగా...(నవ్వు)

:::::: BIT :::::

చరణం

అతడు మువ్వల రవళి పిలిచింది (Bit) కవిత బదులు పలికిందీ

ఆమె కలత నిదుర చెదిరింది (Bit) మనసు కలను వెతికిందీ

అతడు వయ్యారాల గౌతమీ...వయ్యారాల గౌతమీ... ఈ కన్యారూప కల్పనా

ఆమె వసంతాల గీతినీ...నన్నే మేలుకొల్పెనా

అతడు భావాల పూలరాగాల బాట నీకై వేచెనే

బృందం కూకూ...చుకుచుకు...కూకూ...చుకుచుకు..
కూకూ...చుకుచుకు...కూకూ...

ఆమె ఏదో స్వరగతి నూతన పదగతి చూపెను నను శ్రుతిచేసీ

Contd...

అతడు ఇది నా మది సంకీర్తనా..
బృందం కుకుకూ...కుకుకూ...కూ...
ఆమె సుధలూరే ఆలాపనా...
బృందం కుకుకూ...కుకుకూ...కూ...
ఆమె ఏదో స్వరగతి నూతన పదగతి చూపెను నను శ్రుతిచేసీ
బృందం కూకూ...చుకుచుకు...కూకూ...చుకుచుకు..
కూకూ...చుకుచుకు...కూకూ...

:::::: BIT :::::

బృందం ఆ...తనన ధినననన తనన...తనన ధినననన తనన
తనన ధినననన తననన...తనన ధినననన తననన..
తనన తననతన...తనన తననన...తనన...తననన...తనన
తననన...(Long Bit)
ఆమె లలిత లలిత పదబంధం ...(Bit) మదిని మధుర సుమగంధం
అతడు చలిత మృదుల పదలాస్యం...(Bit) అవని అధర దరహాసం
ఆమె మరందాల గానమే...(Bit) మరందాల గానమే...మృదంగాల నాదమూ
అతడు ప్రబంధాల ప్రాణమే...నటించేటి పాదమూ
ఆమె మేఘాల దారి ఊరేగు ఊహ వాలే ఈ మ్రోలా...
బృందం కూకూ...చుకుచుకు...కూకూ...చుకుచుకు..
కూకూ...చుకుచుకు...కూకూ...
ఆమె ఏదో స్వరగతి నూతన పదగతి చూపెను నను శ్రుతిచేసీ
అతడు ఇది నా మది సంకీర్తనా..
బృందం కుకుకూ...కుకుకూ...కూ...
ఆమె సుధలూరే ఆలాపనా...
బృందం కుకుకూ...కుకుకూ...కూ...
అతడు రారా స్వరముల సోపానములకు పాదాలను జతచేసీ
బృందం కూకూ...చుకుచుకు...కూకూ...చుకుచుకు..
కూకూ...చుకుచుకు...కూకూ...

★★★

## సంకీర్తన (1987)

రచన : ఆచార్య ఆత్రేయ　　　　గానం : జేసుదాస్

పల్లవి

ఏ...అఅఅ...ఏ..ఏఏ..ఓఓ..ఓహో..ఓ..ఓ..ఓ..ఓఓ..(Bit)
ఏనావదేతీరమో...ఏ నేస్తమే జన్మవరమో (Bit) ॥2॥
కలగానో...కధగానో...మిగిలేదీ నీవే...ఈజన్మలో
ఏనావదేతీరమో...ఏ నేస్తమే జన్మవరమో

:::::: BIT ::::::

చరణం

నాలోని నీవే...నేనైనానూ...నీలోని నేనే...నీవైనావూ..॥2॥(Bit)
విన్నావా ఈ వింతనూ...(Bit) అన్నారా ఎవరైననూ...(Bit)॥2॥
నీకూ...నాకే...చెల్లిందనూ...
ఏనావదేతీరమో...ఏనేస్తమే జన్మవరమో...

:::::: BIT ::::::

చరణం

ఆకాశమల్లే నీవున్నావూ...నీ నీలిరంగై నేనున్నానూ...॥2॥(Bit)
కలిసేది ఊహేననూ...(Bit) ఊహల్లో కలిశామనూ... (Bit) ॥2॥
నీవూ...నేనే...సాక్ష్యాలనూ...
ఏనావదేతీరమో...ఏ నేస్తమే జన్మవరమో (Bit)
కలగానో...కధగానో...మిగిలేదీ నీవే...ఈజన్మలో
ఏనావదేతీరమో...ఏ నేస్తమే జన్మవరమో (Bit) ॥2॥

★★★



# సంకీర్తన (1987)

రచన : **సి. నారాయణరెడ్డి** గానం : **బాలు, జానకి**

:: Opening Chord ::

పల్లవి (ఆలాపన) హో...హ హ హ...అ అ అ...
ఇద్దరు ఆ...ఆ..ఆ..ఆ..ఆహాహో...అహాహో...ఆ..(Bit)
ఆమె కలికి మేనిలో కలిగే స్పందనం ॥2॥
ఇలకూ...వెన్నెలకూ...ఇలకూ వెన్నెలకు జరిగే సంగమం
అతడు కలికి మేనిలో కలిగే స్పందనం... కలికి మేనిలో...

:::::: BIT :::::

చరణం
అతడు రంగుల కలగా మెరిసే...ఆకాశం...ముంగిట తానే నిలిచే...
ఆమె తోటకు వరమై దొరికే...మధుమాసం...గూటిని తానే వలచే...
అతడు గర్భగుడిని దాటి కదిలింది దేవతా... (Bit) ॥2॥
ఆమె చేయి అందుకొమ్మనీ చేరుకొంది నీజతా...
అతడు కలికి మేనిలో కలిగే స్పందనం...
ఇలకూ...వెన్నెలకూ...ఇలకూ వెన్నెలకు జరిగే సంగమం
ఆమె కలికి మేనిలో కలిగే స్పందనం ...కలికి మేనిలో ....

:::::: BIT :::::

చరణం
ఇద్దరు (ఆలాపన) లాలలాలలా...లాలా...లాలలాలలా...లాలా (Long Bit)
ఆమె పెదవుల వలలో పెరిగే..ఏకాంతం...ప్రేమకు పేరై ఎగిసే...
అతడు తలపుల ఒడిలో ఒదిగే...అనురాగం...తలుపులు తానే తెరిసే...
ఆమె తల్లినేల వేసే మనపెళ్లిపందిరీ...(Bit) ॥2॥
అతడు వేయి జన్మలెత్తినా వీడదు మన కౌగిలీ...
ఆమె కలికి మేనిలో కలిగే స్పందనం ...
అతడు కలికి మేనిలో కలిగే స్పందనం...
ఆమె ఇలకూ...వెన్నెలకూ...
అతడు ఇలకూ... వెన్నెలకు...
ఇద్దరు జరిగే సంగమం..కలికి మేనిలో కలిగే స్పందనం.. కలికి మేనిలో ..

★★★

## ఆరాధన (1987)

రచన : ఆచార్య ఆత్రేయ　　　　గానం : బాలు, జానకి

:: Opening Music ::

పల్లవి

ఆమె　అరె ఏమైందీ... (Long Bit) అరె ఏమైందీ...
　ఒక మనసుకు రెక్కలొచ్చి ఎక్కడికో ఎగిరిందీ (Bit)
　అది ఏమైందీ...తన మనిషిని వెదుకుతు ఇక్కడొచ్చి వాలిందీ (Bit)

అతడు　కలగాని

ఆమె　కలయేదో

అతడు　కళ్లెదుటే నిలిచిందీ

ఆమె　అది నీలో మమతను నిద్దురలేపిందీ

అతడు　అఅఆఆ...అఅఆఆ...అఅఆఆ...ఆ..అరె ఏమైందీ..
　ఒక మనసుకు రెక్కలొచ్చి ఎక్కడికో ఎగిరిందీ (Bit)
　అది ఏమైందీ...?

:::::: BIT :::::

చరణం

ఆమె　నింగి వంగి నేలతోటీ నేస్తమేదో కోరిందీ
　నేలపొంగి నింగికోసం పూలదోసి లిచ్చింది

అతడు　పూలు నేను చూడలేదూ...పూజలేవి చేయలేదూ
　నేలపైన కాళ్లులేవూ...నింగివైపు చూపులేదూ

ఆమె　కన్నెపిల్ల కళ్లలోకీ...ఎన్నడైన చూశావో..
　కానరాని గుండెలోకీ...కన్నమేసి వచ్చావో...
　అది దోచావో..ఓ..(Bit)
　లలలా...లల...లలలా...(Bit) లలల...లా...లలలా...లలలలా
　లలలల...లలలల...లలలలా...లా...

:::::: BIT :::::

Contd...

చరణం

అతడు బీడులోన వాన చినుకూ పిచ్చిమొలక వేసింది
పాడలేని గొంతులోనా...పాట ఏదొ పలికింది

ఆమె గుండె ఒక్కటున్న చాలూ...గొంతు తానె పాడగలదు
మాటలన్ని దాచుకుంటే...పాట నీవు రాయగలవు

అతడు రాతరాని వాడిరాత దేవుడేమి రాశాడో
చేతనైతె మార్చిచూడూ...వీడు మారిపోతాడు
మనిషౌతాడూ...ఊఊఊ

ఆమె అరె ఏమైందీ... ఒక మనసుకు రెక్కలొచ్చి ఎక్కడికొ ఎగిరిందీ (Bit)
అది ఏమైందీ...తన మనిషిని వెదుకుతు ఇక్కడొచ్చి వాలిందీ (Bit)

అతడు కలగాని

ఆమె కలయేదొ

అతడు కళ్లెదుటే నిలిచిందీ

ఆమె అది నీలో మమతను నిద్దురలేపిందీ

అతడు అరె ఏమైందీ...ఒక మనసుకు రెక్కలొచ్చి ఎక్కడికొ ఎగిరిందీ (Bit)
అది ఏమైందీ...???

★★★



## ఆరాధన (1987)

రచన : **ఆచార్య ఆత్రేయ** గానం : **బాలు, జానకి**

పల్లవి

అతడు తీగనై (Bit) మల్లెలూ (Bit) పూచిన వేళ... (Bit)
ఆగనా (Bit) అల్లనా (Bit) పూజకో మాలా...
మనసు తెరతీసినా..మోమాటమేనా...
మమత కలబోసినా...మాట కరువేనా...

ఆమె తీగనై (Bit) మల్లెలూ (Bit) పూచిన వేళ... (Bit)
ఆగనా (Bit) అల్లనా (Bit) పూజకో మాలా...

:::::: BIT :::::

చరణం

అతడు తెలిసీ తెలియందా (Bit) ఇది తెలియక జరిగిందా

ఆమె ఎపుడో జరిగిందా (Bit) అది ఇపుడే తెలిసిందా

అతడు ఆశపడ్డా అందుతుందా..అర్థమైనా వుందా...
అందుకున్నా పొందికుందా...పొత్తుకుదిరేదా...

ఆమె ప్రేమకన్నా పాశముందా... పెంచుకుంటే దోషముందా
తెంచుకుంటే తీరుతుందా...పంచుకుంటే మరిచేదా

:::::: BIT :::::

చరణం

ఆమె కలలో మెదిలిందా (Bit) ఇది కథలో చదివిందా

అతడు మెరుపై మెరిసిందా (Bit) అది వలపై కురిసిందా

ఆమె రాసివుంటే తప్పుతుందా...తప్పు నీదౌనా..
మారమంటే మారుతుందా...మాసిపోతుందా...

అతడు చేసుకున్న పుణ్యముందా...చేరుకునే దారివుందా
చేదుకునే చేయివుందా...చేయిచేయి కలిసేనా

ఆమె తీగనై (Bit) మల్లెలూ (Bit) పూచిన వేళ... (Bit)
ఆగనా (Bit) అల్లనా (Bit) పూజకో మాలా...
మనసు తెరతీసినా..మోమాటమేనా..
మమత కలబోసినా...మాట కరువేనా...

అతడు తీగనై (Bit) మల్లెలూ (Bit) పూచిన వేళ... (Bit)
ఆగనా (Bit) అల్లనా (Bit) పూజకో మాలా...

★★★

## మహర్షి (1987)

రచన : **నాయని కృష్ణమూర్తి** గానం : **బాలు, జానకి (ఆలాపన)**

:::::: Opening Music ::::::

పల్లవి

ఆమె ఆ..ఆ..ఆ..తననాన నాన..తననాన నాన...

అతడు సుమం ప్రతి సుమం సుమం....వనం ప్రతి వనం వనం ॥2॥

జగం అణువణువున కలకలహం..

భానోదయాన...చంద్రోదయాలూ

సుమం ప్రతి సుమం సుమం...వనం ప్రతి వనం వనం

:::::: BIT ::::::

చరణం

ఆమె అహో...ఆఆఆ...అఆ...ఆహాఆ...ఆఆఆ...

అతడు వేణువా...వీణియా...ఏవిఁటీ నాదము ॥2॥

అచంచలం సుఖం మధుర మధురం

మయం హృదంతరం దివిజ సురతం

ఈవేళ నాలో...రాగోల్లసాలూ ॥2॥

కాదు మనసా...ఆఆఆ...ప్రేమ మహిమా...నాదు హృదయం

భానోదయాన...చంద్రోదయాలూ

సుమం ప్రతి సుమం సుమం...వనం ప్రతి వనం వనం

ఆమె ఆఆఆ...తారర తారర...తారరా...తారర తారర...తారా

:::::: BIT ::::::

చరణం

అతడు రంగులే...రంగులు..అంబరానంతటా ॥2॥

స్వరం...నిజం..సగం...వరము అమరం

వరం వరం వరం చెలియ ప్రణయం

ఆ వేగమేదీ నాలోన లేదూ ॥2॥

ప్రేమమయమూ...ఆఆఆ...ప్రేమమయమూ... నాదు హృదయం

భానోదయాన...చంద్రోదయాలు

సుమం ప్రతి సుమం సుమం...వనం ప్రతి వనం వనం ॥2॥

జగం అణువణువున కలకలహం..

భానోదయాన...చంద్రోదయాలు

సుమం ప్రతి సుమం సుమం...వనం ప్రతి వనం వనం

★★★

## మహర్షి (1987)

రచన : వెన్నెలకంటి గానం : బాలు, జానకి

:::::: Opening Music ::::::

పల్లవి

అతడు మాటరాని మౌనమిది (Bit) .. మౌనవీణ గానమిది (Bit) ॥2॥
గానమిదీ నీ ధ్యానమిదీ...ధ్యానములో నా ప్రాణమిదీ
ప్రాణమైన మూగగుండె రాగమిది
మాటరాని మౌనమిది (Bit).. మౌనవీణ గానమిది (Bit)॥2॥

:::::: BIT :::::

చరణం

అతడు ముత్యాల పాటల్లో కోయిలమ్మా...ముద్దారబోసేది ఎప్పుడమ్మా
ఆపాల నవ్వుల్లో వెన్నెలమ్మా...దీపాలు పెట్టేది ఎన్నడమ్మా
ఆమె ఈ మౌనరాగాల ప్రేమావేశం...ఏనాడో ఒకరి సొంతం
ఆకాశదీపాలు జాబిలికోసం...నీకేలా ఇంత పంతం
అతడు నింగి నేలా కూడేవేళా..నీకూ నాకూ దూరాలేలా
ఆమె అందరాని కొమ్మ ఇదీ (Bit)...కొమ్మచాటు అందమిది (Bit)
అతడు మాటరాని మౌనమిది (Bit).. మౌనవీణ గానమిదీ

:::::: BIT :::::

చరణం

ఆమె చైత్రాన కూసేను కోయిలమ్మా...గ్రీష్మానికాపాట ఎందుకమ్మా
రేయంత నవ్వేను వెన్నెలమ్మా...నీరెండకానవ్వు దేనికమ్మా
అతడు రాగాల తీగల్లో వీణానాదం..కోరిందీ ప్రణయ వేదం
చేశారు గుండెల్లో రేగేగాయం...పాడిందీ మధుర గేయం
ఆమె ఆకాశాన తారాతీరం...అంతే లేనీ ఎంతో దూరం
అతడు మాటరాని మౌనమిది (Bit) .. మౌనవీణ గానమిది (Bit)
ఆమె అందరాని కొమ్మ ఇదీ...(Bit) కొమ్మచాటు అందమిదీ (Bit)
కూడనిదీ జతకూడనిదీ...చూడనిదీ మది పాడనిదీ
చెప్పరాని చిక్కుముడి వీడనిదీ
అతడు మాటరాని మౌనమిది (Bit) .. మౌనవీణ గానమిది (Bit)
ఆమె అందరాని కొమ్మ ఇదీ...(Bit) కొమ్మచాటు అందమిదీ (Bit)

★★★

## మహర్షి (1987)

రచన : **జొన్నవిత్తుల రామలింగేశ్వరరావు** గానం : **బాలు, జానకి**

:::::: Opening Music ::::::

పల్లవి

అతడు కోనలో... ఆమె : సన్నజాజిమల్లి..జాజిమల్లి

అతడు మేనులో... ఆమె : పొన్న పూలవల్లి...పొలవెల్లి

అతడు వేడిలో ఆమె : కన్నె నాగమల్లి...నాగమల్లి

అతడు తీరులో.. ఆమె : అనురాగవల్లి...రాగవల్లి

అతడు కావ్యాలకే హోయ్..(Bit) శ్రీకారమై పో (Bit) కస్తూరి తాంబూల మీవే...

ఆమె కోరుకో అతడు : సన్నజాజిమల్లి..జాజిమల్లి

ఆమె ఏలుకో... అతడు : కన్నె సోకులన్ని..సోకులన్ని

ఆమె పాడుకో... అతడు : ప్రేమకైతలల్లి... కైతలల్లి

ఆమె వేసుకో.. అతడు : పాలబుగ్గపైన రంగవల్లి

:::::: BIT :::::

చరణం

ఆమె మేని సోయగాలు..ప్రేమ బంధనాలూ..

మౌన స్వాగతాలూ..రాగ రంజితాలూ

సరసములో (Bit) సమరములూ (Bit)

సరసులకూ (Bit) సహజములూ (Bit)

అతడు ప్రాభవాలలోన..నవ శోభనాల జాణ...

రాగదే రాగమై..రాధవై...

ఆమె కోరుకో... అతడు : సన్నజాజిమల్లి..జాజిమల్లి

ఆమె ఏలుకో... అతడు : కన్నె సోకులన్ని..సోకులన్ని

ఆమె పాడుకో... అతడు : ప్రేమకైతలల్లి... కైతలల్లి

ఆమె వేసుకో... అతడు : పాలబుగ్గపైన రంగవల్లి

ఆమె రాగాలునీ హాయ్ (Bit) దో ఏలుకో హోయ్ (Bit)

మేఘాల మేనాలో రానా

Contd...

అతడు హే...కోనలో... ఆమె : సన్నజాజిమల్లి..జాజిమల్లి
అతడు మేనులో... ఆమె : పొన్న పూలవల్లి...పాలవెల్లి
అతడు వేణిలో... ఆమె : కన్నె నాగమల్లి...నాగమల్లి
అతడు తీరులో... ఆమె : అనురాగవల్లి...రాగవల్లి

:::::: BIT :::::

చరణం

అతడు కోయిలమ్మ రాగం..కొండవాగు వేగం...
పారిజాత సారం...ఏకమైన రూపం
అధరముపై (Bit) అరుణిమలూ (Bit)
మధురిమకై (Bit) మధనములూ (Bit)
ఆమె నందనాలలోన...రసమందిరాలలోన...
హాయిగా...సాగగా..చేరగా
అతడు కోనలో... ఆమె : సన్నజాజిమల్లి..జాజిమల్లి
అతడు మేనులో... ఆమె : పొన్న పూలవల్లి...పాలవెల్లి
అతడు వేడిలో... ఆమె : కన్నె నాగమల్లి...నాగమల్లి
అతడు తీరులో... ఆమె : అసురాగవల్లి...రాగవల్లి
అతడు కావ్యాలకే హాయ్.. (Bit) శ్రీకారమై పో (Bit)
కస్తూరి తాంబూల మీవే...
ఆమె కోరుకో... అతడు : సన్నజాజిమల్లి..జాజిమల్లి
ఆమె ఏలుకో... అతడు : కన్నె సోకులన్ని..సోకులన్ని
ఆమె పాడుకో... అతడు : ప్రేమకైతలల్లి... కైతలల్లి
ఆమె వేసుకో... అతడు : పాలబుగ్గపైన రంగవల్లి

★★★

## మీకు తెలుసా?

మాటల్లో పేర్చలేని, పదాల్లో ఇమడ్చలేని ప్రేమభావనల్ని ఆవిష్కరించగలిగిన సినీ గేయ రచయితల్లో ఆత్రేయ, వేటూరి సరసన వెన్నెలకంటి ముందుంటారు. మహర్షి చిత్రానికి దర్శకుడు వంశీ ముక్తపదగ్రస్థంలో పాట రాయమంటే, వెన్నెలకంటి "మాట రాని మౌనమిది... మౌన వీణ గానమిది" రాశారు. "ఆపాటకు స్వరరచన చెయ్యడం నాకు ఎంతో ఆనందాన్నిచ్చింది. అలాగే ఆత్రేయ నిరీక్షణ చిత్రం కోసం రాసిన 'ఆకాశం ఏనాటిదో... అనురాగం అనాటిది'. కూడా ఓ అద్భుత ప్రయోగం!" అంటూ రాజా గతాన్ని గుర్తుచేసుకున్నారు.

## డాన్స్ మాస్టర్ (1987)

రచన : **వేటూరి** గానం : **చిత్ర**

:::::: Opening Music ::::::

పల్లవి రానేల వసంతాలే..శ్రుతి కానేలా సరాగాలే
నీవే నా జీవనరాగం...స్వరాలా బంధం...
నీదే నా యవ్వన కావ్యం..స్మరించే గీతం
రానేల వసంతాలే...

:::::: BIT :::::

చరణం ఈ మౌన పంజరాన నే మూగనై
నీ వేణువూదగానే నీ రాగమై
ఎగిరే పోతమై...విరిసే తోటనై
ఏ పాటపాడినా... అది పూవులై
అవి నేలరాలినా..చిరుతావినై
బదులైన లేని...ఆశలారబోసి..
రానేలా వసంతాలే...

:::::: BIT :::::

చరణం ఓ ప్రేమికా...చెలియ ఒడిచేరవా
ఈ చెలిమినీ ఇపుడే దరిజేర్చవా
రగిలే తాపమే..ఎదలో తీరగా
నీ చూపుతోనే...చలి తీరగా
నీ స్పర్శతోనే....మది పాడగా
ఎదమీటిపోయే....ప్రేమ గీతిలాగా...
రానేల వసంతాలే...శ్రుతి కానేలా సరాగాలే
నీవే నా జీవనరాగం...స్వరాలా బంధం...
నీదే నా యవ్వనకావ్యం...స్మరించే గీతం...
రానేలా వసంతాలే...శ్రుతి కానేలా సరాగాలే

★★★

## డాన్స్ మాస్టర్ (1987)

రచన : **వేటూరి** గానం : **బాలు, చిత్ర**

:: Opening Music ::

పల్లవి

అతడు జింగళ...జింగళ...జింగళ...జింగళ...జింగా

ఆమె జింగళ...జింగా జీమూత జింగళ జింగా...
నన్ను వరించే కిల్లాడి వలపుల దొంగా..కూ...

అతడు సిత్తరాంగి జీరకోయిల..నావంకరావె..
ధిత్తళాంగు ధీరనెమలీ..॥2॥
జింగళ...జింగా జీమూత జింగళ జింగా...॥2॥ కూ...

:::::: **BIT** :::::

చరణం

అతడు చెలియా...నీరాక..మదిలో అలలాయే...
కనులే నిదరోని..కథలో కలలాయే...
నీవే...లేకుంటే..నింగే ఇలలేదు..(Bit)
కౌగిల్లే లేక..కళకే కళలేదు..(Bit)

ఆమె పక్కనున్న పసివాడు...చక్కనోడు చుక్కలందు రేరాజా

అతడు పక్కనున్న పసికూన...పక్కతోడు పైట వేసుకున్న వీణా..

ఆమె అందానికర్థమై...చినదాని చీర నీవై విరిసెయ్య సవరించవా...
ఓరోరి వీర..సింగమంటి రంగనాయకా..
నన్నేలుకోర..కొంగుపట్టి కన్నెగోపికా..
సింగమంటి రంగనాయకా...నన్నేలుకోర
కొంగుపట్టి కన్నెగోపికా..

అతడు జింగళ జింగా జీమూత జింగళ జింగా...॥2॥ కూ..

:::::: **BIT** :::::

చరణం

ఆమె ఎదలో సన్నాయీ..పలికే రాగాలూ..
ఎదుటే అబ్బాయీ..ఒడిలో భోగాలూ..

Contd...

నీవే లేకుంటే...నేనేమౌతానూ (Bit)
నీవే కాదంటే..నివ్వురైపోతాను...(Bit)

అతడు తట్టుకోవె తాపమిప్పుడూ...
రేయిదాక పట్టివుంచు పైటచప్పుడూ

ఆమె అంటుకోకు అందమిప్పుడూ...
నన్ను తాకి అంటనివ్వు మంటలిప్పుడూ...

అతడు మనసైన చిలకా...ఏకొమ్మనాపండు ముద్దాడుకోవాలమ్మో...
అరెరెరె...సిత్తరాంగి జీరకోయిల..
నావంకరావె...ధిత్తళాంగు ధీరనెమలీ...
సిత్తరాంగి జీరకోయిల...
నాపంకరావె...ధిత్తళాంగు ధీరనెమలీ...

ఆమె జింగళ జింగా... జీమూత జింగళ జింగా
నన్ను వరించే కిల్లాడి వలపుల దొంగా..కూ...

అతడు జింగళ జింగా... జీమూత జింగళ జింగా...కూ..॥2॥

★★★



## డాన్స్‌మాస్టర్ (1987)

రచన : **వేటూరి** గానం : **బాలు**

:::::: Chord ::::::

పల్లవి

రేగుతున్నదొకరాగం...ఎదలో.. సొదలా..
రేపుతున్నదొక మోహం...నదిలో.. అలలా...
కనులే.. (Bit) ముద్దులాడగా... (Bit)
కలలే కన్నుగీటగా..కసిగా...
రేగుతున్నదొకరాగం...ఎదలో.. సొదలా..
రేపుతున్నదొక మోహం...నదిలో.. అలలా...

:::::: BIT ::::::

చరణం

చెక్కిళ్లలో ముద్దుచెమ్మ...తడియారకున్నదీ...
నీ కళ్లలో నీటిబొమ్మ...కదలాడిందే...
తెలిపింది కన్నె గళమే...మనువాడలేదనీ...
ఓ పువ్వు పూసింది ఒడిలో...తొలిప్రేమల్లే...
మెలకువే స్వప్నమై...మెలితిరిగెను నాలో..
ఒరిగినా...ఒదిగినా..హత్తుకొనే ప్రేమా...
నీ..పిలుపే...పిలిచే...వలపై...పెదవుల్లో...దాగీ...
రేగుతున్నదొకరాగం...ఎదలో.. సొదలా..
రేపుతున్నదొక మోహం...నదిలో.. అలలా...
కనులే.. (Bit) ముద్దులాడగా... (Bit)
కలలే కన్నుగీటగా..కసిగా...
రేగుతున్నదొకరాగం...ఎదలో.. సొదలా..
రేపుతున్నదొక మోహం...నదిలో.. అలలా...

:::::: BIT ::::::

చరణం

తారాడు తలపులెన్నో...నీలాల కురులలో...
తనువు మరచిపోయే...మరులే పొంగే...

Contd...

ముద్దాడ సాగె పెదవీ...ఒక మూగభావమై..
చాటు కవితన్నీ...అనురాగాలే...
పెదవులే విచ్చినా..మల్లెపూల వాసనా...
సొగసులే సోకినా...వయసుకే దీవెనా...
వీ..రెవరో...జత కో...కిలలో... ఎద లేదై...లేచీ...
రేగుతున్నదొకరాగం...ఎదలో.. సొదలా..
రేపుతున్నదొక మోహం...నదిలో.. అలలా...
కనులే..(Bit) ముద్దులాడగా...(Bit)
కలలే కన్నుగీటగా..కసిగా...
రేగుతున్నదొకరాగం...ఎదలో.. సొదలా..
రేపుతున్నదొక మోహం...నదిలో.. అలలా...

★★★

## మీకు తెలుసా?

"కోనలో సన్ని జాజిమల్లి, జాజిమల్లి" పాట స్రవంతి మూవీస్ మహర్షి (1987) చిత్రం కోసం జొన్నవిత్తుల రామలింగేశ్వరరావు రాయగా బాలు, జానకి ఆలపించారు. కానీ, మహర్షి చిత్రంలో ఈ పాట లేదు. ఏ కారణం చేతనో దర్శకుడు వంశీ ఈ పాట చిత్రీకరణ జరపలేదు. ఈ పాట *Echo* రికార్డింగ్ కంపెనీ ద్వారా (రి.నెం. 800680) 1987లో విడుదలైంది. ఇదే పాటని సిరి సినీ చిత్రవారి చెట్టు క్రింద ప్లీడరు (1989) చిత్రానికి వాడుకుందామని *Echo* రికార్డింగ్ కంపెనీ ద్వారా (రి.నెం. 8000739) వంశీ మళ్లీ విడుదల చేయించారు. దురదృష్టవశాత్తు ఆ చిత్రంలో కూడా యీ పాట చిత్రీకరణకు నోచుకోలేదు. అయితే ఈ పాట స్థానంలో జొన్నవిత్తుల చేత "జిగిజిగి జిగిజా... జాగేల వనజా రావేల నారోజా" పాట రాయించి, చిత్రీకరణ జరిపారు. ఒక అందమైన పాటకు అలా గ్రహణం పట్టి చిత్రీకరణకు దూరమైంది.

## డాన్స్ మాస్టర్ (1987)

రచన : **వేటూరి** గానం : **చిత్ర**

:::::: Opening Music ::::::

పల్లవి

వాన...మేఘం...మైమరపించే జీవం...
దేహమంత మోహం...ఏమి మాయదాహం..
మహా సుఖం..తడిజ్వరం..ఇదోరకం చలిజ్వరం...
ఫలించెలే స్వయంవరం...జ్వలించెలే నరంనరం...
నింగే..నీలాలుజల్లే...కన్నె ప్రేమలో...
ప్రేమయాత్రలో...వానజల్లుగా...పూలురాలిన
మాలిలేదు...వానపూలు...ఏరి మాలలల్లగా..
వాన...మేఘం...మైమరపించే జీవం..
దేహమంత మోహం...ఏమి మాయదాహం...

:::::: **BIT** ::::::

చరణం

నింగినా...బంగిరై...నీటి తోరణాలతో హోయ్...
ఒంగినా...పొంగులే..ఊగె చుంబనాలతో...
కన్నూ..కన్నూ...కవ్వింతలో...తడీ...పొడీ...తుళ్లింతలో
కసీ...కసీ...రెట్టింతలో...అదీ...ఇదీ అంటింతలో...
సయ్యాటాడే..ఒయ్యారాలేవో...లేతలేతగా...
చేతికందగా..జాజితీవెలే...నీటివీణలై..
వీచుకున్న పాత చినుకులేరి చీరకట్టగా...
వాన...మేఘం...మైమరపించే జీవం..
దేహమంతమోహం...ఏమిమాయ దాహం...
మహా సుఖం..తడిజ్వరం..ఇదోరకం చలిజ్వరం...
ఫలించెలే స్వయంవరం...జ్వలించెలే నరంనరం...
నింగే..నీలాలుజల్లే...కన్నె ప్రేమలో...
ప్రేమయాత్రలో...వానజల్లుగా...పూలురాలిన
మాలిలేదు...వానపూలు...ఏరి మాలలల్లగా..
వాన...మేఘం...మైమరపించే జీవం..
దేహమంత మోహం...ఏమి మాయ దాహం...

★★★

## నాయకుడు (1987)

రచన : వెన్నెలకంటి గానం : బాలు, శైలజ

:::::: Opening Music ::::::

పల్లవి

అతడు ఏదో తెలియని బంధమిదీ... ॥2॥
ఎదలో ఒదిగే రాగమిదీ...

ఆమె ఏదో తెలియని బంధమిదీ... ఎదలో ఒదిగే రాగమిదీ...
ఏదో తెలియని బంధమిదీ...

:::::: BIT ::::::

చరణం

ఆమె పూజకు నోచని పూవునుకోరి...వలచిన స్వామివి నువ్వేలే...

అతడు రూపంలేనీ అనురాగానికి... ఊపిరి నీ చిరునవ్వేలే..

ఆమె కోవెలలేనీ...కోవెలలేనీ దేవుడవూ...
గుండెల గుడిలో వెలిశావూ...

అతడు పలికే జీవనసంగీతానికి వలపుల స్వరమై ఒదిగావూ...
తనువూ...మనసూ...ఇకనీవే...

ఆమె ఏదో తెలియని బంధమిదీ...

అతడు ఏదో తెలియని బంధమిదీ...

ఆమె ఎదలో ఒదిగే రాగమిదీ...

అతడు ఏదో తెలియని బంధమిదీ...

:::::: BIT ::::::

చరణం

అతడు వేసవి దారుల వేసటలోన...వెన్నెలతోడై కలిశావూ..

ఆమె పూచేమల్లెల తీగకు నేడు...పందిరి నీవై నిలిచావూ...

అతడు ఆశలురాలే...ఆశలురాలే శిశిరంలో...
ఆమని నీవై వెలిశావూ...

ఆమె ఆలూమగల అద్వైతానికి అర్థంనీవై నిలిచావూ...
తనువూ...మనసూ...ఇకనీవే..

అతడు ఏదో తెలియని బంధమిదీ...

ఆమె ఏదో తెలియని బంధమిదీ...

అతడు ఎదలో ఒదిగే రాగమిదీ...

ఆమె ఏదో తెలియని బంధమిదీ...

అతడు ఆ...ఆ...ఆ..

★★★

## నాయకుడు (1987)

రచన : **రాజశ్రీ** గానం : బాలు, శైలజ, బృందం

:: Opening Music ::

పల్లవి

ఆమె హొయ్యా హొయ్...హొయ్...హొయ్యాహొయ్య...
ఇద్దరు హొయ్యా హొయ్...హొయ్...హొయ్యాహొయ్య...
అతడు చలాకీ చిన్నది వుందీ...మజాలకు రమ్మంటుందీ ॥2॥
ఒకే ఒకటిమ్మంటుందీ...హొయ్యాహొయ్..
అది ఏందది హొయ్...
మసకేళ చూడూ...నీకుందీ తోడూ...
రాచిలక అందం...రాతిరికే సొంతం...
చలాకీ చిన్నది వుందీ...మజాలకు రమ్మంటుందీ..
ఒకే ఒకటిమ్మంటుందీ...హొయ్యాహొయ్..
అది ఏందది హొయ్...

:::::: BIT :::::

చరణం

అతడు చూపులలోనా చుక్కలు చూడాలీ...
ఆమె అఝుం...అఝుం...అఝుం ॥2॥
అతడు నీ చేతలలోనా దిక్కులు అదరాలీ...
ఆమె అఝుం...అఝుం...అఝుం
అతడు మోజులమాటున కసికసిగా...అ...ముద్దుల దొంతరలివ్వాలీ...
అ...వెచ్చని వన్నెల చాటున...నే ముచ్చటలాడుకోవాలి...
నువ్వాడాలి...నేపాడాలి...పడవూగాలీ...హోయ్...
చలాకీ చిన్నది వుందీ...మజాలకు రమ్మంటుందీ...
ఒకే ఒకటిమ్మంటుందీ...హొయ్యాహొయ్...
అది ఏందది హొయ్...అది హొయ్యాహొయ్...
అది ఏందది హొయ్...

:::::: BIT :::::

Contd...

చరణం

అతడు   కోకారైకా గుసగుసలాడేనే...
ఆమె   అఝుం...అఝుం...అఝుం
అతడు   నా అల్లరికోరిక ఎన్నెల కాసేనే...
ఆమె   అఝుం...అఝుం...అఝుం   ॥2॥

అతడు   నీలో ఒదిగి నిలువెల్లా...అల్లుకుపోతా చిలకమ్మా...
గూటికి చేరే గువ్వల్లే..ఒడిలో వాలవే చిట్టెమ్మా...
నువ్వాడాలి...నేపాడాలి..పడవూగాలీ...హోయ్...
చలాకీ చిన్నది వుందీ...మజాలకు రమ్మంటుందీ ॥2॥
ఒకే ఒకటిమ్మంటుందీ...హొయ్యాహొయ్...
అది ఏందది హొయ్...
మసకేళ చూడూ...నీకుందీ తోడూ...హోయ్...
రాచిలక అందం...రాతిరికే సొంతం...
చలాకీ చిన్నది వుందీ...మజాలకు రమ్మంటుందీ...
ఒకే ఒకటిమ్మంటుందీ...హొయ్యాహొయ్...
అది ఏందది హొయ్...

అందరు   హొయ్యాహొయ్.. అది ఏందది హొయ్...
హొయ్యాహొయ్.. అది ఏందది హొయ్...

★★★



# నాయకుడు (1987)

రచన : **రాజశ్రీ** గానం : **సుశీల, జమునారాణి**

:::::: Opening Music ::::::

పల్లవి

ఆమె నా నవ్వే దీపావళీ...హోయ్...నా పలుకే గీతాంజలీ (Bit) ॥2॥
అరవిందం...నావయసే..అతిమధురం...నామనసే...
నాననవ్వే (Bit) నా నవ్వే దీపావళీ హోయ్!...నా పలుకే గీతాంజలీ...

:::::: BIT ::::::

చరణం

ఆమె కనని వినని అనుభవమే ఇదిరా..చెలి రేయిపవలు నీకై ఉన్నదిరా..(Bit) ॥2॥
అందాలన్నీ పూచెను నేడే.. ఆశల తోటా వెలిసెను నేడే..
స్నేహం...నాదీ...దాహం...నీదీ...పగలూ...రేయీ...నాదే...నీదే...
ఆడీ...పాడీ...నువ్వేరా..నానవ్వే...(Bit)
నా నవ్వే దీపావళీ...హోయ్...నా పలుకే గీతాంజలీ (Bit)
అరవిందం...నా వయసే..అతిమధురం...నా మనసే...

బృందం నా నవ్వే దీపావళీ హోయ్!...నా పలుకే గీతాంజలీ...(Bit)

ఆమె లలల లాల లాలా..లాల లాల లాలా..లా..లాలలాలా..లాలలా..లాలాలా..

:::::: BIT ::::::

చరణం

ఆమె కడలి అలలు నీ చెలి కోరికలే...నా కలల కథలు ఒలికెను
గీతికలే... (Bit) ॥2॥
వన్నెలు చిందే...వెచ్చని ప్రాయం...పలికించేనూ...అల్లరిపాఠం
పరువం...నాలో...రేగే...వేళా...వయసే...బంధం...వేసేవేళా
ఆడీ...పాడీ...నువ్వేరా...
నా నవ్వే దీపావళీ...హోయ్...నా పలుకే గీతాంజలీ (Bit)
అరవిందం...నావయసే..అతిమధురం...నామనసే...

బృందం నా నవ్వే దీపావళీ హోయ్!...నా పలుకే గీతాంజలీ...

★★★

## రక్తాభిషేకం (1988)

రచన : **వేటూరి** గానం : బాలు, చిత్ర

:: Opening Music ::

పల్లవి

బృందం తందాన తాననా..తందాన తాననా (Bit)
తందాన తాననా..తందానతాననా.. (Bit)

అతడు ఒయ్ బందారు చిన్నదాన బాజా బందూలదాన
బాజా బందూల మీన బంతిపూలు సోకే ఓ చిన్నదానా... (Bit) } ॥2॥
సోకు..అమ్మాడి పూతరేకు..కంగాళికోక తాకు...
చేతగిలే ఓ చిన్నదానా..

ఆమె గుంటూరు చిన్నవాడ గులుకూ కన్నూలవాడ
గులుకు కన్నూలతోటి గుండె కొల్లగొట్టే ఓ చిన్నవాడా (Bit) } ॥2॥
చిందు...లేకున్న మావిచిందు నా కన్నెమోవికందు
నీతరమే ఓ చిన్నవాడా...

:::::: BIT ::::::

చరణం

అతడు ఎదుగుతున్న ఆ ఎత్తులూ...సొగసుగున్న నా సొత్తులూ
హోయ్...హోయ్...చిగురువేసే నీ సోకులూ...
పొగరు చెట్టూ మారాకులూ...

ఆమె ఆ మాట నువ్వంటే సిగ్గేస్తది

అతడు హోయ్! హోయ్!!

ఆమె నాపైట జుట్టంతా ఒగ్గేస్తది

అతడు ఆహాc!!(Bit)

ఆమె అంటే అన్నావు గాని పిల్లోడా...అంతా కాజేసి పోబాకా

అతడు ఇన్ని అందాలు ఒగ్గి నేనేడకెడతా ఓ చిన్నదానా

ఆమె గుంటూరు చిన్నవాడ గులుకూ కన్నూలవాడ
గులుకు కన్నూలతోటి గుండె కొల్లగొట్టే ఓ చిన్నవాడా (Bit)

అతడు ఓయ్! బందారు చిన్నదాన బాజా బందూలదాన
బాజా బందూల మీన బంతిపూలు సోకే ఓ చిన్నదానా...

:::::: BIT ::::::

Contd...

చరణం

బృందం తందాన తందానాననా...తందాన తందానాన...నానా... ॥2॥
తందాన...తందాన...తందాన...తందానానా...
తందాన...తందాన...తందాన...తందానానా...నా...(Long Bit)

ఆమె తలకుబోసుకొచ్చానయ్యో...

అతడు ఓహో...

ఆమె తలుపుతీసి పుంచానయ్యో...

అతడు హాయ్...హాయ్...హాయ్...

ఆమె సులకమంచం వేశానయ్యో...

అతడు హ్హా హ్హా హ్హా... (నవ్వు)

ఆమె ఉలవచారు కాశానయ్యో...

అతడు అట్టాంటే నాకోడి కూసేస్తదీ...చిట్టింటి నీగింజ మేసేస్తదీ (Bit)
అంతా బాగున్నకాడ ఓలమ్మీ...సంతాబేరాలు వద్దమ్మీ

ఆమె ఇన్నివాటాలు చూసి నేనేడకెడతా ఓ చిన్నవాడా

అతడు అరెరెరెరెరెరెరెరెరెరె...బందారు చిన్నదాన
బాజా బందూలదాన...బాజా బందూల మీన
బంతిపూలు సోకే ఓ చిన్నదానా...(Bit)

ఆమె గుంటూరు చిన్నవాడ గులుకూ కన్నూలవాడ
గులుకు కన్నూలతోటి గుండె కొల్లగొట్టే ఓ చిన్నవాడా (Bit)

అతడు సోకు..అమ్మాడి పూతరేకు..కంగాళికోక తాకు...
చే తగిలే ఓ చిన్నదానా...హాహాహాఁ...

ఆమె గుంటూరు చిన్నవాడ గులుకూ కన్నూలవాడ

అతడు బాజా బందూల మీన బంతిపూలు సోకే
ఓ చిన్నదానా...(Bit) హాహాఁహాహాఁహాఁ...

★★★

నాయకుడు (1987) డబ్బింగ్ చిత్రానికి వెన్నెలకంటి "ఏదో తెలియని బంధమిదీ... ఎదలో ఒదిగే రాగమిదీ" అంటూ ఒకపాట రాశారు. బాలు, శైలజ ఆలపించిన యీ పాటను విన్న నెల్లూరు ప్రాంతానికి విడుదల హక్కులు తీసుకున్న డిస్ట్రిబ్యూటర్ ఒకరు చలించిపోయి, వెంటనే పాట రచయితగారిని కలిసి ఆయన ఆటోగ్రాఫ్ తీసుకొని తన ఆఫీసు టేబుల్ మీద పదిలపరచుకున్నారు. డబ్బింగ్ పాటల్లో కూడా సాహిత్యపు విలువలు పొందుపరచిన అద్భుత గీత రచయిత వెన్నెలకంటి.

## రక్తాభిషేకం (1988)

రచన : **వేటూరి** గానం : **బాలు, చిత్ర**

పల్లవి

ఇద్దరు తగుదు దుగుదు...తగుదు దుగుదు...తగుదు దుగుదు...
తగుదు దుగుదు...తగుదు దుగుదు...తగుదు దుగుదు...
తగుదు దుగుదు...తగుదు దుగుదు...తగుదు దుగుదు...
తగుదు దుగుదు...తగుదు దుగుదు...తగుదు దుగుదుగు... (Long Bit)

ఆమె సరిగంగ తానాలలో...సగమైతే మేనత్తరో
చూసెయ్...ఓచూపు కోసెయ్ నాకాపునీ (Bit)
తడిలో...తళుకులబేరం..నాతమకపు తాళం
అ..రేగెను సందిట్లో...

అతడు చింతామణీ చీరలో...కాంతామణీ మోతరో...
నీలాటమ్మాయి...నాలాటబ్బాయితో...

:::::: BIT :::::

చరణం

ఆమె(సాకీ) లైలా...మజ్నూని మనసార నాడే ప్రేమించే...
నే ...ఆ ప్రేమ ఆశించీ...నీకై...రాగా...
మనసే తెగమత్తెక్కి రాగం తీసిందీ నాడే..

అతడు వయసే యమవేడెక్కి గాలం వేసిందీనాడే...
ప్రాణం తీయకుభామా...

ఆమె పరువం నాదేలేమ్మా...

అతడు వల్లించినదే ప్రేమా...

ఆమె పద్దంటానా పోమ్మా...

అతడు పండుకుండె పక్కదాడీ (Bit)

ఆమె కట్టుకుంటె కోకవేడీ (Bit)

అతడు పట్టుతప్పి ఆగలేక..పట్టు నిన్ను పట్టలేక
లవ్వరునై ఇవ్వవరే నీకై తేగా..

ఆమె సరిగంగ తానాలలో...సగమైతే మేనత్తరో...
చూసెయ్...ఓచూపు కోసెయ్ నాకాపునీ

Contd ..

:::::: BIT :::::

చరణం

అతడు	మురళే నే వాయించుకుంటూ వస్తా నీకోసం

ఆమె	అయితే...మతిపోయేట్టు చేస్తా నాట్యం నీకోసం...

వాయిస్తావా కృష్ణా...

అతడు	రాత్రికి రావే రాధా...

ఆమె	రాధకు పేరే ప్రేమా...

అతడు	రమ్మంటేనే రానా...

ఆమె	పూతకొచ్చి పొన్నచెట్టు...(Bit)

అతడు	మోతపుట్టె కన్నెగుట్టు...(Bit)

ఆమె	చేయిపట్టుదాపలేక...తేనెపట్టు దాచలేక

నాసోకు నీలో నీకై వేగా

అతడు	చింతామణీ చీరలో...కాంతామణీ మోతరో...

నీలాటమ్మాయి...నాలాటబ్బాయితో..(Bit)

చలిలో...సలసలరాగం...నీకిలకిలపాఠం

తప్పదు కౌగిట్లో...

ఆమె	సరిగంగ తానాలలో...సగమైతే మేనత్తరో...

చూసెయ్...ఓ చూపు కోసెయ్...నా కాపునీ... (Bit)

★★★



# జమదగ్ని(1988)

రచన : **జాలాది** గానం : **మనో, బృందం**

పల్లవి

బృందం ఆహో...(Bit) ఆహో...(Bit) ఆహహహో...ఆహహహో....
ఆహహహో...ఆహహహో...ఆహహహో...ఆహహహో...హో...(Long Bit)

అతడు రాక్షస పాలన రక్కిన కోరల చిక్కటి నెత్తురు చూస్తే...
భగ్గున మండిన..ఉగ్రత నిండిన...సూర్యుడు ఎర్రగ లేస్తే....

బృందం రాక్షస పాలన రక్కిన కోరల చిక్కటి నెత్తురు చూస్తే...
భగ్గున మండిన..ఉగ్రత నిండిన...సూర్యుడు ఎర్రగ లేస్తే....

అతడు అది ప్రళయం కాదా...ప్రభంజనమవదా...
ఇది దేశంకాదా...స్వరాజ్యం లేదా...
దారుణ మారణ హింసా పాలన పోదా...
రాక్షస పాలన రక్కిన కోరల చిక్కటి నెత్తురు చూస్తే...

బృందం భగ్గున మండిన..ఉగ్రత నిండిన...సూర్యుడు ఎర్రగ లేస్తే....

:::::: BIT ::::::

చరణం

అతడు అధములకు పదవులు వస్తుంటే...వ్యధలు పడి పదుగురు చస్తుంటే...
దేశఘనమూ...దాస్యజనమూ తిరగబడదా...
మనుషులను బానిసలనుకుంటే...మనుగడను బూడిద చేస్తుంటే...
ప్రజలు రగిలీ..ప్రగతి పగిలీ...ప్రళయమవదా...
స్వార్థపరత్వం విద్యార్థిని బలిచేస్తే...

బృందం అదిగబశుద్ధం రాక్షసపాలన చేస్తే....

అతడు స్వార్థపరత్వం విద్యార్థిని బలిచేస్తే...

బృందం అదిగబశుద్ధం రాక్షసపాలన చేస్తే....

అతడు యువతరమే...నవతరమై...జనగణమే రణధ్వనులై
కుటిల కఠినములు కూల్చివేయదా...(Bit)

Contd...

రాక్షస పాలన రక్కిన కోరల చిక్కటి నెత్తురు చూస్తే...
భగ్గున మండిన..ఉగ్రత నిండిన...సూర్యుడు ఎర్రగ లేస్తే....
బృందం రాక్షస పాలన రక్కిన కోరల చిక్కటి నెత్తురు చూస్తే...
భగ్గున మండిన..ఉగ్రత నిండిన...సూర్యుడు ఎర్రగ లేస్తే....

:::::: BIT ::::::

చరణం

బృందం (అ) అఅఅఅఅ...ఆఅఆఅఅ...ఆఅఅఅఅఆ...ఆఅఆఅఅ..(Long Bit)
అతడు ఆశలకు ఆకలి పుదుతుంటే....దేశమును దోచుకుతింటుంటే..
కరువు పెరిగీ...పరువు తరిగీ...చీకటవదా...
గుడిసెలకు చీకటి ఉపవాసం...గుండెలకు ఆకటి పరితాపం...
కడుపు రగిలీ..పృథివి పగిలీ..విలయమవదా...
భళ్లున తుళ్లిన అగ్నికణాలై లేస్తే...
బృందం భగ్గున మండిన విప్లవ జ్వాలై వస్తే...
అతడు భళ్లున తుళ్లిన అగ్నికణాలై లేస్తే...
బృందం భగ్గున మండిన విప్లవ జ్వాలై వస్తే...
అతడు గగనములే పొగసెగలై ప్రజబలమే గజబలమై
దురిత చరితములు నరికి వేయదా...(Bit)
రాక్షస పాలన రక్కిన కోరల చిక్కటి నెత్తురు చూస్తే...
భగ్గున మండిన..ఉగ్రత నిండిన...సూర్యుడు ఎర్రగ లేస్తే....
బృందం రాక్షస పాలన రక్కిన కోరల చిక్కటి నెత్తురు చూస్తే...
భగ్గున మండిన..ఉగ్రత నిండిన...సూర్యుడు ఎర్రగ లేస్తే....
అతడు అది ప్రళయంకాదా...ప్రభంజనమవదా...
ఇది దేశంకాదా...స్వరాజ్యం లేదా...
దారుణ మారణ హింసా పాలన పోదా...
రాక్షస పాలన రక్కినకోరల చిక్కటి నెత్తురు చూస్తే...
భగ్గున మండిన..ఉగ్రత నిండిన...సూర్యుడు ఎర్రగ లేస్తే....
అందరు రాక్షస పాలన రక్కినకోరల చిక్కటినెత్తురు చూస్తే...
భగ్గున మండిన..ఉగ్రత నిండిన...సూర్యుడు ఎర్రగ లేస్తే....

★★★

## జమదగ్ని(1988)

రచన : **సాహితి** గానం : **మనో, జానకి**

:: Opening Music ::

పల్లవి

ఆమె ఇది స్వాతి జల్లూ...ఒణికింది ఒళ్లూ...
వయసంది ఝల్లూ...వాటేసి వెళ్లూ...
పెళ్లాడే వాడా...పెనవేసే తోడా...

అతడు ఇది స్వాతి జల్లూ...ఒణికింది ఒళ్లూ...
దీనేది కళ్లూ...అవునంటెచాలూ...
అల్లాడేదానా...అలవాటైపోనా...

ఆమె ఇది స్వాతి జల్లూ...

:::::: BIT ::::::

చరణం

ఆమె నీలికోక నీటికి తడిసే...పైటగుట్టు బైటపడే...
అతడు పెళ్లికాని పిల్లకి చలితో...పెద్ద చిక్కువచ్చిపడే (Bit) ||2||

ఆమె కన్నెఈడు కాగిపోయెరో...
అతడు పడిన నీరు ఆవిరాయెనా...
ఆమె నాలో తోచే...గిలిగింతై...గంతేవేసే...
ఇన్నాళ్లూ నీకైదాచే వయసంతా మల్లై పూచే....
అతడు కౌగిట్లో నీముంత కొప్పంత రేపెయ్యనా...
తీపంత చూపెయ్యనా...
ఆమె ఇది స్వాతి జల్లూ...
అతడు ఒణికింది ఒళ్లూ...
ఆమె వయసంది ఝల్లూ...

:::::: BIT ::::::

చరణం

అతడు చిన్నదాని అందాల నడుమే సన్నగుంది ఎందుకనీ...
ఆమె అందగాని చేతికి ఇట్టే అందుతుంది అందుకనీ...(Bit) ||2||

అతడు బుగ్గమీద సొట్ట ఎందుకే...

Contd...

ఆమె	చక్కనోడి తీపి ముద్దుకే...

అతడు	నాకివ్వాళ...సోయగాల సోకివ్వాల...
శోభనాల రేయవ్వాల...యవ్వనాల హాయివ్వాలా...

ఆమె	ఈపూటా మనజంట చలిమంట కాగాలిరా..
గిలియంత తీరాలిరా...

అతడు	ఇది స్వాతిజల్లూ...ఒణికింది ఒళ్లూ...

ఆమె	వయసంది ఝల్లూ...వాటేసి వెళ్లూ...

అతడు	అల్లాడేదానా...అలవాటైపోనా...

ఆమె	ఇది స్వాతి జల్లూ...

అతడు	ఒణికింది ఒళ్లూ...

ఇద్దరు	వయసంది ఝల్లూ...

★★★



## వారసుడొచ్చాడు (1988)

రచన : **వేటూరి** గానం : బాలు, చిత్ర

:::::: Opening Music ::::::

పల్లవి

ఆమె ఆ...ఆ...ఆ...ఆ...ఆ ...(Bit) ॥2॥

అతడు నీ అందం...నా ప్రేమగీత గోవిందం (Bit)

నీ వర్ణం...నా కీరవాణి సంకేతం...(Bit)

ఆమె నీ రాగం... ఏ ప్రేమవీణ సంగీతం (Bit)

ఈ యోగం... ఏ జీవధార సంయోగం (Bit)

అతడు ఒయ్యారి రూపం...గాంధారశిల్పం

శృంగారదీపం వెలిగిస్తే

ఆమె నీ చూపు కోణం...సంధించు బాణం

నా లేత ప్రాణం వేధిస్తే...

అతడు నీ అందం...నా ప్రేమగీత గోవిందం (Bit)

ఆమె ఈ యోగం... ఏ జీవధార సంయోగం

::::: BIT :::::

చరణం

ఆమె ఆ...ఆ...ఆ...ఆ...ఆ...(Bit)

అతడు జీరాడు కుచ్చిళ్ల పారాడు పాదాల పారాణి

వేదాలు గమకించగా

ఆమె కోరాడు మీసాల తారాడు మోసాల నా మందహాసాలు

చమకించగా

అతడు ఆరారు ఋతువుల్లో అల్లారు ముద్దుల్లో

ఎదజంట తాళాలు వినిపించగా

ఆమె ఆషాఢ మేఘాల ఆవేశ గీతాలు సరికొత్త

భావాలు సవరించగా..

అతడు నీ కోసమే ఈడూ...నేనూ...వేచాములే (Bit)

ఆమె నీ కోసమే నాలో...నన్నే... దాచానులే (Bit)

అతడు నిను పిలిచాను మలి సందె పేరంటం

Contd...

ఆమె ఇక మొదలాయె పొదరింటి పోరాటం...ఆరాటం..
అతడు నీ అందం...నా ప్రేమగీత గోవిందం (Bit)
ఆమె ఈ యోగం... ఏ జీవధార సంయోగం

:::::: BIT :::::

చరణం

ఆమె ఆ...ఆ...ఆ...ఆ...ఆ...(Bit)
హంసల్లే వచ్చింది.. హింసల్లే గిచ్చింది.. నీ నవ్వు
నా పువ్వు వికసించగా..
అతడు మాటల్లే వచ్చింది.. మనసేదో విప్పింది.. వద్దన్న
నీ మాట వలపించగా..
ఆమె రెప్పల్లో కొట్టింది.. రేపల్లె కాళింది.. నా నువ్వు
నీ నేను క్రీడించగా...
అతడు గాథల్లో నిదరోయి రాధమ్మ లేచింది నా వేణువే
నాకు వినిపించగా
ఆమె నీ పింఛమే చిలికించి పాలూ చేసిందిలే (Bit)
అతడు నాకోసమే ఈ పారిజాతం పూసిందిలే (Bit)
ఆమె మన హృదయాలలో ప్రేమ తారంగం
అతడు స్వర బృందావిహారాల చిందేటి ఆనందం
ఆమె నీ రాగం... ఏ ప్రేమ వీణ సంగీతం (Bit)
ఈ యోగం... ఏ జీవధార సంయోగం (Bit)
అతడు వయ్యారి రూపం...గాంధారశిల్పం
శృంగారదీపం వెలిగిస్తే
ఆమె నీ చూపు కోణం...సంధించుబాణం
నా లేత ప్రాణం వేధిస్తే...
అతడు నీ అందం...నా ప్రేమగీత గోవిందం (Bit)
ఆమె ఈ యోగం ఏ జీవధార సంయోగం (Bit)

★★★

## అభినందన (1988)

రచన : **ఆచార్య ఆత్రేయ** గానం : **బాలు**

:::::: Opening Music ::::::

పల్లవి ఎదుటా... నీవే... ఎదలోనా నీవే ॥2॥
ఎటుచూస్తే ... అటు నీవే.. మరుగైనా కావే
ఎదుటా నీవే... ఎదలోనా నీవే

:::::: BIT ::::::

చరణం మరుపే తెలియని నా హృదయం (Bit)..
తెలిసీ వలచుట తొలినేరం..(Bit) అందుకె యీ గాయం ॥2॥
గాయాన్నైనా మాననీవు... హృదయాన్నైనా వీడిపోవు ...
కాలం నాకు సాయం రాదు... మరణం నన్ను చేరనీదు ...
పిచ్చివాణ్ణి కానీదు...
ఆహాహా.. ఓహోహో.. హుహు...హుహు.హూ
ఎదుటా... నీవే... ఎదలోనా నీవే
ఎటుచూస్తే అటు నీవే.. మరుగైనా కావే
ఎదుటా... నీవే... ఎదలోనా నీవే

:::::: BIT ::::::

చరణం కలలకు భయపడి పోయాను (Bit)
నిదురకు దూరం అయ్యాను (Bit)...వేదనపడ్డానూ... ॥2॥
స్వప్నాలైతే క్షణికాలేగా – సత్యాలన్నీ నరకాలేగా
స్వప్నం సత్యమైతే వింత– సత్యం స్వప్నమయ్యేదుందా
ప్రేమకింత బలముందా..
ఆహాహా.. ఓహోహో..హుహు..హుహు.హూ
ఎదుటా... నీవే... ఎదలోనా నీవే
ఎటుచూస్తే ...అటు నీవే.. మరుగైనా కావే (Followup Music)

★★★

## అభినందన (1988)

రచన : ఆచార్య ఆత్రేయ    గానం : బాలు, జానకి

:::::: Opening Music ::::::

పల్లవి

ఆమె    మంచు కురిసే వేళలో మల్లె విరిసేదెందుకో
అతడు    మల్లె విరిసే మంచులో మనసు మురిసేదెందుకో
ఆమె    ఎందుకో ఏ విందుకో ఎవరితో పొందుకో
అతడు    ఎందుకో ఏ విందుకో ఎవరితో పొందుకో
ఆమె    మంచుకురిసే వేళలో...

:::::: BIT ::::::

చరణం

ఆమె    నీవు పిలిచే పిలుపులో జాలువారే ప్రేమలో ॥2॥
జలక మాడీ పులకరించే సంబరంలో
అతడు    జలదరించే మేనిలో తొలకరించే మెరుపులో ॥2॥
ఎందుకా ఒంపులో ఏమిటా సొంపులో
మంచు కురిసే వేళలో మల్లె విరిసేదెందుకో
ఆమె    మల్లె విరిసే మంచులో మనసు మురిసేదెందుకో
అతడు    ఎందుకో ఏ విందుకో ఎవరితో పొందుకో
ఆమె    ఎందుకో ఏ విందుకో ఎవరితో పొందుకో
అతడు    మంచుకురిసే వేళలో...

:::::: BIT ::::::

చరణం

అతడు    మొలకసిగ్గు బుగ్గలో మొదటి ముద్దు ఎప్పుడో ॥2॥
మన్మధునితో జన్మవైరం చాటినపుడో
ఆమె    ఆరిపోనీ తాపము అంతు చూసేదెప్పుడో ॥2॥
మంచులే వెచ్చనీ చిచ్చులైనప్పుడో
మంచు కురిసే వేళలో మల్లె విరిసేదెందుకో
అతడు    మల్లె విరిసే మంచులో మనసు మురిసేదెందుకో
ఆమె    ఎందుకో ఏ విందుకో ఎవరితో పొందుకో
అతడు    ఎందుకో ఏ విందుకో ఎవరితో పొందుకో
ఇద్దరు    మంచుకురిసే వేళలో...

★★★

## అభినందన (1988)

రచన : ఆచార్య ఆత్రేయ | గానం : బాలు

:::::: Opening Music ::::::

పల్లవి ప్రేమ ఎంత మధురం... ప్రియురాలు అంత కఠినం ॥2॥
చేసినాను ప్రేమ క్షీరసాగరమధనం
మింగినాను హాలాహాలం...
ప్రేమ ఎంత మధురం ప్రియురాలు అంత కఠినం

:::::: BIT ::::::

చరణం ప్రేమించుటేనా... నా దోషము (Bit)
పూజించుటేనా నా పాపము (Bit)
ఎన్నాళ్ళని ఈ ఎదలో ముల్లు...కన్నీరుగ ఈ కరిగే కళ్ళు
నాలోని నీ రూపమూ నా జీవనాధారము
అది ఆరాలి పోవాలి ప్రాణము
ప్రేమ ఎంత మధురం... ప్రియురాలు అంత కఠినం

:::::: BIT ::::::

చరణం నే నోర్వలేనూ... యీ తేజము (Bit)
ఆర్పేయరాదా... యీ దీపము (Bit)
ఆ చీకటిలో కలిసేపోయి... నా రేపటినీ మరిచేపోయి
మానాలి నీ ధ్యానమూ... కావాలి నే శూన్యము
అపుడాగాలి ఈ మూగగానము
ప్రేమ ఎంత మధురం... ప్రియురాలు అంత కఠినం
చేసినాను ప్రేమ క్షీరసాగరమధనం
మింగినాను హాలాహాలం...
ప్రేమ ఎంత మధురం ప్రియురాలు అంత కఠినం

★★★

# అభినందన (1988)

రచన : ఆచార్య ఆత్రేయ    గానం : బాలు, జానకి

:::::: Opening Music ::::::

ఆలాపన

ఆమె    ఆ...ఆఆఆఆ...ఆఆఆఆ...ఆఅఆ...ఆఅఆ...ఆఅఆ...ఆఅఆ...ఆ..
ఉహుంహుంహుం...

అతడు    ఊ హుం హూం హుం...(Bit)

ఆమె    ఉహుంహుంహుం...

అతడు    ఊ హుం హూం హుం...(Bit)

ఆమె    ఊహూం...    అతడు : ఊంఊఊ (Bit)

ఆమె    ఊహూం...    అతడు : ఊంహుంహు (Bit)

ఆమె    అఅఆ..అఅఆ...అఅఆ...ఆఆ..లాల...లాల...లాల...లాలా...

పల్లవి

అతడు    రంగులలో కలవో (Bit) ఎద పొంగులలో కళవో (Bit) ॥2॥
నవ శిల్పానివో...రతి రూపానివో
తొలి ఊహల ఊయలవో...(Bit)
రంగులలో కలవో (Bit) ఎద పొంగులలో కళవో

:::::: BIT ::::::

చరణం

అతడు    కాశ్మీర నందన సుందరివో (Bit) ॥2॥
కైలాస మందిర లాస్యానివో (Bit)
ఆమని పూచే యామినివో..

ఆమె    ఆఆఆఆ...

అతడు    ఆమని పూచే యామినివో...

ఆమె    ఆఆఆఆ...

అతడు    మరుని బాణమో    ఆమె: ఆహా...

Contd...

అతడు	మధుమాస గానమో	ఆమె: ఆహా...
అతడు	నవపరిమళాల పారిజాత సుమమో.. (జానకి హమ్మింగ్)
ఆమె	రంగులలో కలనై (Bit) ఎద పొంగులలో కళనై (Bit) ॥2॥
నవ శిల్పాంగినై...రతి రూపాంగినై
నీ ఊహాల ఊగించనా.. (Bit) రంగులలో కలనై

:::::: BIT ::::::

చరణం

అతడు	ముంతాజు అందాల అద్దానివో... (Bit) ॥2॥
షాజాను అనురాగ సౌధానివో.. (Bit)
లైలా కన్నుల ప్రేయసివో
ఆమె	ఆఆఆఆ...
అతడు	లైలా కన్నుల ప్రేయసివో
ఆమె	ఆఆఆఆ...
అతడు	ప్రణయదీపమో	ఆమె : ఆహా...
అతడు	నా విరహతాపమో	ఆమె : ఆహా...
అతడు	నా చిత్రకళాచిత్ర చైత్ర రథమో.. (జానకి హమ్మింగ్)
ఆమె	రంగులలో కలనై (Bit) ఎద పొంగులలో కళనై (Bit)
నవ శిల్పాంగినై...రతి రూపాంగినై
నీ ఊహాల ఊగించనా.. (Bit)
ఇద్దరు	రంగులలో కలనై (Bit) ఎద పొంగులలో కళనై
(బాలు హమ్మింగ్)

★★★

## మీకు తెలుసా?

అభినందన చిత్రంలో ఆచార్య ఆత్రేయ గీతం "రంగులలో కలవో.. ఎద పొంగులలో కళవో" ఆలపించిన డా॥ ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం గారికి ఉత్తమ గాయకునిగా ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ నంది బహుమతి లభించింది.

## అభినందన (1988)

రచన : **ఆచార్య ఆత్రేయ** గానం : **బాలు**

:::::: Opening Music ::::::

పల్లవి లాలలాలలా...లాలాల లాలలా...
ప్రేమలేదని...ప్రేమించరాదనీ..॥2॥
సాక్ష్యమే నీవనీ నన్ను నేడు చాటనీ
ఓ....ప్రియా...జోహారులూ...
ప్రేమలేదని...ప్రేమించరాదనీ..॥2॥
సాక్ష్యమే నీవనీ నన్ను నేడు చాటనీ
ఓ....ప్రియా...జోహారులూ...
లాల లాలలా...లాలాల లాలలా...

:::::: BIT ::::::

చరణం మనసు మాసిపోతే మనిషే కాదనీ
కటిక రాయికైనా కన్నీరుందనీ
వలపుచిచ్చు రగులుకుంటె ఆరిపోదనీ...
గడియపడిన మనసు తలుపుతట్టి చెప్పనీ..
ముసురు కప్పి ... మూగవోయి...నీ వుంటివీ ॥2॥
మోదుబారి నీడ తోడు లేకుంటినీ
ప్రేమలేదనీ...లాలాలలాలలా...

:::::: BIT ::::::

చరణం గురుతు చెరిపివేసీ జీవించాలనీ
చెరపలేకపోతే మరణించాలనీ
తెలిసికూడ చెయ్యలేని వెర్రివాడినీ
గుండె పగిలిపోవువరకు నన్ను పాడనీ
ముక్కలలో లెక్కలేని రూపాలలో ॥2॥
మరల మరల నిన్ను చూసి రోదించనీ...
ప్రేమలేదని...ప్రేమించరాదనీ..॥2॥
సాక్ష్యమే నీవనీ నన్ను నేడు చాటనీ
ఓ....ప్రియా...జోహారులూ...
లాలలాలలా...లాలాలా లాలలా... ॥2॥

★★★

## అభినందన (1988)

రచన : ఆచార్య ఆత్రేయ          గానం : బాలు, బృందం

పల్లవి

అతడు ఆ..ఆ..ఆహోహో..హో (Bit) ఆ..ఆఆ..ఆ.. (Bit) ఆఆఆఆఆ (Bit)
ఆఆ..ఆఆ...ఆఆ... (Long Bit)
అదే నీవు అదే నేను.. అదే గీతం పాడనా
అదే నీవు (బృందం : ఆ..) అదే నేను.. (బృందం : ఆ..)
అదే గీతం పాడనా (బృందం : ఆఆ..)
కథైనా (బృందం : ఆ..) కలైనా (బృందం : ఆ..)
కనులలో చూడనా
అదే నీవు (బృందం : ఆ..) అదే నేను.. (బృందం : ఆ..)
అదే గీతం పాడనా (బృందం : ఆఆ..)
అదే నీవు (బృందం : ఆ..) అదే నేను.. (బృందం : ఆ..)
అదే గీతం పాడనా

:::::: BIT ::::::

చరణం

బృందం లాలాలాల... లాలాలాల...లాలాలాలా...లాలాలాలా...లాల (Bit)
లాలాలాలాల (Bit) లాలాలాలాల (Bit)
లాలాలాలా లాలాలాలలా (Long Bit)

అతడు కొండా కోన గుండెల్లో... ఎండా వానలైనాము ॥2॥
గువ్వా గువ్వ కౌగిల్లో ... గూడు చేసుకున్నాము
అదే స్నేహమూ (బృందం:ఆఆ..ఆఆ) } ॥2॥
అదే మోహమూ (బృందం:ఆఆఆఆ)
ఆదీ అంతం ఏదీ లేని గానము
అదే నీవు (బృందం : ఆ..) అదే నేను.. (బృందం : ఆ..)
అదే గీతం పాడనా (బృందం : ఆఆ..)
కథైనా (బృందం : ఆ..) కలైనా(బృందం : ఆ..)
కనులలో చూడన

:::::: BIT ::::::

Contd...

చరణం

అతడు నిన్నా రేపు సందెల్లో .. నేడై ఉందామన్నావూ ॥2॥
కన్నీరైన ప్రేమల్లో.. పన్నీరౌదామన్నావు
అదే బాసగా (బృందం:ఆఆఆఆ)
అదే ఆశగా (బృందం:ఆఆఆఆ) } ॥2॥
ఎన్నినాళ్లీ నిన్న పాటే పాడను
అదే నీవు (బృందం : ఆ..) అదే నేను.. (బృందం : ఆ..)
అదే గీతం పాడనా (బృందం : ఆఆ..) } ॥2॥
కథైనా (బృందం : ఆ..) కలైనా (బృందం : ఆ..)
కనులలో చూడన
అదే నీవు (బృందం : ఆ..) అదే నేను.. (బృందం : ఆ..)
అదే గీతం పాడనా

★★★



# అభినందన (1988)

రచన : ఆచార్య ఆత్రేయ　　　　గానం : జానకి

:: Opening Music ::

పల్లవి

ఆమె　ఊఊఊఊహు.. (Bit) ఊఊఊఊహు.. (Bit)

ఊఊఊఊహు.. (Bit)

ఊఊఊఊహు.. (Long Bit)

చుక్కలాంటి అమ్మాయీ...చక్కనైన అబ్బాయీ (Bit)
ఆ...చుక్కలాంటి అమ్మాయీ...చక్కనైన అబ్బాయీ
ఇద్దరొద్దికైనారూ...ముద్దు ముద్దుగున్నారూ ॥2॥
చుక్కలాంటి అమ్మాయీ...చక్కనైన అబ్బాయీ

:::::: BIT ::::::

చరణం

ఆమె　ఈ పిల్లకుమనసైందీ (Bit) ఆ కళ్లకు తెలిసిందీ (Bit)
ఆ పిల్లాడు వలచిందీ (Bit) ఈ బుగ్గకు సిగ్గైందీ (Bit)
కల్యాణం..వైభోగం...నేడో రేపో ఖాయం అన్నారూ (Bit)
మేళాలూ...తాళాలూ...బాణాసంచా కలలే కన్నారూ (Bit)

పిల్లలు　పిల్లలకి మాకేమిస్తారు?

ఆమె　కొత్తబట్టలు కుట్టిస్తారు...గుర్రం సార్టు ఎక్కిస్తారు (Long Bit)
కొత్తబట్టలు కుట్టిస్తారు...గుర్రం సార్టు ఎక్కిస్తారు
ఊరంతా ఊరేగిస్తారు
చుక్కలాంటి అమ్మాయీ...చక్కనైన అబ్బాయీ
ఇద్దరొద్దికైనారూ...ముద్దు ముద్దుగున్నారూ ॥2॥
ఆ...చుక్కలాంటి అమ్మాయీ...చక్కనైన అబ్బాయీ

PATHOS VERSION CONTD...

## అభినందన (1988)

రచన : ఆచార్య ఆత్రేయ గానం : జానకి

(PATHOS VERSION)

పల్లవి

ఆమె ఊఊఊఊహు.. (Bit) ఊఊఊఊహు.. (Bit)
ఊఊఊఊహు.. (Bit) ఊఊఊఊహు.. (Bit) ఊఊఊ...
చుక్కలాంటి అమ్మాయీ...చక్కనైన అబ్బాయీ (Bit) ॥2॥
ఇద్దరొద్దికైనారూ...ముద్దు ముద్దుగున్నారూ ॥2॥
చుక్కలాంటి అమ్మాయీ...చక్కనైన అబ్బాయీ

::::: BIT :::::

చరణం ఒక బంధువు వచ్చాడూ (Bit) తానొంటరినన్నాడూ (Bit)
ఆ బంధం వేశాడూ (Bit) సంబంధం చేశాడూ (Bit)
ఆ పిల్ల..అతనికి...అనుకోకుండా ఇల్లాలయ్యిందీ (Bit)
అనుకోకుండా ఇల్లాలయ్యిందీ... (Bit)
ఇన్నాళ్లూ ప్రేమించిన పిల్లాడేమో పిచ్చాడయ్యాడూ...
పిల్లాడేమో...పిచ్చాడయ్యాడూ...

★★★



# మేనమామ (1988)

రచన: వేటూరి　　　　గానం : బాలు, చిత్ర

:::::: Opening Music ::::::

పల్లవి

అతడు　జింగిడి జింగిడి బ్యూటీ...అహ...లంగరు వెయ్యకు స్వీటీ... (Bit)
ముద్దుల మూటను విప్పూ..అరె...లెక్కెట్టుకుంటాను చెప్పూ... (Bit)
అడిగింది తప్పైందా...ఓయబ్బో నీకు ఒళ్లు మండిందా.. ॥2॥
జింగిడి జింగిడి బ్యూటీ...అరె...లంగరు వెయ్యకు స్వీటీ...
జింగిడి జింగిడి బ్యూటీ...

:::::: BIT ::::::

చరణం

ఆమె　మొలకమీసం...సొగసుగున్నా...పెదవికదిపే కులాసరా... } ॥2॥
గరుకు చురుకు గుచ్చుకుంటే...నరనరము రేగిపోవురా
అతడు　కొత్తతెనే నీకట్టాగుందీ...అరె కొన్నాళ్లుపోతే మోజౌతదీ...
శ్రీరంగనీతుల చింతామణీ...అరె...శృంగారమంతేనె భామామణీ...
ఆమె　మగబుద్ధి నువ్వు చూపించకూ...ఓ కన్నెపిల్లనిట్టా ముంచేయకూ...
అతడు　అరె...ఎంతమాట అన్నావూ..
ఆమె　జింగిడి జింగిడి పిల్లగా...అహ...లంగరు వెయ్యకు మెల్లగా (Bit)
ముద్దుల మూటను చూసీ...అరెరెరెరెరెరె...వెర్రెక్కి పోతావు మురిసీ (Bit)
ఊరంత తిరిగేవు...నేడు నా వెంట పడ్డావూ...॥2॥

:::::: BIT ::::::

చరణం

అతడు　బ్రేకు వీకు షాకు చేసే..రూటులో వెళ్లనమ్మడూ... } ॥2॥
నచ్చి మనసు ఇచ్చుకుంటే...నా చిలక నువ్వే గుమ్మడూ...
ఆమె　ఊర్కోవయ్యా...నీ చూసేగుణం...అయ్యో..ఊరంతనీపైన కన్నేసిందీ
ఏచూపు తగిలో చిక్కావిలా...అహ..నా వయసుతో దిష్టి తీస్తానులే
అతడు　నీప్రేమకే నే సగమైతిని...అదికూడ నీకు అనుమానమై
నేనల్లాడి పోతున్నా...
ఆమె　జింగిడి జింగిడి పిల్లగా...అహ...లంగరు వెయ్యకు మెల్లగా (Bit)
అతడు　ముద్దుల మూటను విప్పూ..అరె...లెక్కెట్టుకుంటాను చెప్పూ... (Bit)
ఆమె　ఊరంత తిరిగేవు...నేడు నా వెంట పడ్డావూ... (Bit)
అతడు　అడిగింది తప్పైందా...ఓయబ్బో నీకు ఒళ్లు మండిందా...
ఆమె　జింగిడి జింగిడి పిల్లగా...అహ...లంగరు వెయ్యకు మెల్లగా
అతడు　జింగిడి జింగిడి బ్యూటీ...హ్హా...

★★★

# రుద్రవీణ (1988)

రచన : **సిరివెన్నెల** గానం : **జేసుదాస్, చిత్ర**

:::::: Opening Music ::::::

పల్లవి

అతడు లలిత ప్రియకమలం విరిసినదీ... (Bit)

లలిత ప్రియకమలం విరిసినదీ...కన్నుల కొలనిని...ఆఆఆ...

ఆమె ఉదయ రవికిరణం మెరిసినదీ...ఊహల జగతిని..ఆఆఆ...

ఉదయ రవికిరణం మెరిసినదీ... (Bit)

అతడు అమృత కలశముగ ప్రతినిమిషం ॥2॥

కలిమికి దొరకని చెలిమిని కురిసిన అరుదగు వరమిది

లలిత ప్రియకమలం విరిసినదీ...

:::::: BIT ::::::

చరణం

అతడు రేయి పవలు కలిపే సూత్రం సాంధ్యరాగం

కాదా నీలో నాలో పొంగే ప్రణయం

ఆమె నేల నింగి కలిపే బంధం ఇంద్రచాపం

కాదా మన స్నేహం ముడివేసే పరువం

అతడు కలల విరులవనం...మన హృదయం ॥2॥

వలచిన ఆమని కూరిమి మీరగ చేరిన తరుణం

ఆమె కోటి తలపుల చివురులు తొడిగెను

తేటి స్వరముల మధువులు చిలికెను

అతడు తీపి పలుకుల చిలుకల కిలకిల

తీగ సొగసుల తొణికిన మిలమిల

ఆమె పాడుతున్నది ఎద మురళీ...రాగఝరి తరగల మృదురవళి

అతడు తూగుతున్నది మరులవనీ...లేత విరి కులుకుల నటనగని

ఆమె వేల మధుమాసముల..పూలదరహాసముల

మనసులు మురిసెను

అతడు లలిత ప్రియకమలం విరిసినదీ... కన్నుల కొలనిని..ఆఆఆ..

ఆమె ఉదయరవికిరణం మెరిసినదీ...

:::::: BIT ::::::

Contd...

చరణం

ఆమె కోరేకోవెల ద్వారం నీవై చేరుకోగ...
కాదా నీకై మ్రోగే(ప్రాణం ప్రణవం...
అతడు తీసే శ్వాసే ధూపం...చూసే చూపే దీపం
కాదా మమకారం నీ పూజా కుసుమం...
ఆమె మనసు హిమగిరిగా మారినదీ...॥2॥
కలసిన మమతల స్వరజతి పశుపతి పదగతి కాగా...
అతడు మేని మలుపుల చెలువపు గమనము
వీణ పలికిన జిలిబిలి గమకము
ఆమె కాలి మువ్వగ నిలిచెను కాలము
పూల పవనము వేసెను తాళము
అతడు గేయమైనది తొలి(ప్రాయం...రాయమని మాయని మధుకావ్యం
ఆమె స్వాగతించెను ప్రేమపథం
సాగినది యిరువురి బ్రతుకురథం
అతడు కోరికల తారకల సీమలకు చేరుకొనె వడివడి పరువిడి
ఆమె ఉదయ రవికిరణం మెరిసినదీ...ఊహాల జగతిని...ఆఆఆ..
అతడు లలిత ప్రియకమలం విరిసినదీ...కన్నుల కొలనిని...ఆఆఆ..
లలిత ప్రియకమలం విరిసినదీ...

★★★



## రుద్రవీణ (1988)

రచన : సిరివెన్నెల గానం : బాలు, బృందం

:::::: Opening Music ::::::

పల్లవి తరలిరాద తనే వసంతం (Bit) తన దరికిరాని వనాలకోసం (Bit)
తరలిరాద తనే వసంతం ...తన దరికిరాని వనాలకోసం
గగనాలదాకా అలసాగకుంటే...మేఘాలరాగం ఇలచేరుకోదా
తరలిరాద తనే వసంతం ...తన దరికిరాని వనాలకోసం

:::::: BIT ::::::

చరణం వెన్నెలదీపం కొందరిదా...అడవిని సైతం వెలుగుకదా ॥2॥
ఎల్లలులేనీ చల్లని గాలి...అందరికోసం అందును కాదా
ప్రతీమదిని లేపే ప్రభాతరాగం...పదేపదే చూపే ప్రధాన మార్గం
ఏదీ సొంతం కోసం కాదను సందేశం
పంచే గుణమే పోతే ప్రపంచమే శూన్యం!
ఇది తెలియని మనుగడ కథ
దిశ నెరుగని గమనము కద
తరలిరాద తనే వసంతం...తన దరికిరాని వనాలకోసం

:::::: BIT ::::::

చరణం బ్రతుకునలేనీ శ్రుతికలదా? ఎదసడిలోనే లయలేదా ॥2॥
ఏ కళకైనా...ఏకలకైనా...జీవితరంగం వేదిక కాదా!
ప్రజాధనం కానీ కళా విలాసం
ఏ ప్రయోజనం లేనీ వృధా వికాసం
కూసే కోయిల పోతే...కాలం ఆగిందా?
పారే ఏరే పాడే మరో పదం రాదా?
మురళికి గల స్వరముల కళ...పెదవిని విడి పలకదు కద
తరలిరాద తనే వసంతం...తన దరికిరాని వనాలకోసం
గగనాలదాకా అలసాగకుంటే...మేఘాలరాగం ఇలచేరుకోదా
తరలిరాద తనే వసంతం (Bit) తన దరికిరాని వనాలకోసం (Bit)

★★★

## రుద్రవీణ (1988)

రచన : **సిరివెన్నెల** గానం : **బాలు**

:::::: Opening Music ::::::

సాకీ సీకటమ్మ సీకటీ...ముచ్చటైన సీకటీ...
ఎచ్చనైన ఊసులెన్నొ రెచ్చగొట్టు సీకటీ...
నిన్ను నన్ను రమ్మందీ..కన్నుగొట్టి సీకటి...
ముద్దుగా ఇద్దరికే ఒద్దికైన సీకటీ...
పొద్దు పొడుపేలేని సీకటే ఉండిపోనీ...
మన మధ్యరానీక...లోకాన్ని నిద్దరోనీ...
రాయే రాయే రామసిలకా...
సర్దుకుపోయే సీకటెనకా..ఆ..(Long Bit)

పల్లవి నమ్మకు నమ్మకు ఈ రేయిని (Bit)
కమ్ముకు వచ్చిన ఈ మాయని (Bit)
నమ్మకు నమ్మకు ఈ రేయిని (Bit)
అరె...కమ్ముకు వచ్చిన ఈ మాయని (Bit)
కన్నులు మూసి (Bit) మత్తులోన మెత్తగతోసీ (Bit)
నీ...కన్నులు మూసి (Bit) మత్తులోన మెత్తగతోసీ (Bit)
కలలే...వలగా...విసిరే చీకట్లను...
నమ్మకు నమ్మకు ఈ రేయిని (Bit)
అరె...కమ్ముకు వచ్చిన ఈ మాయనీ (Long Bit)
వెన్నెలలోని మసకలలోనే...మసలును లోకం అనుకోకూ
రవికిరణం కనబడితే..తెలియును తేడాలన్నీ....
నమ్మకు నమ్మకు అరె...నమ్మకు నమ్మకు
నువ్వు నమ్మకు నమ్మకు ఈ రేయిని (Bit)
అరె...కమ్ముకు వచ్చిన ఈ మాయనీ....

:::::: BIT ::::::

చరణం ఆకాశం తాకే ఏమేడకైనా..ఆధారం లేదా ఈ నేలలో ॥2॥
పుడమిని చూడని కన్ను...నడపదు ముందుకు నిన్ను

Contd...

నిరసన చూపకు నువ్వు ఏనాటికీ...
పక్కవారి గుండెలనిండా..చిక్కనైన వేదననిండా ॥2॥
ఏహోయి రాదోయి నీ వైపు మరువకు అని
నమ్మకు నమ్మకు అరె...నమ్మకు నమ్మకు
ఆహాఁ...నమ్మకు నమ్మకు ఈ రేయిని (Bit)
అరె...కమ్ముకు వచ్చిన ఈ మాయనీ....

::::: BIT :::::

చరణం సీతాకాలంలో ఏకోయిలైనా...రాగంతీసేనా ఏకాకిలా ॥2॥
మురిసే పువ్వులు లేక..విరిసే నవ్వులు లేక
ఎవరికి చెందిన గానం సాగించునా..
పదుగురి సౌఖ్యం పండే దినమే పండుగ కాదా ॥2॥
ఆనాడు వాసంత గీతాలు పలుకును కద
(సరిగమలు) మ..గసమ..దమద..నిదని..మమమగస..
మమ..మదమ..దదదనిద..నిసిని..సగసని..
సనిదనిదమ...దమ..నిసనిద..సనిదనిదమసగ..
నమ్మకు నమ్మకు అరె...నమ్మకు నమ్మకు
అహా...నమ్మకు నమ్మకు ఈరేయిని (Bit)
అహా...కమ్ముకు వచ్చిన ఈ మాయని (Bit)
కన్నులు మూసి (Bit) మత్తులోన మెత్తగతోసి (Bit)
నీ కన్నులు మూసి (Bit) మత్తులోన మెత్తగతోసి (Bit)
కలలే...వలగా...విసిరే చీకట్లను...
నమ్మకు నమ్మకు ఈ రేయిని (Bit)
అరె...కమ్ముకు వచ్చిన ఈ మాయనీ (Bit)

★★★

## ఆఖరిపోరాటం (1988)

రచన : **వేటూరి** గానం : **బాలు, చిత్ర**

:::::: Opening Music ::::::

పల్లవి

అతడు అబ్బదీని సోకు... సంపంగి రేకు (Bit)
ఆమె అంటుకుంటే షాకు... నన్నంటుకోకు (Bit)
అతడు అమ్మ దీని చూపు మరుమల్లె తూపు (Bit)
ఆమె అమ్మ రాకురాకు నేనున్న వైపు (Bit)
అతడు లేగులాబి మొగ్గలాటి ఎర్రబుగ్గనంటుకున్న
ముద్దులన్ని మోతపుట్టే...(Bit)
ఆమె సిగ్గుపడ్డ పెదవి మీద మొగ్గ విచ్చుకున్న పూలు
మోజులన్ని మాలలల్లే... (Bit)
అతడు అబ్బదీని సోకు... సంపంగి రేకు (Bit)
ఆమె అంటుకుంటే షాకు... నన్నంటుకోకూ (Bit)
అతడు అమ్మ దీని చూపు మరుమల్లె తూపు (Bit)
ఆమె అమ్మ రాకురాకు నేనున్న వైపు

:::::: **BIT** :::::

చరణం

అతడు దోర అందాలు చూశాక నేనూ... దోచుకోకుంటే ఆగేదెలా...
ఆమె కొమ్మ వంగాక కొంగొత్త పండూ దాచినా నేను దాగేదెలా
అతడు సందె పొద్దింక సన్నగిల్లాక చిన్నగా గిల్లుకోనా...
ఆమె చిమ్మ చీకట్లె... సిగ్గు పడ్డాక... నిన్ను నేనల్లుకోనా...
అతడు ఒడ్డులేని ఏరూ ఒడేల భామా
ఆమె అడ్డులేని ప్రేమా ఇదేనులే
అతడు ముద్దుపెట్టగానే... ముళ్లు జారిపోయే
వెల్లువెంటి ఈదుమీద ఒళ్లు ఒళ్ల వంతెనేసి
చాటు చూసి దాట కుంటే తంటా...
అతడు అబ్బదీని సోకు... సంపంగి రేకు (Bit)
ఆమె అంటుకుంటే షాకు... నన్నంటుకోకు (Bit)
అతడు అమ్మ దీని చూపు మరుమల్లె తూపు (Bit)

Contd...

ఆమె	అమ్మ రాకురాకు నేనున్న వైపు (Bit)
అతడు	లేగులాబి మొగ్గలాటి ఎర్రబుగ్గనంటుకున్న
ముద్దులన్ని మోతపుట్టే... (Bit)
ఆమె	సిగ్గు పడ్డ పెదవిమీద... మొగ్గ విచ్చుకున్నపూలు
మోజులన్ని మాలలల్లే... (Bit)
అతడు	అబ్బదీని సోకు... సంపంగి రేకు (Bit)
ఆమె	అంటుకుంటే షాకు... నన్నంటుకోకూ (Bit)

:::::: BIT :::::

చరణం

ఆమె	ఎన్ని బాణాలు వేస్తావు నీవు... తీపి గాయాలతో చెప్పనా
అతడు	ఎన్ని కోణాలు వున్నాయినీలో... కంటికే నోరు మూసెయ్యానా
ఆమె	ఎంత తుళ్లింత, లేత ఒళ్లంతా, కౌగిలే కప్పుకోనా...
అతడు	మెచ్చు కున్నంత... ఇచ్చు కున్నంత మెత్తగా పుచ్చుకోనా
ఆమె	తెడ్డులేని నావా చలాకి ప్రేమా
అతడు	సందు జూసి ఆడే సరాగమే
ఆమె	మట్టు పెట్టగానే కట్టు జారిపోయే... వెన్నెలంటి
సోకులన్ని యీనె దీసి యివ్వ బోతె ముందుగాని దోపిడైతే...టాటా
అతడు	అబ్బదీని సోకు... సంపంగి రేకు (Bit)
ఆమె	అంటుకుంటే షాకు... నన్నంటుకోకు (Bit)
అతడు	అమ్మ దీని చూపు మరుమల్లె తూపు (Bit)
ఆమె	అమ్మ రాకురాకు నేనున్న వైపు (Bit)
అతడు	లేగులాబి మొగ్గలాటి ఎర్రబుగ్గనంటుకున్న
ముద్దులన్ని మోతపుట్టే...(Bit)
ఆమె	సిగ్గుపడ్డ పెదవి మీద మొగ్గ విచ్చుకున్న పూలు
మోజులన్ని మాలలల్లే...(Bit)
అతడు	అబ్బదీని సోకు... సంపంగి రేకు (Bit)
ఆమె	అంటుకుంటే షాకు... నన్నంటుకోకు (Bit)
అతడు	అమ్మ దీని చూపు మరుమల్లె తూపు (Bit)
ఆమె	అమ్మ రాకురాకు నేనున్న వైపు

★★★

## ఆఖరిపోరాటం (1988)

రచన : **వేటూరి** గానం : బాలు, జానకి

:: Opening Music ::

పల్లవి

అతడు స్వాతి చినుకు సందె వేళలో...హోయ్ (Bit)
లేలేత వణుకు అందగత్తెలో..హోయ్ (Bit)
మబ్బే కన్ను గీటే...అరె...మతే పైటదాటే (Bit)
చలే కొరుకుతుంటే హోయ్ చెలే ఒదుగుతుంటే (Bit)
భలేగుంది పడుచుముచ్చటా...హ్హో (Bit)
భలేకదా గాలి ఇచ్చటా...(Bit)
అరె భలేగుంది పడుచుముచ్చటా...హోయ్ (Bit)
భలేకదా గాలి ఇచ్చటా... (Bit)

ఆమె స్వాతి చినుకు సందె వేళలో...హోయ్ (Bit)
లేలేత వలపు అందగాడిలో..హోయ్ (Bit)
ఈడే ఉరుముతుంటే...నీడే తరుముతుంటే (Bit)
సరాగాలతోటే స్వరాలల్లుకుంటే (Bit)
పదాఅంది పడుచు పూపొదా...హోయ్ (Bit) } ॥2॥
ఇదేకదా చిలిపి ఆపదా...(Bit)

:::::: **BIT** :::::

చరణం

అతడు ఈ గాలితో ఒకే చలీ..ఈ దెబ్బతో అదే బలీ (Bit)
ఆమె ఈ ప్రేమలో ఒకే గిలీ...ఈ పద్దుతో సరేసరి (Bit)
అతడు ఈ తీగకే గాలాడకా..
ఆమె నా వీణలే అల్లాడగా..
అతడు సరాలన్నివేడీ..పదాలెన్నొపాడా
ఆమె వరాలిచ్చిపోరా...వరించాను లేరా
అతడు చల్లనిజల్లుల సన్నని గిల్లుడు సాగినవేళా కురిసిన

Contd...

స్వాతి చినుకు సందెవేళలో హోయ్ (Bit)
లేలేత పణుకు అందగత్తెలో..హోయ్ (Bit)
మబ్బే కన్ను గీటే...అరె...మతే పైటదాటే (Bit)

ఆమె సరాగాల తోటే స్వరాలల్లుకుంటే (Bit)
పదాఅంది పదుచు పూపొదా...హోయ్ (Bit)
ఇదేకదా చిలిపి ఆపదా...(Bit)

అతడు భలేగుంది పడుచుముచ్చటా...హ్హో (Bit)
భలేకదా గాలి ఇచ్చటా...

:::::: BIT :::::

చరణం

ఆమె యాయాయ్యా..యాయాయ్యా...(Bit) యాయాయ్యా
యాయాయ్యా (Bit) తకిట్ట తకిట్ట తకిట్ట తకిట్ట తకిట్ట ..
తకిట తకిట్ట తా..(Long Bit)

ఆమె ఈ వానలో కథేమిటో...నా ఒంటిలో సొదెందుకో (Bit)

అతడు నీ కంటిలో కసేమిటో..నా కంటినీ తడెందుకో (Bit)

ఆమె తొలివానలా గిలిగింతలో

అతడు పెనవేసినా కవ్వింతలో

ఆమె ఇదే మాట రాకా...పెదాలందు ఆడా

అతడు శ్రుతేమించిపోయా..లయే రేగిపోగా

ఆమె మబ్బులచాటున ఎండలు సోకిన అల్లరివేళా విరిసిన
స్వాతి చినుకు సందె వేళలో...హోయ్ (Bit)
లేలేత వలపు అందగాడిలో..హోయ్ (Bit)
ఈడే ఉరుముతుంటే...నీడే తరుముతుంటే (Bit)

అతడు చలే కొరుకుతుంటే చెలే ఒదుగుతుంటే (Bit)
భలేగుంది పడుచుముచ్చటా...హ్హో (Bit)
భలేకదా గాలి ఇచ్చటా...(Bit)

ఆమె పదా అంది పడుచు పూపొదా...హోయ్ (Bit)
ఇదేకదా చిలిపి ఆపదా... (చప్పట్లతో Music bit follows)

★★★

## ఆఖరిపోరాటం (1988)

రచన : **వేటూరి** గానం : **బాలు, లతా మంగేష్కర్**

:: Opening Music ::

పల్లవి

ఆమె ఊఊఉఉఊ.. ఊఉఉఊ.. ఊఊఊఊ (Long Bit)
తెల్లచీరకు తకధిమి తపనలు రేగేనమ్మ సందెఎన్నెల్లో

అతడు సిరిమల్లె పూలకు సరిగమ ఘుమఘుమ
తాకేనమ్మ జంట ముద్దుల్లో

ఆమె అవే తియ్యని సరాగాలుగా

అతడు ఇలా హాయిగా స్వరాలూదగా

ఆమె సన్నాయింటి వయ్యారంలో సాయంత్రాలే సంగీతాలై

అతడు మల్లెపూలకు సరిగమ ఘుమఘుమ
తాకేనమ్మ జంట ముద్దుల్లో

ఆమె అహా... తెల్ల చీరకు తకధిమి తపనలు రేగేనమ్మ సందెఎన్నెల్లో

:::::: BIT :::::

చరణం

అతడు రపప... పప... పపప... పప (Bit) రపప... పప... పపప.. ప (Bit)
తురురు రురు రురు రురురు..తురురు..రురు..తురురురూరు.. (Long Bit)

ఆమె వైశాఖం తరుముతుంటే (Bit) నీ ఒళ్లో ఒదుగుతున్నా (Bit)

అతడు ఆషాఢం ఉరుముతుంటే... (Bit) నీ మెరుపే చిదుముకున్నా (Bit)

ఆమె కవ్వింతనవ్వాలి... పువ్వంతకావాలి... పండించుకోవాలి ఈ బంధమే

అతడు నీ తోడుకావాలి... నే తోడుకోవాలి... నీ నీడలోవున్న శృంగారమే

ఆమె జాబిల్లీ... సూరీడూ...ఆకాశంలో నింపిన సొగసుల

అతడు తెల్లచీరకు తకధిమి తపనలు రేగేనమ్మ సందె ఎన్నెల్లో తారారరీర...

ఆమె సిరిమల్లె పూలకు సరిగమ ఘుమఘుమ తాకేనమ్మ జంట ముద్దుల్లో

అతడు తారారరార...

:::::: BIT :::::

చరణం

ఆమె కార్తీకం అ...కలిసివస్తే (Bit) నీ పరువం అడుగుతున్నా (Bit)

Contd...

అతడు హేమంతం ఒ...కరుగుతుంటే (Bit) నీ అందం కదుగుతున్నా (Bit)
ఆమె ఆకాశ దీపాన ఆ మేఘరాగాలు...పలికాయి నా స్వప్న సంగీతమే
అతడు ఈ చైత్రమాసాన చిరునవ్వు దీపాలు వెలిగాయి...నీకంట నాకోసమే
ఆమె గిలిగింతే గీతాలై సింగారానికి సిగ్గులు కలిపిన
అతడు తెల్లచీరకు తకధిమి తపనలు రేగెనమ్మ సందెఎన్నెల్లో
ఆమె సిరిమల్లె పూలకు సరిగమ ఘుమఘుమ
తాకేనమ్మ జంట ముద్దులో...అవే తియ్యని సరాగాలుగా
అతడు ఇలా హాయిగా స్వరాలూదగా
ఆమె సన్నాయంటి వయ్యారంలో సాయంత్రాలే సంగీతాలై
అతడు తెల్లచీరకు తకధిమి తపనలు రేగేనమ్మ సందెఎన్నెలో
తారారరీర...
ఆమె సిరిమల్లె పూలకు సరిగమ ఘుమఘుమ తాకేనమ్మ జంటముద్దుల్లో
అతడు ఊహూహూహూహూహూ

★★★



## మీకు తెలుసా?

కె. రాఘవేంద్రరావు దర్శకత్వంలో వైజయంతీ మూవీస్ పతాకంపై అశ్వనీదత్ నిర్మించిన "ఆఖరి పోరాటం" (1988)లో "తెల్లచీరకు తకధిమి తపనలు రేగేనమ్మ సందె ఎన్నెల్లో" పాటను లతామంగేష్కర్ చెన్నై వచ్చిన సందర్భంగా అప్పటికప్పుడు వేటూరి చేత రాయించి ఇళయరాజా కంపోజ్‌చేసారు. "వైశాఖం తరుముతుంటే; ఆషాఢం ఉరుముతుంటే; కార్తీకం కలిసివస్తే; హేమంతం కరుగుతుంటే" అనే మాటలతో వచ్చే చరణాలను హిందీకి అనువదించి వివరించినప్పుడు లతామంగేష్కర్ వేటూరి పదప్రయోగ చమత్కారాన్నీ, ఆచరణాలకు అమరిన ఇళయరాజా ట్యూన్ని ఎంతగానో మెచ్చుకున్నారు. – ఇళయరాజా

## శ్రీ కనకమాలక్ష్మి రికార్డింగ్ డాన్స్ ట్రూప్ (1988)

రచన : **వంశీ, ఇళయరాజా** గానం : **బాలు, జానకి**

:::::: Opening Music ::::::

పల్లవి

అతడు వెన్నెల్లై... ఆమె : పాడనా

అతడు నవ్వులే... ఆమె : పూయనా

అతడు మల్లెలే... ఆమె : పొదగనా

అతడు పువ్వులో (హూం)...నవ్వులో (హూం)...మొవ్వలా

ఆమె ఊహూం

అతడు ఒంపులో (హం)..సొంపులో (హం)..కెంపులా

ఆమె ఆహాం

అతడు కలకల పొదలో... (Bit) కిలకిల కథనం (Bit)

మునిముసి రొదలో... (Bit) అలసట మధురం... (Bit)

ఆమె పొద్దులో... అతడు : మీటనా

ఆమె ముద్దులే... అతడు : నాటనా

ఆమె హద్దులే... అతడు : దాటనా

ఆమె ఇవ్వనా (ఆం)...యవ్వనం (ఆం)...పువ్వునై

అతడు అహహ

ఆమె గువ్వనై (ఓ)...గవ్వనై (ఓ)...నవ్వనా...

అతడు (నవ్వు)

ఆమె లలనామణినై... (Bit) కలలో మణినై (Bit)

నవలా మణినై... (Bit) చింతామణినై (Bit)

అతడు వెన్నెల్లై... ఆమె : పాడనా

అతడు నవ్వులే... ఆమె : పూయనా

అతడు మల్లెలే... ఆమె : పొదగనా

ఆమె నీ... అతడు : నిసరి

ఆమె స... అతడు : సరిగ

ఆమె పనిస... అతడు : సమగ సరిగ

ఆమె పనిప... అతడు : గపగ గమరి

Contd...

ఆమె } మనినిని...గగగగ...రిరిరిరీ...ససస...రిరిరిరీ...గా
అతడు } గగగగమ...నిసరిమగ...మగసనిగ సగమ...పనిసనిస

:::::: BIT :::::

చరణం

ఆమె లీలగా తూగుతూ..ఏవిఁటో దేహమె
వేడుకా ధారలే...దాహమై పోరినా (Bit)
పాడుతూ వేడినా...పోరుతూ పాడినా (Bit)
భేషజం చూపుతూ..దోహదం చేయవూ

అతడు మోవికెంపు బాధా...గుండెమువ్వగాథా
పొద్దుపువ్వులాగా...నవ్వుతుంది చూడూ
వెలుతురు (హూఁ)...నేత్రమే ...(హూఁ) సోకని ప్రాంగణమూ (Bit)
గాలికే (హఁ)...ఊపిరి (హఁ)...పూసే పరిమళమూ..

:::::: BIT :::::

చరణం

అతడు తకధిమి...తరికిట తద్ధోం...తకధిమి...తరికిట తద్ధోం...
తరికిట తద్ధోం...తరికిట తద్ధోం...తకతోం...
తకధిమి...తరికిట తద్ధోం...తకధిమి...తరికిట తద్ధోం...
తరికిట తద్ధోం...తరికిట తద్ధోం...తకతోం...

ఆమె చందనం పూయనా...పూలలో రాజుకి
నోచినా నోముకే...పూచినా రోజుకి
సుందరం ధూపమే...వేయనా పూజకి
జాలిగా గాలిలో...వీచినా మోజుకీ

అతడు ప్రమిదకాంతి పువ్వా..ప్రమత చిలుకనవ్వా
కలిపి కలలు రాసే...కథల పురమువాసీ
బతుకున (హూఁ)...పలికిన (హూఁ)...కిలకల కూజితమూ (Bit)
మధురమై (హఁ)... మొలవనీ (హఁ)...ఉలిశిల ఖేలనమూ (Bit)

ఆమె పొద్దులో... అతడు : మీటనా
ఆమె ముద్దులే... అతడు : నాటనా
ఆమె హద్దులే... అతడు : దాటనా

★★★

## శ్రీ కనకమాలక్ష్మి రికార్డింగ్ డాన్స్ ట్రూప్ (1988)

రచన : **సిరివెన్నెల** గానం : బాలు, జానకి

(హోరు గాలి శబ్దం)

పల్లవి

ఆమె ఊఊఉ... ఉఉఊఉ... ఊఊఉఊ... (Bit)
ఏనాడు విడిపోని ముడివేసెనే...
నీ చెలిమితోడూ... ఈ పసుపుతాడూ ॥2॥
ఈ మధుర యామినిని...

అతడు ఏ జన్మ స్వప్నాల అనురాగమో...॥2॥
పూసినది నేడూ... ఈ పసుపుతాడూ... ॥2॥
ఈ సుధల అమనిని..
ఏనాడు విడిపోని ముడివేసెనే

ఆమె ఏనాడు విడిపోని ముడివేసెనే
సా...గామగమ...గామగమ...రీ...(Bit)
సారినిరి...సారినిస..నీ...(Long Bit)
సాదాదరీ...రీరాదపా...

:::::: BIT :::::

చరణం

అతడు మోహనపారాడు వేలికొనలూ (Bit)
నీమేను కాదా...చైత్ర వీణా... (Bit)

ఆమె వేవేల స్వప్నాల వేడుకలలో (Bit)
నీ చూపు కాదా పూలవానా...(Bit)

అతడు రాగసుధ పారే అలల శ్రుతిలో
స్వాగతము పాడే ప్రణయమూ..

ఆమె కలకాలమూ..కలగానమై
నిలవాలి మనకోసము.. ఈ మమత
ఏనాడు విడిపోని ముడివేసెనే

అతడు ఏనాడు విడిపోని ముడివేసెనే

Contd...

::::: BIT :::::

చరణం

| | |
|---|---|
| అతడు | నీ మోవి మౌనాన మదన రాగం (Bit) |
| | మోహాల సాగె మధుపగానం.. (Bit) |
| ఆమె | ఏ మోవి పూసింది చైత్ర మోదం (Bit) |
| | చిగురాగు తీసే వేణునాదం (Bit) |
| అతడు | పాపలుగ వెలిసేను పసిడి కలకూ |
| | ఊయలలు వేసే క్షణమిదే... |
| ఆమె | రేపన్నదీ... ఈపూటనే... |
| | చేరింది మనజంటకు...ముచ్చటగ |
| | ఏనాడు విడిపోని ముడివేసెనే... |
| అతడు | ఏనాడు విడిపోని ముడివేసెనే... |
| ఆమె | నీ చెలిమితోడూ... ఈ పసుపుతాడూ |
| అతడు | పూసినది నేడు... ఈ పసుపుతాడు |
| ఇద్దరు | ఈ మధురయామినిని... |
| | ఏనాడు విడిపోని ముడివేసెనే.. ॥2॥ |

★★★



# శ్రీ కనకమహాలక్ష్మి రికార్డింగ్ డాన్స్ ట్రూప్
## (1988)

రచన : సి. నారాయణరెడ్డి                    గానం : బాలు, జానకి

(గూఢచారి 116 చిత్రం నుండి రీమిక్స్ పాట)

:::::: Opening Music ::::::

పల్లవి

అతడు   నువ్వు నా ముందుంటే...నిన్నలా చూస్తుంటే
జివ్వుమంటుంది మనసూ...రివ్వుమంటుంది వయసూ

ఆమె   నువ్వు నా ముందుంటే...నిన్నలా చూస్తుంటే
జివ్వుమంటుంది మనసూ...రివ్వుమంటుంది వయసూ

అతడు   నువ్వు నా ముందుంటే...నిన్నలా చూస్తుంటే

:::::: BIT :::::

చరణం

అతడు   ముద్దబంతిలా వున్నావు...ముద్దులోలికి పోతున్నావు (Bit) ॥2॥
జింకపిల్లలా చెంగుచెంగుమని చిలిపి సైగలే చేసేవూ

ఆమె   నువ్వు నా ముందుంటే...నిన్నలా చూస్తుంటే
జివ్వుమంటుంది మనసూ...రివ్వుమంటుంది వయసూ

అతడు   నువ్వు నా ముందుంటే...నిన్నలా చూస్తుంటే

:::::: BIT :::::

చరణం

ఆమె   చల్లచల్లగ రగిలించేవూ...మెల్లమెల్లగ పెనవేసేవూ (Bit) ॥2॥
బుగ్గపైన కొనగోట మీటినా సిగ్గు దొంతరలు దోచేవూ

అతడు   నువ్వు నా ముందుంటే...నిన్నలా చూస్తుంటే
జివ్వుమంటుంది మనసూ...రివ్వుమంటుంది వయసూ

ఆమె   నువ్వు నా ముందుంటే...నిన్నలా చూస్తుంటే
జివ్వుమంటుంది మనసూ...రివ్వుమంటుంది వయసూ

అతడు   నువ్వు నా ముందుంటే...

ఆమె   నిన్నలా చూస్తుంటే...

★★★

# స్వర్ణకమలం (1988)

రచన : సిరివెన్నెల గానం : జానకి

:::::: Opening Music ::::::

పల్లవి

ఆ...అఅఅ..అలఅ...అఅఆ...ఆ..అఅఅ...అలఆ... (Bit)
ఆకాశంలో ఆశల హరివిల్లూ... (Bit)
ఆనందాలే పూచిన పొదరిల్లూ... (Bit)
అందమైనా ఆలోకం అందుకోనా... (Bit)
ఆదమరిచీ కలకాలం ఉండిపోనా... (Bit)
ఆకాశంలో ఆశల హరివిల్లూ... (Bit)
ఆనందాలే పూచిన పొదరిల్లూ...

:::::: BIT ::::::

చరణం

మబ్బుల్లో తూలుతున్న మెరుపై పోనా...
వయ్యారి వానజల్లై దిగిరానా...
సంద్రంలో పొంగుతున్న అలనైపోనా..
సందెల్లో రంగులెన్నో చిలికేనా..
పిల్లగాలే..పల్లకీగా..దిక్కులన్నీ...చుట్టిరానా...
నాకోసం...నవరాగాలే...నాట్యమాడెను రా... (Bit)
ఆకాశంలో ఆశల హరివిల్లూ... (Bit)
ఆనందాలే పూచిన పొదరిల్లూ... (Bit)
అందమైనా ఆలోకం అందుకోనా... (Bit)
ఆదమరిచీ కలకాలం ఉండిపోనా...

:::::: BIT ::::::

చరణం

స్వర్గాల స్వాగతాలు తెలిపే గీతం...
స్వప్నాల సాగరాల సంగీతం...
ముద్దొచ్చే తారలెన్నో మెరిసే తీరం...
ముత్యాల తోరణాల ముఖద్వారం...

Contd...

శోభనేనే...సోయగాన...చందమామ మందిరానా...
నాకోసం...సురభోగాలే...వేచి నిలిచెను రా...(Bit)
ఆకాశంలో ఆశల హరివిల్లూ...(Bit)
ఆనందాలే పూచిన పొదరిల్లూ...(Bit)
అందమైనా ఆలోకం అందుకోనా...(Bit)
ఆదమరిచీ కలకాలం ఉండిపోనా...(Bit)
ఆకాశంలో ఆశల హరివిల్లూ...(Bit)
ఆనందాలే పూచిన పొదరిల్లూ...(Bit)

★★★



## నంది పురస్కారం

స్వర్ణకమలం చిత్రంలో బాలు, వాణీజయరాం ఆలపించిన "అందెల రవమిది పదములదా" పాటకు సిరివెన్నెల సీతారామశాస్త్రికి ఉత్తమ గీతరచయితగా ఆంధ్ర ప్రదేశ్ నందిబహుమతి లభించింది.

## స్వర్ణకమలం(1988)

రచన : సిరివెన్నెల గానం : బాలు, జానకి

పల్లవి ఆఅఅఆ...అఅఆ..ఆఆఆ...ఆఆఆ... (Long Bit)

అతడు కొత్తగా రెక్కలొచ్చెనా... గూటిలోనీ గువ్వపిల్లకీ

మెత్తగా (Bit) రేకువిచ్చెనా (Bit) ॥2॥

కొమ్మచాటునున్న కన్నెమల్లికి ॥2॥

కొత్తగా రెక్కలొచ్చెనా.. మెత్తగా రేకువిచ్చెనా

:::::: BIT ::::::

చరణం

అతడు కొండదారి మార్చిందీ కొంటెవాగు జోరూ

కులుకులెన్నొ నేర్పిందీ కలికి ఏటినీరు

ఆమె అహహ..అహహో...అహహ..అహో..ఆ..ఆ..ఆ..

అతడు కొండదారి మార్చిందీ

ఆమె కొంటె వాగు జోరూ

అతడు కులుకులెన్నో నేర్పిందీ

ఆమె కలికి ఏటినీరూ

అతడు బండరాలహోరు మారీ.. పంటచేల పాటలూరీ

ఆమె బండరాలహోరు మారీ.. పంటచేల పాటలూరీ

అతడు మేఘాల రాగాల మాగాణి ఊగేలా

సిరి చిందులేసింది .. కనువిందు చేసింది

కొత్తగా రెక్కలొచ్చెనా..మెత్తగా రేకువిచ్చెనా

:::::: BIT ::::::

చరణం

ఆమె వెదురులోకి ఒదిగిందీ కుదురులేని గాలీ

ఎదురు లేక ఎదిగింది మధుర గానకేళి

అతడు ఆహో...అహహోహ.. హహహోహో..ఆఆఆ..

ఆమె ఆఅఆఅఆ..ఆఅఆఅఆ..

Contd...

అతడు వెదురులోకి ఒదిగిందీ
ఆమె కుదురు లేని గాలీ
అతడు ఎదురులేక ఎదిగిందీ
ఆమె మధుర గాన కేళి
అతడు భాషలోన రాయలేని రాసలీల రేయిలోని
ఆమె అబ్బ... భాషలోన రాయలేనీ రాసలీల రేయిలోని
అతడు యమునా తరంగాల.. కమనీయ శృంగార
కళలెన్నో చూపింది.. కలలెన్నో రేపింది
కొత్తగా రెక్కలొచ్చెనా... గూటిలోనీ గువ్వపిల్లకీ
మెత్తగా (Bit) రేకువిచ్చెనా (Bit) ॥2॥
కొమ్మ చాటునున్న కన్నెమల్లికి ॥2॥
కొత్తగా రెక్కలొచ్చెనా... మెత్తగా రేకు విచ్చెనా.

★★★



# స్వర్ణకమలం(1988)

రచన : **సిరివెన్నెల** గానం : **బాలు, సుశీల, బృందం**

:::::: Opening Music ::::::

పల్లవి

| | |
|---|---|
| అతడు | శివపూజకు చివురించిన సిరిసిరి మువ్వా ॥2॥ |
| బృందం | సిరిసిరి మువ్వా... సిరిసిరి మువ్వా |
| అతడు | మృదుమంజుల పదమంజరి పూచిన పువ్వా ... |
| బృందం | సిరిసిరి మువ్వా... సిరిసిరి మువ్వా ... |
| అతడు | యతిరాజుకు జతిస్వరముల పరిమళమివ్వా ... |
| బృందం | సిరిసిరి మువ్వా... సిరిసిరి మువ్వా ... |
| అతడు | నటనాంజలితో బ్రతుకును తరించనీవా... |
| బృందం | సిరిసిరి మువ్వా... సిరిసిరి మువ్వా ... |

అనుపల్లవి

| | |
|---|---|
| ఆమె | పరుగాపక పయనించవె తలపుల నావా... (Bit) |
| | కెరటాలకు తలవంచితె తరగదు త్రోవా (Bit) |
| | ఎదిరించిన సుడిగాలిని జయించినావా (Bit) |
| | మదికోరిన మధుసీమలు వరించి రావా... (Bit) |
| | పరుగాపక పయనించవె తలపులనావా (Bit) |
| | కెరటాలకు తలవంచితె తరగదు త్రోవా... |

:::::: BIT ::::::

చరణం

| | |
|---|---|
| అతడు | పడమర పడగలపై మెరిసే తారలకై.. ॥2॥ |
| | రాత్రిని వరించకే సంధ్యాసుందరీ |
| | తూరుపు వేదికపై వేకువ నర్తకివై ॥2॥ |
| | ధాత్రిని మురిపించే కాంతులు చిందనీ |
| | నీ కదలిక చైతన్యపు శ్రీకారం కానీ... ॥2॥ |
| | నిదురించిన హృదయరవళి ఓంకారంకానీ |
| | శివపూజకు చివురించిన సిరిసిరి మువ్వా.. |
| బృందం | సిరిసిరి మువ్వా... సిరిసిరి మువ్వా |

Contd...

అతడు	మృదుమంజుల పదమంజరి పూచిన పువ్వా...
బృందం	సిరిసిరి మువ్వా... సిరిసిరి మువ్వా

:::::: BIT ::::::

చరణం

ఆమె	తనవేళ్ళే సంకెళ్ళై కదలలేని మొక్కలా...
బృందం	ఆఆఆఆఆఆ... ఆఆ...ఆఆ...ఆఆ...ఆఆ
ఆమె	ఆమనికై ఎదురు చూస్తు ఆగిపోకు ఎక్కడా...
బృందం	ఆఆ...ఆఆ...ఆఆ...ఆఆ... ఆఆ...ఆఆ...ఆఆ...
ఆమె	అవధిలేని అందముంది అవనికి నలుదిక్కులా...
బృందం	ఆఆ...ఆఆ...ఆఆ... ఆఆ...ఆఆ...ఆఆ...ఆఆ...
ఆమె	ఆనందపు గాలివాలు నడపనీ నిన్నిలా...
బృందం	ఆఆ...ఆఆ...ఆఆ...ఆఆ... ఆఆ...ఆఆ...ఆఆ...
ఆమె	ప్రతిరోజొక నవగీతిక స్వాగతించగా
	వెన్నెల కిన్నెర గానం నీకు తోడుగా...
	పరుగాపక పయనించవె తలపుల నావా (Bit)
	కెరటాలకు తలవంచితె తరగదు త్రోవా

:::::: BIT ::::::

చరణం

అతడు	చలిత చరణ జనితం నీ సహజ విలాసం
	జ్వలిత కిరణ కలితం సౌందర్య వికాసం
	నీ అభినయ ఉషోదయం-తిలకించిన రవి నయనం ॥2॥
	గగన సరసి హృదయంలో...
	వికసిత శతదళ శోభల సువర్ణ కమలం...
ఆమె	పరుగాపక పయనించవె తలపులనావా (Bit)
	కెరటాలకు తలవంచితె తరగదుత్రోవా (Bit)
	ఎదిరించిన సుడిగాలిని జయించినావా...
	మది కోరిన మధుసీమలు వరించి రావా...
అతడు	*శ్రేయాః స్వధర్మో విద్యః-పరధర్మాః స్వనుష్ఠితాత్*
	*స్వధర్మే నిధనం శ్రేయః- పరధర్మో భయావహాః*

★★★

## స్వర్ణకమలం (1988)

రచన : సిరివెన్నెల గానం : బాలు, సుశీల

(గజ్జెల శబ్దం)

పల్లవి

అతడు ఘల్లు ఘల్లు ఘల్లుమంటు మెరుపల్లే తుళ్లూ
ఝల్లు ఝల్లు ఝల్లున ఉప్పొంగు నింగి ఒళ్లూ
నల్లమబ్బు చల్లనీ.. చల్లని చిరుజల్లూ ॥2॥
పల్లవించనీ నేలకు పచ్చని పరవళ్లూ (Long Bit)

ఆమె ఘల్లు ఘల్లు ఘల్లుమంటు మెరుపల్లే తుళ్లూ
ఝల్లు ఝల్లు ఝల్లున ఉప్పొంగు నింగి ఒళ్లూ
వెల్లువొచ్చి సాగనీ తొలకరి అల్లర్లూ ॥2॥
ఎల్లలన్నవే ఎరగని వేగంతో వెళ్లు

అతడు ఘల్లు ఘల్లు ఘల్లుమంటు మెరుపల్లే తుళ్లూ

ఆమె ఝల్లు ఝల్లు ఝల్లున ఉప్పొంగు నింగి ఒళ్లూ

:::::: BIT ::::::

చరణం

అతడు లయకే నిలయమై నీ పాదం సాగాలి

ఆమె ఆహహహ...హాహాహా

అతడు మలయానిల గతిలో సుమబాలగ తూగాలి

ఆమె అహాహా: అహాహా...హాహహా
వలలో ఒదుగునా విహరించే చిరుగాలి
సెలయేటికి నటనం నేర్పించే గురువేదీ (Bit)

అతడు తిరిగే కాలానికీ...

ఆమె అఆఅ...ఆఆఅ...ఆఆఅ...అహ హాహా

అతడు తిరిగే కాలానికీ తీరొకటుందీ

ఆమె అది నీ పాదానికి దొరకను అందీ

అతడు నటరాజస్వామి జటాజూటిలోకి చేరకుంటె

Contd...

విరుచుకుపడు సురగంగకు విలువేముందీ... విలువేముందీ...

ఆమె ఘల్లు ఘల్లు ఘల్లుమంటు మెరుపల్లే తుళ్లూ

అతడు ఝల్లు ఝల్లు ఝల్లున ఉప్పొంగు నింగి ఒళ్లూ

:::::: BIT ::::::

చరణం

ఆమె దూకే అలలకూ ఏ తాళం వేస్తారూ?...

అతడు అహహోహ..హోహహో

ఆమె కమ్మని కలలపాట ఏ రాగం అంటారు?...

అతడు ఊ ఊ ఊ.. ఊ ఉ ఊc

అలలకు అందునా ఆశించిన ఆకాశం

కలలా కరగదమా జీవితాన పరమార్ధం (B!l)

ఆమె వద్దని ఆపలేరూ...

అతడు అ...అ...ఆ....అ...ఆఆఆ...ఆఆఆ

ఆమె వద్దని ఆపలేరు ఉరికే ఊహనీ

అతడు హద్దులు దాటరాదు ఆశల వాహినీ

ఆమె అదుపెరుగని ఆటలాడు వసంతాలు వలదంటే

విరివనముల పరిమళముల విలువేముందీ...విలువేముందీ...

అతడు ఘల్లు ఘల్లు ఘల్లుమంటు మెరుపల్లే తుళ్లూ

ఆమె ఝల్లు ఝల్లు ఝల్లున ఉప్పొంగు నింగి ఒళ్లూ

అతడు నల్లమబ్బు చల్లనీ..చల్లని చిరుజల్లూ

ఆమె వెల్లువొచ్చి సాగనీ..తొలకరి అల్లర్లూ

అతడు పల్లవించనీ నేలకు పచ్చని పరవళ్లూ

ఆమె ఘల్లు ఘల్లు ఘల్లుమంటు మెరుపల్లే తుళ్లూ

అతడు ఝల్లు ఝల్లు ఝల్లున ఉప్పొంగు నింగి ఒళ్లూ

★★★

## స్వర్ణకమలం (1988)

రచన : సిరివెన్నెల గానం : బాలు, వాణీ జయరాం, బృందం

:::::: Opening Music ::::::

సాకీ

బృందం శ్లోకం॥ *గురుబ్రహ్మ(ఆఆఆ).. గురుర్విష్ణుః (ఆఆఆ)*
*గురుర్దేవో(ఆఆఆ) మహేశ్వరః (ఆఆఆ)*
*గురు సాక్షాత్పరబ్రహ్మ ॥2॥ (ఆఆఆ)*
*తస్మై శ్రీ గురవే నమః (Long Bit)*

అతడు ఓం నమో..నమో..నమఃశివాయ

ఆమె మంగళ ప్రదాయ గోతురంగతే నమఃశ్శివాయ (Bit)
గంగయా తరంగితోత్తమాంగతే నమఃశ్శివాయ (Bit)

అతడు ఓం నమో..నమో..నమఃశ్శివాయ

ఆమె శూలినే నమో నమః కపాలినే నమఃశ్శివాయ (Bit)
పాలినే విరంచి తుండ మాలినే నమఃశ్శివాయ (Long Bit)

పల్లవి

ఆమె అందెల రవమిది పదములదా (Bit) (ఆఆఆ)
అందెల రవమిది పదములదా
అంబర మంటిన హృదయముదా... } ॥2॥
అమృత గానమిది పెదవులదా
అమితానందపు ఎదసడిదా..

అతడు సాగిన సాధన సార్థకమందగ
యోగ బలముగ.. యాగ ఫలముగా (Bit) } ॥2॥
బ్రతుకు ప్రణవమై మ్రోగుకదా

ఆమె అందెల రవమిది పదములదా... ఆ...ఆ...

:::::: BIT ::::::

చరణం

ఆమె మువ్వలు ఉరుముల సవ్వడులై...
మెలికలు మెరుపుల మెలకువలై... } ॥2॥

Contd...

మేను హర్ష వర్షమేఘమై (ఆ..ఆ..ఆ..)
వేడి విసురు వాయువేగమై (ఆ..ఆ..ఆ..)

అతడు అంగభంగిమలు గంగపొంగులై
హావభావములు నింగిరంగులై
లాస్యం సాగేలీలా – రసఝురులు జాలువారేలా

ఆమె జంగమమై జడమాడగా

అతడు జలపాత గీతముల తోడుగా

ఇద్దరు పర్వతాలు ప్రసవించిన పచ్చని ప్రకృతి ఆకృతి పార్వతి కాగా..

ఆమె అందెల రవమిది పదములదా.. ఆ..ఆ.. (బృందం:) ఆఆఆ

:::::: BIT ::::::

అతడు నయన తేజమే... 'న' కారమై... (బృందం:) ఆఆఆ
మనోనిశ్చయం.. 'మ' కారమై... (బృందం:) ఆఆఆ
శ్వాసచలనమే.. 'శి' కారమై... (బృందం:) ఆఆఆ
వాంఛితార్థమే.. 'వ' కారమై... (బృందం:) ఆఆఆ
యోచన సకలము.. 'య' కారమై.. (బృందం:) ఆఆఆ

బృందం నాదం 'న'కారం.. మంత్రం 'మ'కారం
స్తోత్రం 'శి'కారం.. వేదం 'వ'కారం
యజ్ఞం 'య'కారం..ఓం నమఃశ్శివాయా

ఆమె భావమె భవునకు భావ్యము కాగా (Bit)
భరతమె నిరతము భాగ్యము కాగా (Bit)
తుహిన గిరులు కరిగేలా తాండవమాడే వేళా

ఆమె ప్రాణ పంచకమె పంచాక్షరిగా... పరమపదము ప్రకటించగా

అతడు ఖగోళాలు పదకింకిణులై... పది దిక్కుల ధూర్జటి ఆర్భటివేగా

ఆమె అందెల రవమిది పదములదా...అంబర మంటిన హృదయముదా
అమృత గానమిది పెదవులదా... అమితానందపు ఎదసడిదా
అందెల రవమిది పదములదా

★★★

## మరణమృదంగం (1988)

రచన : **వేటూరి** గానం : **బాలు, సుశీల**

:: Opening Music ::

పల్లవి

ఆమె కరిగిపోయాను కర్పూర వీణలా... (Bit)

కలిసిపోయాను నీ వంశధారలా... (Bit)

నా గుట్టు జారిపోతున్నా... నీపట్టు చిక్కిపోతున్నా

అతడు నీ తీగ వణికిపోతున్నా... రాగాలు దోచుకుంటున్నా

కురిసిపోయింది ఓ సందెవెన్నెలా...(Bit)

కలిసిపోయాక ఈ రెండు కన్నులా... (Bit)

:::::: **BIT** :::::

చరణం

ఆమె మనసు పడిన కథ తెలుసుగా... ప్రేమిస్తున్నా తొలిగా

అతడు పడుచు తపనలివి తెలుసుగా... మన్నిస్తున్నా చెలిగా

ఆమె ఏ ఆశలో.. ఒకే ధ్యాసగా...

అతడు ఏ ఊసులో... ఇలా బాసగా...

అనురాగాలనే బంధాలనే పండించుకోమని తపించగా

ఆమె కరిగిపోయాను కర్పూర వీణలా... (Bit)

అతడు కురిసిపోయింది ఓ సందె వెన్నెలా... (Bit)

ఆమె నా గుట్టు జారిపోతున్నా... నీ పట్టు చిక్కిపోతున్నా

అతడు నీ తీగ వణికిపోతున్నా... రాగాలు దోచుకుంటున్నా

ఆమె కరిగిపోయాను కర్పూర వీణలా (Bit)

అతడు కురిసిపోయింది ఒ సందెవెన్నెలా (Bit)

:::::: **BIT** :::::

చరణం

అతడు అసలు మతులు చెడి జంటగా... ఏ మౌతామో తెలుసా...

ఆమె జతలు కలిసి మనమొంటిగా... ఏమైనా సరిగరిసా...

అతడు ఏ కోరికో... శ్రుతేమించగా...

Contd...

| | |
|---|---|
| ఆమె | ఈ ప్రేమలో... ఇలా ఉంచగా... |
| | అధరాలెందుకో అందాలలో ఈ ప్రేమలేఖలే లిఖించగా |
| అతడు | కురిసిపోయింది ఓ సందెవెన్నెలా (Bit) |
| ఆమె | కలిసిపోయాను నీ వంశధారలా (Bit) |
| అతడు | నీ తీగ వణికిపోతున్నా... రాగాలు దోచుకుంటున్నా |
| ఆమె | నా గుట్టు జారిపోతున్నా... నీ పట్టు చిక్కిపోతున్నా |
| అతడు | కురిసిపోయింది ఓ సందెవెన్నెలా (Bit) |
| ఆమె | ఆ... కలిసిపోయాను నీ వంశధారలా (Bit) |

★★★




## మనసులో మాట

నా ఇష్టమైన రాగం 'ఆత్మరాగం'. ప్రతిమనిషి దేహానికి ఆత్మనేది వుంటుంది. అది లేకుండా మనదేహం పనిచెయ్యలేదు. ఆత్మ ఎల్లప్పుడూ మనల్ని వెన్నంటే ఉంటుంది. ఆ ఆత్మ పలికే రాగమంటే నాకు ఎంతో ఇష్టం.

– ఇళయరాజా

# మరణమృదంగం (1988)

రచన : **వేటూరి** గానం : **బాలు, చిత్ర**

:: Opening Music ::

పల్లవి

అతడు సరిగమ పదనిస రసనస ... ఇది కనివిని ఎరుగని గుసగుస
ఆమె సరిగమ పదనిస రసనస ... ఇది కనివిని ఎరుగని గుసగుస
ఇద్దరు ముద్దుపెట్టు ముద్దుపెట్టు పద (Bit)
ముద్దులేక పొద్దుపోని కథ (Bit)
ముద్దు పాటుపడ్డ కన్నె ఎద (Bit)
విచ్చుకున్న ముద్దబంతి కద (Bit)
అతడు సరిగమ పదనిస రసనస ... ఇది కనివిని ఎరుగని గుసగుస
ఆమె సరిగమ పదనిస రసనస ... ఇది కనివిని ఎరుగని గుసగుస

:::::: BIT :::::

చరణం

అతడు రెండుహృదయాల పిట్టపోరు తీరనంటుంది ఎందుకో
ఆమె దొంగయోగాల కొంగగారు గాలమేసేది ఎందుకో
అతడు చేతికందాక జాబిలీ...చుక్కతో నాకు ఏంపనీ
ఆమె కట్టుకున్నాక కౌగిలీ...ఏమికావాలో చెప్పనీ
అతడు కస్సుమన్న దానిసోకు కసిగా వుంటుందీ (Bit)
ఆమె తుమ్మెదొచ్చి వాలినాక పువ్వేమంటుందీ (Bit)
అతడు సిగ్గొచ్చి నీలపండు ముగ్గో బత్తాయిపండు
అల్లో నేరేడుపండు నాదీ
ఆమె అరె..నానానానానా... నేనే కాదంటున్నానా..
అతడు సరిగమ పదనిస రసనస ... ఇది కనివిని ఎరుగని గుసగుస
ఆమె సరిగమ పదనిస రసనస ... ఇది కనివిని ఎరుగని గుసగుస
ఇద్దరు ముద్దుపెట్టు ముద్దుపెట్టు పద (Bit)
ముద్దులేక పొద్దుపోని కథ (Bit)
ముద్దు పాటుపడ్డ కన్నె ఎద (Bit)

Contd...

## కూలీ నెం. 1 (1991)

రచన : సిరివెన్నెల గానం : బాలు, చిత్ర

:::::: Opening Music ::::::

పల్లవి

అతడు కిలకిలమని కళావరురాణీ...ఘల్లు ఘల్లుమనె కథాకళికాని
కళ్లెంలేని కళ్లల్లోని కవ్వింతల్ని హాలో అని

ఆమె చల్ మోహనాంగ సుఖాలకు బోణీ...చలిగిలి అన్నీ పాలోమని పోనీ
సిగ్గేలేని సింగారాన్ని చిందించని ఛలో హని

అతడు మదనుడి పాలై పోనీ...ముదిరిన భావాలన్నీ

ఆమె మగజతపాడే బాణీ...మగువకు దేవై రానీ

అతడు కిలకిలమని కళావరురాణీ...ఘల్లు ఘల్లుమనె కథాకళికాని
కళ్లెంలేని కళ్లల్లోని కవ్వింతల్ని హాలో అని

:::::: BIT :::::

చరణం

అతడు బరువుగా...విరివిగా కాపుచూపెకద ఏపుగా...గోపికా...

ఆమె చొరవగా...కరువుగా కాపువేసెకద కైపుగా...కోరికా...

అతడు వాలే...పరువాలే...తగువేళే గనుకా

ఆమె కాలే...తమకాలే..గమకాలై పలుకా

అతడు కాంక్షలో శ్రుతీ గతీ పెంచి డొల్చగా...చుట్టూ కట్టే కంచే ఈ మైకం

ఆమె ఈడులో అతీగతీలేని వేడుకా దిక్కుమొక్కు పంచే ఈ రాగం

అతడు అదమరిచిన ఈడులో ఈతలాడనీ (Bit)

ఆమె చల్ మోహనాంగ సుఖాలకు బోణీ...చలిగిలి అన్నీ పాలోమని పోనీ
సిగ్గేలేని సింగారాన్ని చిందించని ఛలో హని

:::::: BIT :::::

చరణం

ఆమె ఒడుపుగా ఒలుచుకో ఓపలేనుకద ఒంటిలో అవసరం

అతడు చిలిపిగా దులుపుకో మోయలేవుకద నడుములో కలవరం

Contd...

ఆమె తాపం తెరతీసీ తరిమేసే తరుణం
అతడు కాలం తలుపేసి విరబూసే సమయం
ఆమె వీలుగా గుట్టుమట్టు మీటి...లీలగా ఇట్టే పుట్టే వేడికి యాడాడో
అతడు ఒంటిగా వుంటే ఒట్టే అంటూ...వెంటనే జట్టే కట్టెయ్యాలి ఏసీడో
ఆమె జోడు బిగిసిన వేడిలో వేగిపోనీ...(Bit)
అతడు కిలకిలమని కళావరురాణీ...ఘల్లు ఘల్లుమనె కథాకళికాని
కళ్లెంలేని కళ్లల్లోని కవ్వింతల్ని హాలో అని
ఆమె చల్ మోహనాంగ సుఖాలకు బోణీ...చలిగిలి అన్నీ పాలోమని పోనీ
సిగ్గేలేని సింగారాన్ని చిందించని ఛలో హాని
అతడు మదనుడి పాలై పోనీ...ముదిరిన భావాలన్నీ
ఆమె మగజతపాడే బాణీ...మగువకు రేవై రానీ
అతడు కిలకిలమని కళావరురాణీ
ఆమె చల్ మోహనాంగ సుఖాలకు బోణీ
అతడు కళ్లెంలేని
ఆమె కళ్లల్లోని
అతడు కవ్వింతల్ని
ఆమె హాలో
అతడు అని

★★★



## కూలీ నెం. 1 (1991)

రచన : సిరివెన్నెల గానం : బాలు, చిత్ర

:::::: Opening Music ::::::

పల్లవి

బృందం ఓ... ఓ... ఓ... ఓ... ఓ... ఓ... (Long Bit)

అతడు కొత్త కొత్తగా వున్నది (Bit) స్వర్గమిక్కడే అన్నదీ (Bit)
కోటితారలే... (Bit) పూల ఏరులై (Bit)
కోటితారలే...పూల ఏరులై ...నేల చేరగానే...

ఆమె కొత్తకొత్తగా వున్నది (Bit) స్వర్గ మిక్కడే అన్నదీ...

:::::: BIT :::::

చరణం

అతడు నాకన్ను ముద్దాడితే...కన్నెకులుకాయె కనకాంబరం (Bit)

ఆమె నాచెంప సంపెంగలో...కెంపురంగాయె తొలిసంబరం (Bit)

అతడు ఎన్ని పొంగులో కుమారి కొంగులో
ఆమె ఎన్ని రంగులో సుమాల వాగులో (Bit) ॥2॥

అతడు ఉద్యోగ మిప్పించవా...సోకు ఉద్యానవనమాలిగా

ఆమె జీతమీయగా లేతవన్నెలే చెల్లించుకోనా...నా..నా..నా..

అతడు కొత్తకొత్తగా ఉన్నది(Bit) స్వర్గమిక్కడే అన్నదీ (Bit)

ఆమె కోటితారలే (Bit) పూల ఏరులై (Bit) ॥2॥
కోటితారలే...పూల ఏరులై ...నేల చేరగానే...

అతడు కొత్తకొత్తగా ఉన్నదీ (Bit) స్వర్గమిక్కడే అన్నదీ

:::::: BIT :::::

చరణం

ఆమె నీ నవ్వు ముద్దాడితే...మల్లెపువ్వాయె నాయవ్వనం (Bit)

అతడు నాజూకు మందారమే...ముళ్లరోజాగ మారేక్షణం (Bit)

ఆమె మొగలి పరిమళం మొగాడి కౌగిలీ
అతడు మగువ పరవశం సుఖాలలోగిలి (Bit) ॥2॥

Contd...

| | |
|---|---|
| ఆమె | కందల్లో వైశాఖమా...కైపు ఎండల్లు కరిగించుమా |
| అతడు | తీగమల్లికీ...నరాలపందిరీ...అందించుకోనా...నా..నా..నా.. |
| ఆమె | కొత్తకొత్తగా ఉన్నదీ (Bit) స్వర్గమిక్కడే అన్నదీ (Bit) |
| అతడు | కోటితారలే (Bit) పూల ఏరులై (Bit) |
| | కోటితారలే...పూల ఏరులై ... |
| | నేలచేరగానే...నే...నే...నే...నే... |
| ఆమె | కొత్తకొత్తగా ఉన్నదీ (Bit) స్వర్గమిక్కడే అన్నదీ (Bit) |

★★★



## మీకు తెలుసా?

"శ్రీ కనకమాలక్ష్మి రికార్డింగ్ డాన్స్ ట్రూప్" (1988) చిత్రంలో దర్శకుడు వంశీ, ఇళయరాజా సహకారంతో రెండు పాటలు రాశారు. "వెన్నెలై పాడనా... నవ్వులే పూయనా"; "మల్లిక పొగడకు.. గీతిక పాడకు" పల్లవులతో మొదలయ్యే యీ రెండు పాటల్ని బాలు, జానకి ఆలపించారు. విచిత్రమేమిటంటే రెండు పాటల ట్యూన్లు ఒకటే ! మరో విచిత్రం... యీ రెండు పాటల్లో గమకాలు, చరణం కూడా ఇంచుమించు ఒకేలా వుంటాయి. మొదటిపాటకి చరణం "మోవికెంపు బాధా.. గుండెమువ్వ గాథా, పొద్దువువ్వులాగా.. నవ్వుతుంది చూడూ" అని రెండోపాటకి చరణం "గుండెమువ్వగాథా.. మోవికెంపుబాధా.. పొద్దు నవ్వులాగా.. విచ్చుకునే దారీ" అని రాశారు వంశీ.

# కూలీ నెం. 1 (1991)

రచన : సిరివెన్నెల　　　　గానం : ఇళయరాజా, సుశీల

:::::: Opening Music ::::::

పల్లవి

ఆమె　ఊఁఊఁఊ..ఊఁఊఁఊ..ఉఉఉఉ...ఊఁఊఁఊ..

ఊఁఊఁఊ..ఊఁఊఁఊ..(Bit)

కలయా..నిజమా...తొలిరేయి హాయి మహిమా

అతడు　కలయా..నిజమా...తొలిరేయి హాయి మహిమా

ఆమె　అలవాటులేని సుఖమా...ఇక నిన్ను ఆపతరమా...

అతడు　అణిగున్న ఆడతనమా...ఇకనైన మేలుకొనుమా

ఆమె　కలయా..నిజమా...తొలిరేయి హాయి మహిమా..

అతడు　కలయా..నిజమా..

:::::: BIT :::::

చరణం

ఆమె　లేనిపోని ఏ కూనిరాగమో లేచిరా అంటున్నదీ

అతడు　అహఁ...(Bit) ఊరుకోని ఏ వెర్రి కోరికో తీర్చవా అంటున్నదీ (Bit)

ఆమె　కోకముళ్ల కూపీ తీసే కైపు చూపు కొరుకుతున్నదీ

అతడు　కుర్రకళ్లు చీరగళ్లలో దారేలేక తిరుగుతున్నవీ

ఆమె　ముంచేమైకమో..మురిపించే మోహమో...

అతడు　కలయా..నిజమా...తొలిరేయి హాయి మహిమా..

ఆమె　కలయా..నిజమా..

:::::: BIT :::::

చరణం

ఆమె　ఊఁఊఁఊఊఁ...ఊఁఊఁఊఊఁ...ససరరరస్స (Bit)

సరరస్సరరరస్స (Bit) ససస సస...ససస.ససరా

అతడు　చేయివేయనా సేవచెయ్యనా ఓయనే వయ్యారమా

ఆమె　అహహ్హా (Bit)...పాలముంచినా నీటముంచినా నీదయే శృంగారమా

అతడు　ఓహో(Bit)...ఆగలేని ఆకలేవిఁటో పైకి పైకి దూకుతున్నదీ

Contd...

ఆమె      కాలు నేల నిలవకున్నదీ....ఆకాశాన తేలుతున్నదీ
అతడు    హ్హా..అంతా మాయగా అనిపించే కాలమూ
ఆమె      కలయా...(అతడు : ఆహోఁ) నిజమా (అతడు : ఆహోఁ)
తొలిరేయి హాయి మహిమా
అతడు    కలయా...(ఆమె : ఊఁ) నిజమా (ఆమె : నవ్వు)
తొలిరేయి హాయి మహిమా
ఆమె      అలవాటులేని సుఖమా...ఇక నిన్ను ఆపతరమా...
అతడు    అణిగున్న ఆదతనమా...ఇకనైన మేలుకొనుమా
ఆమె      కలయా...(అతడు : ఆహోఁ..) నిజమా (అతడు : ఆహోఁ)
తొలిరేయి హాయి మహిమా
ఇద్దరు    ఉహూఁహూఁ...ఉహూహూఁ...

★★★



## మీకు తెలుసా?

"జల్లంత కవ్వింత కావాలిలే" (గీతాంజలి 1989) పాటను వేటూరి ఇళయరాజా యిచ్చిన ట్యూన్‌కి రాస్తే అది ఒక ఆకతాయి పాటలా అనిపించింది దర్శకుడు మణిరత్నంకి. కో డైరెక్టర్ యు.వి. విష్ణు పాట సారాంశాన్ని ఇంగ్లీషులో తర్జుమా చేసి వినిపించబోయాడు. కానీ, మణిరత్నం వేటూరిచేత ఆ పాటని తెలుగులోనే ఒకటికి రెండుసార్లు వినిపించుకుని, పాటలోని పదాలను ట్యూన్‌కి అన్వయించు కుంటూ, మొదటి రెండు వాక్యాలు మళ్లీ మళ్లీ మననం చేసుకుని "బ్యూటిఫుల్" అంటూ ఇళయరాజాని, వేటూరిని అభినందించారు. ఆ తర్వాత వేటూరి రాసిన ఏ పాటకీ మణిరత్నం వివరణ అడగలేదు.

# కూలీ నెం. 1 (1991)

రచన : **సిరివెన్నెల** గానం : **బాలు**

:::::: Opening Music ::::::

పల్లవి అటెన్షన్ ఎవ్రిబడీ...నేనొస్తున్నా బీరెడీ..
నేనే..మహారాజూ...
నా చుట్టూ క్యూ కట్టండీ...చెయ్యెత్తి జై కొట్టండీ...
నాదే ప్రతీరోజూ...
అదృష్టం బాడీగార్డు...అన్నింటా నేనే ఫస్టు
కాలాన్నే కట్టికూర్చోబెట్ట గుమ్మంముందు...(Bit)
అటెన్షన్ ఎవ్రిబడీ...నేనొస్తున్నా బీరెడీ..
నేనే..మహారాజూ...అహ్హా..
నా చుట్టూ క్యూ కట్టండీ...చెయ్యెత్తి జై కొట్టండీ...
నాదే ప్రతీరోజూ...(Bit)

చరణం

హాలీడేకి జాలీగా హాలీవుడ్ ఎళ్లానంటే...
హల్లోబాసూ...హౌడూయుడూ అంటూ డైలీ ఎంతోమంది
హీరో రోలిస్తామంటూ ప్రాణం దీస్తూ వుంటారూ...
సారీ రా...డైరీ ఖాళీ లేదంటే వింటారా...హ్హా హ్హా హ్హా

:::::: **BIT** :::::

అయామ్ ఏ బాటసారీ...మేఘాలే రహదారీ..
ఉండుండి నేలజారీ...హాల్టేస్తా ఒకసారీ...
పోలెండ్లో పొద్దునుంటే...హాలెండ్లో నా ఆఫ్టర్‌నూనూ...
సిడ్నీలో సాయంకాలం...వాషింగ్టన్‌లో నైట్ రిటర్నూ...
ఎప్పుడూ నివాసం...ఏరోప్లేను...ఎక్కడా స్టడీగా కూర్చోలేను
సూరీడల్లే...భూగోళాన్ని..చుట్టేస్తూనే వుంటా ఎవ్వరిడే..
అటెన్షన్ ఎవ్రిబడీ...నేనొస్తున్నా బీరెడీ..
నేనే..మహారాజూ...హ్హా హ్హా

Contd...

నా చుట్టూ క్యూ కట్టండీ...చెయ్యెత్తి జై కొట్టండీ...
నాదే ప్రతీరోజూ...
అదృష్టం బాడీగార్డు...అన్నింటా నేనే ఫస్టు
కాలాన్నే కట్టికూర్చోబెట్ట గుమ్మంముందు...హ్హా...హ్హా... హ్హాహ్హా
అటెన్షన్ ఎవ్రిబడీ...నేనొస్తున్నా బీరెడీ..
నేనే..మహారాజూ...
నా చుట్టూ క్యూ కట్టండీ...చెయ్యెత్తి జై కొట్టండీ...
నాదే ప్రతీరోజూ...(Bit)

చరణం

నేనేదుంటే అదే చుట్టూ ఆడోళ్లంతా అల్లేస్తారు...
హల్లో డార్లింగ్ అంటూ నాతో డేటింగ్...జొటింగ్...
మీటింగ్..మేటింగ్ ఏదైనా..ఓకే అంటారు..
పెళ్లాడందే పోదీమేళం...ఇల్లా ఐతే పోదా శీలం...

:::::: BIT :::::

అయామ్ ఏ బ్రహ్మచారీ...పట్టాను పెళ్లిదారీ..
కావాలీ తగ్గనారీ...నువ్వేనా ఆ చిన్నారీ..
ఉన్న చాలీ కన్నూ, ముక్కూ, నిక్కూ, టెక్కూ వున్న బాడీ...
మెచ్చాలీ నాలో వున్న వాడీ, వేడీ, కన్నెలేడీ...
మగువా...మగాడా...అనిపించాలి..పొగరూ..వగైరా కనిపించాలి...
ఓకే..ఐతే...చేపడతాను...చూపెడతాను జతలూ, హనీమూన్లూ
అటెన్షన్ ఎవ్రిబడీ...నేనొస్తున్నా బీరెడీ.. నేనే..మహారాజూ...
నా చుట్టూ క్యూ కట్టండీ...చెయ్యెత్తి జై కొట్టండీ... నాదే ప్రతీరోజూ...
అదృష్టం బాడీగార్డు...అన్నింటా నేనే ఫస్టు
కాలాన్నే కట్టికూర్చోబెట్ట గుమ్మంముందు...(Bit)
అటెన్షన్ ఎవ్రిబడీ...నేనొస్తున్నా బీరెడీ..నేనే..మహారాజూ...
నా చుట్టూ క్యూ కట్టండీ...చెయ్యెత్తి జై కొట్టండీ... నాదే ప్రతీరోజూ...

★★★

## ఆదిత్య (369) (1991)

రచన : వెన్నెలకంటి గానం : బాలు, జానకి

:::::: Opening Music ::::::

పల్లవి

అతడు రాసలీలవేళ...రాయబారమేల..
మాటే..మౌనమై మాయజేయనేలా...
రాసలీలవేళా...రాయబారమేలా...

:::::: BIT :::::

చరణం

ఆమె కౌగిలింత వేడిలో..కరిగె వన్నె వెన్నలా
తెల్లబోయి వేసవీ...చల్లె పగటి వెన్నెలా.

అతడు మోజులన్ని పాడగా...జాజిపూల జావళీ
కందెనేమొ కౌగిటా...అందమైన జాబిలీ

ఆమె తేనెవానలోన చిలికె తీయనైన స్నేహమూ...

అతడు మేనివీణలోన పలికె సోయగాల రాగమూ..

ఆమె నిదురరాని కుదురులేని ఎదలలోని సొదలు మాని
రాసలీలవేళ..రాయబారమేలా
మాటే...మౌనమై..మాయచేయనేలా..
రాసలీలవేళ..రాయబారమేలా

:::::: BIT :::::

చరణం

అతడు మాయజేసి దాయకూ...సోయగాల మల్లెలూ
మోయలేని తీయనీ...హాయిపూల జల్లులూ..

ఆమె చేరదీసి పెంచకూ..భారమైన యవ్వనం
దోరసిగ్గు తుంచకూ...ఊరుకోదు ఈక్షణం

అతడు చేపకళ్ల సాగరాన అలల ఊయలూగనా...

ఆమె చూపుముళ్లు ఓపలేను కలల తలుపు తీయనా..

అతడు చెలువసోకు కలువరేకు కలువసోకి నిలువనీదు
రాసలీలవేళ..రాయబారమేలా
మాటే...మౌనమై..మాయజేయనేలా..
రాసలీలవేళ..

ఆమె రాయబారమేలా...

ఇద్దరు రాసలీలవేళ..రాయబారమేలా

★★★

## ఆదిత్య 369 (1991)

రచన : **వేటూరి** గానం : **బాలు, జిక్కి శైలజ**

పల్లవి

ఆమె 1 ఆఆఆ(Bit) ఆఆఆఆ(Bit) ఆఆఆ(Bit) ఆఆఆఆ(Bit) ఆఆ(Bit) ఆ(Bit)
నెరజాణవులే (Bit) ... వరవీణవులే (Bit)
కిలికించితాలలో... ఆహోహహో (Bit)
జాణవులే (Bit) .. మృదుపాణివిలే (Bit) ... మధుసంతకాలలో...
కన్నులలో.. సరసపు వెన్నెలలే
సన్నలలో.. గుసగుస తెమ్మెరలే
మోవిగని.. మొగ్గగని.. మోజుపడిన వేళలో
జాణవులే (Bit) వరవీణవులే (Bit)
కిలికించితాలలో... ఆహోహహో (Bit)
జాణవులే (Bit) .. మృదుపాణివిలే (Bit) ... మధుసంతకాలలో...

::::: BIT :::::

చరణం

ఆమె 1 మోమటుదాచీ మురిపెము పెంచే లాహిరిలో
అహహ... అహహో... ఒహోహో..ఒహోహోహో
మూగవుగానే.. మురళిని వూదే వైఖరిలో
చెలి ఒంపులలో హంపికళా ఊగే ఊయ్యాలా
చెలి పయ్యెదలో తుంగ అలా పొంగే ఈ వేళా
మరియాదకు విరిపానుపు సవరించ వేమిరా
జాణవులే (Bit) వరవీణవులే (Bit)
కిలికించితాలలో... ఆహోహహో (Bit)
జాణవులే (Bit) .. మృదుపాణివిలే (Bit) ...మధుసంతకాలలో...
కన్నులలో... సరసపు వెన్నెలలే
సన్నలలో.. గుసగుస తెమ్మెరలే
మోవిగని.. మొగ్గగని.. మోజుపడిన వేళలో
జాణవులే (Bit) వరవీణవులే (Bit)

Contd...

కిలికించితాలలో... అహోహహో (Bit)
నెరజాణవులే (Bit) ... మృదుపాణివిలే (Bit)...మధుసంతకాలలో...

:::::: BIT ::::::

చరణం

అతడు చీకటి కోపం చెలిమికి లాభం కౌగిలిలో
అహహోహహహో... ఒహోహో హోహోహోహో
వెన్నెల తాపం వయసుకు ప్రాణం ఈ చలిలో
చెలి నారతిలా హారతిలా నవ్వాలీ వేళా..
తొలి సోయగమే ఓ సగమూ ఇవ్వాలీ వేళా..
పరువానికి పగవానికి ఒక న్యాయమింక సాగునా...

ఆమె2 జాణవులే (Bit) వరవీణవులే (Bit)
కిలికించితాలలో... అహోహహో (Bit)

అతడు జాణవులే (Bit) .. మృదుపాణివిలే (Bit) ... మధుసంతకాలలో...

ఆమె2 కన్నులలో.. సరసపు వెన్నెలలే

అతడు సన్నలలో.. గుసగుస తెమ్మెరలే
మోవిగని.. మొగ్గగని.. మోజుపడిన వేళలో
జాణవులే (Bit) వరవీణవులే (Bit)
కిలికించితాలలో... అహోహహో (Bit)
జాణవులే (Bit) .. మృదుపాణివిలే (Bit)... మధుసంతకాలలో...

★★★



## చైతన్య (1991)

రచన : **వేటూరి** గానం : **బాలు**

:::::: Opening Music ::::::

పల్లవి

ఓహో లైల...ఓ చారుశీల కోపమేల (Bit)
మనకేలా గోల మందారమాలా మాపటేళ (Bit)
ఓహో పిల్లా సుభానల్లా..సరాగంలో విరాగాలా (Bit)
మిసమిస వయసు రుసరుసల దరువుల
గుసగుస తెలిసె కలికి చిలక
కసికసి పెదవి కదలికల కవితల
పిలుపులు తెలిసె కవినిగనక
ఓహో లైల...ఓ చారుశీల కోపమేల (Bit)
మనకేలా గోల మందారమాలా మాపటేళా

:::::: **BIT** :::::

చరణం

విశాఖలో నువ్వూ నేనూ వసంతమే ఆడాలా
హుషారుగా చిన్నా పెద్దా షికారులే చెయ్యాల
వివాహపు పొత్తుల్లోనే వివాదమా ఓ బాలా
వరించిన వలపుల్లోనే విరించిలా రాయాలా
అందచందాల అతివల్లోన కోపమే రూపమా
కోపతాపాల మగువల్లోన తప్పనీ తాళమా
చాల్లే బాల...నీ ఛా...ఛా...ఛీల సంధ్యారాగాలాపనా
ఓహో లైల...ఓ చారుశీల కోపమేల (Bit)
మనకేలా గోల మందారమాలా మాపటేళ (Bit)
ఓహో పిల్లా సుభానల్లా..సరాగంలో విరాగాలా (Bit)
మిసమిస వయసు రుసరుసల దరువుల
గుసగుస తెలిసె కలికి చిలక
కసికసి పెదవి కదలికల కవితల
పిలుపులు తెలిసె కవినిగనక...హ

Contd...

:::::: BIT :::::

చరణం

జపించిన మంత్రం నీవే తపించిన స్నేహంలో
ప్రపంచము స్వర్గం నీవే స్మరించిన ప్రేమల్లో
చెలీ...సఖీ అంటూ నీకై జ్వలించిన ప్రాణంలో
ఇదీ కథ అన్నీ తెలిసీ క్షమించవే ప్రాయంతో
కాళ్లబేరాల కొచ్చాకైనా కాకలే తీరవా
గేరు మార్చేసి పాహి అన్నా కేకలే ఆపవా
పోవే బాల చాలించు గోల ప్రేమిస్తున్నా ఘాటుగా
ఓహో లైల...ఓ చారుశీల కోపమేల (Bit)
మనకేలా గోల మందారమాలా మాపటేళ (Bit)
ఓహో పిల్లా సుభానల్లా..సరాగంలో విరాగాలా (Bit)
ఒరె...మిసమిస వయసు రుసరుసల దరువుల
గుసగుస తెలిసె కలికి చిలక
కసికసి పెదవి కదలికల కవితల
పిలుపులు తెలిసె కవినిగనక
ఓహో లైల...ఓ చారుశీల కోపమేలా (Bit)
మనకేలా గోల మందారమాలా మాపటేళా...ళా...ళా...ళా...ళ...ళ...

★★★



## చైతన్య (1991)

రచన : గానం : బాలు, బృందం

:::::: Opening Music ::::::

పల్లవి

అతడు పాప ఈడు గోలా...పాటపేరు జోలా...ఊగుతోంది బాలా...
యవ్వనాల డోలా...
నీవు వేణువైతే...నేను ఊపిరౌతా...
ఓ డార్లింగ్...ఎదలో ఈలా... మోహాలా...దరి రాగాలా...

బృందం బీ..హ్యాపీ...హ్యాపీ ఆల్ ద టైం...॥4॥

:::::: BIT :::::

చరణం

అతడు ఏదో సాగింది...చిలిపికథా...ఓటమి గెలుపైనా...వలపు కథా
కునుకే రాకున్న..కనులకథా...కుడికే పరువాల..పడుచుకథా
పూసేటి వేసంగి పూరేకులో..రాస్తాను నీపేరు తేనెలతో...
తెన్నేటి ఇసుకమ్మ తీరాలలో...వేస్తాను పాదాలు నీజతలో...
పాషాణమైపోకు వైఢూర్యమూ...
పాప ఈడు గోలా...పాటపేరు జోలా...ఊగుతోంది బాలా...
యవ్వనాల డోలా...

:::::: BIT :::::

చరణం

అతడు ఆటే కారాదు బ్రతుకుసుమా...అతికే మనసంటూ లేదు సుమా..
చేతులు కలిపింది చెలిమిసుమా...ఎగిరే నా ప్రేమ పావురమా..
ఆనాటి స్నేహాల వాకిళ్లలో..ఈనాడు వేచేను దోసిలితో...
కాలాలు దాటాను కౌగిళ్లలో...స్వర్గాలు చూడాలి నీఒడిలో...
శిల నీవు కాబోకు శృంగారమా...
పాప ఈడు గోలా...పాటపేరు జోలా...ఊగుతోంది బాలా...
యవ్వనాల డోలా...
నీవు వేణువైతే...నేను ఊపిరౌతా...
ఓ డార్లింగ్...ఎదలో ఈలా... మోహాలా...దరి రాగాలా...

బృందం బీ..హ్యాపీ...హ్యాపీ ఆల్ ద టైం...॥4॥

★★★

# చైతన్య (1991)

రచన : **వేటూరి** గానం : **బాలు, జానకి**

:::::: Opening Music ::::::

పల్లవి

బృందం రుత్తత్తా...రుత్తత్తరా...రుత్తత్తా...రుత్తత్త ॥2॥ (Bit)
రుత్తత్తా...రుత్తత్తరా...రుత్తత్తా...రుత్తత్త ॥2॥ (Bit)
రుత్తత్తా...రుత్తత్తరా...రుత్తత్తా...రుత్తత్త ॥2॥

అతడు రబబ్బ...స్వీటీ...ఎంతదెబ్బ తీసింది నీగుమ్మప్రేమా
ఆమె రబబ్బ..నాటీ..ఎంత ఘాటు గున్నాదిరోయబ్బ ప్రేమా...
అతడు ఓ బాల బాలా...కావాల మాలా...
ఆమె ఇస్తా మసాలా...
అతడు నాదుంప తెంచిందీ...నాచెంప వాచిందీ...
ఆమె నాకొంపముంచిందీ...నీకప్పగించిందీ..
అతడు హో! కొట్టినా...తిట్టినా...కోసినా...నాప్రేమ సవాలు ఇవాళే..
స్వీటీ...ఎంత దెబ్బతీసింది నీ గుమ్మప్రేమా...
ఆమె రబబ్బ..నాటీ..ఎంత ఘాటు గున్నాదిరోయబ్బ ప్రేమా...

:::::: BIT :::::

చరణం

బృందం రుత్తత్తా...రుత్తత్తరా...రుత్తత్తా...రుత్తత్త...
ఆమె రబబ్బ..నాటీ..కొత్తరూటు కొచ్చిందిలే రాసలీలా...
అతడు రురురురూరూరు...స్వీటీ...పాతబీటు మార్చిందిలే ప్రేమగోలా...
ఆమె సాయంత్రకాలం..నీమంత్రజాలం...
అతడు వేసింది గార్డన్..
ఆమె నీ ప్రేమ పుట్టిందీ...పెదవుల్లో కెక్కిందీ..
అతడు ముద్దుల్లో పుట్టిందీ...హద్దుల్లే దాటిందీ...
ఆమె ఏడ్చినా...నవ్వినా...చంపినా..నాప్రేమ కవ్వాలీ కావాలీ
నాటీ..ఎంత ఘాటు గున్నాదిరోయబ్బ ప్రేమా...
అతడు రబబ్బ రబబ్బ స్వీటీ...ఎంతదెబ్బ తీసింది నీగుమ్మప్రేమ

:::::: BIT :::::

Contd...

చరణం

బృందం రుత్తత్తా...రుత్తత్తరా...రుత్తత్తా...రుత్తత్త...
అతడు రబబ్బ..స్వీటీ...ఘమ్మాకొట్టి ఘమ్మందిలే కన్నె ప్రేమా
ఆమె రబబ్బ..నాటీ..చుక్కపెట్టి పొమ్మందిలే చందమామా
అతడు అందాల రూపం..గాంధారశిల్పం..
ఆమె తాంబూలమిస్తా..
అతడు కొట్టింది నీకన్నూ...పట్టింది లవ్ గన్నూ...
ఆమె చెయ్యేసి నావెన్నూ...తాకింది ఆ మిన్నూ...
అతడు కాల్చినా...పూడ్చినా...పాతినా...నాప్రేమ సవాలు నీవేలే...
స్వీటీ...ఎంతదెబ్బ తీసింది నీగుమ్మప్రేమా
ఆమె రబబ్బబ్బ..నాటీ..ఎంత ఘాటు గున్నాదిరోయబ్బ ప్రేమా...
బృందం రుత్తత్తా...రుత్తత్తరా...రుత్తత్తా...రుత్తత్త ॥2॥ (Bit)
రుత్తత్తా...రుత్తత్తరా...రుత్తత్తా...రుత్తత్త (Bit) ॥2॥ (Bit)
రుత్తత్తా...రుత్తత్తరా...రుత్తత్తా...రుత్తత్త

★★★



## సూర్య IPS (1991)

రచన : సిరివెన్నెల గానం : బాలు, చిత్ర, బృందం

:::::: Opening Music ::::::

పల్లవి

ఆమె ఓఓఓఓ...ఓఓఓఓ...ఓఓఓఓ...ఓఓఓఓ...
ఓఓఓఓఓ...ఓఓఓఓ...ఓఓఓఓ...
నెలరాజా...ఇటు చూడరా (Bit) నెలరాజా...ఇటు చూడరా...
ఉలుకేలరా...కులుకేలరా..వలరాజా...
తగువేళరా...తగువేలరా...రవితేజా...

అతడు నవరోజా...తెరతీయవా (Bit) ॥2॥

బృందం తుత్తుతుత్తుత్తుతుత్తు...తుత్తు...తుత్తుతుత్తుత్తుతుత్తు...॥2॥

:::::: BIT :::::

చరణం

ఆమె నీ కోసం ఆశగా నిరీక్షించి ప్రాణం
నీ చేతుల వాలగా చిగిర్చింది ప్రాయం

అతడు నీ వైపే దీక్షగా చలించింది పాదం
నీ రూపే దీపమై ప్రయాణించె జీవం

ఆమె నివాళిచ్చీ నవనవలన్నీ నివేదించనా..

అతడు నువ్వేలేని నిమిషాలన్నీ నిషేధించనా..

ఆమె రతిరాజువై...జతచేరవా...

అతడు విరివానవై...నను తాకవా...
నవరోజా...తెరతీయవా ॥2॥
దివి తారక తవితీరగా నిను చూచా...
జవనాలతో జరిపించవే జతపూజా...

ఆమె నెలరాజా...ఇటు చూడరా ॥2॥

బృందం పపప పపప...పపప పపప...పపపపప..పప..పపపపప...

:::::: BIT :::::

Contd...

చరణం

| | |
|---|---|
| అతడు | ఈ వెన్నెల సాక్షిగా యుగాలాగి పోనీ... |
| | ఈ స్నేహం జంటగా జగాలేలుకోనీ.. |
| ఆమె | నీ కన్నుల పాపగా కలలు ఆడుకోనీ |
| | నీ కౌగిలి నీడలో సదా సాగిపోనీ |
| అతడు | ప్రపంచాల అంచులు దాటి ప్రయాణించనీ... |
| ఆమె | దిగంతాల తారలకోట ప్రవేశించనీ... |
| అతడు | గత జన్మనే ... బ్రతికించనీ |
| ఆమె | ప్రణయాలలో ...శ్రుతి పెంచనీ.. |
| | నెలరాజా...ఇటు చూడరా... |
| అతడు | నవరోజా...తెరతీయవా |
| ఆమె | ఉలుకేలరా...కులుకేలరా..వలరాజా... |
| అతడు | జవరాలతో జరిపించవే జతపూజా... |
| ఆమె | నెలరాజా...ఇటు చూడరా |
| అతడు | నవరోజా...తెరతీయవా |

★★★



## సూర్య IPS (1991)

రచన : సిరివెన్నెల　　　　గానం : బాలు, జానకి

:: Opening Music ::

పల్లవి

అతడు　అరె...ఝుంజినక జింకరా...ఛెంగుఛెంగుమందిరా
బాణం వేసిపట్టుకోనా...

ఆమె　అరె...థింతనక తొందరా...తిమ్మిరెక్కి పోకురా
ఉండమంటె ఉండవేరా...

అతడు　అయ్యారే..ఏంజోరే...చెయ్యి ఎయ్యనీయవేందె జాణ...
ఝుంజినక జింకరా...
అరె..ఝుంజనక జింకరా...ఛెంగుఛెంగుమందిరా
బాణం వేసిపట్టుకోనా...కోనా...కోనా...కోనా...హొయ్

:::::: BIT :::::

చరణం

అతడు　మొయ్యలేని మొత్తాన్ని అయ్యచేత పెట్టేసి హాయిగా...ఆహా...
అందుకోవా...య్యహాc...య్యహాc... య్యహాc...య్యహాc...

ఆమె　ముట్టుకోను వీల్లేని ఇంతవేడి పన్నెల్ని అంటితే
అహా...ఐపోవా...య్యహాc...య్యహాc... య్యహాc...య్యహాc...

అతడు　నావేలు పద్దాక బెండల్లె కరిగావె కూనా...హాc...హాc...

ఆమె　అరెరె...ఆమాట విన్నాక ఆశించి వచ్చానె...నాథా...

అతడు　ఏయ్...ఆవిర్లుపెట్టి...అందమారబెట్టి...
ఓదార్చిపోనా...సెగలు మిగలవని...ఝుంజినక జింకరా...
అరె...ఝుంజినక జింకరా...ఛెంగుఛెంగుమందిరా
బాణం వేసి పట్టుకోనా...

ఆమె　థింతనక తొందరా...తిమ్మిరెక్కి పోకురా
ఉండమంటె ఉండవేరా...

అతడు　అయ్యారే..ఏంజోరే...చెయ్యి ఎయ్యనీయవేందె జాణ...
ఝుంజినక జింకరా...

Contd...

తరిగిడ...ఝింజినక జింకరా...ఛెంగుఛెంగుమందిరా
బాణం వేసి పట్టుకోనా..అకోనా..అకోనా..అకోనా..నసన..ననసన

::::: BIT :::::

చరణం

ఆమె వచ్చిపడే సోకుల్ని ఉంచుకోను చోటేది ఒంటిలో ఎటూ ఏమూలా...
యహాం...య్యహాం...య్యహాం...య్యహాం...

అతడు అంతేమరి ఇరుకైతే కొంచెమిలా పారేస్తే
ఏలనంటినా..ఏదోలా...అయ్యో...అమ్మా...అబ్బా...అబ్బా...

ఆమె నైవేద్యమెట్టినా నాజూకు నాట్యాల గోలా..

అతడు అరెరెరె...నావిద్య చూపించి పాలించుకుంటానె బాలా...

ఆమె కాపాడమంటా..కన్నెదానమిస్తా...నాకొంగుపంటా
దిగులు దిగెను అని...ధింతనక తొందరా...
ధింతనక తొందరా...తిమ్మిరెక్కి పోకురా
ఉండమంటె ఉండవేరా...

అతడు ఝింజినక జింకరా...ఛెంగుఛెంగుమందిరా
బాణం వేసి పట్టుకోనా..

ఆమె జోహారే...ఏంపాోరే..సయ్యారయాడ సంబరాన
ధింతసక తొందరా...

అతడు తరికిటతక...తరికిట ఝింజినక జింకరా...
ఛెంగుఛెంగుమందిరా...బాణం వేసి పట్టుకోనా..
కోనా...కోనా...ధినక్కు ధినక్కు..ధిన...తరికిట...తరికిట...
తరికిట...తరికిట...త...

★★★



## ఓపాపా లాలి (1991)

రచన : రాజశ్రీ గానం : బాలు

:::::: Opening Music ::::::

పల్లవి

మాటేరాని చిన్నదానీ కళ్లు పలికే ఊసులూ
అందాలన్ని పల్లవించీ ఆలపించే పాటలూ
ప్రేమే నాకు పంచే జ్ఞాపకాలురా (Bit)
రేగే మూగతలపే వలపు పంటరా (Bit)
మాటేరాని చిన్నదానీ కళ్లు పలికే ఊసులూ
అందాలన్ని పల్లవించీ ఆలపించే పాటలూ
ప్రేమే నాకు పంచే జ్ఞాపకాలురా (Bit)
రేగే మూగతలపే వలపు పంటరా

:::::: BIT :::::

పల్లవి

వెన్నెలల్లె పూలు విరిసి తేనెలు చిలికెను
చెంతచేరి ఆదమరిచి ప్రేమను కొసరెను
చందనాల జల్లు కురిసె చూపులు కలిసెను
చందమామ పట్టపగలె నింగిని పొడిచెను
కన్నెపిల్ల కలలే నాకికలోకం
సన్నజాజి కళలే మోహనరాగం
చిలకల పలుకులు అలకల ఉలుకులు
నాచెలి సొగసులు నన్నే మరిపించే (Silence)
మాటేరాని చిన్నదానీ కళ్లు పలికే ఊసులూ...
అందాలన్ని పల్లవించీ ఆలపించే పాటలూ...

:::::: BIT :::::

చరణం

ముద్దబంతి లేత నవ్వులు చిందెను మధువులు
ఊసులాడు మేనివగలు వన్నెల జిలుగులు

Contd...

హరివిల్లులోని రంగులు నాచెలి సొగసులు
వేకువల మేలుకొలుపే నాచెలి పిలుపులు
సందెవేళ పలికే నాలో పల్లవి
సంతసాల సిరులే నావే అన్నవి
ముసిముసి తలపులు కరగని వలపులు
నాచెలి సొగసులు అన్నీ ఇకనావే (అలుపుతో - Silence)

మాటేరాని చిన్నదానీ కళ్లు పలికే ఊసులూ...
అందాలన్ని పల్లవించీ ఆలపించే పాటలూ...
ప్రేమే నాకు పంచే జ్ఞాపకాలురా (Bit)
రేగే మూగతలపే వలపు పంటరా (Bit)
మాటేరాని చిన్నదానీ కళ్లు పలికే ఊసులూ...
అందాలన్ని పల్లవించీ ఆలపించే ...పాటలూ

★★★



## ప్రేమలేఖలు (1991)

రచన : **రాజశ్రీ** గానం : **బాలు, చిత్ర (హమ్మింగ్)**

:: Opening Music ::

పల్లవి

ఆమె అఅఅ ఆ అఅఅఅఅఅఅఆహహహాఆఆ...
అఅఅ ఆఅఆఅఅఅఅఅఅ హహాహహా...ఆఆ... (Bit)

అతడు అదో మేఘ తోరణం...అదో వింత సోయగం...నీదే (Bit)
ఇదో రాగ శోభనం...ఇదో ప్రేమ ఉత్సవం...నాదే (Bit)
చూశానే...నా చెలిరూపాన్నే...(Bit)
దాచానే...గుండెలచాటులనేలా...(Bit)
అదో మేఘ తోరణం...అదో వింత సోయగం...నీదే

:::::: BIT :::::

చరణం

అతడు చెలియపాదం...విరిసిన జాజిమల్లి (Bit)
చెలియచూపు...సొగసుల పాలవెల్లి (Bit)
చిలిపి వలపు చాటులో...రాజగోపురం..
నేను వేడుకొంటినీ..చెలిని ఓ...వరం
అందమునకు గురుతులూ...చెలియ మేని ముసుగులూ..
చీరచెంగు తెరలికా..నీకదేల రావా...
అదో మేఘతోరణం...అదో వింత సోయగం...నీదే...

:::::: BIT :::::

చరణం

ఆమె ఆ...ఆఆఆ...(Bit) ఆ...ఆఅఅఅఅఆ...(Bit)ఆ..ఆ..ఆ..
ఆ..(Bit) అఅఅఅ అఅఅఅ ఆఆఆఆఆ...(Long Bit)

అతడు కురులు చూసి...మేఘమని నెవలులాడీ (Bit)
ముఖము చూసి...కలువని జాబిలి పాడీ (Bit)
చెలియపాలనవ్వులే...లేతవెన్నెలే...

Contd...

వింత ఇంద్రధనుసులే..చెలియపన్నెలే..
సృష్టికర్త బ్రహ్మకే చూడమోజు కలుగునే...
ప్రేమభిక్షే కోరునే...చేయిచాచి నిన్నే...
అదో మేఘతోరణం...అదో వింత సోయగం...నీదే...(Bit)
ఇదో రాగ శోభనం...ఇదో ప్రేమ ఉత్సవం...నాదే... (Bit)
చూశానే...నా చెలిరూపాన్నే...(Bit)
దాచానే...గుండెలచాటులనేలా...(Bit)
అదో మేఘ తోరణం...అదో వింత సోయగం...నీదే...(Bit)

★★★



## ప్రేమలేఖలు (1991)

రచన : **రాజశ్రీ** గానం : **బాలు, చిత్ర**

పల్లవి

ఆమె ఓ...ఓ...ఓ...(Bit) ఓ...ఓ...ఓ...ఓ...ఓ...ఓ...
ఓ...ఓ...నానననా...నానననా..నననా నాననా...
నాననా...నన నాననా..నననా నాననా (Long Bit)

అతడు నీవే నీవే...ప్రాణం అంటా...నీవేగా నాలోకం అంటా

ఆమె మనసు కలిసెనే...ఇదే ఇదే తోడు కోరెనే...(Bit)
కలలు విరిసెనే..జగం మరిచెనే...

అతడు నీవే నీవే...ప్రాణం అంటా...నీవే నీవే...

:::::: BIT :::::

చరణం

అతడు కదలి అలలు కమ్మనీ...వసంత గీతి పాడెనే..
పడమటింట సూర్యుడే..తొంగితొంగి చూసెనే...

ఆమె సంజవేళ గాలులే..చిలకరించె గంధం...
పులకరించు వేళలో...పలకరించె రాగం...

అతడు నాలో ఏవో...ఆశలే... రేగెనే...

ఆమె వలపు వాగులే...పొంగెనే...పొంగెనే...

అతడు మంతనాలకు మాటలొచ్చిన వేళా...

ఆమె నీవే నీవే...ప్రాణం అంటా...నీవేగా నాలోకం అంటా

అతడు మనసు కలిసెనే...ఇదే ఇదే తోడు కోరెనే...(Bit)
కలలు విరిసెనే..జగం మరిచెనే...

ఆమె నీవే నీవే...ప్రాణం అంటా...నీవే నీవే...

:::::: BIT :::::

చరణం

ఆమె కళ్లలోని బాసలూ...నీకు ప్రేమలేఖలూ..
ఆశతీర నీకిదీ... చేసుకుంటి దాఖలూ...

అతడు వాడిపోని మల్లికా...మనసు ఇచ్చెనంటా...
మధురమైన బంధమే...నేను అందుకుంటా...

Contd...

ఆమె కనులేపాడే...తీయగా...హాయిగా...
అతడు కలలే చిలికే...తేనెలా...వానలే...
ఆమె నీవు నీవులే...నీవు నేనులే...రాజా...
అతడు నీవే నీవే...ప్రాణం అంటా...నీవేగా నాలోకం అంటా
ఆమె మనసు కలిసెనే...ఇదే ఇదే తోడు కోరెనే...(Bit)
కలలు విరిసెనే..జగం మరిచెనే...
అతడు నీవే నీవే...ప్రాణం అంటా...నీవే ...నీవే...

★★★



## ఇళయరాజీయం అంటే...

వినూత్న పంథాలో పాటలు స్వరపరచడం ఇళయరాజా ప్రత్యేకత. ఆఫ్రికన్ గిరిజన సంప్రదాయ సంగీతం, పాశ్చాత్య జానపద గిటార్ వాద్య సంగీతపోకడులతో పాటు బోసానోవా, ఫ్లమెంకో సంగీత సరళిని అనుసరిస్తూ ఇళయరాజా వైవిధ్య భరితమైన సంగీతాన్ని సంగీతాభిమానులకు అందించారు. అదే ఇళయరాజీయం!

# హృదయం (1991)

రచన : **రాజశ్రీ** గానం : **బాలు, చిత్ర (ఆలాపనతో)**

:: Opening Music ::

పల్లవి

హృదయమా..హృదయమా...నీమౌనమెంత వేదనా...
హృదయమా...హృదయమా... ఈ విరహమెంత యాతనా...
చందమామలేని నింగినేనులే...తోడులేని మోడునైతి నేడులే...
హృదయమా..హృదయమా...నీమౌనమెంత వేదనా...
హృదయమా...హృదయమా...

:::::: BIT :::::

చరణం

మంచల్లే కరిగీ..నదిలాగమారీ...నీనీడగా సాగినానే..
నీ ధ్యాసనేనై ఈలోకాన్ని మరిచీ...ఊహల్లో వూరేగి విహరించానే...
నీకంటి పిలుపే...నాప్రేమలోకం..॥2॥
గుండె పగిలెనే...ఎద శోకమాయెనే...నీవులేని బ్రతుకునాకు ఏలనే...
హృదయమా..హృదయమా...నీమౌనమెంత వేదనా...
హృదయమా...హృదయమా...

:::::: BIT :::::

చరణం

(ఆలాపన) ఆఆఆ...ఆఆఆ...ఆఆఆ...ఆఆఆ
నా జీవరాగం...చిరుగాలి నీకూ... ఈవేళ వినిపించలేదా...
చెలిలేని బ్రతుకే శ్రుతిలేని గీతం...ఇక ఎందుకో నాకు ఈ నాజన్మా...
రగిలేటి సెగలే...ఎదలోన మోశా...॥2॥
చెలిమి నేరమా...నాప్రేమ నేరమా...నీవులేని బ్రతుకునాకు ఏలనే...
హృదయమా..హృదయమా...నీమౌనమెంత వేదనా...
హృదయమా...హృదయమా...
ఈ విరహమెంత యాతనా...
చందమామలేని నింగినేనులే...తోడులేని మోడునైతి నేడులే...
హృదయమా..హృదయమా...నీమౌనమెంత వేదనా...
హృదయమా...హృదయమా...

★★★

## హృదయం (1991)

రచన : **రాజశ్రీ** గానం : బాలు

పల్లవి ఊసులాడే ఒక జాబిలట సిరిమువ్వలుగా నను తాకెనటా (Bit) ॥2॥
చూపులతో బాణమేసెనటా చెలి నాఎదలో సెగ రేపెనటా
మాటే వేదం...తానే నాలోకం..ప్రేమే యోగం
ఊసులాడే ఒక జాబిలట సిరిమువ్వలుగా నను తాకెనటా
చూపులతో బాణమేసెనటా చెలి నాఎదలో సెగ రేపెనటా

:::::: BIT :::::

చరణం అందాలే చిందే చెలిరూపం నాకోసం...
ఆనందం నిలిపేటి ధ్యానం...చెలిధ్యానం...
అదే పేరూ నేనూ జపించేనూ రోజూ...
నన్నే చూసేవేళా అలై పొంగుతాను...
మౌనం సగమై..మోహం సగమై...నేనే నాలో రగిలేనూ
ఊసులాడే ఒక జాబిలట సిరిమువ్వలుగా నను తాకెనటా
చూపులతో బాణమేసెనటా చెలి నాఎదలో సెగ రేపెనటా
మాటే వేదం...తానే నాలోకం..ప్రేమే యోగం
ఊసులాడే ఒక జాబిలట సిరిమువ్వలుగా నను తాకెనటా
చూపులతో బాణమేసెనటా చెలి నాఎదలో సెగ రేపెనటా

:::::: BIT :::::

చరణం నాలోనూ రేగేనే పాట...చెలిపాటా...
నీడల్లే సాగేనే వెంట...తనవెంట...
స్వరాలై పొంగేనా..వరాలే కోరేనా...
ఇలా ఊహల్లోనా..సదా వుండిపోనా...
ఒకటయ్యేదు..ఒకటైనాడు పండగ నాకూ ఏనాడూ
ఊసులాడే ఒక జాబిలట సిరిమువ్వలుగా నను తాకెనటా
చూపులతో బాణమేసెనటా చెలి నాఎదలో సెగ రేపెనటా
మాటే వేదం...తానే నాలోకం..ప్రేమే యోగం
ఊసులాడే ఒక జాబిలట సిరిముస్వలుగా నను తాకెనటా
చూపులతో బాణమేసెనటా చెలి నాఎదలో సెగ రేపెనటా

★★★

# ధర్మక్షేత్రం (1992)

రచన : వేటూరి గానం : బాలు, జానకి, బృందం

:::::: Opening Music ::::::

పల్లవి

అతడు ఎన్నోరాత్రులొస్తాయి గాని రాదీ వెన్నెలమ్మా
ఎన్నో ముద్దులిస్తారు గాని లేదీ వేడిచెమ్మా

ఆమె అన్నాడే...చిన్నోడూ...అన్నిట్లో...ఉన్నోడూ...

అతడు ఆహ..ఎన్నో రాత్రులొస్తాయి గాని రాదీ వెన్నెలమ్మా
ఎన్నో ముద్దులిస్తారుగాని లేదీ వేడిచెమ్మా...

బృందం అ..అ..అఅఅ...అఅఅ...అ...అఅఅ...అఅఅ...అఅఅ...
ఆఅఅఅ...అఅఅఅ...ఆఅఅఅ...

:::::: BIT :::::

చరణం

ఆమె ఎన్ని మోహాలు మోసీ...ఎదల దాహాలు దాచా
పెదవి కొరికే...పెదవి కొరకే ఓహోహో...

అతడు నేనెన్ని కాలాలు వేచా...ఎన్ని గాలాలు వేశా...
మనసు అడిగే...మరుల సుడికే ఓహోహో...

ఆమె మంచం ఒకరితో అలిగినా...మౌనం వలపులే చదివినా

అతడు ప్రాయం సొగసులే వెతికినా... సాయం వయసునే అడిగినా...

ఆమె ఓ...ఓఓఓ...ఓఓఓ...ఓఓ..

అతడు ఎన్నోరాత్రులొస్తాయి గాని

ఆమె రాదీ వెన్నెలమ్మా...ఎన్నో ముద్దులిస్తారు గాని

అతడు లేదీ వేడిచెమ్మా...

బృందం అ...ఆఅ..ఓఓ...ఓ..(Bit) అఅ..ఆ..ఓఓఓ...
(Bit) ఆ...అ...అఅఅ...అఅఅ...

:::::: BIT :::::

చరణం

అతడు గట్టి పత్తిళ్లకోసం...గాలి కౌగిళ్ల తెచ్చా
తొడిమ తెరిచే తొనల రుచికే..ఓహోహో...

Contd...

ఆమె　　నీ గోటి గిచ్చుళ్ళకోసం...మొగ్గ చెక్కిళ్లు ఇచ్చా
　　　చిలిపి పనులా..చెలిమి జతకే..ఓహోహో...
అతడు　అంతే ఎరుగనీ అమరికా...ఎంతో మధురమీ బడలికా
ఆమె　　ఛీ...ఛో...బిడియమా సెలవికా...నాకీ పరువమే పరువికా
అతడు　ఓ...ఓఓ...ఒఒఓ...ఓ..
ఆమె　　ఎన్నోరాత్రులొస్తాయి గాని
అతడు　రాదీ వెన్నెలమ్మా...ఎన్నో ముద్దులిస్తారు గాని
ఆమె　　లేదీ వేడిచెమ్మా...అన్నాడే...చిన్నోడూ..
అతడు　అన్నిట్లో ఉన్నోడూ...
ఆమె　　అహా...ఎన్నోరాత్రులొస్తాయి గాని రాదీ వెన్నెలమ్మా
అతడు　ఆహో...ఎన్నో ముద్దులిస్తారు గాని లేదీ వేడిచెమ్మా

★★★



# ధర్మక్షేత్రం (1992)

రచన : **వేటూరి** గానం : **బాలు, జానకి**

:::::: Opening Music ::::::

పల్లవి

అతడు అరే ఇంక జంక జింక పెంకితనంగా
అదో వంక సింగారంగా సిగ్గు పడంగా
ఆమె ఎలా ఇంకా కల్లోలంగా కన్ను పడంగా
ఉపాయంగా ఊపేయంగా ఉన్నపళంగా
అతడు సరే అంటావా సంతోషంగా... సగం ఇస్తావా సావాసంగా...
ఆమె సతాయిస్తావా అన్యాయంగా...వలై వస్తావా అల్లేయంగా...
అతడు అరే ఇంక జంక జింక పెంకితనంగా
అదో వంక సింగారంగా సిగ్గు పడంగా
ఆమె ఎలా ఇంకా కల్లోలంగా కన్ను పడంగా
ఉపాయంగా ఊపేయంగా ఉన్నపళంగా

:::::: BIT :::::

చరణం

అతడు బంగారం పిచ్చుకా భాగోతం పెంచకా...నాభాగం పంచెయ్యంగా
శృంగారం చిచ్చుగా...గారం చూపించక...బందారం బైటేయంగా
ఆమె బాగుందా బొత్తిగా బలవంతం పెట్టక...బులపాటం చెలరేగంగా
పంతాల పచ్చిగా పొలిమేరే పెంచగా...పొంగుల్లో పొలమారంగా
అతడు మథించేస్తానే చెంగువల చిందేయంగా
ఆమె ఇదే సందంటు చేతబడి చాల్లే ఇంకా
అతడు మరీ స్వాతంత్రంగా..మహా బాహాటంగా
అలా జెండాల ఎగరెయ్యంగా...అరెరెరే...ఇంకా...
అరే ఇంక జంక జింక పెంకితనంగా
అదో వంక సింగారంగా సిగ్గు పడంగా
ఆమె ఎలా ఇంకా కల్లోలంగా కన్ను పడంగా
ఉపాయంగా ఊపేయంగా ఉన్నపళంగా
అతడు సరే అంటావా సంతోషంగా..సగం ఇస్తావా సావాసంగా...

Contd...

ఆమె సతాయిస్తావా అన్యాయంగా.. వలై వస్తావా అల్లేయంగా..
అతడు అరే ఇంక జంక జింక పెంకితనంగా
అదో వంక సింగారంగా సిగ్గు పడంగా
ఆమె ఎలా ఇంకా కల్లోలంగా కన్ను పడంగా
ఉపాయంగా ఊపేయంగా ఉన్నపళంగా

:::::: BIT :::::

చరణం

ఆమె ఏకాంతం సాక్షిగా...ఏమాత్రం దాచక...ఇస్తాగా నిక్షేపంగా
ఆసాంతం వెచ్చగా..ఆశంతా తీర్చగా వస్తాగా ప్రత్యేకంగా
అతడు ఆమాత్రం ఓర్చగా...ఉండొద్దా ఓపిక...అపొద్దే నిష్ఠూరంగా
చెప్పిందే చెప్పక వింటుందా దప్పిక..చంపొద్దే చాదస్తంగా
ఆమె చమత్కారాలు కారాల విడ్డూరంగా
అతడు అలా వారాలు వర్జాలు వద్దేయింకా
ఆమె మరే అంగా ఉంగా అనే గారాబంగా
మొరాయిస్తావే మోహనగంగా...అరెరెరే...ఇంకా
ఎలా ఇంకా కల్లోలంగా కన్ను పడంగా
ఉపాయంగా ఊపేయంగా ఉన్నపళంగా
అతడు అరే..ఇంక జంక జింక పెంకితనంగా
అదో వంక సింగారంగా సిగ్గు పడంగా
ఆమె సతాయిస్తావా అన్యాయంగా.. వలై వస్తావా అల్లేయంగా..
అతడు సరే అంటావా సంతోషంగా..సగం ఇస్తావా సావాసంగా...
ఆమె (నవ్వు)
అతడు అరే ఇంక జంక జింక పెంకితనంగా
అదో వంక సింగారంగా సిగ్గు పడంగా
ఆమె ఎలా ఇంకా కల్లోలంగా కన్ను పడంగా
ఉపాయంగా ఊపేయంగా ఉన్నపళంగా

★★★

# ధర్మక్షేత్రం (1992)

రచన : **వేటూరి** గానం : **బాలు, జానకి**

:::::: Opening Music ::::::

పల్లవి

ఆమె ముద్దుతో శృంగార బీటు కొట్టగానే...
చీరలో మూరకో చిటపటా...

అతడు ఎంగిలే సంపెంగ రంగులేయగానే...
ఎందుకో..ఏవిఁటో...అలసటా...

ఆమె అంటుకున్న చీరలో...అమ్మాయి సోకు
కంటికందినప్పుడే కసుక్కుమంటు

అతడు ఎంగిలే సంపెంగ రంగులేయగానె
ఎందుకో...ఏవిఁటో..అలసటా..

ఆమె ముద్దుతో శృంగార బీటు కొట్టగానే...
చీరలో మూరకో చిటపటా...

అతడు అంటుకున్న చీరలో...అమ్మాయి సోకు
కంటికందినప్పుడే కసుక్కుమంటు

ఆమె ముద్దుతో శృంగార బీటు కొట్టగానే...
చీరలో మూరకో చిటపటా...

::::: BIT :::::

చరణం

ఆమె ముత్యాలవానా...మూగదైనా...ముద్దింటరేగెను తాళం

అతడు రత్నాలవానా...రాత్రిరైనా...తళ్లోన దాగెను దీపం

ఆమె ఎక్కడో...ఏవిఁటో...ఏదో...తొక్కిడే సాగింది నాలో

అతడు ఉందిలే ఊపులో ఎంతో...పాదమే జారితే నాతో

ఆమె ఆషాఢమాసమో...అందాలమోసమో...అబ్బాయికోసమో...
మగ్గుబిళ్ల జారిపోయె

అతడు ఎంగిలే సంపెంగ రంగులేయగానే...
ఎందుకో..ఏవిఁటో...అలసటా...

ఆమె ముద్దుతో శృంగార బీటు కొట్టగానే...
చీరలో మూరకో చిటపటా...

అతడు అంటుకున్న చీరలో...అమ్మాయి సోకు

Contd...

కంటికందినపుడే కసుక్కుమంటు
ఆమె ముద్దుతో శృంగార బీటు కొట్టగానే...
చీరలో మూరకో చిటపటా...
అతడు ఎంగిలే సంపెంగ రంగులేయగానె...
ఎందుకో...ఏవిఁటో..అలసటా..

:::::: BIT :::::

చరణం
అతడు హే...లజికు..లజికులజికా...లజలజలజలజికా...
ఆమె హే...లజికు..లజికులజికా...లజలజలజలజికా...
అతడు హే...లజలజలజలజికా...
ఆమె హే...లజలజలజలజికా...
అతడు లజికా...
ఆమె లజలజలజికా...
ఇద్దరు లజలజలజలజికా... (Long Bit)
అతడు ఆకాశగంగ అందుకున్నా...తీరేది కాదంటతాపం
ఆమె పాతాళగంగ తోడుకున్నా...ఒద్దంటునా ప్రాయం
అతడు ఉక్కిరై బిక్కిరై నాలో...కొక్కొరో అన్నాది ప్రాణం
ఆమె పంపులే సొంపులై నాలో...తుప్పరైపోయాయి పాపం
అతడు ఆ తుంగభద్రలా...ఈవంశధారలా...పెన్నేటి పొంగులా
తుళ్ళిపడ్డదమ్మ ఒళ్ళు
ఆమె ముద్దుతో శృంగార బీటు కొట్టగానే...
చీరలో మూరకో చిటపటా...
అతడు ఎంగిలే సంపెంగ రంగులేయగానే...
ఎందుకో..ఏవిఁటో...అలసటా...
ఆమె అంటుకున్న చీరలో...అమ్మాయి సోకు
కంటికందినప్పుడే కసుక్కుమంటు
అతడు ఎంగిలే సంపెంగ రంగులేయగానె...
ఎందుకో...ఏవిఁటో..అలసటా..
ఆమె ముద్దుతో శృంగార బీటు కొట్టగానే...
చీరలో మూరకో చిటపటా...

★★★

# ధర్మక్షేత్రం (1992)

రచన : **వేటూరి** గానం : **బాలు, చిత్ర**

:::::: Opening Music ::::::

పల్లవి

అతడు చెలి నడుమే అందం..నడకే నాట్యం
మెడలో హారం...పడుచాహారం...లవ్‌లీ...

ఆమె ప్రియరతిలో రాగం...జతలో తాళం...
ఎదలో బంధం...పొద సంబంధం...లవ్‌మీ....

అతడు నినుకోరీ...సరసాలా...వర్షంలో
ఆమె ఒడిచేరే...పరువాలా...పర్వంలో }॥2॥

అతడు నడుమే అందం..నడకే నాట్యం
మెడలో హారం...పడుచాహారం...లవ్‌లీ...

ఆమె ప్రియరతిలో రాగం...జతలో తాళం...
ఎదలో బంధం...పొద సంబంధం...లవ్‌మీ....

:::::: BIT ::::

చరణం

అతడు చూశానే నావైపు...ఏ చుక్కా చూడని షేపు
పూ పొదరిల్లల్లో పోపు నేపెట్టెయ్యనా..

ఆమె మత్తెక్కించే చూపు...నామతిపోగొట్టే వూపు
సెక్సీ సినిమాస్కోపు...నేచుట్టెయ్యనా...

అతడు సైడు తగిలే...నాగోడే ఈడు రగిలే

ఆమె గాలి తగిలే...నాకన్నే మబ్బుచెదిరే

అతడు ఓయ్ నీ దివ్య భారాలు దిద్దుకుంటా
నా నవ్యతీరాలు చేరేదాకా...తీరేదాకా (Bit)
చెలి నడుమే అందం..నడకే నాట్యం
మెడలో హారం...పడుచాహారం...లవ్‌లీ...

ఆమె ప్రియరతిలో రాగం...జతలో తాళం...
ఎదలో బంధం...పొద సంబంధం...లవ్‌మీ....

అతడు నినుకోరీ...సరసాలా...వర్షంలో
ఆమె ఒడిచేరే...పరువాలా...పర్వంలో }॥2॥

Contd...

అతడు	నడుమే అందం..నడకే నాట్యం
	మెడలో హారం...పడుచాహారం...లవ్‌లీ...
ఆమె	ప్రియరతిలో రాగం...జతలో తాళం...
	ఎదలో బంధం...పొద సంబంధం...లవ్‌మీ....

:::::: BIT :::::

చరణం

ఆమె	లాలాలాలాలాలాల...లాలాలాలాలాలాల...లాలాలాలా
	లాలాలాలా...లా... (Long Bit)
	శృంగారంలో ఈనె...మధుమందారంలో తేనె
	వాలే పొద్దుల్లోనే...నీకందించనా...
అతడు	పులకించే పూరేకు..నేపూజించే నీ సోకు
	కొట్టేస్తున్న షాకు...నే చుంబించనా
ఆమె	పట్టపగలే...వెన్నెల్లో తార లెగిరే
అతడు	అరెరెరెరెరె...ముట్టడిస్తే నీ కన్నే బొట్టు కరిగే
ఆమె	హేయ్! ఓ బాలగోపాల ఒప్పుకుంటా
	వయ్యారి గంధాలు అంటేదాక...ఆరే దాక (Bit)
అతడు	చెలి నడుమే అందం..నడకే నాట్యం
	మెడలో హారం...పడుచాహారం...లవ్‌లీ...
ఆమె	ప్రియరతిలో రాగం...జతలో తాళం...
	ఎదలో బంధం...పొద సంబంధం...లవ్‌మీ....
అతడు	నినుకోరీ...సరసాలా...వర్షంలో } ॥2॥
ఆమె	ఒడిచేరే...పరువాలా...పర్వంలో
అతడు	నడుమే అందం..నడకే నాట్యం
	మెడలో హారం...పడుచాహారం...లవ్‌లీ...
ఆమె	ప్రియరతిలో రాగం...జతలో తాళం...
	ఎదలో బంధం...పొద సంబంధం...లవ్‌మీ....

★★★

## ధర్మక్షేత్రం (1992)

రచన : **వేటూరి** గానం : **మనో, చిత్ర బృందం**

పల్లవి

బృందం కొరియ..కొరియ..అరరర...కొరియ..కొరియ..అరరర...
హోహోఓఓ..ఓఓ.. ॥2॥ (Long Bit)

అతడు కొరమీను కోమలం...సొరచేప శోభనం
దొరసానీ బురదకొయ్యా... } ॥2॥
తడిసోకు దప్పళం...తళుకెంతో నిబ్బరం...
అదిమేస్తే అప్పడం...తిరగట్లో తిప్పడం...
కసిగా కొసలే కొరికేస్తా...

బృందం కొరమీను కోమలం...సొరచేప శోభనం
దొరసానీ బురదకొయ్యా... } ॥2॥

:::::: BIT :::::

చరణం

ఆమె బుడమేటి ఈతల్లో...పడిలేచే సోకుల్లో
చిలిపి జలగవీ... (అతడు : ఆ...) ఒక చిన్న బుడగవీ

అతడు నీఎండమావుల్లో...నాగుండె బావుల్లో
బొచ్చెపరిగవీ...(ఆమె : ఏయ్) ఒక పిచ్చినురగవీ

ఆమె నిన్నే సాధిస్తా...నా సత్తాలు చూపిస్తా
సైరా..నాసందెపుడకా...

అతడు నిన్నే కవ్విస్తా...నాకౌగిట్లో కట్టేస్తా
రావే...నారంభొసిలకా...

ఆమె వద్దీ బురదా...కన్నెవాగే వరదా...

అతడు నాకే సరదా..పిల్ల నోరే దురదా...

ఆమె పెట్టావంటే ఫోజు...దులిపేస్తా నీబూజు..హో...హో...హో...

అతడు కొరమీను కోమలం...సొరచేప శోభనం
దొరసానీ బురదకొయ్యా...తస్సదియ్యా...

ఆమె దోబూచీ దొబ్బుడాయ్...పోపోఫీ...బొమ్మిడాయ్...
గిలిగుంటే గిల్లిచూడూ...

Contd...

ముడితీస్తే మూపురం...బిడియాల గోపురం
సుడిచూస్తే సుందరం...తొడగొట్టే తొందరం
పగలే పగలే దులిపేస్తా....

బృందం కొరమీను కోమలం...సొరచేప శోభనం
దొరసానీ బురదకొయ్యా... } ॥2॥

:::::: BIT :::::

చరణం

అతడు నీలాటి రేవుల్లో...నీలాటి చేపల్లా సొగసు తడిసెలే
నా...పొగరు బెడిసెలే...

ఆమె కళ్లెట్టి చూస్తుంటే...గాలాలే వేస్తుంటే..
పులస దొరుకునా...మన వరస కుదురునా....

అతడు తోకే జాడించే చెలి కోకిట్టా పారేస్తే
ఆరేస్తా...తడితునకా...

ఆమె నన్నే ఓడించీ...పగబట్టించీ రేకిస్తే
చూపిస్తా కసినడకా...

అతడు నేనే గడుసూ...నాకు నువ్వే అలుసూ...

ఆమె నీకే తెలుసు...కలవని కంట్లో నలుసూ...

అతడు అరె...ఎక్కిస్తా..నా ఒడ్డూ...ఎవడొస్తాడో అడ్డూ
హే.. హే... హే...

ఆమె దోబూచీ దొబ్బుదాయ్...పోపోఛీ...బొమ్మిడాయ్...
గిలిగుంటే గిల్లిచూడూ...

అతడు అరె...కొరమీను కోమలం...సొరచేప శోభనం
దొరసానీ బురదకొయ్యా...
తడిసోకు దప్పళం...తళుకెంతో నిబ్బరం...
అదిమేస్తే అప్పడం...తిరగట్లో తిప్పడం...
కసిగా కొసలే కొరికేస్తా...

బృందం కొరమీను కోమలం...సొరచేప శోభనం
దొరసానీ బురదకొయ్యా... ॥3॥

★★★

## డిటెక్టివ్ నారద (1992)

రచన : జొన్నవిత్తుల రామలింగేశ్వరరావు    గానం : బాలు, జానకి

:::::: Opening Music ::::::

పల్లవి

| | | | |
|---|---|---|---|
| ఆమె | కొత్త పిట్టరో కో..కో... | అతడు : | చక్కిరి బిక్కిరి చక్క |
| ఆమె | చక్కాగుందీ చూస్కో... | అతడు : | టక్కున చిక్కవె చక్క |
| ఆమె | జట్టు కట్టగా లాక్కో... | అతడు : | అక్కున చేరవె చక్క |
| ఆమె | కాకా పట్టీ కాస్కో... | అతడు : | దక్కవె దాల్చిన చక్క |
| ఆమె | నొక్కుల చెక్కిలిపైనా... | అతడు : | టెక్కుల నిక్కుల చుక్క |
| ఆమె | చక్కని మక్కువలోనా... | అతడు : | చిక్కిన గంధపు చక్క |
| ఆమె | దక్కన శిల్పము చెక్కుకో... | ఓ..ఓ...ఓ.. | |
| అతడు | పక్కపక్కకీ లాక్కో... | ఆమె : | ఇక్కడి కిక్కడి చిక్క |
| అతడు | తస్సా చెక్కా కాస్కో... | ఆమె : | ఒక్కటి కొక్కటి లెక్క |
| అతడు | లిక్క ఎక్కెనా చూస్కో... | ఆమె : | చక్కెర వింటికి మొక్క |
| అతడు | బుగ్గా బుగ్గా రాస్కో... | ఆమె : | మిక్కిలి ఎక్కువ చొక్క |
| అతడు | చక్కిలి గింతలలోన.. | ఆమె : | ఎక్కడి కక్కడ చిక్కి |
| అతడు | తక్కిన వింతలలోన.. | ఆమె : | ఒక్కరి కొక్కరు దక్కి |
| అతడు | మన్మథ బుక్కులు పాడుకో... ఓ..ఓ..ఓ.. | | |
| ఆమె | కొత్త పిట్టరో కో...కో... | అతడు : | చక్కిరి బిక్కిరి చక్క |
| ఆమె | చక్కాగుందీ చూస్కో..అ...అ...అ... | | |

:::::: BIT ::::::

చరణం

ఆమె    ఏదో ఏదో కోరికా..ఏర్రై పొంగెలే యికా...
అతడు    ఎగాదిగా కూడికా...ఎంతో హాయి వేడుకా..
ఆమె    ఆహా...ఇది ఊహా...ఎద స్వాహా...నవమోహనా...
అతడు    దాచుకున్న సోకులే..దారికాచి దోచనా...
ఆమె    కొంటెకూత కూసినా....రేయే జారనీయకూ...
అతడు    హత్తుకో మెత్తగా కొత్త కొత్త మత్తుతో...ఓఓఓ...
ఆమె    కొత్త పిట్టరో కో...కో...    అతడు : చక్కిరి బిక్కిరి చక్క

Contd...

| | | |
|---|---|---|
| ఆమె | చక్కాగుందీ చూస్కో... | అతడు: టక్కున చిక్కవె చక్క |
| ఆమె | జట్టు కట్టగా లాక్కో... | అతడు: చప్పున చేరవె చక్క |
| ఆమె | కాకాపట్టీ కాస్కో... | అతడు: దక్కవె దాల్చిన చక్క |
| ఆమె | నొక్కుల చెక్కిలిపైనా... | అతడు: టెక్కుల నిక్కుల చుక్క |
| ఆమె | చక్కని మక్కువలోనా... | అతడు: చిక్కిన గంధపు చక్క |
| ఆమె | దక్కన శిల్పము చెక్కుకో... | ఓ..ఓ...ఓ.. |
| ఆమె | కొత్త పిట్టరో కో...కో... | అతడు: చక్కిరి బిక్కిరి చక్క |
| ఆమె | చక్కాగుందీ చూస్కో...ఓ..ఓ..ఓ... | |

:::::: BIT :::::

చరణం

ఆమె లాలలలల్ల లాలలా..లాలలలల్ల...లాలలా...లాలలలల్ల...లాలలా...
లాలలలల్ల..లాలలా...లాలలలల్లా...లాలలలల్లా...(Bit)
జాజిపూల తోటలో...జారేనోయి పయ్యెదా...
అతడు చిత్రమైన భాషలో...చెప్పేసింది నీసొదా...
ఆమె రానా..ఒడిలోన...నెరజాణై పెనవేయనా
అతడు ఒక్కసారి చాలునా..వన్నెలాడి లాలనా..
ఆమె తొందరైతె తీరునా...బంధాలేయు మోహనా...
అతడు చుట్టుకో చుట్టమై పిట్ట ముద్దు పెట్టగా...ఆ...ఒయ్...
ఒయ్...ఒయ్...ఒయ్...ఒయ్...ఒయ్...ఒయ్...

| | | |
|---|---|---|
| | పక్కపక్కకీ లాక్కో... | ఆమె : ఇక్కడికిక్కడి చిక్క |
| అతడు | తస్సా చెక్కా కాస్కో.. | ఆమె : ఒక్కటికొక్కటీ లెక్క |
| అతడు | తిక్క ఎక్కెనా చూస్కో.. | ఆమె : చక్కెర విందికి మొక్క |
| అతడు | బుగ్గా బుగ్గా రాస్కో... | ఆమె : మిక్కిలి ఎక్కువ చొక్క |
| అతడు | చక్కిలి గింతలలోన.. | ఆమె : ఎక్కడి కక్కడ చిక్కి |
| అతడు | తక్కిన వింతలలోన.. | ఆమె : ఒక్కరి కొక్కరు దక్కి |
| అతడు | మన్మథ బుక్కులు పాడుకో... | ఓ..ఓ..ఓ.. |
| | పక్క పక్కకీ లాక్కో... | ఆమె : ఇక్కడికిక్కడి చిక్క |
| అతడు | తస్సా చెక్కా కాస్కో...ఓ..ఓ..ఓ..హో...హో...హో...హో... | |

★★★

# డిటెక్టివ్ నారద (1992)

రచన : **వంశీ, పింగళి** గానం : **బాలు, చిత్ర**

:::::: Opening Music ::::::

పల్లవి

ఇద్దరు చిక్ చిక్ (Bit) చిక్ చిక్ చిక్ (Bit) చిక్ చిక్ (Bit)
చిక్ చిక్ చిక్ (Bit) చిం చిం హాయ్ హాయ్
చిం చిం హోయ్ హోయ్...చిం చిం హాయ్ హాయ్...
చిం చిం హోయ్ హోయ్...చిం...చిం...చిం...చిం...

ఆమె యవ్వనాల పువ్వులన్ని నవ్వుతున్న తోటలో...
ప్రేమయాత్ర చేద్దామా...హాఁహో..హాఁ...హాఁ...

అతడు ప్రేమయాత్రలకు బృందావనము నందనవనము ఏలనో...

ఆమె వేడిముద్దు అద్దుకున్న లేత పొద్దులో...ఆ..సోయగాల
స్వర్గసీమ రాసి యివ్వవా...

అతడు కులుకులొలుకు చెలి చెంతనుండగా వేరే స్వర్గము ఏలనో...

ఆమె అహహ...అహహాహో...

అతడు కులుకులొలుకు చెలి చెంతనుండగా వేరే స్వర్గము ఏలనో...

ఆమె యవ్వనాల పువ్వులన్ని నవ్వుతున్న తోటలో...
ప్రేమయాత్ర చేద్దామా...హాఁహో..హాఁ...హాఁ...

అతడు ప్రేమయాత్రలకు బృందావనము నందనవనము ఏలనో...

:::::: BIT :::::

చరణం

ఇద్దరు చిక్ చిక్ (Bit) చిక్ చిక్ చిక్ (Bit) చిక్ చిక్ (Bit)
చిక్ చిక్ చిక్ (Bit) చిం చిం హాయ్ హాయ్
చిం చిం హోయ్ హోయ్...చిం చిం హాయ్ హాయ్...
చిం చిం హోయ్ హోయ్...చిం...చిం...చిం...చిం...

ఆమె జవ్వనాలు గిల్లుకున్న వన్నెలమ్మకి...ఆ..వెన్నెలమ్మ జాడ చెప్పవా...

అతడు చెలినగుమోమే చంద్రబింబమై పగలే వెన్నెల కాయగా

ఆమె హ్హా హ్హా హ్హా హ్హా హ్హా అతడు : హ్హా హ్హా హ్హా

ఆమె ఆ...హ్హా హ్హా హ్హా హ్హా

Contd...

అతడు చెలినగుమోమే చంద్రబింబమై పగలే వెన్నెల కాయగా...
ఆమె వెన్నెల పొదలో..మల్లెల గుడిలో...విరహంతో సఖి రగలాలా..
అతడు సఖినెరిచూపుల చల్లదనంతో జగములె ఊటీ శాయగా...
ఆమె యవ్వనాల పువ్వులన్ని నవ్వుతున్న తోటలో...
ప్రేమయాత్ర చేద్దామా...హాంహో..హోం...హోం...
అతడు ప్రేమయాత్రలకు బృందావనము నందనవనము ఏలనో...

:::::: BIT ::::

చరణం

ఇద్దరు చిక్ చిక్ (Bit) చిక్ చిక్ చిక్ (Bit) చిక్ చిక్ (Bit)
చిక్ చిక్ చిక్ (Bit) చిం చిం హాయ్ హాయ్
చిం చిం హోయ్ హోయ్...చిం చిం హాయ్ హాయ్...
చిం చిం హోయ్ హోయ్...చిం...చిం...చిం...చిం...
ఆమె కన్నె ప్రేమలేని లేతకన్నె గువ్వకీ..నీకున్న ప్రేమ దోచిపెట్టవా...
అతడు కన్నవారినే మరువజేయుచూ అన్ని ముచ్చటలు తీర్చనా...
హ్హా హ్హా హ్హో హ్హా హ్హో ఆమె : హ్హా హ్హా హ్హా
అతడు ఆ...హ్హా హ్హా హ్హా హ్హో...
కన్నవారినే మరువజేయుచూ అన్ని ముచ్చటలు తీర్చనా...
ఆమె ఊసుల ఒడిలో...ఊహల చెలికే...ఊపిరులై..నీ ఆదరణే..
అతడు సతి ఆదరణే పతికి మోక్షమని సర్వ శాస్త్రములు చాటగా...
యవ్వనాల పువ్వులన్ని నవ్వుతున్న తోటలో...
ప్రేమయాత్ర చేద్దామా...హ్హా హ్హా హ్హా హ్హో...
ఆమె ప్రేమయాత్రలకు బృందావనము నందనవనము ఏలనో...
అతడు వేడిముద్దు అద్దుకున్న లేత పొద్దులో...ఆ...సోయగాల
స్వర్గసీమ రాసి యివ్వవా...
ఆమె కులుకులొలుకు చెలి చెంతనుండగా వేరే స్వర్గము ఏలనో...
అతడు అహహా...అహహాహో...
కులుకులొలుకు చెలి చెంతనుండగా వేరే స్వర్గము ఏలనో...
ఆమె యవ్వనాల పువ్వులన్ని నవ్వుతున్న తోటలో...
ప్రేమయాత్ర చేద్దామా...హాంహో..హోం...హోం...
ఇద్దరు ప్రేమయాత్రలకు బృందావనము నందనవనము ఏలనో...

★★★

# చక్రవ్యూహం (1992)

రచన : **వేటూరి** గానం : **బాలు, చిత్ర**

:::::: Opening Music ::::::

పల్లవి

అతడు ఆశలు పూసే..ఆమనిలో...
ఆమె అల్లుకుపోయే...ప్రేమలలో..
అతడు నీ అందం చందం... }॥2॥
ఆమె అరె...చం...చం...చం...చం...
అతడు అరె... ఏమిదాహామో....అది ఎంత గాఢమైనదో...
ఆమె ఆశలు పూసే...ఆమనిలో... (Bit)
అతడు అల్లుకు పోయే ప్రేమలలో

:::::: BIT :::::

చరణం

ఆమె కనులే పిలిచి...కలలే నిలిచి..
కలిపే కథలో...మెరిసే హృదయం...
అతడు వలపే మధురం...వయసే మధురం..
బ్రతుకూ...పరువం...జతలో....మధురం...
ఆమె ఈచైత్రమాసం...పూలారబోసే...
శృంగార భావాల నీడలలో..
అతడు ఓ ప్రేమగీతం...రాగాలు తీసే..
ఈ జంట ప్రాణాల కౌగిళ్లలో...
ఆమె ఆశలు పూసే....ఆమనిలో... (Bit)
అతడు అల్లుకుపోయే...ప్రేమలలో

:::::: BIT :::::

చరణం

అతడు నా వేణుగానం...మంజీర గీతం...
పూయించె నీలో..శ్రీపారిజాతం...
ఆమె జయదేవుడిలో...ప్రియభావనగా...
పలికే శ్రుతిలో....ఒణికే అధరం...

Contd...

అతడు ఆ జన్మబంధం...దారాలు తీస్తే
క్రీగంటి గానాల పల్లవిలో...
ఆమె ఆకాశమైనా...వేదాలు పాడే...
అందాల గంధాల సందిళ్లలో...
అతడు ఆశలు పూచే... ఆమనిలో...
ఆమె అల్లుకుపోయే...ప్రేమలలో
అతడు నీ అందం చందం...
ఆమె అరె...చం...చం...చం...చం... } ॥2॥
అతడు అహ ఏమిదాహమో....అది ఎంత గాఢమైనదో...
ఆమె ఆశలు పూసే...ఆమనిలో...(Bit)
అతడు అల్లుకు పోయే ప్రేమలలో

★★★



# కిల్లర్ (1992)

రచన : **వేటూరి** గానం : **బాలు, చిత్ర**

పల్లవి

ఆమె ఉక్కిరి బిక్కిరి చక్కిలి గింతల కిల్లర్ (Bit)
మిస్సుకు నచ్చిన కిస్సుల గిచ్చుడు లవ్వర్ (Bit)
అహోహోఆఅ...అహోహోఆఅ...అహహోహోహో... (Bit)
ఉక్కిరి బిక్కిరి చక్కిలి గింతల కిల్లర్ (Bit)
ఈ మిస్సుకు నచ్చిన కిస్సుల గిచ్చుడు లవ్వర్ (Bit)

అతడు ఒక ఆటా...(Bit) ఆడిస్తా (Bit) ఒడిలోనే...(Bit) ఓడిస్తా (Bit)

ఆమె ఓయ్...నువ్వేనా కిల్లర్ (Bit)

అతడు హో...మై నేమ్ ఈజ్ ఈశ్వర్ (Bit)

ఆమె ఆయ్! నువ్వే నా కిల్లర్ (Bit)

అతడు మై నేమ్ ఈజ్ ఈశ్వర్ (Bit)

ఆమె ఉక్కిరి బిక్కిరి చక్కిలి గింతల కిల్లర్ (Bit)

అతడు ఈ మిస్సుకు నచ్చిన కిస్సుల గిచ్చుడు లవ్వర్

:::::: BIT :::::

చరణం

అతడు నా జీవితం... ఇది ఓ నాటకం...విధితో...విధిగా పోరాటం
నా సంతకం..యమప్రాణాంతకం...విలనే అననీ ఈ లోకం
యముడికి పాశం తగిలించే మొనగాడినీ..
మదనుడి బాణం విరిచేసే మగవాడినీ...

ఆమె అదిసరి నీ పని సరి లే చెలిదరిలో...
యూ ఆర్ మై లవ్ కింగ్...(Bit) } ॥2॥

అతడు ఐ హావ్ ఎ లైకింగ్..(Bit)

ఆమె ఆటల్లో పాటల్లో నవ్వించి కవ్వించు అంకుల్ (Bit)
ఊఁకొట్టి జోకొట్టి ఊరెళ్లిపోతాడు ట్వింకిల్ (Bit)
అందుతున్నా...మేనమామా...అందగానే చందమామా
యూ ఆర్ మై లవ్వర్ (Bit)

అతడు మై నేమ్ ఈజ్ ఈశ్వర్ (Bit)

Contd...

ఆమె ఓ...యూ ఆర్ మై లవ్వర్ (Bit)
అతడు మై నేమ్ ఈజ్ ఈశ్వర్ ..

:::::: BIT :::::

చరణం

అతడు నా డాన్సులో...తొలి రోమాన్సులో...
ఆమె జతినీ...రతినీ నేనంటా..
అతడు నా వేటలో..చలి సయ్యాటలో...
ఆమె ఎరనై...ఎదటే నేనుంటా
అతడు నెమలికి ఫించం పురివిప్పే నటరాజునీ
రమణికి అందం పులకించే రసరాజునీ...
ఆమె కథకళిలో...మణిపురిలో...కలయికలో...
నీ సోపే వింటర్ (Bit)
అతడు నా ముద్దే కౌంటర్ (Bit)
ఆమె ఓ! నీ సోపే వింటర్ (Bit)
అతడు నా ముద్దే కౌంటర్ (Bit)
ఆమె ఉక్కిరి బిక్కిరి చక్కిలి గింతల కిల్లర్ (Bit) (అతడు :యా)
ఈ మిస్సుకు నచ్చిన కిస్సుల గిచ్చుడు లవ్వర్ (Bit)
అతడు (నవ్వు)..ఒక ఆటా...ఆడిస్తా (Bit) ఒడిలోనే...ఓడిస్తా (Bit)
ఆమె అయ్! నువ్వే నా కిల్లర్ (Bit)
అతడు మై నేమ్ ఈజ్ ఈశ్వర్ (Bit)
ఆమె ఓయ్! నువ్వే నా కిల్లర్ (Bit)
అతడు హాయ్! మై నేమ్ ఈజ్ ఈశ్వర్ (Bit)
ఆమె ఉక్కిరి బిక్కిరి చక్కిలి గింతల కిల్లర్ (Bit)
అతడు ఈ మిస్సుకు నచ్చిన కిస్సుల గిచ్చుడు లవ్వర్ (Bit)

★★★

## కిల్లర్ (1992)

రచన : **వేటూరి** గానం : **మనో, చిత్ర, బృందం**

:::::: Opening Music ::::::

పల్లవి

అతడు ప్రియా ప్రియతమా రాగాలూ... సఖీ కుశలమా అందాలు
ప్రియా ప్రియతమా రాగాలూ... సఖీ కుశలమా అందాలు
నీ లయ పంచుకుంటుంటే...నా శ్రుతి మించిపోతుంటే
నాలో...రేగే..ప్రియా ప్రియతమా రాగాలూ ..సఖీ కుశలమా అందాలు
ప్రియా ప్రియతమా రాగాలూ సఖీ కుశలమా అందాలూ

:::::: BIT ::::::

చరణం

బృందం లలల లల్లాల (Bit)...లలల లలల్ల (Bit) లలల లల్లాల (Bit)
తారత్త తారత్త తారత్త తారత్త తారత్త..తా...(Bit)

అతడు జగాలు లేని సీమలో...యుగాలు దాటే ప్రేమలూ

ఆమె పెదాల మూగ పాటలో...పదాలు పాడే ఆశలూ...

అతడు ఎవరులేనీ మనసులో...ఎదురురావే...నాచెలీ

ఆమె అడుగు జారే వయసులో...అడిగి చూడూ కౌగిలీ

అతడు ఒకే వసంతం...కుహూ నినాదం...నీలో నాలో పలికే

ఆమె ప్రియా ప్రియతమా రాగాలూ

అతడు సఖీ కుశలమా అందాలూ

ఆమె నీ... లయ పంచుకుంటుంటే...

అతడు నా... శ్రుతి మించిపోతుంటే

ఆమె నాలోరేగే...ప్రియా ప్రియతమా రాగాలూ ...

అతడు సఖీ...కుశలమా అందాలూ...

:::::: BIT ::::::

చరణం

ఆమె శరత్తులోన వెన్నెలా....తలెత్తుకుంది కన్నులా...

అతడు షికారు చేసే కోకిలా...పుకారు వేసే కాకిలా..

ఆమె ఎవరు ఎంత వగచినా...చిగురు వేసే కోరికా

అతడు నింగితానే విడిచినా...ఇలకు రాదూ తారకా..

ఆమె మదే ప్రపంచం...విధే విలాసం..నిన్ను నన్ను కలిపే...

అతడు ప్రియా ప్రియతమా రాగాలూ ...సఖీ కుశలమా అందాలు ॥2॥
నీ..లయ పంచుకుంటుంటే...నా...శ్రుతి మించిపోతుంటే...నాలో రేగే

బృందం ప్రియా ప్రియతమా రాగాలూ... సఖీ కుశలమా అందాలూ... ॥2॥

★★★

## కిల్లర్ (1992)

రచన : **వేటూరి** గానం : **జానకి**

పల్లవి ఓఒఒఓ...ఓఒఒఓ...ఓఒఒఓ...ఓఒఒఓ...(Bit)
పిలిచే కుహుకుహు వయసే...పలికే తహతహ మనసే (Bit)
పిలిచే కుహుకుహు వయసే(Bit)...పలికే తహతహ మనసే (Bit)
ఒళ్లే ఉయ్యాలగ ఊగిందిలే..ఒళ్లో తాపాలను రేపిందిలే..
ఓఒఒఓ...ఓఒఒఓ...ఓఒఒఓ...ఓఒఒఓ...ఓ
పిలిచే కుహుకుహు వయసే(Bit)...పలికే తహతహ మనసే

:::::: BIT ::::::

చరణం చురుక్కుమంటూ..కొరుక్కుతింటూ...చురచురమనే సూరీడూ
కలుక్కుమంటూ...తళుక్కుమంటూ.ససేమిరా అనే నా ఈడూ
అదేవిటో గానీ...తడే తమాషా..చలెందుకో గానీ భలే కులాసా
ఓ..వయ్యారాలే ఓణీ వేసే..
పిలిచే కుహుకుహు వయసే(Bit)...పలికే తహతహ మనసే

:::::: BIT ::::::

చరణం పదాల తాళం..పెదాల రాగం...తనువులో లయే ఝుమ్మందీ...
కిలాడి ప్రాయం...చలాకి గేయం...పదపద సరే లెమ్మందీ...
అదేవిటో గానీ...కలే నిజంలా...మనస్సుతో పేచీ...మజామజాగా...
ఓహో...ఓఓ గాలే నాలో ఈలే వేసే...
పిలిచే కుహుకుహు వయసే(Bit)...పలికే తహతహ మనసే
ఒళ్లే ఉయ్యాలగ ఊగిందిలే..ఒళ్లో తాపాలను రేపిందిలే..
ఓఒఒఓ...ఓఒఒఓ...ఓఒఒఓ...ఓఒఒఓ...
పిలిచే కుహుకుహు వయసే(Bit)...పలికే తహతహ మనసే

★★★

## కిల్లర్ (1992)

రచన : **వేటూరి** గానం : **బాలు, జానకి**

పల్లవి

అతడు (ఆలాపనతో) ఉహూం ఉహూ ఉహూ...ఊహుహు
హుహుహుహూహూం...ఉహూం
ఉహూం ఊహూం...ఊహుహుం హూహూహుహూం...(Bit)
సిందూరపూ పూదోటలో...చిన్నారి ఓ పాపా...
ఏపాపమో...అతోటలో...వేసిందిలే...పాగా...
ఏమనినే...నే పాడనులే...ప్రేమకుతానోడెనులే..
ఆకథ ఎందుకులే..
సిందూరపూ పూదోటలో...చిన్నారి ఓ పాపా...

:::::: BIT :::::

చరణం

అతడు కనులే..కథలల్లే..కనుపాపే..నా బొమ్మగా...(Bit)
మనసే...తెరతీసే..పసిపాపే...మా అమ్మగా...(Bit)
రగులు పగలు కాసే...చల్లనివెన్నెల కాగా...
చిలక పలకగానే..గూటికి గుండెలు మోగా...
విధిచదరంగంలో...విషరణరంగంలో...
గెలవలేని ఆటే ఎన్నడు పాడని పాటా...
సిందూరపూ పూదోటలో...చిన్నారి ఓ పాపా...
ఏపాపమో...ఆతోటలో...వేసిందిలే...పాగా...

:::::: BIT :::::

చరణం

ఆమె రాబందేకాదా...ఆ రామయ్యకు బంధువూ...(Bit)
సీతమ్మను విరహాలే...దాటించిన సేతువూ...(Bit)
కోవెల చేరినదీపం...దేవుడి హారతి కాదా..
చీకటి మూగినచోటే...వేకువ వెన్నెల రాదా...
ఈతడు మాతోడై...ఈశ్వరుడే నీడై...

Contd...

కలసివుంటే చాలూ..వేయి వసంతాలూ..
సిందూరపూ పూదోటలో...చిన్నారి ఓ పాపా...
పాప అంటే మాతోటలో...లేదండిలే...జాగా...

అతడు నే...ఏమనినే...పాడనులే...ప్రేమకుతానోడెనులే..
ఆకథ ఎందుకులే..
సిందూరపూ పూదోటలో...చిన్నారి ఓ పాపా...
ఏపాపమో...ఆతోటలో...వేసిందిలే...పాగా...

★★★




## మీకు తెలుసా?

చంటి (1992) చిత్రంలో "ఓప్రేమా...నాప్రేమా...ప్రేమిస్తే చావేనా", "ఎన్నెన్నో అందాలూ...ఏవేవో రాగాలూ" అనే వేటూరి రాసిన రెండుపాటలు ఒకే రాగంలో వుంటాయి. అలాగే, "జాబిలికీ...వెన్నెలకీ పుట్టిన పున్నమిలే", "పావురానికీ పంజరానికీ పెళ్లిచేసె పాడులోకం", అనే మరో రెండు పాటలు కూడా యించుమించు ఒకేరాగంలోనే వుంటాయి. ఈ నాలుగు పాటలు వేటికవే బహుజనాదరణ పొందడానికి ఇళయరాజా ఇచ్చిన వైవిధ్యభరిత నేపథ్య సంగీత సంగతులే కారణం అని చెప్పవచ్చు.

# కిల్లర్ (1992)

రచన : **వేటూరి** గానం : **బాలు, జానకి**

:::::: Opening Music ::::::

పల్లవి

ఆమె ఓరబ్బీ ఏందెబ్బా కందిపోయే అందమంతా...
ఒయ్యారీ ఒళ్లు కాస్త తుళ్లిపడ్డ కౌగిలింతా... } ॥2॥

అతడు పెదవిలో పెరిగిన పెరపెరలే...
నడుములో కదిలిన తకధిమలై...
వయసుతో వయసుకు ముడిపడెలే...
బిగువులో బిడియము ముదిరెనులే...

ఆమె ఓరబ్బీ ఏందెబ్బా కందిపోయే అందమంతా...
ఒయ్యారీ ఒళ్లు కాస్త తుళ్లిపడ్డ కౌగిలింతా...

:::::: BIT :::::

చరణం

ఆమె నువ్వే ఎగబడితె...నేనే కలబడితె మోతగా...మోజుగా...

అతడు చెయ్యే తడమగనె...చెంగే తడబడినె లేతగా...లేసుగా...(Bit)

ఆమె నిన్నే ఉసిగొలుపు..కన్నే తొలివలపు కొత్తగా...ఉందిగా...

అతడు నీలో ఒడిదుడుకు...నాలో కసిఉడుకు మొత్తమే...నీదిగా..(Bit)

ఆమె ఎదాఎదా ఏకం కాగా...పెదాలకోపాకంరాగా...

అతడు లడాయితే మనసులకే...బడాయిపద్దే పరువంలో హోయ్!

ఆమె ఓరబ్బీ ఏందెబ్బా కందిపోయే అందమంతా...
ఒయ్యారీ ఒళ్లు కాస్త తుళ్లిపడ్డ కౌగిలింతా...

అతడు పెదవిలో పెరిగిన పెరపెరలే...
నడుములో కదిలిన తకధిమలై...
వయసుతో వయసుకు ముడివడెలే...
బిగువులో బిడియము ముదిరెనులే...

ఆమె ఓరబ్బీ ఏందెబ్బా కందిపోయే అందమంతా...
ఒయ్యారీ ఒళ్లు కాస్త తుళ్లిపడ్డ కౌగిలింతా...

:::::: BIT :::::

Contd...

చరణం

| | |
|---|---|
| అతడు | ఎన్నో గుసగుసలు విన్నా మిసమిసల సోకులో...షాకులో |
| ఆమె | ఒళ్లో కసకస పనల్లో కిసకిసలు చూచుకో...దాచుకో..(Bit) |
| అతడు | తప్పో...తగనిపని గొప్పో...జరిగినది మత్తులో...మాయలో |
| ఆమె | లప్పో...ఉడుకుడుకు చప్పో...అదుగుమరి మెల్లగా...పిల్లగో.. |
| అతడు | జతజతా జిందాబాదు..కథేయిక కంచేపోదు |
| ఆమె | తుఫానులే..వయసులలో...దఫాలవారీ దరువుల్లో.. |
| అతడు | ఆయ్! |
| ఆమె | ఓరబ్బీ ఏందెబ్బా కందిపోయే అందమంతా...<br>ఒయ్యారీ ఒళ్లు కాస్త తుళ్లిపడ్డ కౌగిలింతా... |
| అతడు | పెదవిలో పెరిగిన పెరపెరలే... |
| ఆమె | హ్హా.. |
| అతడు | నడుములో కదిలిన తకధిమలై... |
| ఆమె | హ్హా.. |
| అతడు | వయసుతో వయసుకు ముడిబడెలే... |
| ఆమె | (నవ్వు) అహాఁ... |
| అతడు | బిగువులో బిడియము ముదిరెనులే... |
| ఆమె | ఓరబ్బీ ఏందెబ్బా కందిపోయే అందమంతా...<br>ఒయ్యారీ ఒళ్లు కాస్త తుళ్లిపడ్డ కౌగిలింతా... |

★★★

## మీకు తెలుసా?

2005లో ఇళయరాజా రాయల్ ఫిలార్మోనిక్ ఆర్కెస్ట్రా వారికోసం ప్రాచీన తమిళ సంప్రదాయ సాహిత్యం నేపథ్యంగా "తిరువాసగమ్" పేరుతో సింఫనీ నిర్వహించి ఆల్బమ్‌గా విడుదలచేశారు. బుడాపెస్ట్ సింఫనీ ఆర్కెస్ట్రా కళాకారులు ఈ సింఫనీకి సహకరించారు. ఆస్కార్ పురస్కార గ్రహీత, ప్రసిద్ధ హాలీవుడ్ గీతరచయిత స్టీఫెన్ షెవార్ట్జ్, ఐదుసార్లు ప్రసిద్ధ గ్రామీ పురస్కారం అందుకున్న సౌండ్ ఇంజనీర్ రిచర్డ్ కింగ్ తదితరులతో కూడిన సంగీత విద్వాంసుల బృందం ఈ సింఫనీలో పాల్గొన్నారు. ప్రాచీన తమిళ సంప్రదాయ ఆధ్యాత్మికతను ప్రచారం చేసేందుకే యీ సంఫనీ నిర్వహించినట్లు ఇళయరాజా తెలియజేశారు.

# చంటి (1992)

రచన : **వేటూరి** గానం : చిత్ర

పల్లవి

ఓ ప్రేమా (Long Bit) నా ప్రేమా (Long Bit)
దైవాలాడే జూదం (Bit) దయ్యంపాడే వేదం (Bit)
ఓ ప్రేమా...నా ప్రేమా...ప్రేమిస్తే...చావేనా...
దైవాలాడే జూదం దయ్యంపాడే వేదం
రక్తంలోని సుడిగుండం...రాయైపోయే అనుబంధం
ఓ ప్రేమా...నాప్రేమా...ప్రేమిస్తే...చావేనా...

:::::: BIT :::::

చరణం

క్షణమొక యుగముగ గడిపిన బ్రతుకిది తెలుసుకో ప్రియతమా
చిరమని సుఖమని కలయిక కలయని తలచుటే మధురమా
మృతులకు చితులకు ముగియని కథయిది కదలిరా ప్రణయమా
అడుగులు చిలికిన రుధిరపు మడుగుల ఎరుపులే ప్రళయమా
జారిపోయేకాలం...చేజారిపోయే యోగం
రగులుతున్న గాయం...నేనడగలేను న్యాయం
కరువౌతాను కన్నుల్లో...గురుతుంటాను గుండెల్లో
ఓ ప్రేమా...నా ప్రేమా...ప్రేమిస్తే..చావేనా...(Bit)
దైవాలాడే జూదం దయ్యంపాడే వేదం
రక్తంలోని సుడిగుండం...రాయైపోయే అనుబంధం
ఓ ప్రేమా...నాప్రేమా...ప్రేమిస్తే...చావేనా...
ఆ..ఆ..ఆ..ఆ..ఆ..(Bit) ఆ..ఆ..ఆ..ఆ..ఆ..(Bit)
ఆ..ఆ..ఆ..ఆ..ఆ..ఆ..ఆ..ఆ..

::::: BIT :::::

Contd...

చరణం

గిరులను విడిచిన నదులిక వెనుకకు తిరుగునా జగమున
కులమని కడుగని కులమని విలువలు చెరుగునా మనసున
గగనపు మెరుపుల నగలను తొడిగితె ఘనతలే పెరుగునా
ఉరుములు వినపడి ఉదయపు వెలుగులు అదురునా చెదురునా
పేదవాళ్లప్రేమా...కాటువేసే పాముా...
స్వాగతాలు అనగా...చావుకైనా ప్రేమా..
మానై నేను బ్రతికున్నా...మనిషై నేను చస్తున్నా...
ఓ ప్రేమా...నా ప్రేమా...ప్రేమిస్తే...చావేనా...
దైవాలాడే జూదం దయ్యంపాడే వేదం
రక్తంలోని సుడిగుండం...రాయైపోయే అనుబంధం
ఓ ప్రేమా...నాప్రేమా...ప్రేమిస్తే...చావేనా...

★★★



## చంటి (1992)

రచన : **వేటూరి** గానం : **బాలు, చిత్ర**

:::::: Opening Music ::::::

పల్లవి

ఆమె ఎన్నెన్నో...అందాలూ...ఏవేవో...రాగాలూ...
వేసే పూలబాణం...పూసే గాలి గంధం...
పొద్దేలేని ఆకాశం...హద్దేలేని ఆనందం
ఎన్నెన్నో...అందాలూ...ఏవేవో...రాగాలూ...

:::::: BIT :::::

చరణం

అతడు సిరిగల చిలకలు ఇలదిగి నడుచుట న్యాయమా..ధర్మమా...
ఆమె తొలకరి మెరుపులు చిలికిన చినుకులు నింగిలో ఆగునా...
అతడు చలిమర గదులలో సుఖపడు బతుకులు వేసవే కోరునా...
ఆమె అలికిన గుడిసెల చలువల మనసులు నీడలో దొరుకునా...
అతడు అందాల మేడల్లోనే అంటదు కాలికి మన్ను
ఆమె బంగారు పంటలు పండే మన్నుకు చాలదు మిన్నూ
అతడు నిరుపేదిల్లు పొదరిల్లూ...
ఆమె ఇలలో వున్న హరివిల్లూ...
అతడు ఎన్నెన్నో...అందాలూ...ఏవేవో...రాగాలూ...
వేసే పూలబాణం...పూసే గాలి గంధం...
పొద్దేలేని ఆకాశం...హద్దేలేని ఆనందం
ఎన్నెన్నో...అందాలూ...ఏవేవో...రాగాలూ...

:::::: BIT :::::

చరణం

ఆమె జలజల పదముల అలజడి నదులకు వంత నే పాడనా
అతడు మిలమిల మెరిసిన తళతళ తారలు నింగినే వీడునా
ఆమె చెరువుల కడుపున విరిసిన తామర తేనెలే పూయునా

Contd...

| | |
|---|---|
| అతడు | మిణుగురు పురుగుల మిడిమిడి వెలుగులు వెన్నెలే కాయునా |
| ఆమె | ఈ గాలిమేడల్లోనా దీపంలా నేవున్నా |
| అతడు | మాపల్లె సింగారాలు నీలో నేనే కన్నా |
| ఆమె | గోదారమ్మ పరవళ్లూ... |
| అతడు | ఎలుగింటమ్మ తిరునాళ్లూ... |
| ఆమె | ఎన్నెన్నో...అందాలూ...ఏవేవో...రాగాలూ... |
| అతడు | వేసే పూలబాణం...పూసే గాలి గంధం... |
| ఆమె | పొద్దేలేని ఆకాశం...హద్దేలేని ఆనందం |
| అతడు | ఎన్నెన్నో...అందాలూ... |
| ఆమె | ఏవేవో...రాగాలూ... |

★★★

## మీకు తెలుసా?

"సన్నజాజి పడకా...మంచెకాడ పడకా" (క్షత్రియపుత్రుడు-1992) పాటకు యస్.డి. బర్మన్ స్వరపరిచిన "ఏ దిల్ దివానాహై.. దిల్‌తో దివానాహై.. దీవానా దిల్‌హై...దిల్ దీవానా" (ఇష్క్‌పర్ జోర్‌నహీం 1970) అనే పాట ప్రేరణ. ఈ పాటలో "బే చైన్ రెహతాహై...ఛుప్‌కేసె కెహతాహై..ముఝ్‌కో ధదక్‌నేదో...షోలా భడక్‌నేదో..." అనే చరణాన్ని ప్రేరణగా తీసుకొని "కొండామల్లి పువ్వులన్నీ... గుండెల్లోని నవ్వులన్నీ...దండేకట్టి కాచుకున్నా...నీ కొరకే" అంటూ పాటని మలిచారు ఇళయరాజా. కానీ, ఈ పాట పల్లవికీ... హిందీ పాట పల్లవికి ఎలాంటి పోలికే వుండదు. ఇళయరాజా గురించి బాలు మాట్లాడుతూ "యస్.డి. బర్మన్, ఆర్.డి. బర్మన్‌లతో పాటు సి. రామచంద్ర, సలీల్‌చౌదరి, రోషన్, మదన్ మోహన్‌ల సంగీతం ఇళయరాజాకు చాలా ఇష్టమని, వారి సరసన నిలవగలిగే అర్హత రాజాకు ఉంద"ని చెప్పారు.

## చంటి (1992)

రచన : **సాహితి** గానం : **బాలు**

:::::: Opening Bit ::::::

పల్లవి జాబిలికీ వెన్నెలకీ పుట్టిన పున్నమిలే (Bit)
గంగలలో తేనెలలో కడిగిన ముత్యములే (Bit)
ముద్దులోనే...పొద్దుపోయే...కంటినిండా నిదరోవె..
చంటి పాడే జోలలోనే...
జాబిలికీ వెన్నెలకీ పుట్టిన పున్నమిలే (Bit)
గంగలలో... తేనెలలో... కడిగిన ముత్యములే

:::::: BIT ::::::

చరణం

కన్నతల్లి ప్రేమకన్నా అన్నమేది పాపలకీ
అమ్మ ముద్దుకన్న వేరే... ముద్దలేదు ఆకలికీ } ॥2॥
దేవతంటి అమ్మనీడే...కోవెలే బిడ్డలకీ
చెమ్మగిల్లు బిడ్డకన్నే...ఏడుపే అమ్మలకీ
అమ్మచేతి కమ్మనైన...దెబ్బ కూడ దీవెనా
బువ్వ పెట్టి బుజ్జగించే...లాలనెంతో తీయనా
మంచుకన్నా చల్లనైనా...మల్లెకన్నా తెల్లనైనా
అమ్మపాటే పాడుకోనా
మల్లెకన్నా తెల్లనైనా అమ్మపాటే పాడుకోనా ॥2॥

:::::: BIT ::::::

## చంటి (1992)

రచన : **సాహితి** గానం : **చిత్ర**

:::::: Opening Bit ::::::

పల్లవి

జాబిలికీ వెన్నెలకీ పుట్టిన పున్నమిలే (Bit)
గంగలలో తేనెలలో కడిగిన ముత్యములే (Bit)

Contd...

ముద్దులోనే...పొద్దుపోయే...కంటినిండా నిదరోవె...
చంటి పాదే జోలలోనే...
జాబిలికీ వెన్నెలకీ పుట్టిన పున్నమిలే (Bit)
గంగలలో... తేనెలలో... కడిగిన ముత్యములే

:::::: BIT ::::::

చరణం

వేమనయ్య నాగురువే... వేలిముద్ర నా చదువే
పాలబువ్వ నాపలుకే...హాయి నిద్ర పాపలకీ } ॥2॥
కూనలమ్మ నాపదమే...తేనె కన్న తియ్యనిదీ
కోనలన్ని పాడుకునే...గువ్వ చిన్న పాటయిదీ
రాగములు...తాళములూ నాకసలే రావులే
పాడుకొను జ్ఞానమునే..నా కొసగే దైవమే
ముద్దులోనే...పొద్దుపోయే...కంటినిండా నిదరోవె..
చంటి పాదే జోలలోనే...
జాబిలికీ వెన్నెలకీ పుట్టిన పున్నమిలే
గంగలలో... తేనెలలో... కడిగిన ముత్యములే

★★★

## మీకు తెలుసా?

ఎల్లోరా మూవీక్లబ్ సంస్థ ఇళయరాజా సంగీత దర్శకత్వంలో 'అజంతా' చిత్రాన్ని నాలుగు దక్షిణ భారత భాషల్లో నిర్మించనుంది. ఇళయరాజా దివంగత సోదరుడు పావలర్ వరదరాజన్ వర్ధంతి సందర్భంగా తమిళ వర్షన్ ఆడియోని ఇటీవల విడుదల చేశారు. ఈ చిత్రంకోసం నాలుగు దక్షిణభారత భాషల్లో మొత్తం 36 పాటల్ని రాజా స్వరపరిచారు. ఒకే చిత్రంకోసం వివిధ భాషల్లో ఇన్నిపాటలు రావడం ఒక రికార్డు. తెలుగు 'అజంతా' చిత్రంలో సాయికిరణ్, వందన జంటగా నటిస్తున్నారు. ఈ నాలుగు చిత్రాలు ఏకకాలంలో నిర్మితం అవుతున్నాయి. తమిళంలో రమణ, వందనాగుప్త, మళయాళంలో వినూమోహన్, హనీరోజ్, కన్నడంలో వెంకటేష్, హనీరోజ్ జంటలుగా నటిస్తున్నారు.

## చంటి (1992)

రచన : వేటూరి   గానం : బాలు

పల్లవి  పావురానికీ పంజరానికీ పెళ్ళిచేసె పాడు లోకం (Bit)
కాళరాత్రికీ చందమామకీ ముళ్ళుపెట్టె మూఢలోకం (Bit) } ॥2॥
కొడిగట్టిన దీపాలే గుడి హారతులయ్యేనా... ఓ...ఓ...ఓ...
పావురానికీ పంజరానికీ పెళ్ళిచేసె పాడు లోకం
కాళరాత్రికీ చందమామకీ ముళ్ళుపెట్టె మూఢలోకం

:::::: BIT ::::::

చరణం  తానిచ్చు పాలలో ప్రేమంత కలిపీ చాకింది నా కన్నతల్లీ (Bit)
లాలించు పాటలో నీతంత తెలిపి పెంచింది నాలోన మంచీ (Bit)
కపటాలు మోసాలు నాలోన లేవూ... కలనైన అపకారి కానూ (Bit)
చేసిన పాపములా - ఇవి ఆవిధి శాపములా
మారని జాతకమా - ఇది దేవుని శాసనమా ...ఇది తీరేదే కాదా...
పావురానికీ పంజరానికీ పెళ్ళిచేసె పాడు లోకం
కాళరాత్రికీ చందమామకీ ముళ్ళుపెట్టె మూఢలోకం
కొడిగట్టిన దీపాలే గుడి హారతులయ్యేనా.. ఓ..ఓ..ఓ..
పావురానికీ పంజరానికీ పెళ్ళిచేసె పాడు లోకం
కాళరాత్రికీ చందమామకీ ముళ్ళుపెట్టె మూఢలోకం

:::::: BIT ::::::

చరణం  తాళంటె తాడనే తలచాను నాడూ - అది ఏదొ తెలిసేను నేడూ (Bit)
ఆ తాళి పెళ్లికే ఋజువన్న నిజమూ తరువాత తెలిసేమి ఫలమూ (Bit)
ఏమైన, ఏదైన జరిగింది ఘోరం - నా మీద నాకేలే కోపం (Bit)
నా తొలి నేరములా - ఇవి తీరని వేదనలా
నా మది లోపములా-ఇవి ఆరని శోకములా..ఇక ఈ బాధే పోదా..
పావురానికీ పంజరానికీ పెళ్ళిచేసె పాడు లోకం
కాళరాత్రికీ చందమామకీ ముళ్ళుపెట్టె మూఢలోకం
కొడిగట్టిన దీపాలే గుడి హారతులయ్యేనా.. ఓ..ఓ..ఓ..
పావురానికీ పంజరానికీ పెళ్ళిచేసె పాడు లోకం
కాళరాత్రికీ చందమామకీ ముళ్ళుపెట్టె మూఢలోకం

★★★

# చంటి (1992)

రచన : **సాహితి** గానం : **బాలు, బృందం**

పల్లవి

బృందం అమ్మలారా...కొమ్మలారా...కన్నెగౌరీ వన్నెమీరే...
తియ్యరానీ దిష్టినీరే...ఇవ్వరానీ చిట్టినూరే..
వీధులకూ మువ్వరకే...రాయనీరే పసుపులూ...
వీకొరకూ చేతులకే...సొంపొసగే గాజులూ...(Long Bit)

అతడు అన్నుల మిన్నల అమ్మడి కన్నులు గుమ్మడి పువ్వులులే...
తొలిసిగ్గుల మొగ్గల బుగ్గలు కందిన పుత్తడి అందములే...
సుమ సుందరి అందెలలో...చిరుమువ్వల సందడులే...
శుభ మంగళవేళలలో...శుభమస్తుల దీవెనలే..
అలివేణే...ఈరాణీ...(Bit)
అన్నుల మిన్నల అమ్మడి కన్నులు గుమ్మడి పువ్వులులే...
తొలిసిగ్గుల మొగ్గల బుగ్గలు కందిన పుత్తడి అందములే...

:::::: **BIT** :::::

చరణం

అతడు ఆదేవుడు ఆదేవితొ అలక బూనెనేమో..
ఈరూపుగ శ్రీదేవిని ఇలకు పంపెనేమో..
మోహనాల శోయగాల మేనకో...
మరి దేవలోక పారిజాత మాలికో...
రేకులు విచ్చిన సిరిమల్లి...అన్నల ముద్దులచెల్లీ...
నేలకు వచ్చిన జాబిల్లి...వన్నెల రంగుల వల్లీ...
విరబూసే...పూబోడీ...(Bit)
అన్నుల మిన్నల అమ్మడి కన్నులు గుమ్మడి పువ్వులులే...
తొలిసిగ్గుల మొగ్గల బుగ్గలు కందిన పుత్తడి అందములే...
సుమ సుందరి అందెలలో...చిరుమువ్వల సందడులే...
శుభ మంగళవేళలలో...శుభమస్తుల దీవెనలే..

Contd...

అలివేణే... ఈరాణీ... (Bit)
అన్నుల మిన్నల అమ్మడి కన్నులు గుమ్మడి పువ్వులులే...
తొలిసిగ్గుల మొగ్గల బుగ్గలు కందిన పుత్తడి అందములే...

:::::: BIT :::::

చరణం

ఆకలుపలు ఈ కనులకు మారురూపులేమో...
ఆనగవులు వేకువలకు మేలుకొలుపులేమో..
పాలకడలి మీద తేలు చంద్రికో...
గగనాల వేలకాంతులీను తారకో...
వెన్నెల వస్తాదు ఓనాడూ...రాజంటి గొప్పింటి మొగుడూ...
ఊరంత సందళ్లు ఆనాడూ...వాడంత వియ్యాలవారూ...
పిప్పిప్పీపీ...డుండుండుం... (Bit)
అన్నుల మిన్నల అమ్మడి కన్నులు గుమ్మడి పువ్వులులే...
తొలిసిగ్గుల మొగ్గల బుగ్గలు కందిన పుత్తడి అందములే...
సుమ సుందరి అందెలలో...చిరుమువ్వల సందడులే...
శుభ మంగళవేళలలో...శుభమస్తుల దీవెనలే..
అలివేణే... ఈరాణీ... (Bit)
అన్నుల మిన్నల అమ్మడి కన్నులు గుమ్మడి పువ్వులులే...
తొలిసిగ్గుల మొగ్గల బుగ్గలు కందిన పుత్తడి అందములే...

★★★



## చిత్రం : ప్రియతమా (1992)

రచన : **వేటూరి** గానం : బాలు, స్వర్ణలత, బృందం

:::::: (HAPPY VERSION) ::::::

పల్లవి

బృందం అ...అ...అ... I love You ...I love You ...I love You ...
I love You ...I love You ...I love You ...I love You ...
I love You ...I love You ...I love You ...I love You ... ॥3॥

అతడు ప్రియతమా...ప్రియతమా... ప్రియతమా...
తనువులా...తగిలిన హృదయమా...
మల్లెలేతెచ్చి...మాలలేగుచ్చేయ్ జాబిలమ్మా...హోయ్!
వెన్నెలేపోసి...వేణువేపాడెయ్ కోకిలమ్మా...హోయ్!
ప్రేమే నీవే భామా...

ఆమె ప్రియతమా...ప్రియతమా... ప్రియతమా...
తనువులా...తగిలిన హృదయమా...

:::::: BIT :::::

చరణం

అతడు చలివేదపాఠం...ఒకసారి వల్లెవేయవా...
ఆమె గిలిగింతరాగం...తొలిసారి నేర్పి చూడవా..
అతడు అది ప్రేమ లాంఛనం...మధుమాసమీదినం
ఆమె మరుమల్లె శోభనం...పరదాన సాధనం..
అతడు తారలన్ని ధారపోసే..సోయగాలు నీవిలే..
ఆమె వాంఛలన్ని ఆరిపోయే...వాయిదాలు వేయకే..
అతడు భ్రమరికా...గమనమా....
ఆమె రారా...మేఘశ్యామా...ప్రియతమా...
ప్రియతమా...ప్రియతమా...
తనువులా...తగిలిన హృదయమా...
అతడు మల్లెలేతెచ్చి...మాలలేగుచ్చేయ్ జాబిలమ్మా...హోయ్!
వెన్నెలేపోసి...వేణువేపాడెయ్ కోకిలమ్మా...హోయ్!
ప్రేమే నీవే భామా...ప్రియతమా...

Contd...

ఆమె ప్రియతమా...ప్రియతమా... తనువులా...
అతడు తగిలిన హృదయమా...

:::::: BIT :::::

చరణం

బృందం రూరూరురూ...రురురూరు...
రూరూరురూరు...రురురూరురు (Bit)

ఆమె బృందావిహారం..ప్రియ సామవేద గానమై
అతడు ఓల్గాకుటీరం...మనసామ్యవాద రూపమై...
ఆమె ఒకసారి ఇద్దరం...అవుదాము ఒక్కరం..
అతడు నదికోరు పుష్కరం...మనసైన కాపురం
ఆమె ఆకసాలు దాటిపోయే ఆశయాలు నావిలే...
అతడు పాలపుంత తోడుకున్న పాయసాలు తీపిలే...
ఆమె మధువనీ...మనుపమా...
అతడు ఏలా ఈ హంగామా...ప్రియతమా...ప్రియతమా..ప్రియతమా
ఆమె తనువులా...తగిలిన హృదయమా...
మల్లెలేతెచ్చి...మాలలేగుచ్చేయ్
అతడు జాబిలమ్మా...హోయ్! వెన్నెలేపోసి...వేణువే పాడెయ్
ఆమె కోకిలమ్మా...హోయ్!
అతడు ప్రేమే నీవే భామా...ప్రియతమా...
ఆమె ప్రియతమా...ప్రియతమా... తనువులా...
అతడు తగిలిన హృదయమా...

★★★



# ప్రియతమా (1992)

రచన : **వేటూరి** గానం : **బాలు**

:::::: (PATHOS VERSION) ::::::

పల్లవి

**ఆఆఆ...ఆఆఆఆఆ...ఆఆఆఆఆ...ఆఆ...ఆఆఆ...ఆఆఆఆఆ...**
**ఆఆఆ...ఆఆఆఆఆ...ఆఆఆఆఆ...ఆఆ...ఆఆఆ...** (Bit)
ప్రియతమా...ప్రియతమా ప్రియతమా (Bit)
పయనమా...ప్రణయమే విరహమా... (Bit)
మంచులాసోకి...మంటలారేగే జాబిలమ్మా (Bit)
అమనే మాసి..ఆకులా రాలే కోకిలమ్మా... (Bit)
ఏమై పోయే ప్రేమా...ప్రియతమా....
ప్రియతమా....ప్రియతమా.... (Bit)
పయనమా...ప్రణయమే విరహమా... (Bit)

:::::: BIT :::::

చరణం

మదిలో వసంతం...వసివాడిపోదులే ప్రియా..
నదిలోని కెరటం...నదిగుండెలోనిదే లయా...
ఋతువెంతమారినా...శ్రుతి మారిపోదులే....
జతలేని జీవితం...మృతికన్న చేదులే...
జీవితాన్ని అంటుకున్నా...నీకు స్వాగతానికే...
పూవులెన్నొ చల్లుకున్నా...త్రోవచూపదానికే...
ప్రియతమా...మరలుమా...రావేప్రేమా...రామా...
ప్రియతమా...ప్రియతమా ప్రియతమా (Bit)
పయనమా...ప్రణయమే విరహమా... (Bit)
మంచులాసోకి...మంటలారేగే జాబిలమ్మా (Bit)
అమనే మాసి..ఆకులా రాలే కోకిలమ్మా... (Bit)
ఏమై పోయే ప్రేమా...ప్రియతమా....
ప్రియతమా....ప్రియతమా.... (Bit)
పయనమా...ప్రణయమే విరహమా...

★★★

## ప్రియతమా (1992)

రచన : **వేటూరి** గానం : **మనో, స్వర్ణలత, బృందం**

:::::: Opening Music ::::::

పల్లవి

అతడు మజ్జారేమైనా...నచ్చావే జాణా...
ఒంపులఖజానా..చెలిసొంపుదోచుకోనా...
ఆమైనా...ముఖాముఖం...నాదేలే...
ఏమైనా...సుఖం సగం...నాకేలే...

ఆమె అచ్చారే నయ్‌నా...ఈరాదే దేనా...
పాటపాడుకోనా...విరిపాట పంచుకోనా..
ఓనైనా ఎతం...పతం...నాతోనా...
ఎంతైనా ప్రియం...జయం...నీదేనా...

అతడు అ...మజ్జారే మైనా...అ...నచ్చావే జాణ!

:::::: BIT :::::

చరణం

అతడు వాలుచూపులోనే...వేలచుక్కలాడే
బానవైపుచూశా...(ఆమె : ఏయ్! )
ఈలకేకలేశా... (ఆమె : ఆc...)
రుంగురుంగు ఈడే..రువ్వుకున్ననాడే...
భామషేపు చూశా (ఆమె : ఊc..)
అరె మామ లైఫ్‌వేశా.. (ఆమె : ఛీపో...)
కిందామీదా...కన్నె అందం కిస్‌మీ అంటుంటే..

ఆమె ఉందా లేదా..అన్నబంధం లక్ష్మీ రమ్మంటే...

అతడు వాకిట్లో నందీ...వాటేస్తానందీ...
వయ్యారాలోహలా...ఉయ్యాలూగే వేళల్లో సిగ్గు ఉచ్చులేరా

ఆమె అచ్చారే నయ్‌నా...ఈరాదే దేనా (అతడు : ఆ...)
పాటపాడుకోనా... (అతడు : హేయ్..హేయ్...)
విరిపాట పంచుకోనా..

అతడు అర్రెర్రెరెరెరె...ఆమైనా ముఖాముఖం...నాదేలే...
ఏమైనా సుఖం సగం...నాకేలే...

బృందం అచ్చారే నయ్‌నా (అతడు : ఆ..)

Contd...

ఈరాదే దేనా (అతడు : అహ్హా) పాట పాడుకోనా (అతడు : కుర్ర్)
విరిపాట పంచుకోనా..

:::::: BIT :::::

చరణం

ఆమె దూడూ..దూడూ...అంటూ జోడుకూడి ఎంతో...
చేసె కౌగిలింత...మోజు మొత్తమెంత

అతడు అరె...కస్సుబుస్సుమన్నా...బ్లెస్సు చేసుకున్నా....
మిస్సు పాలపుంత...(ఆమె : ఏయ్!)
నీకిస్సు రేటు ఎంత...

ఆమె షటప్...కుయ్యో మొర్రో కుర్రకారే రాగింగ్ ఇస్తుంటే...

అతడు పిచ్చో...వెర్రో పిల్లగాలి ఫీలింగ్ యిస్తుంటే...

ఆమె బస్సులో బ్రేకూ...మిస్సైతే షేకూ...
కోలాటాలాడే పైలాపచ్చీ పాటల్లో.. బంతులిప్పుడేలా...

అతడు/బృందం అబ్బ...మజ్జారేమైనా...నచ్చావే జాణా...
ఒంపులఖజానా.. (ఆమె : ఏయ్!)
చెలిసొంపుదోచుకోనా...

ఆమె/బృందం ఓనైనా ఎరం...పరం...మాతోనా...
ఎంతైనా ప్రియం...జయం...నీదేనా...

అందరు మజ్జారే మైనా...హో...ఈరాదే దేనా...ఉఉ...
ఒంపుల ఖజానా...విరిపాట పంచుకోనా...

★★★



## అశ్వమేథం (1992)

రచన : **వేటూరి** గానం : బాలు, చిత్ర, బృందం

పల్లవి

బృందం తానా...తానతంద...తందనా తానతంద...తాననా (Bit)
తానా...తానతంద...తానా..తానతంద....తందానతాన
తంద...తా...న... (Long Bit)

అతడు గుంతలకిడి ఘుమఘుమందం అరె..ఎంతసొగసు యమ ఒయ్యారం
ఆమె గుంతలకిడి ఘుమఘుమందం అరె..ఎంత పొగరు యమ యవ్వారం...
అతడు అహ...ఒహో...యహ..యహ...యహ...యహ...
గుంతలకిడి ఘుమఘుమందం అరె..ఎంతసొగసు యమ ఒయ్యారం
ఆమె గుంతలకిడి ఘుమఘుమందం అరె..ఎంత పొగరు యమ యవ్వారం...
అతడు పైటలూరి పేటలో...ఏటవాలు వీధిలో దాచొద్దు అందమంతా...
ఆమె కోక సీమతోటలో...రైకముళ్లరేవులో దోచెయ్యి అందినంతా...
అతడు గుమ్మెత్తిపోవాలి గుమ్మరింతలో...
గుంతలకిడి ఘుమఘుమందం అరె..ఎంతసొగసు యమ ఒయ్యారం
ఆమె గుంతలకిడి ఘుమఘుమందం అరె..ఎంత పొగరు యమ యవ్వారం...

:::::: BIT :::::

చరణం

బృందం తందాన తందనాన (Bit) తందాన తందనాన (Bit) తాతందాన...
తారార తందాన తారార..తందరత్త తందనాన (Long Bit)
అతడు కొప్పులోన సంపెంగంట..అపువ్వు మీద నా బెంగంట...
ఆమె తొలిరేకు సోకు నీకే ఇస్తా...
అతడు నవ్వు జాజిపూలేనంటా...నేను తుమ్మెదల్లే వాలేనంటా...
ఆమె మరుమల్లె...జాజి..మందారాల పాదు చేస్తానంటా...
మురిపాలు పూస్తాయా..
అతడు వేసుకుంటా గడియా...విడిపోకు నన్నీ ఘడియా..
ఆమె దాస్తే చూస్తావు...చూస్తే దోస్తావు...అల్లారు అందాలు హోయ్! కుడిఎడమ..
గుంతలకిడి ఘుమఘుమందం అరె..ఎంత పొగరు యమ యవ్వారం...

Contd...

| | |
|---|---|
| అతడు | గుంతలకిడి ఘుమఘుమందం అరె..ఎంతసొగసు యమ ఒయ్యారం |
| | పైటలూరి పేటలో...ఏటవాలు వీధిలో దాచొద్దు అందమంతా... |
| ఆమె | కోక సీమతోటలో...రైకముళ్లరేవులో దోచెయ్యి అందినంతా... |
| అతడు | గుమ్మెత్తిపోవాలి గుమ్మరింతలో... |
| | గుంతలకిడి ఘుమఘుమందం అరె..ఎంతసొగసు యమ ఒయ్యారం |
| ఆమె | గుంతలకిడి ఘుమఘుమందం అరె..ఎంత పొగరు యమ యవ్వారం... |

:::::: BIT :::::

చరణం

| | |
|---|---|
| ఆమె | కంచిపట్టుచీరే కట్టీ...నిన్ను కంచెలాగ నేనే చుట్టీ... |
| అతడు | అరె...చెంగేకాస్తా...చేనేమేస్తా... |
| ఆమె | వెన్నపూస మనసేయిచ్చీ...చిరు నల్లపూస నడుమేయిస్తే |
| అతడు | అరె..కవ్వంలాగా..తిప్పీతిప్పీ..కౌగిలిస్తానంటా..ననుకాదు పొమ్మన్నా.. |
| ఆమె | తొలిసారి విన్నామాటా...ప్రతిరేయి నాపాటా.. |
| అతడు | నీతో పేచీలు..రాత్రే రాజీలు...నా ప్రేమ పాఠాలు హోయ్! గుడిఎనక.. |
| | గుంతలకిడి ఘుమఘుమందం అరె..ఎంతసొగసు యమ ఒయ్యారం |
| ఆమె | గుంతలకిడి ఘుమఘుమందం అరె..ఎంత పొగరు యమ యవ్వారం.. |
| అతడు | పైటలూరి పేటలో...ఏటవాలు వీధిలో దాచొద్దు అందమంతా... |
| ఆమె | కోక సీమతోటలో...రైకముళ్లరేవులో దోచెయ్యి అందినంతా... |
| అతడు | గుమ్మెత్తిపోవాలి గుమ్మరింతలో... |
| | గుంతలకిడి ఘుమఘుమందం అరె..ఎంతసొగసు యమ ఒయ్యారం |
| ఆమె | గుంతలకిడి ఘుమఘుమందం అరె..ఎంత పొగరు యమ యవ్వారం... |

★★★



## అశ్వమేథం (1992)

రచన : **వేటూరి** గానం : **బాలు, ఆశాభోంస్లే**

:::::: Opening Music ::::::

పల్లవి

ఆమె సీతాకాలం...ప్రేమకు ఎండాకాలం...
అతడు ఎండాకాలం...ముద్దులు పండేకాలం...
ఆమె సందిట్లో విందే సాయంకాలం..కౌగిట్లో రక్తే ప్రాతఃకాలం...
అతడు వలపమ్మ జల్లే వానాకాలం..సిగ్గమ్మ కొచ్చే పోయేకాలం...
ఆమె ఇది సీతాకాలం...ప్రేమకు ఎండాకాలం
అతడు ఎండాకాలం...ముద్దులు పండేకాలం...
ఆమె సందిట్లో విందే సాయంకాలం..కౌగిట్లో రక్తే ప్రాతఃకాలం...
అతడు వలపమ్మ జల్లే వానాకాలం..అహహహ...సిగ్గమ్మ కొచ్చే పోయేకాలం...
ఆమె ఇది సీతాకాలం...ప్రేమకు ఎండాకాలం
అతడు ఎండాకాలం...ముద్దులు పండేకాలం...

:::::: BIT ::::::

చరణం

అతడు చేగాలికే చెదిరే నడుమే...పూగాలికే పొదలా ఒడికే...
ఆమె ఊరింపుతో ఉడికే పెదవే...లాలింపుగా పెదవే కలిపే..
అతడు సన్నగిల్లే...చెలివెన్నుగిల్లే...ఆకలింతే...తొలి కౌగిలింతే..
ఆమె చలి అందాలన్నీ చందాలిస్తా..ఓ...
అతడు సీతాకాలం...ప్రేమకు ఎండాకాలం...
ఆమె ఎండాకాలం...ముద్దులు పండేకాలం...
అతడు సందిట్లో విందే సాయంకాలం..హోయ్...కౌగిట్లో రక్తే ప్రాతఃకాలం...
ఆమె వలపమ్మ జల్లే వానాకాలం..
అతడు రరరర రరరర రరరర
ఆమె సిగ్గమ్మ కొచ్చే పోయేకాలం...
అతడు సీతాకాలం...ప్రేమకు ఎండాకాలం
ఆమె ఎండాకాలం...ముద్దులు పండేకాలం...

:::::: BIT ::::::

Contd...

చరణం

ఆమె నూనూగుగా తగిలే తనువే...నాజూకుగా తపనై రగిలే...
అతడు నీ ఒంపులో...ఒదిగే తళుకే...కవ్వింపులే కసిగా అలికే...
ఆమె జివ్వుమంటే...ఎదకివ్వుమంటే...జవ్వనాలే...తొలిపువ్వుతూగే...
అతడు పొద పేరంటాలే ఆడించేస్తా ఓ...ఓ...ఓ...
ఆమె సీతాకాలం...ప్రేమకు ఎండాకాలం...
అతడు ఎండాకాలం...ముద్దులు పండేకాలం...
ఆమె సందిట్లో విందే సాయంకాలం..
అతడు తురురురు...తురురురు...తురురురు...
ఆమె కౌగిట్లో రక్తే ప్రాతఃకాలం...
అతడు వలపమ్మ జల్లే వానాకాలం..ఆc...సిగ్గమ్మ కొచ్చే పోయేకాలం...
ఆమె ఇది సీతాకాలం...ప్రేమకు ఎండాకాలం
అతడు అరె....ఎండాకాలం...ముద్దులు పండేకాలం...
ఆమె అ... సీతాకాలం...ప్రేమకు ఎండాకాలం
అతడు ఎండాకాలం...ముద్దులు పండేకాలం...

★★★

## మీకు తెలుసా?

ఇళయరాజా బిజీగా వున్నరోజుల్లో ఒకసారి దర్శకుడు బాలచందర్ దర్శకత్వం వహిస్తున్న సినిమాకి అతితక్కువ వ్యవధిలో రీరికార్డింగ్ చెయ్యాల్సివచ్చింది. నాణ్యతే ప్రధానంగా భావించే రాజా, ఆ చిత్రానికి రీరికార్డింగ్ చెయ్యలేకపోయారు. ఇళయరాజా రీరికార్డింగ్ నిర్వహించిన పాతసినిమాల్లో వున్న బ్యాక్ గ్రౌండ్ స్కోర్‌లను అక్కడక్కడా కాపీచేసి, ఇళయరాజా సమ్మతిలేకుండా ఆ చిత్రంలో జోడించి నిర్మాతలు సినిమాని విడుదల చేశారు. ఇళయరాజాకు మనస్తాపం కలిగి ఆ చిత్రనిర్మాతలు తీసే భవిష్యత్ సినిమాలకు పనిచెయ్యనని చెప్పేశారు. తదనంతర కాలంలో ఆ నిర్మాతలు (కవితాలయా ప్రొడక్షన్స్) తీసిన "రోజా" చిత్రానికి ఎ.ఆర్. రెహమాన్ సంగీత దర్శకునిగా తొలిసారి చిత్రసీమకు పరిచయం అయ్యారు.

# అశ్వమేథం (1992)

రచన : **వేటూరి** గానం : **బాలు, జానకి**

:::::: Opening Music ::::::

పల్లవి

అతడు చెప్పనా ఉన్నపని...చెయ్యనా కాస్తపని...
జంటగా పని వుందమ్మో....

ఆమె చెప్పకూ పాతపని...చేసుకో కొత్తపని...
ఇంతకీ పని ఏందయ్యో...!

అతడు నువ్వు అదరహం... ఆమె : (నవ్వు)

అతడు నవ్వు ముదరహం...పువ్వుల కలహం..
యవ్వన విరహం...నీపై మోహం...
చెప్పనా ఉన్నపని...చెయ్యనా కాస్తపని...
జంటగా పని వుందమ్మో....

ఆమె చెప్పకూ పాతపని...చేసుకో కొత్తపని...
ఇంతకీ పని ఏందయ్యో...!

:::::: BIT ::::::

చరణం

అతడు నున్నబడిన నీమెడపై...వెన్నెలే చెమటా...(Bit)
సన్నబడిన నీ నడుమే...మీటనీ అచటా...(Bit)

ఆమె ఎంత తిమ్మిరిగా వుంటే...అంత కమ్మనిదీ...
ఎంతకమ్మనిదో ప్రేమ...అంతతుంటరిదీ...

అతడు చూపులో ఉంటాయి ఊటీలూ...షేపులో అవుతాయి బ్యూటీలూ...

ఆమె ఒంటిలో ఒంటొంటి డిగ్రీలూ...కంటిలో వస్తాయి ఆంగ్రీలూ

అతడు మల్లెపూలే నిద్రలేక మండిపోతుంటే...లవ్...లవ్...
చెప్పనా ఉన్నపని...చెయ్యనా కాస్తపని...
జంటగా పని వుందమ్మో....

ఆమె చెప్పకూ పాతపని...చేసుకో కొత్తపని...
ఇంతకీ పని ఏందయ్యో...!

అతడు నువ్వు అదరహం... ఆమె : (నవ్వు)

Contd...

అతడు నవ్వు ముదరహం...పువ్వుల కలహం..
యవ్వన విరహం...నీపై మోహం...
చెప్పనా ఉన్నపని...చెయ్యనా కాస్తపని...
జంటగా పని వుందమ్మో....
ఆమె చెప్పకూ పాతపని...చేసుకో కొత్తపని...
ఇంతకీ పని ఏందయ్యో...!

:::::: BIT ::::::

చరణం

ఆమె ఎర్రబడిన నీకనులా...నీడలే పిలుపూ...(Bit)
వెంటబడిన నీకథలా...అర్థమేవలపూ...(Bit)
అతడు పచ్చికౌగిలి మేనినీతో...పంచుకోమందీ...
గుచ్చి గుత్తులుగా అందం...గుంజుకోమందీ...
ఆమె గిచ్చితే పుడతాయి గీతాలూ..చీకటీ పులకింతే గీతాలూ...
అతడు చూడనీ అందంగా ఆగ్రాలూ...జోడుగా శుభస్యశీఘ్రాలూ...
ఆమె చందమామే చెమ్మలేక ఎండిపోతుంటే...లవ్...లవ్...
అతడు చెప్పనా ఉన్నపని...చెయ్యనా కాస్తపని...
జంటగా పని వుందమ్మో....
ఆమె చెప్పకూ పాతపని...చేసుకో కొత్తపని...
ఇంతకీ పని ఏందయ్యో...!
అతడు నువ్వు అదరహం... ఆమె : (నవ్వు)
అతడు నవ్వు ముదరహం...పువ్వుల కలహం..
యవ్వన విరహం...నీపై మోహం...
చెప్పనా ఉన్నపని...చెయ్యనా కాస్తపని...
జంటగా పని వుందమ్మో....
ఆమె చెప్పకూ పాతపని...చేసుకో కొత్తపని...
ఇంతకీ పని ఏందయ్యో...!

★★★

# అశ్వమేధం (1992)

రచన : **వేటూరి** గానం : **బాలు, ఆశాభోంస్లే, బృందం**

:::::: Opening Music ::::::

పల్లవి

బృందం ఓ...ప్రేమా...

ఆమె నను నువ్వే ప్రేమ..నవ్వే ప్రేమ..
పువ్వే తేనె పొంగే ప్రేమ..తెలుసా.. (Bit)

అతడు ఓ...మైనా...ఇంక ఏదేమైన..రావేమైనా...
రాగాలెన్నో తీసే ప్రేమ తెలుసా... (Bit)

ఆమె అదరాలి నాలో అందం అధరాలు అందిస్తే...

అతడు ముదరాలి చుమ్మాచుంబం...మురిపాలు పిండేస్తే...

ఆమె ఒకమాటో...అరమాటో...అలవాటుగా మారేవేళ

బృందం ఓ ప్రేమా...

ఆమె నను నువ్వే ప్రేమ...నవ్వే ప్రేమ...
పువ్వై పూసి రాలే ప్రేమ...తెలుసా... (Bit)

అతడు ఓ...మైనా... (Bit)

బృందం ఓ...ఓ...ఓ...ఓ...ఓ...ఓఓఓ...ఓఓఓ...

:::::: BIT ::::::

చరణం

ఆమె చలువరాతి హంసమేడలో ఎండే చల్లనా

అతడు వలువచాటు అందగత్తెలో వయసే వెచ్చనా...

ఆమె వసంతపు తేనెతోనే...తలంటులే పోయనా...

అతడు వరూధిని సోయగాల...స్వరాలు నేమీటనా

ఆమె నువ్వు కల్లోకొస్తే తెల్లారే కాలం...నిన్ను చూడాలంటె కొండెక్కే దీపం

అతడు నువ్వు కవ్విస్తుంటె నవ్వింది రాగం...రెండు గుండెల్లోన తప్పింది తాళం...

ఆమె మురిసింది తారా మూగాకాశంలో

బృందం ఓ...ప్రేమా...

ఆమె నను నువ్వే ప్రేమ...నవ్వే ప్రేమ...
పువ్వై పూసి రాలే ప్రేమ...తెలుసా... (Bit)

Contd...

అతడు ఓ...మైనా.ఇంక నేనేమైనా...నీకేమైనా...
గాలై వీచి కూలేప్రేమ తెలుసా... (Bit)
ఆమె విధి నిన్ను ఓడిస్తుంటే...వ్యధలాగనే వున్నా...
అతడు కథమారి కాటేస్తుంటే...కొడగట్టి పోతున్నా..
ఆమె ఎడబాటే...ఎదపాటై చలినీరుగా సాగేవేళ...
బృందం ఓ...ప్రేమా...
ఆమె నను నువ్వే ప్రేమ..నవ్వే ప్రేమ..
పువ్వేతేనె పొంగే ప్రేమ..తెలుసా..హ్హా
అతడు ఓ...మైనా... (Bit)

:::::: BIT ::::::

చరణం

బృందం ఓ...ఓ...ఓ...ఒఒఓ...ఒఒఓ... (Bit)
ఆమె మనసులోన తీపి మమతలు ఎన్నో వుంటవీ...
అతడు ఇసుకమీద కాలిగురుతులై నిలిచేనా అవీ...
ఆమె ఎడారిలో కోయిలమ్మ కచేరి నాప్రేమగా
అతడు ఎదారిన దారిలోనే...షికారులే నావిగా...
ఆమె కన్నె అందాలన్ని పంపే ఆహ్వానం...కౌగిలింతల్లోనే కానీ కల్యాణం
అతడు స్వర్గలోకంలోనే పెళ్లిపేరంటం...సందెమైకంలోనే పందే తాంబూలం
ఆమె మెరిసింది తారా ప్రేమాకాశంలో...
బృందం ఓ..ప్రేమా...
ఆమె నను నువ్వే ప్రేమ..నవ్వే ప్రేమ..
పువ్వేతేనె పొంగే ప్రేమ..తెలుసా.. (Bit)
అతడు ఓ...మైనా...ఇంక ఏదేమైన..రావేమైనా...
రాగాలెన్నో తీసే ప్రేమ తెలుసా... (Bit)
ఆమె అదరాలి నాలో అందం అధరాలు అందిస్తే...
అతడు ముదరాలి చమ్మాచుంబం...మురిపాలు పిండేస్తే...
ఆమె ఒకమాటో...అరమాటో...అలవాటుగా మారేవేళ
బృందం ఓ ప్రేమా...
ఆమె నను నువ్వే ప్రేమ...నవ్వే ప్రేమ...
పువ్వై పూసి రాలే ప్రేమ...తెలుసా... (Bit)
అతడు ఓ...మైనా...

★★★

## అశ్వమేధం (1992)

రచన : **వేటూరి** గానం : **బాలు, జానకి**

:::::: Opening Music ::::::

పల్లవి

ఆమె ఏందెబ్బ తీశావురా...ఓయబ్బ నచ్చావురా...

అతడు ఓ బాలికా...మెచ్చానులే...నీకోరికే...గ్రహించానులే...

ఆమె అల్లాడిపోయానురా..అహ! ఏందెబ్బ తీశావురా...ఓయబ్బ నచ్చావురా...

:::::: BIT ::::::

చరణం

ఆమె బాలయ్యా...కన్నెబెంగ తీరే దారేదయ్యా...
బావయ్యా...సిగ్గుచీర దోస్తే...దోస్తేనయ్యా....

అతడు రాధమ్మా...పొన్నచెట్టు నీడల్లోనే చుమ్మా...
అత్తమ్మా...వెన్న దుత్త దాస్తావేమే గుమ్మా...

ఆమె ఏలయ్యా ఇంత తొందరా...గోలయ్యా కాస్తముందరా...

అతడు ఓలమ్మీ నీది బందరా..ఒళ్లమ్మీ ఇవ్వు నా ధరా...

ఆమె అమ్మో...యీ ఆగడం...అబ్బాయీ రేగడం
రమ్మనలేక...ఇమ్మనలేక...పొమ్మనలేక...కమ్మని కేక
ఏందెబ్బ తీశావురా...ఓయబ్బ నచ్చావురా...

:::::: BIT ::::::

చరణం

అతడు నీ జబ్బా...నిబ్బరాలు బాగా చూసేస్తున్నా...
జాకెట్టై...ఉబ్బరాల పొగావేసేస్తున్నా...

ఆమె హోయబ్బా...కన్నెమబ్బునేనై కమ్మేస్తున్నా...
నీగాలే...సోకిపూల వానై కాటేస్తున్నా...

అతడు ఓలమ్మీ...ఒళ్లు భద్రమే..పొంగొస్తే తుంగభద్రమే..

ఆమె కుర్రోడా...కూత చాలురా..గుడివాడ కోతలాపరా...

అతడు నీకొంపముంచటం...నీగంప దించటం..
కోతలు కావే...చేతలు లేవే..మోతలు రేపే మోజులు నావే...
ఏందెబ్బ చూశావులే...ఓ యబ్బ ముందుందిలే..

ఆమె ఓ ప్రేమికా...మెచ్చానురా...నే ఘాటుగా వరించానురా..

అతడు పెళ్లాడుకుందాములే...ఏం దెబ్బ చూశావులే...

ఆమె ఆహో...ఓయబ్బ నచ్చావురా...

★★★

## చామంతి (1992)

రచన : **రాజశ్రీ** గానం : **బాలు, చిత్ర**

( హోరుగాలి, పక్షుల శబ్దంతో )

:::::: Opening Music ::::::

పల్లవి

అతడు చక్కని చిక్కని చిలక దరిచేరెను కాదా...
ఓహో...చిక్కని చక్కని వయసే జతకోరెను కాదా..
కన్నులలోనే...సాగెను ఆటా...వెన్నెలలోనే...వన్నెలవేటా...

ఆమె అహ...చక్కని చిక్కని చిలక దరిచేరెను కాదా...
ఓహో...చిక్కని చక్కని వయసే జతకోరెను కాదా..
కన్నులలోనే...సాగెను ఆటా...వెన్నెలలోనే...వన్నెలవేటా...

అతడు అహ...చక్కని చిక్కని చిలక దరి చేరెను కాదా...

ఆమె ఓహో...చిక్కని చక్కని వయసే జతకోరెను కాదా..

:::::: BIT ::::::

చరణం

అతడు వేదేను నీతోడు నావేడి వయసూ...అందాలి నీమేని అందం...

ఆమె పూసేను పువ్వల్లె నాతేనె మనసూ...తీరాలి నీచెంత దాహం..

అతడు చూశాను నీపైటలో...తరగని సింగారం...

ఆమె తెలిసెను నీమాటలో చెరగని శృంగారం...

అతడు నీవేకాదా సంబరాల సన్నిధానం...

ఆమె కానా నేనే నీ ఊపిరి నాదే యోగం

అతడు ఎదలోన కదిలేనే నీఅందం నాకే వేసే బంధం

ఆమె చక్కని చిక్కని చిలక దరిచేరెను కాదా..
ఓహో...చిక్కని చక్కని వయసె జతకోరెను కాదా...

అతడు కన్నులలోనే...సాగెను ఆటా..వెన్నెలలోనే వన్నెల వేటా...

ఆమె అహ...చక్కని చిక్కని చిలక దరి చేరెను కాదా...
ఓహో...చిక్కని చక్కని వయసే జతకోరెను కాదా..

:::::: BIT ::::::

Contd...

చరణం

ఆమె ముత్యాలపొద్దుల్లో ఊరేగి చూడూ...చిన్నారి నాలేత ప్రేమా...
అతడు సందేళచేరావె సరసాల భామా...మారాలు చాలించవమ్మా..
ఆమె ఉల్లాసవీధుల్లోనా...కలలే ఊరేగనీ...
అతడు నీ ముద్దుముచ్చట్లోనా...వలపులు పండించనీ...
ఆమె ఊహల్లోనా చిందించనీ మౌనరాగం...
అతడు మాటల్లోనా అందించనీ ప్రేమతాళం...
ఆమె ఉడికించి...ఊరించి...నాఅందం నీకే వేసే బంధం
అతడు చక్కని చిక్కని చిలక దరి చేరెను కాదా...
ఓహో...చిక్కని చక్కని వయసే జతకోరెను కాదా..
ఆమె కన్నులలోనే...సాగెను ఆటా...వెన్నెలలోనే...వన్నెలవేటా...
అతడు చక్కని చిక్కని చిలక దరి చేరెను కాదా...
ఆమె ఓహో...చిక్కని చక్కని వయసే జతకోరెను కాదా..

★★★

## మీకు తెలుసా?

అమావాస్యచంద్రుడు (1981) చిత్రంకోసం దర్శకులు సింగీతం శ్రీనివాసరావు వేటూరితో ఒక పాట రాయించారు. వేటూరికి ఇళయరాజాతో పనిచెయ్యడం అదే ప్రథమం. పల్లవి (సుందరమో...సుమధురమో...చందురుడందిన చందన శీతలమో) రాయడం గురించి వేరొకచోట మనం చెప్పుకున్నాం. పల్లవికి ముందు బృందాలాపన పెడితే బాగుంటుందనిపించి, దర్శకులు సింగీతం వేటూరిని ఒక అంధ విద్యార్థుల పాఠశాలలో పిల్లలు ఆలపించే సాకీగా దానిని జోడించమన్నారు. అప్పటికే ప్రసాద్ స్టూడియో రికార్డింగ్ థియేటర్ కిటికీ వద్ద నిలబడివున్న వేటూరికి కవిత్వం పొంగిపొరలింది. అదే..."సరిగమపదని సప్తస్వరాలు మీకూ..అవి ఏడురంగుల ఇంద్రధనస్సులు మాకు...మనసే ఒక మార్గము...మమతే ఒక దీపము ఆ వెలుగే మాకు దైవమూ..." పాట. ఈ పాటలో ఆలాపనను టి.వి. గోపాలకృష్ణన్ చేత పాడించారు ఇళయరాజా. ఈ చిత్రాన్ని తెలుగు, తమిళ భాషల్లో ఒకేసారి నిర్మించారు.

# చామంతి (1992)

రచన : **రాజశ్రీ** గానం : **బాలు, చిత్ర**

:::::: Opening Music ::::::

పల్లవి

అతడు ఇదే రాజయోగం...యోగం...ఇదే మోహబంధం...బంధం

ఆమె ఇదే రాజయోగం...యోగం...ఇదే మోహబంధం...బంధం

అతడు మనసులే...తొలకరీ...కవితలే..పలికెనే...
కలిపెనే...జీవితాలే..నీవేనేనే...నేనేనీవే..
నీవేనేనే...నేనేనీవే...

ఆమె ఇదే రాజయోగం...యోగం...ఇదే మోహబంధం...బంధం

:::::: BIT ::::::

చరణం

అతడు సద్దుచేసెనంటా...ముద్దబంతి పాటా...
యవ్వనాల పొంగులో...పసిడి కలల పంటా...

ఆమె కనులు మూసినా కూడా సాగేనంట నీ ధ్యానం...
కలల రాజవీధుల్లో చిందేసేనంట సిందూరం...

అతడు కథగా...ఎదలో...ఉన్నాను కాదా...

ఆమె తలపూ...వలపూ...నాకింక నువ్వేగా...

అతడు కలగా...నిలిచిపో...నాకళ్లల్లో...
నీవేనేనే...నేనేనీవే...నీవేనేనే...నేనేనీవే...

ఆమె ఇదే రాజయోగం...యోగం...

అతడు ఇదే మోహ బంధం...బంధం

:::::: BIT ::::::

చరణం

ఆమె పాలమనసు నన్నే...పలకరించె నేడే...
మల్లెపూల గారాలే...విందు చేయువేళా...

Contd...

అతడు అంతులేని నాగానం...ఆలాపించె శ్రీరాగం...
ఆశలన్ని పండించీ...అందించేను నీకోసం...
ఆమె యుగమే...క్షణమై...సాగింది కాలం....
అతడు సర్వం నావే...నాదేవి వయ్యారం...
ఆమె సరసం...మధురం...నాదే వైభోగం...
నీవేనేనే...నేనేనీవే...నీవేనేనే...నేనేనీవే...
అతడు ఇదే రాజయోగం...యోగం... ఇదే మోహబంధం...బంధం
ఆమె మనసులే...తొలకరీ...కవితలే..పలికెనే...
కలిపెనే...జీవితాలే..
అతడు నీవేనేనే...నేనేనీవే...నీవేనేనే...నేనేనీవే...
ఆమె ఇదే రాజయోగం...యోగం...
అతడు ఇదే మోహ బంధం...బంధం

★★★

## తెలుసుకుందాం

ఎవియం స్టూడియోలో "అన్నక్కిళి" చిత్రం మొదటి పాట రికార్డింగ్‌కి అంతా సిద్ధం చేశారు ఇళయరాజా. రికార్డింగ్‌కి ఓకే చెప్పేసరికి కరెంట్ పోయింది. ఇది శుభసూచకం కాదని వాద్యబృందంలో గుసగుసలు బయలుదేరాయి. ఇళయరాజా నిరుత్సాహంతో బయటకు వచ్చారు. ఎం.జి.ఆర్, శివాజీగణేశన్ చిత్రాలకు దర్శకత్వం వహించే ప్రఖ్యాత దర్శకుడు పి. మాధవన్ ఎదురొచ్చి ఇళయరాజా చేతిలో ప్రసాదం పెట్టి దీవించాడు. కరెంట్ రాగానే రికార్డింగ్ మొదలైంది. యస్. జానకి గళం విప్పింది. పాట రికార్డింగ్ అయిపోయింది. పాట ఎలా వచ్చిందో విందామని సౌండ్ ఇంజనీర్ ప్లే చేస్తే అసలు పాటే రికార్డు కాలేదు. తర్వాత మళ్లీ పాటను ఇళయరాజా రికార్డ్ చేశారు. ఈ సినిమా మొదట ఒక థియేటర్లో విడుదలై వారం తిరక్కముందే వేరే హాలుకి మార్చబడినా సినిమా మాత్రం తమిళనాడులో సిల్వర్ జూబిలీ చేసుకుంది. పాటలు అద్భుతవిజయాన్ని సాధించి ఇళయరాజాను తారాపథానికి తీసుకువెళ్లాయి.

## చామంతి (1992)

రచన : **రాజశ్రీ** గానం : **బాలు, టి. శ్రీనివాస్**

సాకీ

అతడు2 కదలిలో ఒంటరిగా పోతున్నా...అచెలిమీ...కలిమీ... ఎదకోరెనే
అలలలో అలజడి వున్నా...ఆ తలపే తూగాడెనే..
తానే కాదా నాకే సొంతం...(Long Bit)

పల్లవి

అతడు2 కదలికి వినిపించె నాజాలిపాటా...
కవితగ నాచెలికి అందించలేదా...
నిన్ను నేను చూడందే...కంటికి కునుకేది
నాకు నీవు కాదావరమే...(Bit)
నాటి అనుబంధాలు....నిను వీడిపోలేవు..
జీవితాలు యింతేకాదా...(Bit)

సాకీ

అతడు 2 నిలిచిపో గుండెలలో గుడివై...వెల్లివిరిసేది ఊహలలో...
చింతలలో నేను కుమిలేనే...రేయి పవలు నిన్నే తలచేనే...
కలలా కరిగే..నారాతా...

:::::: BIT ::::::

చరణం

అతడు2 వేదనలో వున్న నీధ్యాస పోదే...
వేడుక అందించె నీగాధనాదే...
జడివానలోనైనా...సుడిగాలిలోనైనా..
నీవు నాతోడూ..నీడా...(Bit)
దయలేదు దేవుడికి...తావులేదు ప్రేమలకి
అంతులేని బంధం...మనదే...(Bit)

సాకీ

అతడు 2 ఆశలా అలజడిలో నిలచీ...నిన్ను నేను చేరలేను..ఓ...చెలీ....
చీకటికే బలియైతి నేనిలా...
దరికీ చేరేది నేనెలా...కలిసే క్షణమే...వచ్చేనా...

:::::: BIT ::::::

Contd...

చరణం

అతడు I వేదనలు తొలగించు వేదుకల కాలం...
అది మనకు లేదంట ఇక ఎంతోదూరం...
చూపులన్ని కలిసేవేళ...గుండెలోన కరిగే వేళ...
చింతలన్ని తీరీ...పోవా...(Bit)
అయినవాళ్లు హద్దులు గీసి...మనను నేడు వీడదీశారూ
ఆగదులే మనలో స్నేహమే...(Bit)
కదలికి వినిపించె నా జాలిపాటా..
కవితగ నాచెలికి అందించలేదా...
నిన్ను నేను చూడందే...కంటికిక కునుకేది
నాకు నీవు కాదా వరమే...(Bit)
నాటి అనుబంధాలు....నిన్ను వీడిపోలేవు..
జీవితాలు యింతేకాదా...(Bit)

★★★



## ఆ ఒక్కటీ అడక్కు (1992)

రచన : **వేటూరి** గానం : **బాలు, జానకి**

పల్లవి

ఆమె పావురమా..పావురమా..మన బ్రతుకే పంజరమా
కన్నులలో...కాపురమా...అందని ఓ...గోపురమా
పావురమా..పావురమా..మన బ్రతుకే పంజరమా
:::::: BIT ::::::

చరణం

ఆమె వెన్నెల్లో మల్లెపూల మంచంవేసి వుంచానూ
అందాల మందారాల గంధాలెన్నో దాచానూ
అతడు కళ్లల్లో వత్తులువేసి నీకై వేచివున్నానూ
వెచ్చన్నీ కౌగిళ్లల్లో ఒకటై పోదామన్నానూ
ఆమె వెన్నెల పాన్పై కరిచినవేళా...
అతడు కన్నుల ఆశా కరిగినవేళా..
ఆమె జాలైనా లేనేలేదా రానేరాదా నీకింకా
అతడు ఈబాధ తీరేదెట్టా నీవే చెప్పు నాకింకా
పావురమా..పావురమా..మన బ్రతుకే పంజరమా
కన్నులలో...కాపురమా...అందని ఓ...గోపురమా
పావురమా..పావురమా..మన బ్రతుకే పంజరమా
:::::: BIT ::::::

చరణం

ఆమె ఆఆఆఆఆ..ఆఆఆఆఆ..ఆఆఆ..ఆఆఆ..ఆఆఆ..ఆఆఆ..ఆఆఆ.. (Long Bit)
అతడు ఎన్నాళ్లీ ఉపవాసాలూ..ఎన్నేళ్లమ్మా వనవాసం
శివరాత్రి రాకుండానే చేస్తున్నానే జాగారం
ఆమె ఆకుండీ వక్కా వుండీ రెండూ కలిసేదేనాడో
పరువాల తాంబూలంతో పెదవులు పండేదేనాడో
అతడు నెమ్మదిలేనీ...తుమ్మెద గోలా
ఆమె తుమ్మెదరాని పూవున జ్వాలా...
అతడు ఎన్నెన్నో కలలేకన్నా నిన్న నేడు నీకోసం
ఆమె మౌనంగా ఏడుస్తున్నా నాలోనేనే మనకోసం
పావురమా..పావురమా..మన బ్రతుకే పంజరమా
అతడు కన్నులలో...కాపురమా...అందని ఓ...గోపురమా
ఆమె పావురమా..పావురమా..మన బ్రతుకే పంజరమా

★★★

## ఆ ఒక్కటీ అడక్కు (1992)

రచన : **భువనచంద్ర** గానం : **బాలు, జానకి**

పల్లవి

ఆమె వారెవా...మానవా...ఎదలే అదిరే
జోరుగా...జోడుగా...కథలే ముదిరే
ఓపలేను ...తపనలు ఆపలేను
మదనుడ రావేరా..జత నీవేరా
రావేరా...జత నీవేరా...

అతడు వారెవా...పాడవే...నిదురే చెదిరే
వాటమై...జంటగా...వలపే కుదిరే

:::::: BIT ::::::

చరణం

అతడు మొత్తుకున్న మోహాలకు మోజే బలిసి
చెలి గొంతుదాటు దాహాలకు తీపే తెలిసే

ఆమె చీరదాటు శ్రీలేఖలు లగ్గాలడిగె
కదకొంగుచాటు కోణాలకు ప్రాణాలెగిరే

అతడు వనితల తలపులే కవితల మెరుపులూ

ఆమె పురుషుల వలపులే చరితకు మలుపులూ

అతడు ఇంతగా కోరితే చెంత చేరనా

ఆమె చెంతకే చేరితే చేతులాగునా
ఒక ఉడుకై...ఒడిదుడుకై చలి తిరుగులెగసెరా

అతడు వారెవా...పాడవే...నిదురే చెదిరే
వాటమై...జంటగా...వలపే కుదిరే
ఆగలేను..తపనలు తాగలేను
మదనిక రావేలా..జత నీవేగా

ఆమె వారెవా...మానవా...ఎదలే అదిరే
జోరుగా...జోడుగా...కథలే ముదిరే

:::::: BIT ::::::

Contd...

చరణం

ఆమె	కన్ను కన్ను కావ్యాలకు ప్రాసే కుదిరే
అది నిన్ను నన్ను కౌగిళ్లకు ముందే కలిపే

అతడు	గిచ్చు గిచ్చు గీతాలకు రాగాలదిరి
అవి చిచ్చుపెట్టి శ్రీ మన్మథలీలే ముదిరే

ఆమె	పెదవుల గుసగుసే ప్రేమకు పదనిస

అతడు	తనువుల కలయికే మనువుకు కళయిక

ఆమె	ఆశగా కోరితే అందమివ్వనా...

అతడు	అందమో చందమో అంతు చూడనా...
అది ఉలుకో..చెలిపలుకో..తొలివలపు చిలికెనే

ఆమె	వారెవా...మానవా...ఎదలే అదిరే
జోరుగా...జోడుగా...కథలే ముదిరే

అతడు	ఆగలేను..తపనలు తాగలేను
మదనిక రావేలా..జత నీవేగా...రావేలా..జత నీవేగా

ఆమె	వారెవా (Bit) మానవా (Bit) ఎదలే అదిరే (Bit)

అతడు	వాటమై (Bit) జంటగా (Bit) వలపే కుదిరే

★★★



## చినరాయుడు (1992)

రచన : భువనచంద్ర గానం : బాలు, జానకి

:::::: Opening Music ::::::

పల్లవి

అతడు స్వాతి ముత్యమాల...ఒళ్లు తాకి తుళ్లిపోయిందీ...
సిగ్గుపడ్డ చీర...కట్టువీడి జారిపోయిందీ...
కొంగుచాటు అందాలూ..కన్నుకొట్టి రమ్మంటే....
వయసాడమంది సయ్యాటా...ఇది యవ్వనాల పూదోటా..
స్వాతి ముత్యమాల...ఒళ్లు తాకి తుళ్లిపోయిందీ...

:::::: BIT :::::

చరణం

ఆమె ఇదేవింటో పెదవి కలిపితే...మధువులే కురియవా...
అతడు తనువుతో తనువు తడిమితే...తపనలే రగలవా....
ఆమె తొందరెందుకంది కన్నెమనసూ... పూలతీగలాగ వాటేసీ...
అతడు ఊయలూగమంది కోరవయసూ... కోడె గిత్తలాగ మాటేసీ...
ఆమె కవ్విస్తున్నదీ పట్టెమంచమూ... రావా...రావా...నారాజా...
అతడు స్వాతి ముత్యమాల...
ఆమె ఒళ్లు తాకి తుళ్లిపోయిందీ...
అతడు సిగ్గుపడ్డ చీర...
ఆమె కట్టువీడి జారిపోయిందీ...

:::::: BIT :::::

చరణం

అతడు మేఘమా మెరిసి చూపవే...గడసరీ తళుకులూ...
ఆమె మోహమా కొసరి చూడవే...మగసిరీ మెరుపులూ...
అతడు కొల్లగొట్టమంది పిల్లసొగసూ...కొంటె కళలన్ని నేర్పేసీ...
ఆమె లెక్కపెట్టమంది సన్న రవికా... ముద్దులెన్నో మోజు తీర్చేసీ...
అతడు పరువే నలగనీ...పరువం చిలకనీ...మళ్లీ...మళ్లీ...నీవేలా...
ఆమె స్వాతి ముత్యమాల...ఒళ్లు తాకి తుళ్లిపోయిందీ...
సిగ్గుపడ్డ చీర...కట్టువీడి జారిపోయిందీ...
కొంగుచాటు అందాలూ..కన్నుకొట్టి రమ్మంటే....
వయసాడమంది సయ్యాటా...ఇది యవ్వనాల పూదోటా..
అతడు వయసాడమంది సయ్యాటా...ఇది యవ్వనాల పూదోటా..

★★★

## చినరాయుడు (1992)

రచన : భువనచంద్ర గానం : బాలు

పల్లవి

నిండు ఆకాశమంత మనసువున్న రాజువయ్యా (Bit)
పండు వెన్నెలలాంటి చల్లని చూపుల రేడువయ్యా (Bit)
ముచ్చటగా...ఒక తాళికట్టి...
నింగికి...నేలకు నిచ్చెన వేసిన దేవుడు నీవే...(Bit)
చినరాయుడు నీవే..
నిండు ఆకాశమంత మనసు వున్న రాజువయ్యా (Bit)
పండు వెన్నెలలాంటి చల్లని చూపుల రేడువయ్యా

:::::: BIT :::::

చరణం

గాలిలోన తేలే పరువాల పూలకొమ్మా...(Bit)
నేలవాలిపోగా చివురింప చేసినావే...
పసుపుతాడు మీద లోకానికున్న ప్రేమా...
మనిషిమీద లేదు... ఈ నీతికెవరు బ్రహ్మ
తప్పవురా హేళనలు...వేదనలే...నీ హితులూ
గుండెకు బండకు వారధికట్టిన దేవుడి లీలా(Bit)
ఇది కాకుల గోలా
నిండు ఆకాశమంత మనసు వున్న రాజువయ్యా (Bit)
పండు వెన్నెలలాంటి చల్లని చూపుల రేడువయ్యా

:::::: BIT :::::

చరణం

నీటిలోని చేపా...కన్నీరు ఎవరికెరుకా...(Bit)
గూటిలోని చిలుకా...గుబులేదో ఎవరికెరుకా...
నుదుటిమీద రాత వేరెవరు మార్చగలరూ..
న్యాయమూర్తి నీవే...తీర్పెవరు తీర్చగలరూ..
ఒంటరిదీ నీ పయనం...నిబ్బరమే నీకభయం..
తప్పుకి...ఒప్పుకి గంతలు కట్టిన...దేవుడి లీలా (Bit)

Contd...

ఇది కాకులగోలా
నిండు ఆకాశమంత మనసువున్న రాజువయ్యా (Bit)
పండు వెన్నెలలాంటి చల్లని చూపుల రేడువయ్యా (Bit)
ముచ్చటగా...ఒక తాళికట్టీ...
నింగికి...నేలకు నిచ్చెన వేసిన దేవుడు నీవే...(Bit)
చినరాయుడు నీవే..
నిండు ఆకాశమంత మనసు వున్న రాజువయ్యా (Bit)
పండు వెన్నెలలాంటి చల్లని చూపుల రేడువయ్యా (Bit)

★★★



# చినరాయుడు (1992)

రచన : **భువనచంద్ర** గానం : **బాలు, చిత్ర**

(పక్షుల కిలకిలరావాలతో)

పల్లవి

అతడు బుల్లిపిట్ట...బుజ్జిపిట్ట...గూటిలోని గువ్వపిట్ట
పంజరాన రామచిలుక ఎట్టావున్నదీ (Bit)
బుల్లిపిట్ట...బుజ్జిపిట్ట...గూటిలోని గువ్వపిట్ట
పంజరాన రామచిలుక ఎట్టావున్నదీ (Bit)
అది ఎవరే...ఎవరే...తెలిపేదీ
ఎన్ని నాళ్లే ఇట్టా గడిచేదీ... } ॥2॥
బుల్లిపిట్ట...బుజ్జిపిట్ట...గూటిలోని గువ్వపిట్ట
పంజరాన రామచిలుక ఎట్టావున్నదీ

:::::: **BIT** :::::

చరణం

ఆమె నిన్నే తలుచుకుంటు...ప్రాణం నిలుపుకుంటు
నీకై నిలిచివుంది శ్వాసా...(Bit)
అతడు కాలం కరుగుతున్నా...శోకం పెరుగుతున్నా
ఏదో జరుగునన్న ఆశా...(Bit)
ఆమె పూమాల వాడలేదు...పారాణి ఆరలేదు
అయినా లోకం జాలి చూపదే...(Bit)
అతడు నీగుండె చప్పుడింకా...నాగుండె చేరలేదు
అయినా..అయినా కథ మారదే (Bit)
ఆమె కష్టాలన్నీ గాయాలే..
అతడు అవి కాలంతోటే మానాలే...
ఆమె బుల్లిపిట్ట...బుజ్జిపిట్ట...చెట్టుమీద పాలపిట్ట
ఊరిలోని గోరువంక ఎట్టా వున్నదీ (Bit)
అతడు బుల్లిపిట్ట...బుజ్జిపిట్ట...గూటిలోని గువ్వపిట్ట
పంజరాన రామచిలుక ఎట్టావున్నదీ

:::::: **BIT** :::::

Contd...

చరణం

అతడు నువ్వే దేవుడివన్న ఊరే నిందిస్తూ వుంటే..
చెప్పలేనీ గుండెకోతా...(Bit)

ఆమె కళ్లే కలుపుకొని...ఎన్నో కలలుగన్న
మేనే కాటేసింది...బాధా (Bit)

అతడు మురిపాల కట్టుకున్న పొదరిల్లు కూలిపోతే
ఎదలో రగిలే మంటలారునా..(Bit)

ఆమె నూరేళ్ల పంట ఇట్ట మూన్నాళ్ల ముచ్చటైతే
మామా...మామా...వ్యధ తీరునా...(Bit)

అతడు మళ్లీ ఎట్టా కలిసేదీ...

ఆమె నా ప్రాణం ఎట్టా నిలిపేదీ...

అతడు బుల్లిపిట్ట...బుజ్జిపిట్ట...గూటిలోని గువ్వపిట్ట
పంజరాన రామచిలుక ఎట్టావున్నదీ (Bit)

ఆమె బుల్లిపిట్ట...బుజ్జిపిట్ట...చెట్టుమీద పాలపిట్ట
ఊరిలోని గోరువంక ఎట్టా వున్నదీ (Bit)

అతడు అది ఎవరే...ఎవరే...తెలిపేదీ
ఎన్ని నాళ్లే ఇట్టా గడిచేదీ...

ఆమె అది ఎవరే...ఎవరే...తెలిపేదీ
నే నెట్టా...ఎట్టా బతికేదీ...

అతడు బుల్లిపిట్ట...బుజ్జిపిట్ట...గూటిలోని గువ్వపిట్ట
పంజరాన రామచిలుక ఎట్టావున్నదీ (Bit)

★★★



## క్షత్రియపుత్రుడు (1992)

రచన : **వెన్నెలకంటి** గానం : **బాలు, జానకి**

పల్లవి

ఆమె సన్నజాజి పడకా (హమ్మింగ్)...మంచె కాడ పడకా (హమ్మింగ్)
సన్నజాజి పడకా...మంచెకాడ పడకా
చల్లగాలి పడకా...మాటవినకుందీ ఎందుకే...(Bit)
సన్నజాజి పడకా...మంచెకాడ పడకా
చల్లగాలి పడకా...మాటవినకుందీ ఎందుకే... } ॥2॥
అడిగితే సిగ్గేసిందీ...సిగ్గులో మొగ్గేసిందీ
మొగ్గలా బుగ్గేకంది..పో...యే..నే...
సన్నజాజి పడకా...మంచెకాడ పడకా
చల్లగాలి పడకా...మాట వినకుందీ ...ఎందుకే (Long Bit)

అతడు సన్నజాజి పడకా...మంచెకాడ పడకా
చల్లగాలి పడకా...మాట వినకుందీ ఎందుకే
మనసులో ప్రేమేవుందీ..మరువనీ మాటే వుందీ
మాయని ఊసే పొంగి పాటై రావే...
సన్నజాజి పడకా...మంచెకాడ పడకా
చల్లగాలి పడక...మాట వినకుందీ ...ఎందుకే...ఏయ్!

:::::: BIT ::::::

చరణం

ఆమె కొండామల్లీ పువ్వులన్నీ...గుండెల్లోని నవ్వులన్నీ
దండేకట్టి కాచుకున్నా...నీకొరకే...
అతడు పండువెన్నెలంటి ఈడూ...ఎండల్లోన చిన్నబోతే
పండించగా చేరుకున్నా..నీ దరికే...
ఆమె అందా దండా నీవేననీ...పండగంతా నాదేననీ
ఉండీ ఉండీ ఊగిందీ..నామనసే...
అతడు కొండాపల్లి బొమ్మా ఇకా...పందూ చెందూ దోచెయ్యనా
దిండే పంచే వేళైనది... రావే
దిండే పంచే వేళైనదీ...రా...వే

Contd...

ఆమె సన్నజాజి పడకా...మంచెకాడ పడకా
చల్లగాలి పడక...మాట వినకుందీ ఎందుకే

అతడు సన్నజాజి పడకా...మంచెకాడ పడకా
చల్లగాలి పడకా...మాట వినకుందీ ఎందుకే

ఆమె అడిగితే సిగ్గేసిందీ..సిగ్గులో మొగ్గేసిందీ
మొగ్గలా బుగ్గేకంది పో...యే...నే...

అతడు సన్నజాజి పడకా...మంచెకాడ పడకా
చల్లగాలి పడకా...మాట వినకుందీ ఎందుకే

★★★



## దళపతి (1992)

రచన : **రాజశ్రీ** గానం : **బాలు, చిత్ర**

:::::: Opening Music ::::::

పల్లవి

బాలు సుందరి నేనే నువ్వంట (Bit) చూడనీ నీలో నన్నంటా (Bit)

చిత్ర కానుకే ఇచ్చా మనసంత (Bit)...జన్మకే తోడై నేనుంటా (Bit)

బాలు గుండెలో నిండమంటా..నీడగా పాడమంటా...నాసిరి నీవేనటా...

సుందరి నేనే నువ్వంట (Bit) చూడనీ నీలో నన్నంటా (Bit)

చిత్ర కానుకే ఇచ్చా మనసంతా (Bit) జన్మకే తోడై నేనుంటా

:::::: BIT :::::

చరణం

బృందం (ఆలాపన)

చిత్ర అనుకున్న మాటలు సర్వం కరిగిపోతే న్యాయమా

మధురాల మధువులు చిందీ...చల్లని ప్రేమే మాయమా

బాలు అ...రేపవలు నిద్దరలోను...ఎదనీ తోడి పోదునూ

యుద్ధాన ఏమైనా..నా ఆత్మే నిన్నే చేరునూ (Bit)

చిత్ర ఎద తెలుపు ఈ వేళా...ఏల యీ శోధనా..

బాలు జాబిలిని నీవడుగూ తెలుపు నావేదనా

చిత్ర నాలో ప్రేమే మరిచావు

బాలు ప్రేమే నన్నే గెలిచేనే

చిత్ర కానుకే ఇచ్చా మనసంత (Bit) జన్మకే తోడై నేనుంటా (Bit)

బాలు సుందరి నేనే నువ్వంట (Bit) చూడనీ నీలో నన్నంటా (Bit)

చిత్ర గుండెలో నిండమంటా...(Bit) నీడగా పాడమంటా...

నా సిరి నీవేనటా

బాలు సుందరి నేనే నువ్వంట (Bit) చూడనీ నీలో నన్నంటా (Bit)

చిత్ర కానుకే ఇచ్చా మనసంత జన్మకే తోడై నేనుంటా

:::::: BIT :::::

Contd...

చరణం

| | |
|---|---|
| బృందం | (ఆలాపన) |
| చిత్ర | పువ్వులే ముళ్లై తోచూ నీవే నన్నూ వీడితే.. |
| | ఊహలే పూలై పూచు నీ ఎదమాటున చేరితే (Bit) |
| బాలు | ఆ..మాసాలు వారాలౌను నీవు నేను కూడితే |
| | వారాలు మాసాలౌను బాటే మారీ సాగితే (Bit) |
| చిత్ర | పొంగు నీబంధాలే నీదరీ చేరితే |
| బాలు | గాయాలు ఆరేనూ నీ ఎదుట వుంటే |
| చిత్ర | నీవే కదా నా ప్రాణం |
| బాలు | నీవే కదా నాలోకం |
| | సుందరి నేనే నువ్వంట (Bit) చూడనీ నీలో నన్నంట (Bit) |
| చిత్ర | కానుకే ఇచ్చా మనసంత (Bit)...జన్మకే తోడై నేనుంటా (Bit) |
| బాలు | గుండెలో నిండమంటా..నీడగా పాడమంటా...నాసిరి నీవేనటా (Bit) |
| | సుందరి నేనే నువ్వంట (Bit) చూడనీ నీలో నన్నంత (Bit) |
| చిత్ర | కానుకే ఇచ్చా మనసంత (Bit) జన్మకే తోడై నేనుంటా (Bit) |

★★★



# దళపతి (1992)

రచన : **రాజశ్రీ** గానం : **మనో, స్వర్ణలత**

:::::: Opening Music Bit ::::::

పల్లవి

అతడు ఆ...ఆ...ఆ...ఆ...ఆ...ఆ...ఆ...ఆ...ఆ...ఆ...ఆ...
ముద్దబంతి పూచేనులే...తేనెజల్లు చిందేనులే...
ఊహలన్నీ ఊరేగెనే...నందనాలు విందు చేసెనే.. }॥2॥
గుండెల్లో ఊసులన్నీ...కళ్ళల్లో పొంగెనే...
కళ్ళల్లో బాసలన్నీ...రాగాలై సాగెనే...
ముద్దబంతి పూచేనులే...తేనెజల్లు చిందేనులే...
ఊహలన్నీ ఊరేగెనే...నందనాలు విందు చేసెనే..

:::::: BIT :::::

చరణం

అతడు జాబిల్లీ..ఆనింగిలోన...మబ్బులలో దాగేనో...వెన్నెలలే...దాచేనో...
ఆమె నీయనీ...నీధ్యాసలోనే...పిలిచేనే నాధ్యానం...నీతోనే...నాలోకం...
అతడు కనికరించి నన్నే...సేదతీర్చువేళా..
ఆమె కళ్ళలోన ప్రేమా...చిలకరించువేళా...
అతడు కరిగేనే...నీలో...
ఆమె ముద్దబంతి పూచేనులే...తేనెజల్లు చిందేనులే...
ఊహలన్నీ ఊరేగెనే...నందనాలు విందు చేసెనే..

:::::: **BIT** :::::

చరణం

ఆమె జీవితం...పండేను నేడూ...పలికెనులే ఓగీతం...పాడెనులే సంగీతం..
అతడు తోడుగా...నీవున్ననాడూ...ఆశలకే శ్రీకారం...మమతలకే ప్రాకారం...
ఆమె చల్లగాలి నీవై....సద్దుచేసి నావే...
అతడు చందమామ నీవై...పలకరించి నావే...
ఆమె వెలిసేనే...నీకై...
అతడు ముద్దబంతి పూచేనులే...తేనెజల్లు చిందేనులే...

Contd...

ఊహాలన్ని ఊరేగెనే...నందనాలు విందు చేసెనే..

ఆమె ముద్దబంతి పూచేనులే...తేనెజల్లు చిందేనులే...
ఊహాలన్ని ఊరేగెనే...నందనాలు విందు చేసెనే..

అతడు గుండెల్లో ఊసులన్నీ...కళ్లల్లో పొంగెనే...

ఆమె కళ్లల్లో బాసలన్నీ...రాగాలై సాగెనే...
ముద్దబంతి పూచేనులే...తేనెజల్లు చిందేనులే...
ఊహాలన్ని ఊరేగెనే...నందనాలు విందు చేసెనే..

అతడు ముద్దబంతి పూచేనులే...తేనెజల్లు చిందేనులే...
ఊహాలన్ని ఊరేగెనే...నందనాలు విందు చేసెనే..

★★★



## దళపతి (1992)

రచన : **రాజశ్రీ** గానం : **బాలు, జేసుదాస్, బృందం**

:::::: Opening Music ::::::

పల్లవి

అతడు సింగారాల పైరుల్లోన...బంగారాలే పండేనంట...పాడాలి... } ॥2॥
అతడు2 నవ్వుల్లోన పువ్వుల్లాగ...జీవితాలే సాగాలంట...ఆడాలీ...
బృందం ఈనాడూ...ఊరంతటా...రాగాల...దీపాలటా...
నీ కోసం వెలిగేనటా...ఉల్లాసం...నీవేనటా...హోయ్
అతడు సింగారాల పైరుల్లోన...బంగారాలే పండేనంట...పాడాలి...
అతడు2 నవ్వుల్లోన పువ్వుల్లాగ...జీవితాలే సాగాలంట...ఆడాలీ...

:::::: BIT ::::::

చరణం

అతడు ఒద్దంటానే పాతదనాన్ని...ముద్దంటానే కొత్తదనాన్ని
కొత్తగ ఇపుడే పుట్టావనీ అనుకోమంటారా...హోయ్...
అతడు2 బతుకేదారి పోతేఏంటి...బాటేదైనా నీకదిఏంటి
నారుని వేసే ఆపైవాడే...నీరేపోస్తాడే...హోయ్!
అతడు మూలబడివున్న...బుట్టా తట్టా తీసి భోగిమంటల్లోన
నీవే వెయ్యరా..హోయ్!
అతడు2 తెల్లవారగానే..సంకురాత్రి కాదా..పొంగేపాలు అందరిపాలు హాయిగా..
ఇద్దరు నేలతల్లి పంచేనంట పైడీపంటా నీకూనాకూ...
అంతకంటె సందదేది లేదే...హోయ్!
అతడు సింగారాల పైరుల్లోన...బంగారాలే పండేనంట...పాడాలి...
అతడు2 నవ్వుల్లోన పువ్వుల్లాగ...జీవితాలే సాగాలంట...ఆడాలీ...
బృందం ఈనాడూ...ఊరంతటా...రాగాల...దీపాలటా...ఒహ్హోయ్!
సింగారాల పైరుల్లోన...బంగారాలే పండేనంట...పాడాలి...
నవ్వుల్లోన పువ్వుల్లాగ...జీవితాలే సాగాలంట...ఆడాలీ...

:::::: BIT ::::::

Contd...

చరణం

అతడు  బంధాలేంటి...బంధువులేంటి...పోతే ఏంటి...వస్తే ఏంటి...
తిండేలేదని దిగులే పడనీ జన్మేనాదిరా...హోహో...హో...

అతడు2  మనసే యిచ్చి...చెయ్యందించి తోడైనీడై మిత్రుడు కలిసే
అతనికంటే చుట్టాలెవరూ నాకే లేరంటా...

అతడు  హృదయం మాత్రం నాది...ఊపిరికాదా తనదే...

అతడు2  నానేస్తంకోసం ప్రాణాలైనా యిస్తానే...

అతడు  నా మిత్రుడు పెట్టే తిండి...నేతింటున్నానీవేళ...

అతడు2  తనమాటే నాకు వేదం అంటా ఏవేళా...

ఇద్దరు  శోకం వీడే స్వర్గం చూసే రాగం పాడే తాళం వేసే...
పాటలు పాడే పువ్వుల జంట మేమే...హోయ్

అతడు  సింగారాల పైరుల్లోన...బంగారాలే పండేనంట...పాడాలి...

అతడు2  నవ్వుల్లోన పువ్వుల్లాగ...జీవితాలే సాగాలంట...ఆడాలీ...

బృందం  ఈనాడూ...ఊరంతటా...రాగాల...దీపాలటా...
నీకోసం వెలిగేనటా...ఉల్లాసం నీవేనటా...హోయ్!
సింగారాల పైరుల్లోన...బంగారాలే పండేనంట...పాడాలి...
నవ్వుల్లోన పువ్వుల్లాగ...జీవితాలే సాగాలంట...ఆడాలీ... (Long Bit)

★★★



## దళపతి (1992)

రచన : రాజశ్రీ గానం : బాలు, చిత్ర, బృందం

:::::: Opening Music ::::::

పల్లవి

అతడు అరె...చిలకమ్మా చిటికెయ్యంట..(Bit) నువు రాగాలే పాడాలంట(Bit)
ఇక సాగాలీ మేళాలంట (Bit)
బృందం జగ జగ జగజాం
అతడు నీ సరదాలే రేగాలంట (Bit)
బృందం జగ జగ జగ జగ జగజ
ఆమె ఓ చిన్నోడా పందిరివెయ్‌రా (Bit) ఓ రోజాపువ్ మాలేతేరా (Bit)
ఈ చినదానీ మెడలో వెయ్‌రా (Bit)
బృందం జగ జగ జగజాం
ఆమె నడిరేయంతా సందడి చెయ్‌రా (Bit)
బృందం జగ జగ జగ జగ జగజ
అతడు ఆ టక్కరిగాడే..అహ ఈ బుల్లోడే (Bit)
నను కట్టివేసే...మొనగాడే లేడే...(Bit)
బృందం జాంగు జక్కి జకక్కు జక్కి జాంగు జక్కిజా ॥4॥
అతడు అహ..చిలకమ్మా చిటికెయ్యంట(Bit) నువు రాగాలే పాడాలంట(Bit)
ఆమె ఓ చిన్నోడా పందిరివెయ్‌రా (Bit) ఓ రోజాపువ్ మాలేతేరా

:::::: BIT :::::

చరణం

అతడు చీకూ చింతాలేదూ...చిందులేసే ఊరూ
పాటా ఆటా ఇది ఏందంట
ఆమె అహ...ఊరిలోనివారు...ఒక్కటైనారూ
నీకూ నాకూ వరసేనంట
అతడు పండగ నేడే మన ఊరికే...ఆశలు రేపే కలలూరేనే
వాడనిదంటా ఈ వేడుకే...అందరికింక వెత తీరేనే
ఆ...ఈపూటా కానీరా..ఆటాపాటా
బుల్లెమ్మా నవ్వించంట (Bit)
బృందం జగ జగ జగజాం
అతడు మణి ముత్యాలే రాలేనంట (Bit)
బృందం జగ జగ జగ జగ జగజ
ఆమె అరె...మామయ్య రేగాడంట (Bit)

Contd...

| | |
|---|---|
| బృందం | జగ జగ జగజాం |
| ఆమె | నా మనసంతా దోచాడంట (Bit) |
| బృందం | జగ జగ జగ జగ జగజ |
| అతడు | నీమాటే నాకు..ఓ వెండికోట....నువ్ నాదేనంట..నీతోనే వుంటా |
| బృందం | జాంగు జక్కి జకక్కు జక్కి జాంగు జక్కిజా ॥4॥ |
| అతడు | హె..హె..హె..అరె...చిలకమ్మా చిటికెయ్యంట (Bit)<br>నువు రాగాలే పాడాలంట (Bit) |
| ఆమె | అరె...మామయ్య రేగాడంట (Bit) నా మనసంతా దోచాడంట |

:::::: BIT :::::

చరణం

| | |
|---|---|
| అతడు | వేడుకైనవేళా...వెన్నెలమ్మలాగా..దీపం నీవై వెలగాలంటా |
| ఆమె | అహా...చీకటంతపోయే...పట్టపగలాయె<br>ఏలా దీపం యిక మనకంటా... |
| అతడు | జాతికి నేడే మంచికాలమే...నమ్మకముంటే వచ్చి తీరేనే<br>ఊరికి నీవే మేలు కోరితే...కోరికలన్నీ రేపే తీరేనే...<br>అరె...ఆనందం...నీసొంతం...అంతేకాదా...<br>చిట్టెమ్మా నన్నే చూడు (Bit) జత చేరమ్మా నాతోపాటు (Bit) |
| ఆమె | మురిపాల పండగపూట మన ముచ్చట్లే సాగాలంట (Long Bit) |
| బృందం | ఊ...ఊఊ...ఊఉఊఊ...ఉఊ...<br>బంగారు పరువం...పలికె ఈ వేళా గుసగుసలు...<br>పదుచు కలలే బాకులై వాలెనే..మహదానందం..<br>చిలిపి కథలన్ని కురిపించెనూ...మరిపించెనూ...<br>ఆదమరిచే మూగ మనసులే వెన్నెలనే కురిపించేనే...<br>మూగ మనసులే వెన్నెలనే కురిపించేనే... |
| అతడు | అరె...చిలకమ్మా చిటికెయ్యంట నువు రాగాలే పాడాలంట |
| ఆమె | ఓ చిన్నోడా పందిరివెయ్‌రా (Bit) ఓ రోజాపువ్ మాలేతేరా (Bit) |
| అతడు | ఆ రోసయ్యంటే...నీతోడై వుంటా...నీకళ్లల్లోన...నే కాపరముంటా.. |
| బృందం | జాంగు జక్కి జకక్కు జక్కి జాంగు జక్కిజా ॥4॥ |
| అతడు | అహా...చిలకమ్మా చిటికెయ్యంట (Bit) నువ్ రాగాలే పాడాలంట (Bit) |
| ఆమె | ఓ చిన్నోడా పందిరివెయ్‌రా (Bit) ఓ రోజాపువ్ మాలేతేరా |
| అతడు | ఊ..ఊc... |

★★★

## గుణ (1992)

రచన : **వెన్నెలకంటి** గానం : **మాధవపెద్ది రమేష్**

:::::: Opening Music ::::::

పల్లవి ఆ... అఆఆ.. అఆఆ.. అఆఆ.. ఓ.. ఒఒఓ.. ఒఒఓ.. ఒఒఓ.. (Long Bit)
పిచ్చి బ్రహ్మ ఆడుతున్న తోలుబొమ్మలాటలోన
ఎప్పుడింక ఆటవిడుపూ... ఓ తమ్ముడా...
చెప్పుకుంటె జాలిగొలుపూ...
ఈ పుట్టుటేమొ...గిట్టుటేమొ...చిత్రమేమొ...చెప్పలేని
సంశయాల మేలుకొలుపు...ఓ తమ్ముడా...
సంకటాల బ్రహ్మతలపూ...
కన్ను తెరిస్తె జననం...కన్ను మూస్తె మరణం...
రెప్పపాటు జన్మా...తప్పదంట కర్మా...
పిచ్చి బ్రహ్మ ....పిచ్చి బ్రహ్మ ఆడుతున్న తోలుబొమ్మలాటలోన
ఎప్పుడింక ఆటవిడుపూ... ఓ తమ్ముడా...
చెప్పుకుంటె జాలిగొలుపూ...

:::::: **BIT** ::::::

చరణం తల్లి తండ్రి ఆలూమగలూ అందమైన బంధమూ (Bit)
నాటకాలలోకం వేసే మాయదారి వేషమూ (Bit)
వెనకవుండి నడిపేవాడూ....సూత్రధారి దేవుడూ (Bit)
వెతలలోన నలిగేవాడూ...పాత్రధారి జీవుడూ (Bit)
వీడదంట దేహం...సందేహం...నీదాహం...నూరేళ్లవరకూ (Bit)
తీరిపోతే లోపం..నీపాపం...ఆదీపం...వెయ్యేళ్ల వెలుగూ (Bit)
ఈ వైరాగ్యం...ఆరోగ్యం...విస్సన్న...వేమన్న...సామన్న తత్వమిది
పిచ్చి బ్రహ్మ ....పిచ్చి బ్రహ్మ ఆడుతున్న తోలుబొమ్మలాటలోన
ఎప్పుడింక ఆటవిడుపూ... ఓ తమ్ముడా...
చెప్పుకుంటె జాలిగొలుపూ...

Contd...

:::::: BIT ::::::

చరణం నీటిమీద రాతే కాదా ప్రాణమైన దేహమూ (Bit)
ఓటికుండ మోతేలేరా పెంచుకున్న పాశమూ (Bit)
ఎవరికోసమేనాడైనా ఆగబోదు కాలమూ (Bit)
ఎవరికెవరు ఈ లోకంలో అదే ఇంద్రజాలమూ (Bit)
మూడునాళ్ల భోగం...వైభోగం...నీభాగం ఏమౌను తుదకూ (Bit)
ఆలకించి వేదం..వివాదం...సంవాదం...నీదారి వెదుకూ (Bit)
ఇది వేదాంతం...సిద్ధాంతం..సత్యాన ముత్యాలు పంచేటి బాధ ఇది
పిచ్చి బ్రహ్మ ....పిచ్చి బ్రహ్మ ఆడుతున్న తోలుబొమ్మలాటలోన
ఎప్పుడింక ఆటవిడుపూ... ఓ తమ్ముడా...
చెప్పుకుంటె జాలిగొలుపూ...
ఈ పుట్టుటేమొ...గిట్టుటేమొ...చిత్రమేమొ...చెప్పలేని
సంశయాల మేలుకొలుపు...ఓ తమ్ముడా...
సంకటాల బ్రహ్మతలపూ...
కన్ను తెరిస్తె జననం...కన్ను మూస్తె మరణం...
రెప్పపాటు జన్మా...తప్పదంట కర్మా...
పిచ్చి బ్రహ్మ ....పిచ్చి బ్రహ్మ ఆడుతున్న తోలుబొమ్మలాటలోన
ఎప్పుడింక ఆటవిడుపూ... ఓ తమ్ముడా...
చెప్పుకుంటె జాలిగొలుపూ...
ఈ పుట్టుటేమొ...గిట్టుటేమొ...చిత్రమేమొ...చెప్పలేని
సంశయాల మేలుకొలుపు...ఓ తమ్ముడా...
సంకటాల బ్రహ్మతలపూ...

★★★

## తొలిముద్దు (1993)

రచన : భువనచంద్ర గానం : బాలు, జానకి

:::::: Opening Music ::::::

పల్లవి

అతడు చిట్టిగుమ్మ పదవే రెండు రెక్కలు కట్టుకుందాం (Bit)

ఆమె వెండిమబ్బు ఒడిలో ముద్దు ముచ్చటలాడుకుందాం

అతడు చిరుగాలై కొండా కోనల్లోనా తేలీ

ఆమె చిరునవ్వై పూలగుండెల్లోన దాగాలీ ||2||

అతడు చిట్టిగుమ్మ పదవే రెండు రెక్కలు కట్టుకుందాం (Bit)

ఆమె వెండిమబ్బు ఒడిలో ముద్దు ముచ్చటలాడుకుందాం

:::::: BIT :::::

చరణం

ఆమె కదలీ అంచుల్లో జలకాలాడీ...

అలలా అంతూ పొంతూ చూసొద్దామా..

అతడు యమహో ముందో ముద్దు లాగిద్దామా.. (Bit)

ఆమె తొణికే వెన్నెల్లో సరసాలాడీ

వయసూ హద్దూ పొద్దూ తేలుద్దామా...

అతడు త్వరగా అస్సూ బుస్సూ కానిద్దామా(Bit)

ఆమె తరగని మోహాలే వేశాయీ వలలో

తడితడి ఒంపుల్లో పిల్లోడా..

అతడు అరగని అందాలే పొంగాయి సడిలో

పెదవుల తాంబూలం అందీవే

ఆమె తనువిచ్చెయ్‌మంటోందీ..మనసొద్దొద్దంటోందీ

అతడు ఇక సిగ్గేమంటూ కొమ్మా రెమ్మా ఊగాడిందీ

చిట్టిగుమ్మ పదవే రెండు రెక్కలు కట్టుకుందాం (Bit)

ఆమె వెండిమబ్బు ఒడిలో ముద్దు ముచ్చటలాడుకుందాం

అతడు చిరుగాలై కొండా కోనల్లోనా తేలీ

ఆమె చిరునవ్వై పూలగుండెల్లోన దాగాలీ

అతడు చిట్టిగుమ్మ పదవే రెండు రెక్కలు కట్టుకుందాం (Bit)

ఆమె వెండిమబ్బు ఒడిలో ముద్దు ముచ్చటలాడుకుందాం

Contd...

:::::: BIT :::::

చరణం

| | |
|---|---|
| అతడు | చలిలో చిన్నారీ...వయ్యారాలే కసిగా గుచ్చీగుచ్చీ ఊరిస్తుంటే |
| ఆమె | ఉసిగా తట్టీతట్టీ ఊగిస్తుంటే (Bit) |
| అతడు | వలపుల కౌగిళ్ల నజరానాలే...రతిలా మళ్లీమళ్లీ అందిస్తుంటే |
| ఆమె | మరుడే ఒళ్లోకొచ్చీ కవ్విస్తుంటే (Bit) |
| అతడు | తెలియని ఆవేశం రేగిందే మదిలో... |
| | తలుపులు తీవేమే బుల్లెమ్మా |
| ఆమె | పరువపు ఆరాటం తీరాలి జడిలో... |
| | తకధిమి సాగించెయ్ బుల్లోడా... |
| అతడు | ఇహ అడ్డేముందమ్మో...మలి ముద్దిచ్చేవమ్మో |
| ఆమె | మెరుపల్లే బాణం సంధించైరా వీరా ధీరా |
| అతడు | చిట్టిగుమ్మ పదవే రెండు రెక్కలు కట్టుకుందాం (Bit) |
| ఆమె | వెండిమబ్బు ఒడిలో ముద్దు ముచ్చటలాడుకుందాం |
| అతడు | చిరుగాలై కొండా కోనల్లోనా తేలీ } ॥2॥ |
| ఆమె | చిరునవ్వై పూలగుండెల్లోన దాగాలీ |
| అతడు | చిట్టిగుమ్మ పదవే రెండు రెక్కలు కట్టుకుందాం (Bit) |
| ఆమె | వెండిమబ్బు ఒడిలో ముద్దు ముచ్చటలాడుకుందాం |

★★★



## తొలిముద్దు (1993)

రచన : భువనచంద్ర గానం : బాలు, జానకి, బృందం

:::::: Opening Music ::::::

పల్లవి

బృందం జంజగజగ...జంజగజగ...జంజగజగ...జంజంజగ... ॥2॥

అతడు తొలిముద్దు తొలిముద్దు...తొలిప్రేమ సరిహద్దు...
దాటింది నాగువ్వనేడూ...మళ్లీమళ్లీ ముద్దిమ్మంది ఈడూ...

ఆమె తొలిముద్దు తొలిముద్దు...తొలిప్రేమ సరిహద్దు...
దాటింది గోరింక నేడూ...మళ్లీమళ్లీ ముద్దిమ్మంది చూడూ...

అతడు కౌగిళ్ల పందిళ్లు వేయనా...

ఆమె పూలంగి సేవల్లు చేయనా...

అతడు అరె...హొయ్యారే...హొయ్యారే...హొయ్...హొయ్...

ఆమె అహా..తొలిముద్దు తొలిముద్దు...తొలిప్రేమ సరిహద్దు...
దాటింది గోరింక నేడూ...మళ్లీమళ్లీ ముద్దిమ్మంది చూడూ...

అతడు తొలిముద్దు తొలిముద్దు...తొలిప్రేమ సరిహద్దు...
దాటింది నాగువ్వనేడూ...మళ్లీమళ్లీ ముద్దిమ్మంది ఈడూ...

:::::: BIT ::::::

చరణం

బృందం తిరిత్తిరి తిత్తీరిరీరీ...రంభం...తిరిత్తిరి తిత్తీరిరీ...(Bit)
తిత్తీరిరీరీ...తిత్తిత్తీరి...తిత్తిత్తీరి...రీ...(Bit)

అతడు కంటిమీద కాటుకల్లే...కొంటె ముద్దులీయనా..
పాలబుగ్గలందుకునీ...పూలముద్దు లీయనా...

ఆమె ముత్యమంతముద్దునిచ్చీ...నిన్ను పెనవేయనా..
మోజుపడ్డ అందగాడీ..ముచ్చటేదో తీర్చనా...

అతడు ఓపలేని తాపమిదీ..దాహమింక తీరనీ

ఆమె ముద్దులన్ని మాలగట్టీ...గుండెమీద వేయనీ...
అరె....హొయ్యారే...హొయ్యారే...హొయ్యారే...హొయ్యారే...

Contd...

హొయ్యారే...హొయ్యారే...హొయ్యారే...హొయ్...

అతడు తొలిముద్దు తొలిముద్దు...తొలిప్రేమ సరిహద్దు...
దాటింది నాగువ్వనేడూ...

ఆమె మళ్లీమళ్లీ ముద్దిమ్మంది చూడూ...

:::::: BIT ::::::

చరణం

బృందం రరరారరరరరా..రరరారరరరరా... (Long Bit)

ఆమె ముద్దుకొక ముద్దునిచ్చీ...నన్ను రాణి చేసుకో...
గువ్వపిట్టలాగ నన్నూ...గుండెలోన దాచుకో...

అతడు ముద్దువచ్చు ముద్దునిచ్చీ...ప్రేమనంత దోచుకో...
అందరాని అంబరాల అంచులేవొ చేరుకో...

ఆమె చెప్పలేని ఘాటువుందీ...చీకటింటి ముద్దులో...

అతడు విప్పలేని కోరికుందీ...హత్తుకున్న ముద్దులో...
అరె....హొయ్యారే...హొయ్యారే...హొయ్యారే...హొయ్యారే...
హొయ్యారే...హొయ్యారే...హొయ్యారే...హొయ్...

ఆమె ఆహా...తొలిముద్దు తొలిముద్దు...తొలిప్రేమ సరిహద్దు...
దాటింది గోరింక నేడూ...మళ్లీమళ్లీ ముద్దిమ్మంది చూడూ...

అతడు ఆహా...తొలిముద్దు తొలిముద్దు...తొలిప్రేమ సరిహద్దు...
దాటింది నాగువ్వ నేడూ...మళ్లీమళ్లీ ముద్దిమ్మంది ఈడూ...

ఆమె కౌగిళ్ల పందిళ్లు వేయనా...

అతడు పూలంగి సేవల్లు చేయనా...

ఆమె అరె...హొయ్యారే...హొయ్యారే...హొయ్...హొయ్...

అతడు ఆహా..తొలిముద్దు తొలిముద్దు...తొలిప్రేమ సరిహద్దు...
దాటింది నాగువ్వనేడూ...మళ్లీమళ్లీ ముద్దిమ్మంది ఈడూ...

ఆమె తొలిముద్దు తొలిముద్దు...తొలిప్రేమ సరిహద్దు...
దాటింది గోరింక నేడూ...మళ్లీమళ్లీ ముద్దిమ్మంది చూడూ...

★★★

# కుంతీ పుత్రుడు (1993)

రచన : **జాలాది** గానం : **బాలు**

పల్లవి

ఆఆఆ..ఓఓఓఓ..ఆఆఆఆ..ఆఆఆఆ..
ఓఓఓఓ..ఆఆఆఆఆ..(Long Bit)
లేలే...బాబా నిద్దురలేవయ్యా...(Bit)
ఏలే...స్వామీ మేలుకోవయ్యా...(Bit)
రవితేజ కిరణమే...నీ శరణు కోరుతూ...
చరణాల...చేరగ...తలుపుతీసె...రా...బాబా...
లేలే...లేలే...లేలే బాబా నిద్దురలేవయ్యా...(Bit)
ఏలే...స్వామీ మేలుకోవయ్యా...

:::::: **BIT** ::::::

చరణం

వేగుచుక్క తిలకమెట్టీ...వేదమంత్ర పూలుపెట్టీ...ఆఆఆ...
వేగుచుక్క తిలకమెట్టీ...వేదమంత్ర పూలుపెట్టీ...
పాదసేవ చేసుకొనే...వేళదాటిపోయెననీ...
ప్రశ్న వేయకుంటే మంచిదే...ఇద్దరికీ...
పెద్దకొడుకంటే ముద్దేలే...ఏ తండ్రికీ..
అందుకనె గుండె...నీగురుపీఠమైనదీ..
ఆరాధ్యదైవమని కొనియాడుతున్నదీ...
అంతకు మించిన భాగ్యమేదిరా..బాబా
లేలే...బాబా నిద్దురలేవయ్యా...(Bit)
ఏలే...స్వామీ మేలుకోవయ్యా...(Bit)
రవితేజ కిరణమే...నీ శరణు కోరుతూ...
చరణాల...చేరగ...తలుపుతీసె...రా...బాబా...
లేలే బాబా నిద్దురలేవయ్యా...(Bit)
ఏలే...స్వామీ మేలుకోవయ్యా...

:::::: **BIT** ::::::

Contd...

చరణం

నీలకంఠస్వామిలో...నిండుకున్న జ్యోతివై (Bit)
సత్యమైన వెలుగులో...దత్తాత్రేయ రూపమై...(Bit)
లోకములు కాచే తండ్రివీ...నీవేననీ...
రూపములనేకములైన శ్రీసాయివీ...(Bit)
నమ్ముకున్న వారికెల్ల నారాయణాత్మవై
కుమ్మరించు వరములే సుఖశాంతి నెలవులై
వెంటన నువ్వుంటె లోటేలేదుగా...బాబా...
లేలే...బాబా నిద్దురలేవయ్యా...(Bit)
ఏలే...స్వామీ మేలుకోవయ్యా...(Bit)
రవితేజ కిరణమే...నీ శరణు కోరుతూ...
చరణాల...చేరగ...తలుపుతీసె...రా...బాబా...
లేలే...లేలే...బాబా నిద్దురలేవయ్యా...(Bit)
ఏలే...స్వామీ మేలుకోవయ్యా...(Bit)

★★★



## కుంతీ పుత్రుడు (1993)

రచన : **రసరాజు** గానం : **జేసుదాస్**

:::::: Opening Music ::::::

పల్లవి

ఆ..ఆఆఆఆ..ఆఆఆఆ..ఆఆఆఆ..ఆఆఆ..ఆఆఆ..ఆ..ఆఆఆ..
ఒక హృదయము పలికిన సరిగమ స్వరము ఇది
ఎవరాపిన ఆగని సంధ్యారాగమిదీ (Bit) } ॥3॥
ఓ మేఘమా...ఆనింగిలో...ఈపాటనే...వినిపించవే...
నా మైథిలీ లేకుంటే ఎందుకు నాకు ఈ జీవితం
ఒక హృదయము పలికిన సరిగమ స్వరము ఇది (Bit)
ఎవరాపిన ఆగని సంధ్యారాగమిదీ

:::::: BIT ::::::

చరణం

ఆకాశవీధిలో...ఆషాడమాసాన మేఘమై...
ఆ కాళిదాసులో...అందాల సందేశరాగమై...
నాలోని ప్రేమ విరులై పూయగా...
నాగుండె గొంతు వలపై కూయగా... } ॥2॥
నిసరి...నిసరిగ...సరి..(Bit) గరిస..గరిసనిద...(Bit)
పామగరి...పమగరి...దనిసరి...(Bit) రీ...గమప...రిగమప..
దనిసరి (Bit) రిసరి.. సనిసాని..దని..నిదనిదప...గమరిమ..
గమపద..నిదప...గరిస...నిసని..సనిదప..
మగరి...హృదయము పలికిన సరిగమ స్వరము ఇది (Bit)
ఎవరాపిన ఆగని సంధ్యారాగమిదీ....

:::::: BIT ::::::

చరణం

ఏనాటి బంధమో...ఈనాడు ఊగించెనన్నిలా...
ఏ పూలగంధమో..నాపైని చల్లింది వెన్నెలా...
ఆ ప్రేమకే నేను పూజారిగా..
ఆ గుండెలో చిన్న దీపానిగా... } ॥2॥

Contd...

దరిగ...సరినిసరి...నిసని (Bit) రిగరి...సనిసదప...
దమప...(Bit) దనిసరి..సగరిమగ..గరిసమగపమ...
దప...పమప....నిదప...రిరిస...దమదస రిరిసగరి...రిగరి...
సనిదమ...సరిరిరిసరీగరీగరీ...గామగామగా...గరిస...
రిరిసనిద దనిసప...సనినిద...దనిదప...దపమగ...రిగమప...
గమపద...మమపద...సగరి సని దమప...పగరిగరి...
పరిగరిస...రిగరిగస...పదప...దపనిదప...మగరిస...రిరిసని...
దప...మగరిస...ఒక హృదయము పలికిన సరిగమ స్వరము ఇది (Bit)
ఎవరాపిన ఆగని సంధ్యారాగమిదీ (Bit)
ఓ మేఘమా...ఆనింగిలో...ఈపాటనే...వినిపించవే...
నా మైథిలీ లేకుంటే ఎందుకు నాకు ఈ జీవితం
ఒక హృదయము పలికిన సరిగమ స్వరము ఇది (Bit)
ఎవరాపిన ఆగని సంధ్యారాగమిదీ (Bit)

★★★



## అమ్మకొడుకు (1993)

రచన : **వేటూరి** గానం : **బాలు, చిత్ర, బృందం**

:: Opening Music ::

పల్లవి

బృందం **అఅఆఅ... అఅఆఅ.. ఆ.. ఆ.. ఆఆఅఆఆ.. అఅఅఅ...**
**అఅఅఅఆ.. ఆఆ.. ఆఆఅఅఆఅఆ... ఆఅఅఆఆఆఆ...**
**ఆఆఅఆఅఅ.. అ.. ఆ.. అ.. ఆఆ...** (Bit)

అతడు కోవెల గంటలు ఏమన్నవీ...
ఆమె నా తొలిపూజలు నీకన్నవీ..
అతడు ప్రేమకు నీపెదవే పల్లవీ...
ఆమె కన్నుల కాసిన జాబిల్లివీ...
అతడు కోవెల గంటలు ఏమన్నవీ...
ఆమె నా తొలిపూజలు నీకన్నవీ...

:::::: **BIT** ::::::

చరణం

అతడు మల్లెజాజుల్లో...వాసనే...మౌనమూ...
మత్తెక్కించే ఆ మౌనమే...ప్రాణమూ... (Bit) } ॥2॥
ఆమె పూలలో తేనెలూ...గాలికే ఆరవూ
అతడు నింగిలో తారలూ...వానకే...రాలవూ...
ఆమె తొలకరి అనుభవం అతడు : ఆ...ఆహాహా...
ఆమె తొడిమకు పులకరం అతడు : ఓ...ఓహొహో...
ఆమె తొలకరి అనుభవం...తొడిమకు పులకరం
తేనెపాలు చిలికిన వయసును
అతడు కోవెల గంటలు ఏమన్నవీ...
ఆమె నా తొలిపూజలు నీకన్నవీ..
అతడు ప్రేమకు నీపెదవే పల్లవీ...
ఆమె కన్నుల కాసిన జాబిల్లివీ...
అతడు కోవెల గంటలు ఏమన్నవీ...
ఆమె నా తొలిపూజలు నీకన్నవీ...

:::::: **BIT** ::::::

Contd...

::::: **BIT** :::::

చరణం

ఆమె వెన్నెల్లో వేడీ కన్నులే మూయదూ
ఏదో ఆరాటం...ఎంతకీ తీరదూ...(Bit) } ||2||

అతడు గుండెలో..వేసవీ..చూపుతో...ఆరదూ...

ఆమె మనసులో...ఆకలీ...మాటతో...ఆగదూ...

అతడు పెదవుల పరిచయం... ఆమె : ఆ..ఆహాహా...

అతడు ఎదలకు పరిణయం... ఆమె : ఓ...ఓహోహో...

అతడు పెదవుల పరిచయం...ఎదలకు పరిణయం...
మాఘవేళ మలచిన వయసున
కోవెల గంటలు ఏమన్నవీ...

ఆమె నా తొలిపూజలు నీకన్నవీ..

అతడు ప్రేమకు నీపెదవే పల్లవీ...

ఆమె కన్నుల కాసిన జాబిల్లివీ...

అతడు కోవెల గంటలు ఏమన్నవీ...

ఆమె నా తొలిపూజలు నీకన్నవీ...

★★★



# అమ్మకొడుకు (1993)

రచన : **వేటూరి** గానం : **బాలు, చిత్ర**

:::::: Opening Music ::::::

పల్లవి

అతడు చిన్న చిన్న చినుకుల్లోనా...చిందే చిందే సిగ్గుల్లోనా...
నీలో మోగే...నీటివీణా...నాలోరేగే గాలివానా...
చిన్న చిన్న చినుకుల్లోనా...చిందే చిందే సిగ్గుల్లోనా...
నీలో మోగే...నీటివీణా...నాలోరేగే గాలివానా... చిన్న చిన్నా...

:::::: **BIT** ::::::

చరణం

అతడు చినుకు శోభనం...ముసురు మోహనం
నాలో..నీలో తళుక్కుమంటే...

ఆమె (నవ్వు-వచనం) ఓహో...మేఘం తళుక్కుమందా...
దేహం కలుక్కుమందా...

అతడు వణుకువందనం...వయసు ఇంధనం...
నీరే..నిప్పై...చురుక్కుమంటే...

ఆమె పెదవి తదారిలో...ఎదల ఎదారిలో...
వానే...జల్లై...చివుక్కుమంటే...

అతడు ఒడికి గడేసిన...పడుచుగుడారమే
వంపో...సొంపో...కొరుక్కుతింటే...

ఆమె చెమ్మాచెక్కా..చెంగోయమ్మా...
గోదారక్కా..పొంగేనమ్మా...

అతడు వయసు...కులము...వలపు....మతము
చవిచినుకుల చిటపటలకు తడిసిన ఒడిలో...చిన్న...చిన్న...
చిన్న చిన్న చినుకుల్లోనా...చిందే చిందే...సిగ్గుల్లోనా...
నీలో మోగే...నీటివీణా...నాలో రేగే...గాలివానా...
చిన్న చిన్న...చినుకుల్లోనా...

Contd...

చరణం

అతడు కలికి జీవితం....చెలికి స్వాగతం
అన్నా...విన్నా...అలగకమ్మా...

ఆమె (వచనం) అలిగితే...అందం రెట్టింపౌతుందట..తెలుసా...ఊc..

అతడు ఓహోహో...పడుచుసోయగం...తడిసి ఈదినం...
వేడో...వెచ్చో...చలిరేయిలా...

ఆమె మెరుపు తరంగమై...మేఘ మృదంగమై...
తాళం వేసే కాముడిలో...

అతడు చినుకు టపాలకి...చిలక చిరాకుగా...జాబే..రాసే జాతరలో....

ఆమె పస్తే రావే...వానాయమ్మా...దోస్తీనాకూ...వాడేనమ్మా...

అతడు ఉలికిపడిన మెరుపు వయసు తొలివెన్నెల
పులకరమిది కలిసిన తడిలో ...చిన్నచిన్న...
చిన్న చిన్న చినుకుల్లోనా...చిందే చిందే సిగ్గుల్లోనా...
నీలో మోగే...నీటివీణా...నాలోరేగే గాలివానా...
చిన్న చిన్న చినుకుల్లోనా...చిందే చిందే సిగ్గుల్లోనా...
నీలో మోగే...నీటివీణా...నాలోరేగే గాలివానా... చిన్న చిన్నా...

★★★

## తెలుసుకుందాం

**1985**లో ఇళయరాజా ప్రఖ్యాత వేణుగాన విద్వాంసుడు హరిప్రసాద్ చౌరాసియాతో కలిసి, 'నథింగ్ బట్ విండ్' ఆల్బం తీసుకొచ్చారు. ఆవిష్కరణ కార్యక్రమానికి ముఖ్యఅతిథిగా ప్రముఖ హిందీ చలనచిత్ర సంగీతదర్శకులు నౌషద్ ఆలీ వచ్చారు. గాయకుడు పి.బి. శ్రీనివాస్ నౌషద్ హిందీ ప్రసంగాన్ని అనువదిస్తున్నారు. శ్రీనివాస్‌కి నౌషద్ అంటే వీరాభిమానం. నౌషద్ మాట్లాడుతూ "ఇళయరాజా నాకంటే గొప్ప కంపోజర్" అన్నారట. ఆ మాట శ్రీనివాస్‌కి రుచించలేదు. "నౌషద్‌గారూ! మీ మాట నేను అంగీకరించను. కాబట్టి అనువదించను" అని చెప్పేశారు. చివరికి ఎలాగో ఆ కార్యక్రమం పూర్తయింది. విశేషమేమిటంటే నౌషద్ తన మాటను వెనక్కి తీసుకోకపోవడం!

# అమ్మకొడుకు (1993)

రచన : **వేటూరి** గానం : జిక్కి

:::::: Opening Music ::::::

పల్లవి

కొమ్మా రెమ్మా....కోలో కోలో అంటె...కోకిల పాడెను పాట (Bit) } ॥2॥
ఎండా వానా..ఏలోఏలో అంటు...పాడెనులే ఎంకి పాటా (Bit)
నీ ఎదలో...నా గుండపలికెను జీవితమే మనపాటా...
పాడుకుంటా ఈ జన్మపాట...పదుగురు పాడనిపాటా...
కొమ్మా రెమ్మా....కోలో కోలో అంటె...కోకిల పాడెను పాటా
ఎండా వానా..ఏలోఏలో అంటు...పాడెనులే ఎంకి పాటా

:::::: **BIT** ::::::

చరణం

చిలకే పాడాలి..చిగురే వెయ్యాలి..పరువాల బృందావనీ...
ఎదలో రాగాలు...కదిపే అందాలు..చిలికిందిలే ఆమనీ...
పలికే చిలకమ్మ...కసులే చిలికాయి..వదగళ్లు ఆ పాటకీ...
చెవితో విన్నోరు...శహబాస్ అన్నారు....పలికే రాగాలకీ...
జానపదం పాడుకుంటూ...జావళినైపోయా...ఇలాగే...
అత్తందాల తాంబూలాలూ....గోదారమ్మ తారంగాలూ...
కచ్చేరులే చేసే వేళలో...
కొమ్మా రెమ్మా....కోలో కోలో అంటె...కోకిల పాడెను పాట (Bit)
ఎండా వానా..ఏలోఏలో అంటు...పాడెనులే ఎంకి పాటా

:::::: **BIT** ::::::

చరణం

ఆ...ఆఆ...ఆఆ...ఆఆ...ఆ...
మనసై వుండేది...మమతై పండేది..ఏదో ఏబంధమో } ॥2॥
పెదవై పాడేది..మధువై పొంగేది...ఏజన్మ సంగీతమో..
లాలిపాట పాడమంది..పాపలాంటి బతుకే నీవేళా...

Contd...

మాటలన్ని పువ్వులైతే...తోటతల్లి నవ్వులైతే
పాటకాని పాటే నా కథా...
కొమ్మా రెమ్మా....కోలో కోలో అంటు...కోకిల పాడెను పాట (Bit)
ఎండా వానా..ఏలోఏలో అంటు...పాడెనులే ఎంకి పాట (Bit)
నీ ఎదలో...నా గుండపలికెను జీవితమే ఒకపాటా...
పాడుకుంటా ఈ జన్మపాట...పదుగురు పాడనిపాటా...
కొమ్మా రెమ్మా....కోలో కోలో అంటె...కోకిల పాడెను పాటా (Bit)
ఎండా వానా..ఏలోపలో అంటు...పాడెనులే ఎంకి పాటా

★★★



## అమ్మకొడుకు (1993)

రచన : **వేటూరి** గానం : బాలు

:::::: Opening Music ::::::

పల్లవి (ఆలాపన) ఆహాహో...అఅఅఅ...అఅఆఆ...ఆఆఆ...అఅఅ...
అఅఅ...ఆఆఆ...ఓహోహోహో...(Bit)
గూబు గూబు గుట్టమ్మా...గువ్వా చిట్టెమ్మా
గూట్లో పాట గుండెల్లోనా దాచే పిట్టమ్మా
ఇంపుగా...సొంపుగా...(Bit) తాకితే..తంబురా...(Bit)
ఇందిరా...మందిరా...ఎందుకా...తొందరా...(Bit)
గూబు గూబు గుట్టమ్మా...గువ్వా చిట్టెమ్మా
గూట్లో పాట గుండెల్లోనా దాచే పిట్టమ్మా
ఇంపుగా...సొంపుగా...(Bit) తాకితే..తంబురా

:::::: BIT ::::::

చరణం

గుమ్మా గుమ్మా గువ్వల గుంటా...నాపాటకే ఆదేనంటా
గుచ్చీ గుచ్చీ అడిగిన మాట...చెప్పానంటే చెల్లేనంటా
రెక్కే విప్పి...తైతక్కల తాళాలే వేసేనంట
ఎర్రాముక్కూ వేడెక్కిన రాగాలే తీసేనంటా
సుప్పీ సుప్పీ పాటలన్నీ...దుప్పీ దుప్పీ నేర్చుకుంటా
ఆటా మాటా పంచుకుంటా...
గూబు గూబు గుట్టమ్మా...గువ్వా చిట్టెమ్మా
గూట్లో పాట గుండెల్లోనా దాచే పిట్టమ్మా
ఇంపుగా...సొంపుగా...(Bit) తాకితే..తంబురా...(Bit)

:::::: BIT ::::::

చరణం

వరించినా అతిథీవేళా...వసంతమై వాలిపోగా...
స్వరాలతో ఎదలీవేళ..ఉయ్యాలలే ఊగిపోగా...

Contd...

మొగ్గే విచ్చే...పూదోటలా..నీగాలే వీచేనంట...
బుగ్గే గిచ్చే సయ్యాటలా చేవ్రాలే దాచేనంటా...
అచ్చా తెలుగు పాటలాగా...అందాలన్నీ పాడుకుంటా...
గూడూ ఈడూ పంచుకుంటా...
గూబు గూబు గుట్టమ్మా...గువ్వా చిట్టెమ్మా
గూట్లో పాట గుండెల్లోనా దాచే పిట్టమ్మా
ఇంపుగా...సొంపుగా...(Bit) తాకితే..తంబురా...(Bit)
ఇందిరా...మందిరా...ఎందుకా...తొందరా...(Bit)
గూబు గూబు గుట్టమ్మా...గువ్వా చిట్టెమ్మా
గూట్లో పాట గుండెల్లోనా దాచే పిట్టమ్మా
ఇంపుగా...సొంపుగా...(Bit) తాకితే..తంబురా (Bit)
ఇందిరా...మందిరా...ఎందుకా...తొందరా...

★★★

## మీకు తెలుసా?

మహానది **(1993)** డబ్బింగ్ చిత్రంలో "శ్రీ రంగ రంగ నాథుని దివ్యరూపమే చూడవే.. శ్రీదేవి రంగనాయకి నామం సంతతం పాడవే" అనే గీతాన్ని బాలు, చిత్ర పాడారు. కథానాయకి శోభన ఈ పల్లవి పాడింది. టి.విలో ప్రసారమైన యీ పాటని యాధృచ్ఛికంగా చూసిన కళాతపస్వి కె. విశ్వనాథ్ రచయిత ఎవరో విచారించి, వెన్నెలకంటికి ఫోన్ చేసి అభినందించారు. "నీలవేణిలో నీటి ముత్యాలు, నీరజాక్షునికి పూలుగా... కృష్ణవేణిలో అలలగీతాలు కృష్ణగీతలే పాడగా అనే పంక్తులు తనకి ఎంతో నచ్చాయని, యీ పాట డబ్బింగ్ పాటలాలేదు" అంటూ అభినందన మందారమాలను వెన్నెలకంటి కంఠానికి అలంకరించారు.

# మహానది (1993)

రచన : వెన్నెలకంటి                    గానం : బాలు, చిత్ర, శోభన

సాకీ

ఆమె2 *గంగాతరంగాశ కావేరీ.. శ్రీరంగేశ మనోహరీ..*
*కల్యాణకారి కలుషారీ... నమస్తేస్తు సుధాఝరీ..*
అ... అ... అ... అ... ఆఅ...

పల్లవి

ఆమె2 శ్రీరంగ రంగనాథుని దివ్యరూపమే చూడవే
శ్రీదేవి రంగనాయకి నామం సంతతం పాడవే ॥2॥
నీలవేణిలో నీటిముత్యాలు... (Bit)
కృష్ణవేణిలో అలల గీతాలు (Bit)
నీలవేణిలో నీటి ముత్యాలు నీరజాక్షునికి పూలుగా
కృష్ణవేణిలో అలల గీతాలు కృష్ణ గీతలే పాడగా
శ్రీరంగ రంగనాథుని దివ్యరూపమే చూడవే
శ్రీదేవి రంగనాయకి నామం సంతతం పాడవే

:::::: BIT :::::

చరణం

ఆమె1 కృష్ణాతీరాన అమరావతిలో... శిల్ప కళావాణి పలికిన శ్రుతిలో
అలలై పొంగేను జీవనగీతం.. కలలే పలికించు మధుసంగీతం
చల్లగా గాలి పల్లకీలోన పాట వూరేగగా...
వెల్లువై గుండె పల్లె పదమల్లి పల్లవే పాడగా...
శ్రీ త్యాగరాజ కీర్తనై సాగె తియ్యనీ జీవితం
శ్రీరంగ రంగనాథుని దివ్యరూపమే చూడవే
శ్రీదేవి రంగనాయకి నామం సంతతం పాడవే
నీలవేణిలో నీటి ముత్యాలు నీరజాక్షునికి పూలుగా
కృష్ణవేణిలో అలల గీతాలు కృష్ణ గీతలే పాడగా
శ్రీరంగ రంగనాథుని దివ్యరూపమే చూడవే
శ్రీదేవి రంగనాయకి నామం సంతతం పాడవే

:::::: BIT :::::

Contd...

చరణం

అతడు గంగను మరపించు ఈ కృష్ణవేణీ...
వెలుగులు ప్రవహించు తెలుగింటి రాణీ..
పాపాల హరియించు పావన జలమూ...
పచ్చగ ఈనేల పండించు ఫలమూ...
ఈ ఏటి నీటి పాయలే తేటగీతులే పాడగా...
సిరులెన్నొ పండి ఈ భువి స్వర్గలోకమై మారగా...
కల్లకపటమే కానరాని ఈ పల్లె సీమలో
శ్రీరంగ రంగనాథుని దివ్యరూపమే చూడవే
శ్రీదేవి రంగనాయకి నామం సంతతం పాడవే
నీలవేణిలో నీటి ముత్యాలు నీరజాక్షునికి పూలుగా
కృష్ణవేణిలో అలల గీతాలు కృష్ణ గీతలే పాడగా
శ్రీరంగ రంగనాథుని దివ్యరూపమే చూడవే

అందరు శ్రీరంగ రంగనాథుని దివ్యరూపమే చూడవే
శ్రీదేవి రంగనాయకి నామం సంతతం పాడవే

★★★



## సమరం (1994)

రచన : భువనచంద్ర గానం : బాలు, చిత్ర

:::::: Opening Music ::::::

పల్లవి

ఆమె వెన్నెలలో...మల్లెలలో చిరుగాలి సరిగమలో
నీవె సుమా... (Bit) కలకాదు సుమా... (Bit) ॥2॥
చిలిపి వెన్నెలలో...మల్లెలలో చిరుగాలి సరిగమలో
నీవె సుమా... (Bit) కలకాదు సుమా... (Bit) ॥2॥
కురిసెను నాలో...వలపుల వాన..
మనసున మోగే...మమతల వీణా...

అతడు వెన్నెలలో మల్లెలలో చిరుగాలి సరిగమలో
నీవె సుమా... (Bit) కలకాదు సుమా... (Bit) ॥2॥

:::::: BIT :::::

చరణం

ఆమె నీలాల గగనాన వీచినదో చిరుతార నేడూ...హోయ్ (Bit)
అతడు గారాల నెలవంక తోడుగనే నిలిచింది చూడూ...హో (Bit)
ఆమె ఏ దేవ తమకాలు సుడిరేగె నాలో
అతడు కమ్మంగ ఒడిచేరి కరగాలి నీలో
ఆమె పదవే తపించే క్షణాన...
చిలిపి వెన్నెలలో..మల్లెలలో... చిరుగాలి సరిగమలో...
నీవె సుమా... (Bit) కలకాదు సుమా... (Bit) ॥2॥
కురిసెను నాలో...వలపుల వాన..
మనసున మోగే...మమతల వీణా...

అతడు వెన్నెలలో మల్లెలలో చిరుగాలి సరిగమలో
నీవె సుమా... (Bit) కలకాదు సుమా... (Bit) ॥2॥

:::::: BIT :::::

చరణం

అతడు కౌగిళ్ల ద్వారాలు తీయమనే పిలుపందుకున్నా...(నవ్వు) (Bit)

Contd...

ఆమె శృంగార తీరాలు చేరమని నినుకోరుతున్నా...(నవ్వు) (Bit)

అతడు ఏనాటి కలలన్నీ ఎదచేరినాయో...

ఆమె ఎన్నెన్ని జన్మాల తెరతీసినాయో...

అతడు నీకై జ్వలించే క్షణాన..

ఆమె చిలిపి వెన్నెలలో...మల్లెలలో... చిరుగాలి సరిగమలో...
నీవె సుమా...(Bit)

అతడు కలకాదు సుమా (Bit) నీవె సుమా...(Bit)

ఆమె కలకాదు సుమా (Bit)

అతడు ఓ...కురిసెను నాలో...వలపుల వానా..

ఆమె మనసున మోగే...మమతల వీణా...

అతడు వెన్నెలలో మల్లెలలో చిరుగాలి సరిగమలో నీవె సుమా...(Bit)

ఆమె కలకాదు సుమా...(Bit) నీవె సుమా...(Bit)

అతడు కలకాదు సుమా (Bit)

★★★



# అల్లరిపోలీస్ (1994)

రచన : జాలాది గానం : జేసుదాస్, బృందం

బృందం బంగారు బొమ్మా...మందార కొమ్మా...
పేరంటానికి రారమ్మా...(Bit)
చామంతి పువ్వా..గోరింక నవ్వా....
సీమంతమాడెను చూడమ్మా

పల్లవి

అతడు (ఆలాపనతో)
ఊఊం...ఊఊఊం...ఊఊఉఊం..ఊఊం...ఆఆఆఆ...
అనగనగనగా..ఓచిన్న కథగా...ఆఆఆఆ...
వినవమ్మ చెబుతా గువ్వకథా...(Bit)
పాలగువ్వొకటీ...పూలగువ్వొకటీ జంటగ కలిసిన శుభవేళా
చెరిసగమై ఆడుకోగా...చిరుగాలే పాడె ఆనందలాలి జోలపాటా...
అనగనగనగా..ఓ చిన్న కథగా..వినవమ్మ చెబుతా గువ్వ కథా..(Bit)
పాలగువ్వొకటీ...పూలగువ్వొకటీ జంటగ కలిసిన శుభవేళా

:::::: BIT ::::::

చరణం

అతడు ఒకరికొకరు చెరిసగాల శ్రుతిలయ జతలౌ బ్రతుకులోనా...
విధికి వ్యధకు లొంగిపోయి సాహస గుణమౌ జీవితాలై
ప్రణయమైన రూపమొకరుగా...ప్రమిదలోని దీపమొకరుగా
కలలన్నీ నెరలు నిండగా...కనిపెంచే పలపుపంటగా..
ఉరికే...అజంటా...మైమరిచే దేవి శ్రీమంతం ఆడువేళా

బృందం బంగారు బొమ్మా...మందార కొమ్మా... పేరంటానికి రారమ్మా...(Bit)
చామంతి పువ్వా..గోరింక నవ్వా....సీమంతమాడెను చూడమ్మా

:::::: BIT ::::::

చరణం

కపటవిధికి వికటమైన ప్రళయం గూడే కూల్చిపోగా...
స్వంతమైన జంట గువ్వరూపమదేదో పోల్చలేకా..

Contd...

ఎదురున్నది పాలగువ్వనీ...ఎదనమ్మిన ముద్దుగుమ్మనీ
ఓదార్చే తీరు తెలియకా..లోలోపల గుండె పగులగా
ఏద్చే... ఈస్నేహం.. జతచేర్చే దారి ఏమౌనో..కానరాకా...
అనగనగనగా...ఓచిన్నకథగా...
వినవమ్మ చెబుతా గువ్వకథా... (Bit)
పాలగువ్వొకటీ...పూలగువ్వొకటీ (Bit) జంటగ కలిసిన శుభవేళా
చెరిసగమై ఆడుకోగా...చిరుగాలే పాడె ఆనందలాలి జోలపాటా...

బృందం బంగారు బొమ్మా...మందార కొమ్మా... పేరంటానికి రారమ్మా... (Bit)
చామంతి పువ్వా..గోరింక నవ్వా....సీమంతమాడెను చూడమ్మా

★★★



## హలో యంగ్‌మేన్ (1994)

రచన : వెన్నెలకంటి గానం : బాలు, చిత్ర

:::::: Opening Music ::::::

పల్లవి

ఆమె ఆశ అధరం...మధురం...మధురం..
ప్రేమకావ్యం...హృదయం...హృదయం...
పూలరాగం...వయసుమేఘం...
వసంతమాసం...వలపుకోసం..
నీవు నాచెంతగా...చేరుమా...ప్రాణమా...
ఆశ అధరం...మధురం...మధురం..
ప్రేమకావ్యం...హృదయం...హృదయం...

:::::: BIT ::::::

చరణం

అతడు చెలియవ్వనం...తెరతీసే ఇలా...
చలిమంట మోహం..మదిరేగేనిలా..
ఆమె సరిహద్దులన్ని దాటేసై పొద్దునే...
చిరుముద్దులన్ని కాజేసై హాయిగా....
అతడు కలలనందనం...హో ఓ ఓ...కరిగిపొమ్మనీ...
ప్రేమగీతాలనే పాడగా..తోడుగా...
ఆమె ఆశ అధరం...మధురం..మధురం...
ప్రేమకావ్యం...హృదయం...హృదయం...

:::::: BIT ::::::

చరణం

ఆమె నిలవాలిలే...కరిగేకాలమూ...
గెలవాలిలే...ఒరిగే నేస్తమూ...
అతడు ఎన్నో కలలూ కందామా...జంటగా...
ఎన్నాళ్లైనా ఉందామా..ఒకటిగా...

Contd...

ఆమె నీవే నేనుగా..ఆఆఆఆ...నేనే నీవుగా...ఆఆఆఆ...
స్నేహతీరాలకీ...చేరగా...తీయగా...

అతడు ఆశ అధరం...మధురం...మధురం..
ప్రేమకావ్యం...హృదయం...హృదయం...
పూలరాగం... (ఆమె : ఊహూం)
వయసుమేఘం... (ఆమె : ఆ..ఆ..ఆ..ఆ..)
వసంతమాసం... (ఆమె : ఊహూం)
వలపుకోసం.. (ఆమె : ఆఅఆ..)
నీవు నాచెంతగా...చేరుమా...ప్రాణమా...

ఆమె ఆశ అధరం...మధురం...మధురం..
ప్రేమకావ్యం...హృదయం...హృదయం...

★★★

## మీకు తెలుసా?

లలితశ్రీ కంబైన్స్ పతాకం క్రింద ఆర్.వి. రమణమూర్తి నిర్మాతగా అశోక్‌కుమార్ దర్శకత్వంలో 'అభినందన' చిత్రం నిర్మించారు. కార్తీక్, శోభన జంటగా నటించిన ఈ చిత్ర నిర్మాణం **1985**లో ప్రారంభమైంది. ఆచార్య ఆత్రేయ రాసిన పాటలన్నీ ఇళయరాజా నిర్దేశకత్వంలో ECHO రికార్డింగ్ కంపెనీ ద్వారా LP రికార్డుగా విడుదల అయ్యాయి. (నెం. **800585** LP) ఇందులో అన్నిపాటలు హిట్టే. ప్రత్యేకించి బాలు ఆలపించిన "ఎదుటా నీవే... ఎదలోనా నీవే... ఎటు చూస్తే అటునీవే... మరుగైనాకావే" అనే పాట ట్యూన్ దర్శకుడు వంశీకి చాలా నచ్చింది. అనివార్య కారణాలవల్ల చిత్ర నిర్మాణం జాప్యమై ఈ చిత్రం **01.01.1988**న విడుదలైంది. **1985**లోనే కార్తీక్, భానుప్రియ జంటగా నిర్మాత కామినేని ప్రసాద్ రాంకుమార్ ప్రొడక్షన్స్ పతాకం క్రింద వంశీ దర్శకత్వంలో 'అన్వేషణ' చిత్రం ప్రారంభించారు. చిత్రంలో పాటలన్నీ వేటూరి రాశారు. అభినందన చిత్రం విడుదల జాప్యం కావడంతో వంశీ తనకు నచ్చిన 'ఎదుటానీవే' పాట ట్యూన్‌ని అన్వేషణ చిత్రంలో వాడుకుందామని ఇళయరాజాకు సూచించడంతో... ''ఇలలో కలిసే శిధిలాకాశమూ... కలలో పలికే శుక సంగీతమూ" పాటను ఇళయరాజా అదే ట్యూన్‌లో స్వరపరిచారు. ఈ అన్వేషణ చిత్రం **19.7.1985**న విడుదలై బాక్సీఫీసు విజయం సాధించింది. **01.01.1988**న విడుదలైన అభినందన చిత్రం కూడా అంతే విజయం సాధించింది. రెండుపాటలూ విజయవంతమైన ఈ రెండు చిత్రాల్లో హీరో కార్తీక్ కావడం కొసమెరుపు!

## శ్రీకారం (1996)

రచన : **సిరివెన్నెల** గానం : **బాలు, చిత్ర**

పల్లవి

ఆమె కస్సుమనే కోపం...బుస్సుమనే తాపం (Long Bit)
కస్సుమనే కోపం...బుస్సుమనే తాపం...ఎందుకు లెండీ..? (Bit)
అంత పటాటోపం...ఎందుకటా పాపం...ఏమైందండీ...? (Bit)
కడుపాకలి తీరొద్దా...కాస్తోపిక చేరొద్దా...
ఆనక తీరిగ్గా...అలగొచ్చును ఎంచక్కా..
ఈ నాలుగు ముద్దలు తిందురు లేవండీ..ఓ..హోయ్
కస్సుమనే కోపం...బుస్సుమనే తాపం...ఎందుకు లెండీ..? (Bit)
అంత పటాటోపం...ఎందుకటా పాపం...ఏమైందండీ...?

:::::: BIT ::::::

చరణం

ఆమె ప్రతీపనికి ప్రత్యేకంగా... (Bit) ఏదో సమయముంటుందండీ (Bit)
పట్టింపులూ...పంతాలన్నీ...ఏకాంతవేళ (Bit)
ఇల్లాంటప్పుడు విడ్డూరంగా... (Bit) ఉసూరంటే బాగోదండీ.. (Bit)
ఒళ్లోకొస్తే ఇస్తాలెండీ నా...లాలనా.. (Bit)
క్షమించరా శ్రీవారూ..చాలించరా మీపోరూ....
చూపాలంటే కోపాలూ..చేకొండిక దొరగారూ...
కారాలు చాలండీ...మమకారాలు పంచండీ...
ఈకయ్యాలు కట్టేసి కౌగిళ్లరాజీకి రారండీ... (Bit)
కస్సుమనే కోపం...బుస్సుమనే తాపం...ఎందుకులెండీ... (Bit)
అంత పటాటోపం...ఎందుకటా పాపం...ఏమైందండీ...? (Bit)
కడుపాకలి తీరొద్దా..కాస్తోపిక చేరొద్దా...
అనక తీరిగ్గా...అలగొచ్చును ఎంచక్కా..
ఈ నాలుగు ముద్దలు తిందురు లేవండీ..ఓ.. హేయ్
కస్సుమనే కోపం...బుస్సుమనే తాపం...ఎందుకు లెండీ..? (Bit)
అంత పటాటోపం...ఎందుకటా పాపం...ఏమైందండీ...?

:::::: BIT ::::::

Contd...

చరణం

ఆమె ఎడా పెడా అలిగే హక్కు (Bit) చెడా మడా చీదే ముక్కు (Bit)
పిల్లాళ్లకే రాసాడండీ...ఆ బ్రహ్మదేవుడూ (Bit)
బిగించడం పెళ్లాం వంతు (Bit) ఓదార్చడం మొగుడికి ముద్దు (Bit)
అయ్యో అనీ మరిచాడండీ ఈ జీవుడూ
ఏనాటిదీ ఆచారం...మార్చెయ్యడం అపచారం...
చెట్టెక్కి దిగనంటుంటే...సాగేదెలా సంసారం...
మారాజు మరియాదా..మన్నించండి మహరాజా...

అతడు ఏం గారాలు పోతావె గయ్యాళి వయ్యారి బాగుందే...
మాటలతో మంత్రం...మమతలతో బంధం...వేసేస్తావు (Bit)
నీమాటే వేదం...నీతోటే లోకం...అనిపిస్తావూ...(Bit)
తియ్యతియ్యగ రమ్మంటే..ఏంచెయ్యను సయ్యనకా...
చల్లని నీ ఒళ్లో...పసిపిల్లడినయ్యాగా...
ఈ తప్పుని ఓటమి నీకూ ఇష్టమేగా...(Bit)
మాటలతో మంత్రం...మమతలతో బంధం...వేసేస్తావు (Bit)
నీమాటే వేదం...నీతోటే లోకం...అనిపిస్తావూ...(Bit)

★★★



## శ్రీకారం (1996)

రచన : **సిరివెన్నెల** | గానం : **జేసుదాస్**

పల్లవి

మనసు కాస్త కలతపడితె మందు యిమ్మనీ (Bit)
మరణాన్ని అడగకూ...
కనులనీరు తుడుచువారు ఎవరులేరనీ (Bit)
చితి ఒడికి చేరకూ
ప్రాణమన్నదీ...బంగారు పెన్నిధీ...
నూరేళ్లు నిండుగా..జీవించమన్నదీ...
వేటాడు వేళ్లతో...పోరాడమన్నదీ..
మనసుకాస్త కలతపడితె మందు యిమ్మనీ...మరణాన్ని అడగకూ...

:::::: BIT ::::::

చరణం

ఆమె కలిసిరాని కాలమెంత కాటేస్తున్నా...చలి చితిమేస్తున్నా...
కూలిపోదు వేరువున్న తరువేదైనా...తనువే మోడైనా...
మాను జన్మకన్నా...మనిషి ఎంతమిన్నా..
ఊపిరిని పోసే...ఆడదానివమ్మా
నేలపై నువ్వు కూలితే...నేలపై ప్రాణముందదమ్మా
మనసు కాస్త కలత పడితె మందు యిమ్మనీ...మరణాన్ని అడగకూ...
ప్రాణమన్నదీ...బంగారు పెన్నిధీ...
నూరేళ్లు నిండుగా..జీవించమన్నదీ...
వేటాడు వేళ్లతో...పోరాడమన్నదీ..
మనసుకాస్త కలతపడితె మందు యిమ్మనీ...మరణాన్ని అడగకూ...

:::::: BIT ::::::

చరణం

ఆమె ఆయువంత...ఆయుధముగ మార్చవే నేడు...పరిమార్చవే కీడూ
కాళివైతె..కాలికింద అణువును చూడూ...నిను అణిచే వాడూ
మృత్యువును మించే..హాని ఎక్కడుంది?

Contd...

ఎంతగాయమైనా...మాని తీరుతుంది...
అందుకే...పదముందుకే...లోకమే రాదా నీవెనకే..
మనసు కాస్త కలతపడితె మందు యిమ్మనీ...మరణాన్ని అడగకూ...
కనులనీరు తుడుచువారు ఎవరులేరని...చితి ఒడికి చేరకూ
ప్రాణమన్నదీ...బంగారు పెన్నిధీ...
నూరేళ్లు నిండుగా..జీవించమన్నదీ...
వేటాడు వేళ్లతో...పోరాడమన్నదీ..
మనసుకాస్త కలతపడితె మందు యిమ్మనీ...మరణాన్ని అడగకూ...

★★★




నంది పురస్కారం

శ్రీకారం చిత్రంలో జేసుదాస్ ఆలపించిన "మనసు కాస్త కలతపడితే మందుయిమ్మనీ మరణాన్ని అడగకూ" పాటకు ఉత్తమ గీత రచయితగా సిరివెన్నెల సీతారామ శాస్త్రిగారికి ఆంధ్ర ప్రదేశ్ నందిబహుమతి లభించింది.

## చిన్నబ్బాయి (1997)

రచన : భువనచంద్ర　　　　　　　గానం : బాలు, చిత్ర

:::::: Opening Music ::::::

పల్లవి

అతడు　జాజిమల్లి...తెల్లచీర కట్టుకుంటే (Bit)
జాబిలమ్మ...వెన్నెల్లపూలు పెట్టుకుంటే...య్యా... (Bit)
జాజిమల్లి...తెల్లచీర కట్టుకుంటే
జాబిలమ్మ...వెన్నెల్లపూలు పెట్టుకుంటే... } ॥2॥
నువ్వే...నువ్వే....అదినువ్వే నువ్వేనమ్మ నూరుపాళ్లు
నిన్ను చూడాలంటె చాలవమ్మ వేయికళ్లు

ఆమె　సందెపొద్దే ఓ ముద్దుపాట పాడుతుంటే
సాగరాలే...సందిట్లో వాలి పొంగుతుంటే.. } ॥2॥
నువ్వే...నువ్వే....అదినువ్వే నువ్వేనంట నూరుపాళ్లు
నిన్ను చూడాలంటె చాలవంట వేయికళ్లు

అతడు　జాజిమల్లి...తెల్లచీర కట్టుకుంటే
జాబిలమ్మ...వెన్నెల్లపూలు పెట్టుకుంటే...

:::::: BIT ::::::

చరణం

ఆమె　గువ్వగూడు దాటీ...నీపక్కకొస్తే...
గుండె బుంగమేపీ..కట్టేసుకోవా...

అతడు　ఓ...దగదగ...దందందం...దగదగ...దందందం...
వన్నె ఒంపులన్నీ ఒడికెత్తుకుంటి
కన్నె కెంపులన్నీ ముడి పెట్టుకోనా...

ఆమె　నీకొంటె చూపులన్ని పోగుచేసి...

అతడు　ఆ...ఓ...ఓ...ఓఓఓఓఓ...

ఆమె　నీకొంటె చూపులన్ని పోగుచేసి......
సరికొత్త కోకనేసి యిచ్చుకుంటే...

అతడు　మధుపర్కాలేకావా...అవి ముద్దుల బుల్లెమ్మా
మనసున చల్లగ మోగే...తొలి మంగళవాద్యాలమ్మ
జాజిమల్లి...మల్లి...జాబిమల్లీ...మల్లీ...

Contd...

జాజిమల్లి...తెల్లచీర కట్టుకుంటే
జాబిలమ్మ...వెన్నెల్లపూలు పెట్టుకుంటే...

:::::: BIT ::::::

చరణం

అతడు సిగ్గుపగ్గాలన్ని తెంచేసుకుంటే
బుగ్గ నిగ్గులన్నీ పంచేసుకోనా...

ఆమె హో...దగదగ...దందందం...దగదగ...దందందం
మిన్నుమీద వాలీ ఉయ్యాలవైతే... మెన్ను పూసలాంటి వయ్యారమేనా...

అతడు చలిమంట వేసుకున్న చందమామ

ఆమె ఓ...ఓ...ఓ..ఓఓఓఓఓ...

అతడు చలిమంట వేసుకున్న చందమామ....
తొలిముద్దు పాయసాలు కాచివ్వమ్మా...

ఆమె చుక్కల చెక్కిలితాకే చిరుమబ్బువి నీవంటా...
అక్కున తానాలాడే ప్రతి చినుకును నేనంటా...
జాజిమల్లి...మల్లి...జాజిమల్లీ...మల్లీ...

అతడు జాజిమల్లి...తెల్లచీర కట్టుకుంటే
జాబిలమ్మ...వెన్నెల్లపూలు పెట్టుకుంటే
నువ్వే...నువ్వే....అదినువ్వే నువ్వేనమ్మ నూరుపాళ్లు
నిన్ను చూడాలంటె చాలవమ్మ వేయికళ్లు
జాజిమల్లి...తెల్లచీర కట్టుకుంటే
జాబిలమ్మ...వెన్నెల్లపూలు పెట్టుకుంటే

ఆమె సందెపొద్దే ఓ మంచిమాట చెప్పిపోతే...
సాగరాలే...సందిట్లో పొంగి సాక్షులైతే...
నడిపించునన్ను...ఏడడుగులూ...
నీతో...నేనడిచివచ్చేసూ...ఏడేడు జన్మలూ...
జాజిమల్లీ...జాజిమల్లీ...హో..
జాజిమల్లి...తెల్లచీర కట్టుకుంటే
జాబిలమ్మ...వెన్నెల్లపూలు పెట్టుకుంటే...

అతడు నువ్వే...నువ్వే....అదినువ్వే నువ్వే నంట నూరుపాళ్లు
నిన్ను చూడాలంటె చాలవంట వేయికళ్లు

★★★

## చిన్నబ్బాయి (1997)

రచన : సిరివెన్నెల గానం : బాలు, చిత్ర, మాల్గుడిశుభ

:::::: Opening Music ::::::

పల్లవి

ఆమె వసంతుడికి ఎలా తెలిసెనంట...వనకన్య మనసులోని మాట
తేటినెలా స్వాగతించెనంట...మదిలోన మధువు నింపుకున్న తోట...
తెలుసుకో...తెలుసుకో...ఓవనమాలీ

అతడు (వచనం) ఇదేనా నేను నేర్పింది?
తెలుసుకో... ఆమె : తెలుసుకో...

అతడు తెలుసుకో... ఆమె : తెలుసుకో...

అతడు ఓ...వనమాలీ...

ఆమె తెలుసుకో...తెలుసుకో...ఓ వనమాలీ... ॥2॥
ఈ రాధిక మదిలో...అనురాగం తెలిపే..
రాయబారమేదో చేయరావే ఓ చిరుగాలీ...

ఇద్దరు రరర రరర...తెలుసుకో...తెలుసుకో...ఓ వనమాలీ...
తెలుసుకో...తెలుసుకో...ఓ వనమాలీ...ఓ వనమాలీ...

:::::: BIT ::::::

చరణం

అతడు లాలలా...లాలలాలలాలలాలాల లాల లాలాల లాలా...ఆఆఆ...

ఆమె లాలలా...లాలలాలలాలలాలాల లాల లాలాల లాలా...ఆఆఆ...

అతడు లలలలలల...లలలలలల...లాలలా } ॥2॥

ఆమె ననననన...నననననన...నాననా

ఆమె మూగమనసు లోగిలికి...నీలికళ్లే వాకిలీ...అ...ఆ... ॥2॥

అతడు దాగని తలపులతో...అవి తెలుపవ స్నేహాంజలీ ॥2॥

ఆమె ఎరుపెక్కిన చెక్కిలిపై...అదురుతున్న పెదవులతో
భాషలేని ప్రేమలేఖ రాసుకునే వేళ
తెలుసుకో...తెలుసుకో...ఓ వనమాలీ...
తెలుసుకో...తెలుసుకో...ఓ వనమాలీ...ఓ వనమాలీ...

:::::: BIT ::::::

Contd...

చరణం

ఆమె (2) కొత్తకైపు మ్యూజిక్కుల్లో...మత్తురేపే మ్యాజిక్కుంది హొయ్యహ
హో...హో...కుర్రతాళం కవ్విస్తోంది...కొంటెమేళం
కావాలంది...సయ్యహ...హోహో...
ఆడే...మ్యూజింగుతో...పాడే సత్సాంగుతో....భూగోళం
ఊగాలి హొయ్యా...హొయ్...హో ఓఓఓ...
కొత్తకైపు మ్యూజిక్కుల్లో...మత్తురేపే మ్యాజిక్కుంది హొయ్యహ (Bit)
కుర్రతాళం తప్పిస్తోంది..కొంటెమేళం కావాలంది..సయ్యహ (Long Bit)
నాది జనమంతా మెచ్చే నాట్యం...

అతడు కాదే...అది సదుములు విరిచే పైత్యం...

ఆమె (2) నాలో మెరుపల్లే నువ్వు బ్రేక్ చెయ్!

అతడు ఏ బాల...నీతికమక పరుగుకు బ్రేక్ వెయ్!!హ్వా...

ఆమె (2) నీచురుకెంతా
అతడు ఆ మెరుపంతా...హాయ్..
ఆమె (2) అడుగెయ్ చూస్తా..
అతడు చిటికెయ్ చెప్తా... ॥2॥

తరికిటతక...తరికిటతక...తకధిమి..శ్రుతి లయలకు
సరిపడగల జతులివె..హోయ్!

ఆమె (2) తెలుసుకో...తెలుసుకో...ఓ వనమాలీ...
తెలుసుకో...తెలుసుకో...ఓ వనమాలీ...

అతడు ఈ రాధిక మదిలో...అనురాగం తెలిపే...
రాయబారమేదొ చేయరావే ఓ చిరుగాలీ...(Bit)

ఇద్దరు తెలుసుకో...తెలుసుకో...ఓ వనమాలీ...
తెలుసుకో...తెలుసుకో...ఓ వనమాలీ...ఓ వనమాలీ...

★★★



# అంతఃపురం (1998)

రచన : **సిరివెన్నెల** గానం : **ఇళయరాజా, చిత్ర**

పల్లవి

అతడు హే...నానననననా..నననా...నననా..
హే...నానననననా..నననా...నననా..
అస్సలేం గుర్తుకురాదు...నా కన్నులముందు నువ్వు ఉండగా (Bit)
అస్సలేం తోచదు నాకు ఓ నిమిషంపాటు నిన్ను చూడకా (Bit)
హే...నానననననా..నననా...నననా..
హే...నానననననా..నననా...నననా.. (Long Bit)

ఆమె నా...నననననా..నననా...నననా..
నా...నననననా..నననా...నననా..
అస్సలేం గుర్తుకురాదు నా కన్నులముందు నువ్వువుండగా..
అస్సలేం తోచదు నాకు ఓ నిమిషం కూడా నిన్ను చూడక...
నీలో వుందీ నా ప్రాణం...అది నీకు తెలుసునా
ఉన్నాన్నేనూ నీకోసం..నువు దూరమైతే బతకగలనా
ఏం గుర్తుకు రాదు నా కన్నుల ముందు నువ్వు ఉండగా
అస్సలేం తోచదు నాకు ఓ నిమిషం కూడా నిన్ను చూడకా

:::::: BIT :::::

చరణం

ఆమె గోరువెచ్చని ఊసుతో చిన్న ముచ్చటని ...వినిపించనీ...
ఆకుపచ్చని ఆశతో నిన్ను చుట్టుకుని ...చిగురించనీ...
అల్లుకోమని గిల్లుతున్నది చల్లల్లని గాలి...
తెల్లవారులు అల్లరల్లరి సాగించాలి...
ఏకమయే..ఏకమయే ఏకాంతం లోకమయేవేళ...
అహ జంట ఊపిరి వేడికి మరిగింది వెన్నెలా...
అస్సలేం గుర్తుకురాదు నా కన్నులముందు నువ్వు వుండగా...
అస్సలేం తోచదు నాకు ఓ నిమిషం కూడా నిన్ను చూడక...
నీలో వుందీ నా ప్రాణం...అది నీకు తెలుసునా

Contd...

ఉన్నాన్నేనూ నీకోసం..నువు దూరమైతే బతకగలనా
ఏం గుర్తుకు రాదు నా కన్నుల ముందు నువ్వు ఉండగా
అస్సలేం తోచదు నాకు ఓ నిమిషం కూడా నిన్ను చూడకా

:::::: BIT :::::

చరణం

ఆమె కంటిరెప్పల చాటుగా నిన్ను దాచుకుని... బంధించనీ...
కౌగిలింతల సీమలో కోట కట్టుకుని... కొలువుండనీ..
చెంత చేరితె చేతిగాజులు చేసే గాయం..
జంట మధ్యన సన్నజాజులు హాహాకారం..
మల్లీ మల్లీ..మల్లీ మల్లీ ఈ రోజూ రమ్మన్నా రాదేమో
నిలవనీ చిరకాలమిలాగే ఈ క్షణం...
అస్సలేం గుర్తుకురాదు నా కన్నులముందు నువ్వు వుండగా..
అస్సలేం తోచదు నాకు ఓ నిమిషం కూడా నిన్ను చూడక..
నీలో వుందీ నా ప్రాణం...అది నీకు తెలుసునా
ఉన్నాన్నేనూ నీకోసం..నువు దూరమైతే బతకగలనా
ఏం గుర్తుకు రాదు నా కన్నుల ముందు నువ్వు ఉండగా
అస్సలేం తోచదు నాకు ఓ నిమిషం కూడా నిన్ను చూడకా

★★★



**నంది పురస్కారం:** అంత:పురం చిత్రంలో సిరివెన్నెల గీతం "సూరీడు పువ్వా... జాబిల్లి గువ్వా.. చినబోయినా వెందుకే" ఆలపించిన గాయని ఎస్. జానకికి ఉత్తమ గాయనిగా ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ నంది బహుమతి లభించింది.

## అంతఃపురం (1998)

రచన : **సిరివెన్నెల** గానం : **జానకి**

:: Opening Music ::

పల్లవి ఓఒహోహోహోహోహో... ఓఒహోహోహోహోహో...
సూరీడు పువ్వా...జాబిల్లి గువ్వా...చినబోయినావెందుకే
మాకంటి చలువా...కోనేటి కలువా కన్నీటి కొలువెందుకే
నడిరేయి జాములో..సడిలేని సీమలో...
సూరీడు పువ్వా...జాబిల్లి గువ్వా...చినబోయినా వెందుకే
మాకంటి చలువా...కోనేటి కలువా కన్నీటి కొలువెందుకే

:::::: BIT :::::

చరణం బతుకే బరువూ ఈ నేలకీ...కరుణే కరువూ ఈ నీతికీ...
వెలుగే రాదూ ఈ వైపుకీ...శ్వాసే చేదూ ఈ గాలికీ..
ఆకాశమే మిగిలున్నదీ ...ఏకాకి పయనానికీ...
ఆ శూన్యమే తోడున్నదీ ... ఈ చిన్ని ప్రాణానికీ..
నిదురించెనే నీతూరుపూ..నిట్టూరుపే ఓదారుపూ..
అందాల చిలకా అపరంజి మొలకా అల్లాడకే అంతగా..
పన్నీటి చినుకా..కన్నీటి మునకా కలలన్ని కరిగించగా

:::::: BIT :::::

చరణం ఏవైపుందో ఏమోమరీ..జాడేలేదే దారీదరీ...
ఏమౌతుందో నీ ఊపిరీ...వేటాడిందే కాలంమరీ...
ఈ గుండెలో గోదావరీ..నేర్పాలి ఎదురీతనీ...
నీ కళ్లలో దీపావళీ...ఆపాలి ఎద కోతనీ..
పరుగాపనీ పాదాలతో..కొనసాగనీ నీరాత్రనీ
శ్రీ వెంకటేశా...ఓ శ్రీనివాసా..నీ మౌనమెన్నాళ్లయా..
అలవైకుంఠాన...అంతఃపురానా ఏమూల వున్నావయా...
ఓ నామాల దేవరా...ఈ నీమాయ ఆపరా..
శ్రీ వెంకటేశా...ఓ శ్రీనివాసా..నీ మౌనమెన్నాళ్లయా..
అలవైకుంఠాన...అంతఃపురానా ఏమూల వున్నావయా

★★★

## పెళ్ళికొడుకు అమ్మబడును (1998)

రచన : వెన్నెలకంటి గానం : బిజునారాయణ్, బృందం

సాకీ

అతడు పొద్దేపొడిచేసిందిలే...కోడికూడ కూసిందిలే..
బంగారు తల్లీ...మాపాలవెల్లీ...నాచిట్టిచెల్లీ...
మేలుకో...మేలుకోమ్మా...మేలుకో మేలుకోమ్మా...

బృందం ఊఊ...ఊఊఉఊఁ...ఊఊఊఊఊఁ...॥2॥

పల్లవి

అతడు ఊఉఊఉఊఊఉఊఁ...
అందానికే అందమ్మునీవే...ఈ అన్న ప్రాణమ్ము నీవే...
గారాల చెల్లాయివే...
ఈనేలకే దిగివచ్చుతారా...గుండెల్లోనా పలికే సితారా...
గారాల చెల్లాయివే...
చెల్లాయిపైన పూలజల్లు కురిసీ...తలపులన్ని పాటగట్టి పాడీ...
మురిసే ఈ అన్న మనసూ...
అందానికే అందమ్ము నీవే...ఈ అన్న ప్రాణమ్ము నీవే...
గారాల చెల్లాయివే...

:::::: BIT ::::::

చరణం

బృందం ఊఊఉఊఁ...ఊఉఊఁ...ఊఊఉఊఊఁ...ఊహుహుహూ
ఊఁ...ఊహూహుహూఁఊఁ...

అతడు సూరీడు నిన్ను చూడ తెల్లారె వస్తాడూ...

బృందం తెల్లారె వస్తాడూ...తెల్లారె వస్తాడూ...

అతడు అ..సూరీడు నిన్ను చూడ తెల్లారె వస్తాడూ...
చందురుడు నిన్ను చూడ సాయంకాలం వస్తాడూ...
సేవలు చేయ...లోకమంతా వచ్చేనూ...
నీ మాటే వినగా కాలమంతా వేచేనూ...
నాచెల్లి...సిరిమల్లీ...అమ్మా...నాతల్లీ...

Contd...

బృందం  నాచెల్లి...సిరిమల్లీ...అమ్మా...నాతల్లీ...
అతడు  ఈ అన్నయ్య మదినిండు దీవెనే ప్రేమా
అందానికే అందమ్ము నీవే.. ఈ అన్న ప్రాణమ్ము నీవే...
గారాల చెల్లాయివే...
బృందం  తందాన...నానా...తందన తందానానానా.. హే..
తందన తందానానానా... హే...తందానతానానా...
తందాన తానానా...

:::::: BIT ::::::

చరణం
అతడు  ఇంద్రుని మించే బావను చెల్లాయ్‌కోసం వెతికేస్తా
బృందం  చెల్లాయ్ కోసం వెతికేస్తా....
అతడు  ఇంద్రుని మించే బావను చెల్లాయ్‌కోసం వెతికేస్తా
నింగంత పందిరివేసి పెళ్లినేను జరిపిస్తా...
ఊర్వశితోటి రంభమేనక దాన్సుందీ.
హేయ్! కల్యాణరాగం దేవలోకం పాడ్తుందీ..
గారాలే పండంగ...ముద్దుల్నే పంచంగా...
బృందం  గారాలే పండంగ...ముద్దుల్నే పంచంగా...
అతడు  ఊరంత పెళ్లి చూసి ఆహా...ఓహో అంటారూ...
అందానికే అందమ్మునీవే... ఈ అన్న ప్రాణమ్మునీవే...
అందరు  గారాల చెల్లాయివే...
అతడు  చెల్లాయిపైన పూలజల్లు కురిసీ...తలపులన్ని పాటగట్టిపాడీ...
మురిసే ఈ అన్న మనసూ...
అందరు  అందానికే అందమ్ము నీవే... ఈ అన్న ప్రాణమ్ము నీవే...
గారాల చెల్లాయివే...
ఈనేలకే దిగివచ్చుతారా...గుండెల్లోనా పలికే సితారా...
గారాల చెల్లాయివే...

★★★

# టైమ్ (1999)

రచన : **వేటూరి** గానం : **సుజాత**

:::::: Opening Music ::::::

పల్లవి లలాల లాల లాలలా...లలాల లాల లాలలా... (Long Bit)
జీవితం మనోగతం చైత్రసంగమాలు
అంకితం స్వయంకృతం గ్రీష్మ పంచమాలు
పియానో...ప్రియానో...అనేసినా...
నయానో...భయానో...వినేసినా...
జీవితం మనోగతం చైత్రసంగమాలు
అంకితం స్వయంకృతం...

:::::: BIT ::::::

చరణం

ఎడారిచేరి కోకిలమ్మ తప్పి పూలదారి
ఆవిరి... వినేతగా... వినోదమే... (Bit)
ఉగాది వచ్చి ఎండమావిలోన కాలుజారీ...
కలైనా...కళైనా... విషాదమే...
పెదవిలో బాసలు...తెగలనీ ఆశలూ..
రగిలి నా శ్వాసలో...కరిగినా సేసలూ...
కుచలపై అచ్చులలో... దాచుకొనే రూపం...
చిత్రముగా ఛాయగా మారే ఈ నా ప్రాయం...
జీవితం మనోగతం చైత్రసంగమాలు
అంకితం స్వయంకృతం గ్రీష్మ పంచమాలు
పియానో...ప్రియానో...అనేసినా...
నయానో...భయానో...వినేసినా...
జీవితం మనోగతం చైత్రసంగమాలు
అంకితం స్వయంకృతం...

:::::: BIT ::::::

Contd...

చరణం

ఏ జవాబు నోచుకొంది సాగరాల ఘోష
పాడుతా తుఫానులో స్వరాలిలా...(Bit)
ఈ పెదాలు దాటిరాదు కన్నె మూగభాషా...
స్వరాలే...జ్వలించీ... పదాలుగా..
నిలవదీ కాలము...కలవదీ బంధమూ...
కరుగు కన్నీటిలో...కలువనీ అందమూ...
తూరుపుకీ...పడమరకీ...ఊయల నా ప్రాణం...
మనసులో...గానమే...పాటలో మౌనం...
జీవితం మనోగతం చైత్రసంగమాలు
అంకితం స్వయంకృతం గ్రీష్మ పంచమాలు
పియానో...ప్రియానో...అనేసినా...
నయానో...భయానో...వినేసినా...
జీవితం మనోగతం చైత్రసంగమాలు
అంకితం స్వయంకృతం...మనోగతం...
స్వయంకృతం...

★★★



# ప్రేమించేది ఎందుకమ్మా (1999)

రచన : **సిరివెన్నెల** గానం : **బాలు (చిత్ర ఆలాపనతో)**

:::::: Opening Music ::::::

పల్లవి

ఆమె లాలాలలాల లాలలా...లాలాల లాల లాలలా

అతడు చిన్ని పాదాల చినుకమ్మా...స్వాతి ముత్యాలు చిలుకమ్మా
పంచ వర్ణాల చిలకమ్మా...మంచి ముచ్చట్లు పలుకమ్మా
నిన్ను నన్ను కలిపీ..కన్యాదానం జరిపీ...
నిన్నూ నన్నూ ఆనందించే దెపుడమ్మా....
ముద్దై నువ్వు నాలో నవ్వే దెపుడమ్మా...
చిన్ని పాదాల చినుకమ్మా...స్వాతి ముత్యాలు చిలుకమ్మా
పంచ వర్ణాల చిలకమ్మా...మంచి ముచ్చట్లు పలుకమ్మా

:::::: BIT ::::::

చరణం

అతడు అదుపులేని పరుగా ఇదీ...కదలలేని పదమా ఇదీ...
ఏమో మరీ ఈ సంగతీ...
అలల లయల పిలుపా ఇదీ..
చిలిపి తలపు స్వరమా ఇదీ...
ఏమో మరీ ఎదసవ్వడీ...
పాటైన రానంత మౌనాలా...ఏభాషకీ రాని గానాలా...
మనజంటె లోకంగ మారాలా...మనవెంటె లోకాలు రావాలా...
బదులీయవా ప్రణయమా...

ఆమె లల లాలాల లలలాలా...లలలాలాల లలలాలా ॥2॥

:::::: BIT ::::::

చరణం

అతడు శ్వాసవేణువై సాగినా...వేడి వేసవై వేగినా...
భారం నీదే ప్రియభామమా...
ఆశకి ఆయువై చేరినా...అలలవెనక నే దాగినా...
తీరం నువ్వే అనురాగమా...

Contd...

దూరాన్ని దూరంగ తరిమేసి..ఏకాంతమే ఏలుతున్నామా
ఊహల్లో కాలాన్ని ఉరివేస్తూ..గాలుల్లో ఊరేగుతున్నామా...
తెలిసేన ఓ ప్రియతమా...
చిన్ని పాదాల చినుకమ్మా...స్వాతి ముత్యాలు చిలుకమ్మా
పంచ వర్ణాల చిలకమ్మా...మంచి ముచ్చట్లు పలుకమ్మా
నిన్ను నన్ను కలిపీ..కన్యాదానం జరిపీ...
నిన్నూ నన్నూ ఆనందించే దెపుడమ్మా....
ముప్పై నువ్వు నాలో నవ్వే దెపుడమ్మా...
చిన్ని పాదాల చినుకమ్మా...స్వాతి ముత్యాలు చిలుకమ్మా
పంచ వర్ణాల చిలకమ్మా...మంచి ముచ్చట్లు పలుకమ్మా

★★★



స్వాతిముత్యం చిత్రంకోసం దర్శకుడు విశ్వనాథ్ డా॥ సి.నారాయణరెడ్డిగారితో ఒక లాలిపాట రాయించి చిత్రీకరించాలని సంకల్పించి ఇళయరాజాతో మ్యూజిక్ సిట్టింగ్ ఏర్పాటుచేశారు. ఇళయరాజా వచ్చేదానికి ముందే సినారెకు విశ్వనాథ్ ఒక పల్లవి వినిపించారు. అదే "వటపత్రశాయికి వరహాల లాలి..రాజీవ నేత్రునికి రతనాల లాలి" పాట. ఇదే స్ఫూర్తిగా సినారె మిగతా పల్లవిని "మురిపాల కృష్ణునికి ముత్యాల లాలి..జగమేలు స్వామికి పగడాల లాలీ" అని పూరించారు. ఇళయరాజా రంగప్రవేశం చేశాక విశ్వనాథ్ తాము తయారుచేసిన పల్లవిని రాజాకు వినిపించారు. కాని, ఇళయరాజా అంతకుముందే తయారుచేసుకున్న ట్యూన్‌కి సినారె చేసిన పల్లవికి పొంతన కుదరలేదు. "వటపత్రశాయి" పల్లవి అద్భుతంగా ఉండటంతో ముందు తయారుచేసిన ట్యూన్‌ని రద్దుచేసి పాటకు కొత్తట్యూన్ కట్టారు. అది ఎంత విజయవంతం అయిందో మనకు తెలుసు.

# ఇళయరాజా చిత్రావళి

| నం. | చిత్రం పేరు | సం॥ |
|---|---|---|
| డైరెక్ట్ చిత్రాలు | | |
| 1. | భద్రకాళి | 1977 |
| 2. | అమ్మ ఎవరికైనా అమ్మ | 1979 |
| 3. | కాళరాత్రి | 1979 |
| 4. | ఊర్వశి నీవే నా ప్రేయసి | 1979 |
| 5. | పంచభూతాలు | 1979 |
| 6. | యుగంధర్ | 1979 |
| 7. | గురు | 1980 |
| 8. | కాళి | 1980 |
| 9. | పసిడిమొగ్గలు | 1980 |
| 10. | అమావాస్య చంద్రుడు | 1981 |
| 11. | చిన్నారి చిట్టిబాబు | 1981 |
| 12. | కొత్తజీవితాలు | 1981 |
| 13. | అందగాడు | 1982 |
| 14. | పూలపల్లకి | 1982 |
| 15. | సీతాకోకచిలక | 1982 |
| 16. | అభిలాష | 1983 |
| 17. | మంత్రిగారి వియ్యంకుడు | 1983 |
| 18. | రాజ్‌కుమార్ | 1983 |
| 19. | సాగర సంగమం | 1983 |
| 20. | ఛాలెంజ్ | 1984 |
| 21. | మెరుపుదాడి | 1984 |
| 22. | రాగబంధం | 1984 |
| 23. | సాహసమే జీవితం | 1984 |
| 24. | సితార | 1984 |
| 25. | వీరభద్రుడు | 1984 |
| 26. | అన్వేషణ | 1985 |
| 27. | దర్జాదొంగ | 1985 |
| 28. | జ్వాల | 1985 |
| 29. | ఖూని | 1985 |
| 30. | మాంగల్యబంధం | 1985 |
| 31. | ప్రేమించు పెళ్ళాడు | 1985 |

| నం. | చిత్రం పేరు | సం॥ |
|---|---|---|
| 32. | శ్రీ షిర్డీసాయిబాబా మహాత్మ్యం | 1985 |
| 33. | ఆలాపన | 1986 |
| 34. | కిరాతకుడు | 1986 |
| 35. | లేడీస్‌టైలర్ | 1986 |
| 36. | మంచిమనసులు | 1986 |
| 37. | మిస్టర్ భరత్ | 1986 |
| 38. | నిరీక్షణ | 1986 |
| 39. | ఒకరాధ-ఇద్దరు కృష్ణులు | 1986 |
| 40. | రాక్షసుడు | 1986 |
| 41. | స్వాతిముత్యం | 1986 |
| 42. | ఆరాధన | 1987 |
| 43. | అందరికంటే ఘనుడు | 1987 |
| 44. | మహర్షి | 1987 |
| 45. | సంకీర్తన | 1987 |
| 46. | ఆఖరిపోరాటం | 1988 |
| 47. | ఆస్తులు-అంతస్థులు | 1988 |
| 48. | అభినందన | 1988 |
| 49. | గర్జించిన గంగ | 1988 |
| 50. | జమదగ్ని | 1988 |
| 51. | మరణమృదంగం | 1988 |
| 52. | మేనమామ | 1988 |
| 53. | రక్తాభిషేకం | 1988 |
| 54. | రుద్రవీణ | 1988 |
| 55. | శ్రీ కనకమాలక్ష్మి రికార్డింగ్ డాన్స్ ట్రూప్ | 1988 |
| 56. | స్వర్ణకమలం | 1988 |
| 57. | టార్జాన్ సుందరి | 1988 |
| 58. | వారసుడొచ్చాడు | 1988 |
| 59. | అశోకచక్రవర్తి | 1989 |
| 60. | బాలనాగమ్మ | 1989 |
| 61. | చెట్టుకింద ప్లీడరు | 1989 |
| 62. | గీతాంజలి | 1989 |

| నం. | చిత్రం పేరు | సం॥ |
|---|---|---|
| 63. | గోపాలరావుగారి అబ్బాయి | 1989 |
| 64. | ఇంద్రుడు చంద్రుడు | 1989 |
| 65. | ప్రేమ | 1989 |
| 66. | రుద్రనేత్ర | 1989 |
| 67. | శివ | 1989 |
| 68. | స్వాతి చినుకులు | 1989 |
| 69. | విచిత్రసోదరులు | 1989 |
| 70. | బొబ్బిలిరాజా | 1990 |
| 71. | గురుశిష్యులు | 1990 |
| 72. | ఇదేం పెళ్ళాం బాబోయ్ | 1990 |
| 73. | జగదేకవీరుడు అతిలోకసుందరి | 1990 |
| 74. | కోకిల | 1990 |
| 75. | కొండవీటి దొంగ | 1990 |
| 76. | కొత్తపెళ్ళికూతురా రారా | 1990 |
| 77. | స్టూవర్టుపురం పోలీస్‌స్టేషన్ | 1990 |
| 78. | ఆదిత్య 369 | 1991 |
| 79. | ఏప్రిల్ 1 విడుదల | 1991 |
| 80. | బుజ్జిపాప-బ్రహ్మచారులు | 1991 |
| 81. | చైతన్య | 1991 |
| 82. | కీచురాళ్ళు | 1991 |
| 83. | కూలీ నెం.1 | 1991 |
| 84. | మైకేల్ మదన కామరాజు | 1991 |
| 85. | మైడియర్ మార్తాండ | 1991 |
| 86. | నిర్ణయం | 1991 |
| 87. | సూర్య IPS | 1991 |
| 88. | శ్రీ ఏడుకొండలస్వామి | 1991 |
| 89. | ఆ ఒక్కటీ అడక్కు | 1992 |
| 90. | అశ్వమేధం | 1992 |
| 91. | చామంతి | 1992 |
| 92. | చక్రవ్యూహం | 1992 |
| 93. | చంటి | 1992 |
| 94. | చినరాయుడు | 1992 |
| 95. | డిటెక్టివ్ నారద | 1992 |
| 96. | ధర్మక్షేత్రం | 1992 |
| 97. | కిల్లర్ | 1992 |
| 98. | మహారాణి | 1992 |
| 99. | మొరటోడు నామొగుడు | 1992 |
| 100. | ప్రేమవిజేత | 1992 |
| 101. | ప్రియతమా | 1992 |
| 102. | శాంతి | 1992 |
| 103. | అమ్మకొడుకు | 1993 |
| 104. | అసాధ్యులు | 1993 |
| 105. | కుంతీపుత్రుడు | 1993 |
| 106. | తొలిముద్దు | 1993 |
| 107. | అల్లరి పోలీస్ | 1994 |
| 108. | సమరం | 1994 |
| 109. | రాజయ్య | 1995 |
| 110. | శ్రీకారం | 1996 |
| 111. | చిన్నబ్బాయి | 1997 |
| 112. | అంతఃపురం | 1998 |
| 113. | పెళ్ళికొడుకు అమ్మబడును | 1998 |
| 114. | ప్రేమించేది ఎందుకమ్మా | 1999 |
| 115. | నినుచూడక నేనుండలేను | 2002 |
| 116. | శేషు | 2002 |
| 117. | శంభు | 2003 |
| 118. | శివశంకర్ | 2004 |
| 119. | ట్వింకిల్ ట్వింకిల్ లిటిల్‌స్టార్ | 2006 |
| 120. | శివ 2006 | 2006 |
| 121. | అనుమానాస్పదమ్ | 2006 |
| 122. | చలాకి చిన్నది | 2007 |
| 123. | సన్నీ | 2007 |
| 124. | మల్లెపువ్వు | 2008 |
| 125. | జగన్మోహిని | 2009 |
| 126. | ఓం శాంతి | 2009 |
| 127. | గాయం-2 | 2010 |
| 128. | శ్రీరామరాజ్యం | 2011 |
| 129. | ధోనీ | 2012 |

| సం. | చిత్రం పేరు | సం॥ |
|---|---|---|
| | డబ్బింగ్ చిత్రాలు | |
| 1. | దగాకోరులు | 1977 |
| 2. | పోరాటం | 1977 |
| 3. | భైరవి | 1978 |
| 4. | దొంగ దొర | 1978 |
| 5. | వయసుపిలిచింది | 1978 |
| 6. | అజేయుడు | 1979 |
| 7. | ధర్మయుద్ధం | 1979 |
| 8. | ఎర్రగులాబీలు | 1979 |
| 9. | కల్యాణరాముడు | 1979 |
| 10. | ముల్లు పువ్వు | 1979 |
| 11. | నువ్వే నా శ్రీమతి | 1979 |
| 12. | ఓ ఇంటి కథ | 1979 |
| 13. | మాయదారి కృష్ణుడు | 1980 |
| 14. | నాపేరు జానీ | 1980 |
| 15. | పూరికొక్కడు | 1980 |
| 16. | చిలిపిచిన్నోడు | 1981 |
| 17. | చిలిపిమొగుడు | 1981 |
| 18. | గర్జనం | 1981 |
| 19. | మౌనగీతం | 1981 |
| 20. | ముసలోడికి దసరాపండగ | 1981 |
| 21. | ప్రేమ పిచ్చి | 1981 |
| 22. | రామ్-లక్ష్మణ్ | 1981 |
| 23. | రంగూన్ రాజా | 1981 |
| 24. | అమరగీతం | 1982 |
| 25. | గ్రామకక్షలు | 1982 |
| 26. | మధురగీతం | 1982 |
| 27. | పల్లెటూరి సింహం | 1982 |
| 28. | పట్నంవచ్చిన పసిపాప | 1982 |
| 29. | ప్రేమ సంగమం | 1982 |
| 30. | రాధా మాధవి | 1982 |
| 31. | టైగర్ రజని | 1982 |
| 32. | టిక్ టిక్ టిక్ | 1982 |
| 33. | వసంతకోకిల | 1982 |
| 34. | గండికోట వీరుడు | 1983 |
| 35. | పల్లవి అనుపల్లవి | 1983 |
| 36. | రాగమాలిక | 1983 |
| 37. | టక్కరిదొంగ | 1983 |
| 38. | అమ్మా నన్ను దీవించు | 1984 |
| 39. | అమ్మాయిలూ ప్రేమించండి | 1984 |
| 40. | చిన్నారిచేతన (3D) | 1984 |
| 41. | దెబ్బకు దెబ్బ | 1984 |
| 42. | గడుసుపిండం | 1984 |
| 43. | ఇదే నా సవాల్ | 1984 |
| 44. | జల్సారాయుడు | 1984 |
| 45. | కాలరుద్రుడు | 1984 |
| 46. | ఖైదీ వేట | 1984 |
| 47. | కిలాడి | 1984 |
| 48. | లవ్‌స్టోరీ | 1984 |
| 49. | మంచిరోజు | 1984 |
| 50. | మొనగాళ్ళకు మొనగాడు | 1984 |
| 51. | నూరవరోజు | 1984 |
| 52. | ప్రియమైన రజనీకాంత్ | 1984 |
| 53. | వాడేవీడు | 1984 |
| 54. | చిన్న ఇల్లు | 1985 |
| 55. | దొంగల వేటగాడు | 1985 |
| 56. | ఈతరం ఇల్లాలు | 1985 |
| 57. | జల్సాబుల్లోడు | 1985 |
| 58. | జపాన్‌రాముడు | 1985 |
| 59. | పగలేవెన్నెల | 1985 |
| 60. | పెళ్ళిపిచ్చోడు | 1985 |
| 61. | ప్రేమశాస్త్రం | 1985 |
| 62. | రాజముద్ర | 1985 |
| 63. | రహస్య హంతకుడు | 1985 |
| 64. | సింధుభైరవి | 1985 |
| 65. | శ్రీమంత్రాలయ రాఘవేంద్రస్వామి | 1985 |
| 66. | ఉదయగీతం | 1985 |
| 67. | ఆత్మబంధువు | 1986 |
| 68. | ఏజెంట్ విక్రమ్ | 1986 |

| నం. | చిత్రం పేరు | సం॥ |
|---|---|---|
| 69. | అనురాగ సంగమం | 1986 |
| 70. | మౌనరాగం | 1986 |
| 71. | నేనే రజనీకాంత్ | 1986 |
| 72. | సూర్యోదయం | 1986 |
| 73. | అర్ధరాత్రి ఆడది | 1987 |
| 74. | డాన్స్‌మాస్టర్ | 1987 |
| 75. | కేడీ | 1987 |
| 76. | మాఇంటి కృష్ణుడు | 1987 |
| 77. | మిస్టర్ ఆనంద్ | 1987 |
| 78. | నాయకుడు | 1987 |
| 79. | పెళ్ళినాటకం | 1987 |
| 80. | ప్రేమ పోరాటం | 1987 |
| 81. | రెండుతోకలపిట్ట | 1987 |
| 82. | సిస్టర్ నందిని | 1987 |
| 83. | విజేతలు | 1987 |
| 84. | ఆకర్షణ | 1988 |
| 85. | చిలిపిదొంగ | 1988 |
| 86. | ఘర్షణ | 1988 |
| 87. | గూండాపోలీస్ | 1988 |
| 88. | నువ్వా-నేనా | 1988 |
| 89. | సాగరగీతం | 1988 |
| 90. | శభాష్ శంకర్ | 1988 |
| 91. | సత్య | 1988 |
| 92. | వద్దంటేపెళ్ళి | 1988 |
| 93. | అపూర్వ సహోదరులు | 1989 |
| 94. | భార్యలూ జాగ్రత్త | 1989 |
| 95. | గరగట్టగోపయ్య | 1989 |
| 96. | ఖైదీ నెం. 79 | 1989 |
| 97. | ప్రేమగీతం | 1989 |
| 98. | ప్రేమాంజలి | 1989 |
| 99. | రాజాధిరాజా | 1989 |
| 100. | రుక్మిణీకల్యాణం | 1989 |
| 101. | టైగర్ శివ | 1989 |
| 102. | గ్యాంగ్ ఫైటర్ | 1990 |
| 103. | హలో పక్కీరామ్ | 1990 |
| 104. | కలియుగ దుర్గ | 1990 |
| 105. | కొండవీటి పులి | 1990 |
| 106. | క్షత్రియుడు | 1990 |
| 107. | మావూరి రంగా | 1990 |
| 108. | మొగుడికి తగ్గ పెళ్ళాం | 1990 |
| 109. | పట్నంవచ్చిన మొనగాడు | 1990 |
| 110. | పోలీస్ అధికారి | 1990 |
| 111. | పోలీస్ డైరీ | 1990 |
| 112. | పోలీస్ దౌర్జన్యం | 1990 |
| 113. | ప్రేమశాసనం | 1990 |
| 114. | ప్రేయసి | 1990 |
| 115. | రుస్తుం రుద్రయ్య | 1990 |
| 116. | సామ్రాజ్యం | 1990 |
| 117. | తూర్పుసిందూరం | 1990 |
| 118. | వేదాగ్ని | 1990 |
| 119. | ఆమె కాపురం | 1991 |
| 120. | అనుబంధాలు | 1991 |
| 121. | చేతబడి | 1991 |
| 122. | హృదయం | 1991 |
| 123. | ఓ పాపాలాలి | 1991 |
| 124. | ప్రేమలేఖలు | 1991 |
| 125. | ప్రేమ రాయబారం | 1991 |
| 126. | రాజు రాణీ జాకీ | 1991 |
| 127. | సిందూర తిలకం | 1991 |
| 128. | ఖైదీ అన్నయ్య | 1991 |
| 129. | అసాధ్యుడు | 1992 |
| 130. | కెప్టెన్ ప్రభాకర్ | 1992 |
| 131. | దళపతి | 1992 |
| 132. | ఎదురులేని రౌడీ | 1992 |
| 133. | గుణ | 1992 |
| 134. | క్షత్రియపుత్రుడు | 1992 |
| 135. | మన్మధుడే నా మొగుడు | 1992 |
| 136. | మీరా | 1992 |
| 137. | ముఠా నాయకుడు | 1992 |
| 138. | ప్రేమపాఠం | 1992 |

| నం. | చిత్రం పేరు | సం॥ |
|---|---|---|
| 139. | శ్రీమతి ప్రియాంక | 1992 |
| 140. | అల్లరిదొంగ | 1993 |
| 141. | బంగారుపాప | 1993 |
| 142. | భారతమాత | 1993 |
| 143. | డైరెక్టరు గారి పెళ్లాం | 1993 |
| 144. | ఘరానా కూలీ | 1993 |
| 145. | ఘరానా ప్రేమికుడు | 1993 |
| 146. | ఐ లవ్ ఇండియా | 1993 |
| 147. | మహానది | 1993 |
| 148. | ముద్దుల బావ | 1993 |
| 149. | పోలీస్‌వేట | 1993 |
| 150. | రేపటి రౌడీ | 1993 |
| 151. | రౌడీ బుల్లోడు | 1993 |
| 152. | రౌడీ జమీందార్ | 1993 |
| 153. | సీక్రెట్ పోలీస్ | 1993 |
| 154. | ఆడవాళ్ళకు మాత్రమే | 1994 |
| 155. | దౌర్జన్యకాండ | 1994 |
| 156. | గౌరమ్మా నీ మొగుడెవరమ్మా | 1994 |
| 157. | హలో బావా | 1994 |
| 158. | హలో యంగ్‌మేన్ | 1994 |
| 159. | జిల్లా కలెక్టర్ | 1994 |
| 160. | పోలీస్ కమాండో | 1994 |
| 161. | రఘుపతి IPS | 1994 |
| 162. | సాధు | 1994 |
| 163. | సతీ లీలావతి | 1994 |
| 164. | వీర | 1994 |
| 165. | విజయ | 1994 |
| 166. | ప్రేమరాగం | 1995 |
| 167. | విధ్వంసం | 1995 |
| 168. | గిల్లి గిచ్చి | 1995 |
| 169. | కాలాపాని | 1995 |
| 170. | ఒకవూరిలో ఒకరాజకుమారి | 1995 |
| 171. | ఆయనే మా ఆయన | 1996 |
| 172. | అల్లరిప్రేమ | 1996 |
| 173. | కుర్రాడు బాబోయ్ | 1996 |
| 174. | ఆంధ్రాఅల్లుడు | 1997 |
| 175. | ప్రియురాలు | 1997 |
| 176. | గాయత్రి | 1998 |
| 177. | ప్రేమకావ్యం | 1998 |
| 178. | వినాలనివుంది | 1998 |
| 179. | విక్రమ్ ధర్మ | 1998 |
| 180. | అల్లరిపిల్ల అనుమానపుపెళ్ళాం | 1999 |
| 181. | భారత్ టాకీస్‌లో బాంబు | 1999 |
| 182. | మోహిని | 1999 |
| 183. | రాజస్థాన్ | 1999 |
| 184. | ట్రైమ్ | 1999 |
| 185. | దేవీపుత్రులు | 2000 |
| 186. | హే రామ్ | 2000 |
| 187. | ప్రేమసవ్వడి | 2000 |
| 188. | అవునా | 2003 |
| 189. | మనసంతా | 2003 |
| 190. | శివపుత్రుడు | 2003 |
| 191. | పోతురాజు | 2004 |
| 192. | ముంబయ్ ఎక్స్‌ప్రెస్ | 2006 |
| 193. | హోప్ | 2006 |
| 194. | ప్రియతమా రావే | 2006 |
| 195. | ప్రేమసవ్వడి | 2006 |
| 196. | అజంతా | 2007 |
| 197. | మాయబొమ్మలు | 2008 |
| 198. | ఓ మై గాడ్ | 2009 |
| 199. | మన్మథుడు | 2009 |
| 200. | నేను దేవుణ్ణి | 2009 |
| 201. | స్విచ్ ఫర్ లవ్ | 2009 |

గమనిక : సమాచారం దొరికినంతవరకు సేకరించిన జాబితా మాత్రమే

డా॥ బాలు సినీ గీతాల సంకలనం "పల్లవించవా నా గొంతులో"
ఆవిష్కరణోత్సవ చిత్రాలు 21-03-2010



పాటల సంకలనాన్ని ఆవిష్కరిస్తున్న పద్మభూషణ్ డా॥ బాలు,
కళాభినేత్రి శ్రీమతి వాణిశ్రీ, శ్రీ జె.ఎస్.రెడ్డిలతో సంకలనకర్త ఏ.షణ్ముఖాచారి



పుస్తక ఆవిష్కరణలో పాల్గొన్న సినీ గేయ రచయిత శ్రీ వెన్నెలకంటి,
జిల్లా కలెక్టర్ శ్రీ కె. రాంగోపాల్, డా॥ బాలు, శ్రీమతి వాణిశ్రీ, శ్రీ జె.ఎస్. రెడ్డిలతో....
సంకలనకర్త

